Acc. No. 28227



(పండితరత్న, ధర్మనిరత)

॥పం॥ పెద్దమఠము రాచవీరదేవర "తీర్థ" (కలకత్త)

ఎమ్. ఓ. ఎల్. (ఓ. యు.)

హిందీ "భూషణ" కన్నడ "జాణ"

ఆం.ప్ర. వీరమాహేశ్వర (జంగమ)

మహాసభాధ్యక్షులు

॥ ఓం ॥

# బాల్య జీవితము

నా తల్లిదండ్రుల పేరు శ్రీమతి నాగమ్మ మా తాత బిక్కయ్య గారు తాము ప్రేమతో వీరిని బుచ్చమ్మ అని పిలుచుచుండిరి. తండ్రిగారి పేరు శివశ్రీ మఠం వీరయ్యగారు మా తీర్థ రూపులైన శ్రీ వీరయ్య గారిని గురించి కాస్తంత విపులంగా వ్రాయవలసియున్నది. శ్రీవారి జన్మస్థానం మెదక్ జిల్లాలోని అందోలు తాలూక చేవెళ్ళ గ్రామంలో మూలమఠము. వీరి తండ్రి అనగా మా తాతగారైన శ్రీ మూలమఠము సంగయ్య గారికి నలుగురు కుమారులు. 1. రాచయ్యగారు, 2. శంకరయ్యగారు, 3. షడక్షరి - పంచాక్షరి అను వీరిద్దరు కవల పిల్లలు ఇద్దరిలో పంచాక్షరిగారు బాల్యములోనే గతించిరి. షడక్షరి గారుండిరి. తరువాత 4. శ్రీ వీరయ్యగారు మా తీర్థ రూపులు. వీరికంటే పెద్ద సోదరి శ్రీమతి సంగమ్మగారు వీరి వివాహము జోగిపేటలోని శ్రీ అడికె వీరయ్యగారితో జరిగినది. చేవెళ్ళ చూచుటకు చిన్న గ్రామమే అయినను వీరశైవ భక్తా మాహేశ్వరుల గృహములే వందకు ఏబది ఇండ్లు భక్తులవే యుండును. ఈ భక్తులు తమ ఆచారసాంప్రదాయముల ప్రకారము పండుగలందు శుభాశుభ కార్యములందును మాహేశ్వరుల నాహ్వానించనిదే భుజించెడి వారుగాదు. ఇంచలి జనులందరు వ్యవసాయ దారులె. గ్రామం చుట్టూర మోట బావులు, ఉల్లి, వెల్లుల్లి, జొన్న, గోధుమ, శనగ ధాన్యములను పుష్కలంగా పండించెడివారు.

పైన పేర్కొన్న నలుగురు సోదరులలో అందు పెద్దవారు శ్రీ రాచయ్యగారు శ్రీమతి శివ్వమ్మగారిని వివాహమాడి ఇంట్లోనే ఉండి సంసార భారమును వహించి యుండిరి. రెండవవారు శ్రీ శంకరయ్య గారు పావన్న పేట మఠమునకు దత్తుగా వెళ్ళి నాగమ్మను పెండ్లియాడి అక్కడ సంసార భారమును నిర్వహించిరి. వీరికి సంతానము లేని కతమున అరుగొండ గ్రామము నుండి శ్రీ మల్లయ్య (చంద్ర శేఖరయ్య)ను మఠాధికారమునకు. శంకరయ్యను గృహస్థునిగా కార్య నిర్వాహకులనుగాచేసికొనిరి. మూడవ వారైన శ్రీ షడక్షరి (గొల్లాళప్ప) గారు జోగిపేట పెద్ద మఠము మరియు సదాశివపేట పెద్ద మఠము లకు అధ్యక్షులుగా నుండి, మఠాల యొక్క కార్య కలాపముల నిర్వ హణమునకై తమ కనిష్ఠ సోదరులైన శ్రీ వీరయ్యగారిని (మా తండ్రి గారిని) తమవద్దనే ఉంచుకొని చిలపుచెడు మఠము శ్రీ బక్కయ్యగారి కూతురైన నాగమ్మతో పాణిగ్రహణము జేయించిరి. ఇట్లు వీరందరు రెక్కడ విభజింపబడి తమ తమ బాధ్యతలను నిర్వహించుచుండిరి.

తరచుగా మా తండ్రిగారు తన సోదరులైన శ్రీ గొల్లాళప్ప (షడక్షరి) మహాస్వాములవారి వద్దనే ఉండి గ్రామంలో భిక్షాటన (పిండి-బియ్యం) మరియు స్థానిక వీరశైవుల ఇండ్లలో జరిగే శుభా-శుభకార్యములను నిర్వహించుచుండిరి.

వీరుభయులు తమ సోదరిని జోగిపేటకు ఇచ్చుట వలన-ఇక్కడి పెద్దమఠమును స్వాధీనపరచుకొని అనగా అప్పట్లో మఠాధిపతిగా నున్న శ్రీ వీరంతప్ప మహాస్వామివారి ఆదేశానుసారము ఉండి తమ కార్యకలాపములను ఉధృతపరచిరి. నిరంతరము మఠమునకు విచ్చేయు అతిథులకు దాసోహము(అన్నదానము)ను నెలకొల్పి యుండిరి.

పోతె మఠము కేవలము గ్రామము భిక్షాటనము పైననే ఆధారపడి యున్నందున స్వప్రభావముతో మఠము వెనుక కొంత (ఒక ఎకర) భూమిని సంపాదించిరి.

అన్నదానము (దాసోహం)తో పీఠల కీర్తిప్రతిష్ఠలు స్థానికముగాను, పరిసర గ్రామములందును బాగుగా వ్యాప్తి చెందెను, జోగిపేట తాలూక గ్రామమగుటచేత మున్సిఫ్ కోర్టు, తహసీలు ఆఫీసు, పోలీసు స్టేషన్, ప్రభుత్వ ఔషధాలయము (దవాఖానా), ప్రభుత్వోన్నత పాఠశాల, బాలికల పాఠశాలలతో గూడియుండేదే గాకుండ వ్యాపారరీత్యా గొప్ప పేరు ప్రఖ్యాతులను గడించినది. ఈ గ్రామమున కుత్తర దక్షిణ దిశ లందు గొప్పగా విశాలములైన తటాకములున్నవి. దీనికి ఉత్తరమున నున్నది. అన్నాసాగరం చెరువనియు, దక్షిణమున నున్నది అందోలు చెరువనియు ఇవి వర్షాలు బాగుగా కుర్సి నిండిన యెడల రెండు సం॥ముల వరకు వర్షములు పడకపోయినను, పంటలను బండించుటకు కొరత యుండదు. సంవత్సరమునకు ఈ చెరువు నీటి ద్వారా రెండు మూడు వరి పంటలను రైతులు అవలీలగా పండించుచున్నారు.

ఇవేకాకుండ ఆ గ్రామము చుట్టు మోటబావులు, మామిడి తోటలు, పుష్పవాటికలు, చిన్న పుట్ట చెరువులు కుంటలకు కొదువలేదు. వీటి నీటి ద్వారా గూడ వరి పంటలను సమృద్ధిగా పండించుట వలన యెప్పుడు గూడ క్షామ మనేదిక్కడ ఉండదు. వరి పంటలు సమృద్ధిగా పండుటే గాకుండ మెట్టపంటలు జొన్న, గోధుమ, వేరుశనగ, శనగ, పెసలు, మినుప మొదలగు పంటలు గూడ సమృద్ధిగాబండును.

ఇక్కడ ప్రతి ఆదివారము సంత జరుగుతుంది. ఈ గ్రామము నకు తూర్పు దిక్కున ఎత్తు గుట్టపై జోగినాథస్వామి మందిరము ఒకటి

వెలసియున్నది. ఇటీవలె ఈ గుట్టపైననే ఒకటి నెహ్రూ మెమోరియల్ ఆర్ట్సు మరియు సైన్సు డిగ్రీ కళాశాల. మరియు జోగినాథస్వామి గుడి ప్రక్కనే శ్రీవీరభద్రుని విగ్రహము, ఈరెండు విగ్రహములకు పూజారులు వీరశైవపశుపతి జంగములున్నారు. ఈ మందిరమునకు కొద్ది దూరంలో దక్షిణ దిశలో మున్సిఫ్ కోర్టు (న్యాయాలయము) దాని ముందటే మంచి నీటి సప్లైజేయు నీళ్ళ ట్యాంకు ఉంది. దీనికి కొద్ది దూరంలో జోగి పేటలో క్రొత్తగా నిర్మించిన గంజి. దానికి కొద్ది దూరంలో బి.డి.ఓ. కార్యాలయము, విద్యుత్తు సప్లైజేయు కార్యాలయముంది. ఇకపోతే ఈ గుట్టు పొడుగునా గృహకల్ప సహాయంతో బి.సి.వారికి. క్రొత్తగృహములు నిర్మించబడినవి. గ్రామ పంచాయితి కార్యాలయము. దాని ప్రక్కనే తహసీలు కార్యాలయము, దానికి చెరువలోనే రక్షక భటుల (పోలీసు) కార్యాలయము. పోలీసులుండె గృహములు, దాని ప్రక్కనే బీద విద్యార్థుల హాస్టలుంది. ఒక గొప్పనైన దవాఖానా ప్రసూతి గృహము లున్నవి. గ్రామమధ్యన కాలసూచి (క్లాక్ టవర్) ఉత్యున్నతముగా నిర్మించబడినది. పడమర దిశలో గ్రామమునకానుకొనే ఒక శివా లయం శ్రీ రాజేశ్వర దేవాలయము ప్రాచీన కట్టడముతో ధర్మశాల. దానితో విశాల మందిరము చూడముచ్చటగా నున్నది. దక్షిణ దిశలో శ్రీ మాణిక్యప్రభు మందిరము. దానికి సమీపంలో ఈశ్వరాలయ ముంది. ఇందులో చిన్న మఠమయ్య శ్రీ యం. వీరభద్రయ్యగారు తన సొంత గృహం(మఠము) స్థలము కొద్దిగానున్న 3 ఎకరాల సేద్యపు భూమిని విక్రయించుకొని స్థానిక ఈశ్వరాలయంలోనే వీరితండ్రి శ్రీయం. మడివాళయ్యగారి కాలము నుండి స్థిర నివాసం ఏర్పరచికొని కుటుంబ యుక్తముగానున్నారు. తూర్పుగవని (కమాను)కి సమీపంలో ఉత్తర

వెలసియున్నది. ఇటీవలె ఈ గుట్టపైననే ఒకటి నెహ్రూ మెమోరియల్ ఆర్ట్సు మరియు సైన్సు డిగ్రీ కళాశాల. మరియు జోగినాథస్వామి గుడి ప్రక్కనే శ్రీవీరభద్రుని విగ్రహము,ఈరెండు విగ్రహములకు పూజారులు వీరశైవమతుపతి జంగములున్నారు. ఈ మందిరమునకు కొద్ది దూరంలో దక్షిణ దిశలో మున్సిఫ్ కోర్టు (న్యాయాలయము) దాని ముందటే మంచి నీటి సప్లైజేయు నీళ్ళ ట్యాంకు ఉంది. దీనికి కొద్ది దూరంలో జోగి పేటలో క్రొత్తగా నిర్మించిన గంజి. దానికి కొద్ది దూరంలో బి.డి.ఓ. కార్యాలయము, విద్యుత్తు సప్లైజేయు కార్యాలయముంది. ఇకపోతే ఈ గుట్టు పొడుగునా గృహకల్ప సహాయంతో బి.సి.వారికి క్రొత్తగృహములు నిర్మించబడినవి. గ్రామ పంచాయితి కార్యాలయము. దాని ప్రక్కనే తహసీలు కార్యాలయము, దానికి చెరువలోనే రక్షక భటుల (పోలీసు) కార్యాలయము. పోలీసులుండె గృహములు, దాని ప్రక్కనే బీద విద్యార్థుల హాస్టలుంది. ఒక గొప్పనైన దవాఖానా ప్రసూతి గృహము లున్నవి. గ్రామమధ్యన కాలసూచి (క్లాక్ టవర్) ఉత్యున్నతముగా నిర్మించబడినది. పడమర దిశలో గ్రామమునకానుకొనే ఒక శివా లయం శ్రీ రాజేశ్వర దేవాలయము ప్రాచీన కట్టడముతో ధర్మశాల. దానితో విశాల మందిరము చూడముచ్చటగా నున్నది. దక్షిణ దిశలో శ్రీ మాణిక్యప్రభు మందిరము. దానికి సమీపంలో ఈశ్వరాలయ ముంది. ఇందులో చిన్న మఠమున్న శ్రీ యం. వీరభద్రయ్యగారు తన సొంత గృహం(మఠము) స్థలము కొద్దిగానున్న 3 ఎకరాల సేద్యపు భూమిని విక్రయించుకొని స్థానిక ఈశ్వరాలయంలోనే వీరి తండ్రి శ్రీయం. మఠివాళయ్యగారి కాలము నుండి స్థిర నివాసం ఏర్పరచికొని కుటుంబ యుక్తముగానున్నారు. తూర్పుగవని (కమాను)కి సమీపంలో ఉత్తర

ముగా బడియుండేది. దీని పునరుద్ధరణమునకై స్థానిక వర్తక సంఘము వారు పూనుకొని అందుకు మా పెద్ద మఠము నిర్మాణమునకై దెచ్చియుంచిన నాలుగైదు గజముల పొడుగుగాటి ఒక ఫీటు (అడుగు) న్నర వెడల్పుగల 12 కడీలను "మళ్ళీ మీకు దెచ్చియిచ్చెదమని" చెప్పి ఒక చిట్టి వ్రాసి నాకే ఇచ్చి శ్రీ దట్టి గోవిందు గుప్తగారు దీసికెళ్ళినారు. కాని ఈ వరకివ్వకుండానే వారు మరణించిరి. మరో వర్తకుడు శ్రీ చింతల శంకరయ్యగుప్తగారు గూడ నేను సంస్కృత విద్యాభ్యాసమునకై కర్నాటకమున రాయచూరుజిల్లా యాదగిరికి వెళ్ళియున్న సమయంలోనే నిమ్మన్నానని అబద్ధపుమాటలు మాసోదరునితో చెప్పి కొన్నిరాతికడీలను దీసికెళ్ళి ఇంతవరకివ్వలేదు. ఇట్లే "గరీబికి బీవి సబుకి భాబి" అన్న సామెత మేరకు ఇప్పటి భక్తులు మఠమునకు దాము దానమొసగి దాని నుద్ధరించుటకు బదులుగా అద్దానికి సంబంధించిన రాళ్ళను దీసికెళ్ళడము, మట్టిని త్రవ్వి దీసికెళ్ళడము జరిగినది, జరుగుతుంది.

ఇక ఇక్కడ నా బాల్యమును గురించి వివరించవల్సి యున్నది. నేను సుమారు రెండు అథవా మూడు సంవత్సరముల ప్రాయములో నున్నప్పుడు మా పెద్ద నాన్నగారైన గౌరీశప్ప (షడక్షరి) మహాస్వాములవారు తమ కనిష్ఠ సోదరుండైన మా తీర్థరూపులు శ్రీ ముగ్గం మఠం వీరయ్యగారి జ్యేష్ఠ కుమారుడినైన నన్ను తమ కుత్తరాధికారిగా సదాశివపేట మరియు జోగిపేట పెద్ద మఠాలకు స్వీకరించి, అందుకు దగిన మాహేశ్వర దీక్షా సంస్కారమును (కారణాలు—అయ్యాచారాలు) చేసే సమయంలోనే "వ్యవహారిక చాంద్రమాన రక్తాక్షినామ సం॥ఫాల్గుణ బహుళ ౧౨ బుధవారం" నాడు ఈ కారణ సంస్కార కార్యక్రమమును, గొప్ప గొప్ప మహాస్వాములను రప్పించి వారి సమక్షమున జరిపించిరి.

ఈ సందర్భమున పాల్గొన్న చరమూర్తులు శ్రీ పూజ్య సంగన బసప్ప తాలూక చెరమూర్తి నివాసము దన్నవరము చెన్‌వీరయ్యగారు, పూజ్య శ్రీ గొల్లాళప్ప శివానుభావ చెరమూర్తి సదాశివపేట, పావన్న పేట మఠం చంద్రయ్యగారు దేశికమూర్తి, శ్రీ పూజ్య కల్పగూరు వీరు సంగప్ప తాలూక చెరమూర్తి. బిక్కలం పావన్నపేట చంద్రయ్య కాదులాబాదుచెరమూర్తి గంగాధరయ్య, సం. ద. సంగన బసప్ప చెరమూర్తి చేవెళ్ళ తకుశిమురాయచూరు.

ద, పులుకల్ మూలమఠం శంకరప్ప

మొ, పులకల్ దేశికమూర్తి

ప, మఠంచెను బసప్ప కల్పగూరు

ప, గురుశాంతప్ప దేశికమూర్తి చెవేళ్ళ. మఠం సిద్ధి వీరయ్య డాకూరు.

మహాత్తు దైవము చెవేళ్ళ

౧, ద, భూమన్న మొకద్దంమాలి.

౨, ప, అనుమన్న మొకద్దం రొత్వాలు, మొ॥

---

సూచన :— కారణ సంస్కారముకైన పత్రము యొక్క ప్రతి

## (నకలు)

## శ్రీగురు బసవలింగాయనమః

శ్రీ శుభమస్తు

సంగన బసప్ప తాలూక చెరమూర్తి నివాసం దన్నవరము చెన్‌వీరయ్య

౧. గొల్లాళప్ప శివానుభావ చెరమూర్తి సదాశివపేట.

పాపన్నపేట చంద్రయ్యగారు దేశికమూర్తి శ్రీమతు సచ్చిదా నంద చిన్మయ చిద్రూపయోగ ఆనంద అద్వైత నిత్య శుద్ధపరిపూర్ణ సమర్థ వియోగజపకరు తత్వకారణ మహాసుఖాపన్నులైన, పట్టాభిషిక్తు లయ్యు రేవణ సిద్ధశివాచార్యయోగ మండల కమండలధారులైన పొడమ చిళిగి సాంప్రదాయకులైన గురు శాంతప్ప శిష్యుడు, రాచయ్య శిష్యుడు, మల్లయ్య శిష్యుడు, శంకరయ్య, సిద్ధయ్య శిష్యుడు, వీరయ్య యిట్టి యీ అయిదుమంది కారణసంస్కారం... .... అయినది.

వ్యావహారిక చాంద్రమాన రక్తాక్షినామ సం,
ఫాల్గుణ బ, ౧౧, బుధవారం కారణం
అయ్యనది. చేవెళ్ళ సంగన బసప్ప మఠంలో
సహి....... కారణముల తప్పీలు

1. రాచయ్య వ, వీరయ్య, చేవెళ్ళ సిద్ధయ్య వ, సంగయ్య చేవెళ్ళ, పిండ్లు యిద్దరు సదాశివప్పని ప్యాట, జోగిప్యాట, షడస్థలం పెద్దమఠాలకు హక్కుదార్లు.

1. మల్లయ్య వ, భూమయ్య...........చిలుపు చెడు మఠముకు

1. శంకరయ్య ద, చంద్రయ్యసాకిన్, చిట్టెంపల్లి-చీలెపల్లి మఠాలకు

1. వీరయ్య వ, శంకరయ్య అందోలు మఠంకు....... చేవెళ్ళ మఠంలో కారణాలు చేసినది సహి, ఈ స్తకతులు పెద్దలయ్యనవారు.

1. కల్పగూరు వీరు సంగప్ప తాయాక చెరమూర్తి, బిక్కులం పాపన్నపేట మఠం చంద్రయ్యగారు.

1. కాడులదాద చెరమూర్తి గంగాధరయ్య.

1. సం. ద, సంగన బసప్ప చెరమూర్తి, చేవెళ్ళ తకుశిమ్ము.. రాయచూరు.

ద, పులికల్ మూలమఠం శంకరప్ప మొక్కాం పులికల్ దేశి కమూర్తి.. .......

ద. మఠం చెనుబసప్ప కల్వగూరు.

ద, గురుశాంతప్ప దేశికమూర్తి చేవెళ్ళ మఠం సిద్ధవీరయ్య దాకారు.

మహత్తు దైవము చేవెళ్ళ

1. ద, భూమన్న మొకద్దం మాలి

1. ద, అనుమన్న మొకద్దం కొత్వాలు.

ఇట్లు నా కారణ సంస్కారము జరిగిన పిదప మా తండ్రి గారి తోబుట్టువైన శ్రీమతి సంగమ్మగారిని జోగిపేట వాస్తవ్యులైన శ్రీ అడ్డె వీరయ్యకిచ్చి వివాహము గావింప; వారితోబాటే బాల్యములో నున్న మా పెద్దనాన్న గారిని మరియు నాన్నగారైన వీరయ్యగారిని స్థానిక పెద్ద మఠాధిపతులైన పూజ్య శ్రీ వీరంతయ్య స్వాములవారు మిగుల ప్రేమతో తన భుజాలపైన గూర్చుండపెట్టుకొని బజారునకు దోక్కొనిపోయి వారిద్దరి చిన్నారుల కిష్టమైన తినుబండారుల నిప్పించి మరల ఇంటివద్ద వారిద్దరిని వదలివేసి తమ మఠానికి దిరిగి వెళ్ళేవారట. ఇదే విధముగ ప్రతి దినము రాకపోకల వలన బలపడిన అనురాగము చేత శ్రీ పూజ్యులైన వీరంతప్ప మహాస్వాములవారు మా జ్యేష్ఠ పితృవ్యులైన షడక్షరిని (గొల్లాకప్ప)ను తన మఠమున కుత్తరాధికారిగా స్వీకరించి కారణ (అయ్యాచార) సంస్కారములను గావించిరనియు. ఆ తరువాత కొన్నాళ్ళకు పూజ్యపాదులు శ్రీ వీరంతయ్య మహాస్వాములు లింగైక్యు లైరనియు, నా బాల్యములో మా తీర్థరూపులైన శ్రీ వీరయ్యగారు చెప్పగా వింటిని, శ్రీ వీరంతయ్య స్వాములవారు మహత్తుగలవారనియు, పుణ్యవంతులనియు, వారు లింగైక్యులైన పిదప పెద్ద మఠంలోనే

ఒకమూలన యథాశాస్త్రోక్తముగా సమాధినిగట్టించిరి. స్వామివారిసమాధి సున్నము (గచ్చు)రాలతో, రాతి కాడీలతో కమాను కమానులుగా తీర్చి దిద్ది, ముగ్గులు రంగవల్లి మామిడి తోరణములతో, అరటి బోదెలతో కొబ్బరి కొమ్మ, (ఇప్పలు—ఆకు)లతోను, పూలమాలతోను, సుగంధ ద్రవ్యములతోను, అగరుబత్తి ధూపములతో, అరటిపండ్లు ఫలాలతోను, టెంకాయలతో నలంకరించబడి యుండెనట. రేయింబవళ్ళు భజన—సంకీర్తనలతో ఆరాధన జరిగేదని చెప్పేవారు. అంత్యక్రియలను సల్పి ఒక సం॥ము గడచిన తరువాత మరల నా సమాధినిదీసి చూడగా పార్థివ శరీరమట్లె యుండెననియు, ఆ తీసిన రోజు ఆదివారమగుట వలన సంత జరుగును. ఈ సంగతిని వినిన జనులు తండోపతండములుగా విచ్చేసి స్వామివారి పార్థివ శరీరమును దర్శించి టెంకాయలను గొట్టి తీర్థ ప్రసాదములను స్వీకరించి వెళ్ళారని మా నాన్నగారు చేప్పేవారు. నేటికిని వారి సమాధి మఠంలోనే ఉంది.

శ్రీవారు లింగైక్యమైన తరువాత మా పెద్ద నాయనగారు పెద్ద మఠము నభివృద్ధి పరచిరి. గొప్ప అశ్వరాజముల నధిరోహించి సంచార మొనరించిరి. మఠానికి వచ్చిన అతిథులందరికి దాసోహ (అన్నదానం) కర్మచేత తృప్తిపరచిరి. స్థానిక మరియు పరిసర గ్రామ భక్తులందరు వారి గుణగణములను వేనోళ్ళ బొగడుతు పాదార్చనల గావించిరి. వారి యభీష్టముల మేరకు నడచుకొనిరి. ధనధాన్యములను తమ తమ యథా శక్తి కానుకలుగా తెచ్చి గడుభక్తితో సమర్పించుకొనిరి.

కాని స్థానిక గ్రామము (జోగిపేట)లోని శివభక్తులెల్లప్పుడు పోట్లాడుట, ఉన్న కొద్ది మందిలోనే రెండు మూడు చీలిక లేర్పడుటకు అసహించుకొని, కొన్నాళ్ళ తరువాత తన ప్రతినిధిగా శ్రీ మల్లయ్య

స్వామిని పెద్దమఠంలో నిల్పి శ్రీ గొల్లాళప్ప (షడక్షరి) మహాస్వాముల వారు మొదలు ఒక్కరే సదాశివపేటకు వెళ్ళి చౌకిమఠములో ప్రసిద్ధి గాంచిన శ్రీ చనమల్లప్ప, శ్రీ రాచోటప్ప మహాస్వాములతో కొన్నాళ్ళు గల్సి ఉండి. అటు పిదప తమ శాఖా మఠమైన స్థానిక (సదాశివపేట లోనె) పెద్ద మఠమునకు శ్రీ మాదయ్య స్వాములవారి ఆహ్వానముపై విచ్చేసి తదభివృద్ధి పరచెను. తరువాత శ్రీవారు తమ కనిష్ఠ సోదరులైన శ్రీ వీరయ్యగారు కుటుంబ యుక్తముగా సదాశివపేటకు వెళ్ళిరి.

సూర్యుడుదయించు దిక్కులో బడియున్న కొలత కోలమాదిరి గల చిన్నగట్టు అద్దానిపై శ్రీ జోగినాథస్వామి వెలసి సమస్త జనులను దన చల్లని చూపులతో బ్రోచుచుండును. ప్రతియేట వైశాఖ శు॥ ౧౦॥ నాడు రథోత్సవ మత్యంత వైభవోపేతముగ జరుగును. నైజాం రాష్ట్రముననే ఇచటి రథము యొక్క నైపుణ్యము జాతముప్పటగా నుండును. సుమారు పదైదు రోజులైన ఈ రథోత్సవము జరుగుచుండెను. వేల ప్రజ లిందు పాల్గొనెవారు, నాటి బాజాదుల యలంకరణములు వర్ణనాతీతమై యుండేవి.

నేను సుమారు (౫)ఐదు సంవత్సరముల ప్రాయమువాడను. ఆ కాలమున నాయొక్క ఆచారవిచారములు వేరు. ధరించు ఉడుపు వేరు. లోకాతీతమై యుండెను. కారణమేమనగా నన్ను మా తండ్రిగారు బాల్యముననే (రెండు సంవత్సరముల వయస్సులో) మా తండ్రి జ్యేష్ఠ సోదరులు సన్యాసాశ్రమమున నుంటచేత వారికి ఉత్తరాధికారిగా జోగిపేట పెద్ద మఠము (హిరే:మఠము, అని కన్నడమున వ్యవహారము గలదు). నాకు దత్తముగా నొసగియుండిరి. అందువలననా బాల్యవయస్సు ననుసరించి పాదరక్షులలో చిన్న చిన్న (కఱ్ఱపాదుకలు) పావకోళ్ళు (కఱ్ఱచేత

చేయబడిన పాదుకలు, పైసిందుగా పిలమండల పర్యంతము కావికపని (శాల్వ) లోన కౌపీనము, మస్తకమునకు పొడుగాటి టోపి యొకటి, నుదుట భస్మము, కంఠమున రుద్రాక్షమాలలు, ఈ వేషమును ధిల కించిన సమస్త జనులు సన్మానిక పూజ్యభావముతో గౌరవించుచుండిరి. కొందఱుతోటి వయస్కులు ఇరిహసించుచుండిరి. మరికొందఱు గుణ వంతులు జూచి సంతసించుచుండిరి. వయస్సు ననుసరించి మా తీర్థ రూపులు గూడ విద్యావిచక్షణుండు గాబట్టి నన్ను పిన్న ప్రాయముననే విద్యార్జనమునకు మూలమగు అక్షర విన్యాసములను గ్రమముగా నభ్యా సము జేయించిరి. తీర్థరూపులు బహులౌకిక వ్యవహారజ్ఞులు. కావున లౌకిక జ్ఞానార్జనమునకై వరుసగ ఒకట్లు ఎక్కములు. బంతులు (కూడికలు, గుణకారము, తీసివేత) బాజా బాకీలు పుస్తక పఠనము. ఆంధ్ర నామ సంగ్రహముయొక్క పద్యములను కంఠస్థము జేయించు చుండిరి. అమరకోశములోని శ్లోకములనువల్లింపజేయుచుండిరి.

సుమారు (౮) ఎనమిది సంవత్సరములు ప్రాప్తమగునరికి ప్రభుత్వ పాఠశాలలో జేర్చిరి. ఆ సమయమున బాల్యచాపల్యత ననుస రించి సదాసహచరులతో గూడి యాడుకోవలెనను గుతూహలము నాలో మెండు, సరె. మా తండ్రిగారు ఘరము నుండి బయటకు వెళ్ళెదె ఆలస్యము సహపఠుల మధ్యన జేరితిని. ఈ విధముగ అధికమైన క్రీడా కుతూహల ప్రేరితుడనైనను ఏ క్రీడయందు నిపుణుడనుగాను, గోటిం ఆటయందు ప్రథమముగ నేనే మొ చేతితో దూకుడు, చిర్రగోనె ఆట యందును నావె "కై" ముందు, గోంగురాల ఆటలయందును నా కొండ రావ్నే క్రీడ బదవేయుటము. ఇలాంటి క్రీడా వైదగ్ధ్యమును, గావుననే ఈ యాటల యందాసక్తి గలవాడనై భోజనాదులపై శ్రద్ధ యంతగా

శేకుండెడివి. మా తండ్రిగారి దెబ్బలకు జడిసి వారు స్నానం, శివార్చన భోజనాదుల బరిసమాప్తి జేయుసరికి వారి దృష్టిపథమును దప్పించుక దిరుగుచుంటిని. భోజనానంతరము మధ్యాహ్నము వారికి కాస్త నిద్రించు అలవాటు. వారు నిద్రించిన పిదప మాతృశ్రీగారు వెదుకుతు వచ్చి భోజనమునకై బిలువగా నాయనగారు నిద్రించిన సంగతిబోధకట్టడముతో అతీవ భయముచేత మెల్లమెల్లన గృహమును బ్రవేశించి, స్నానము, శివార్చన,భోజనాదులుతొందరగ దీర్చుకొని,ధౌతవస్త్రములనుమేనదాల్చి మనః క్రీడానిమగ్నుడనగుచుంటిని. సాయంత్రము దీపారాధన గావించు వేళకు గూడా భయముచేత ఇంట్లోకి బ్రవేశించకుండ బయటనె అక్క డక్కడ దిరుగుతు కాలయాపనం బొనర్చుచుంటిని. ఒకొక్క సారి మా యింటికి ప్రక్క ఇంట్లో పరుండుకొనుచుంటిని. నా పిదప మా తండ్రి గారు నా విషయమై అమ్మగారిని కోపగించుట గమనించి అమ్మగారొక చేత లాటిన్ (రందిలి దీపము)ను బుచ్చుకొని నా సహచరుల యిండ్లను (వెదకుతు)గాలించుతు వచ్చి నేను నిద్రించియున్న ఇంటికి వచ్చి లేపి రమ్మనినను నాయనగారికి భయపడి రానని మారాము జేయుచుంటిని. అందుకు అమ్మగారు నానా విధముల సమాధానముల జెప్పి యోదార్చి చిట్టచివరికి "నీవు నిద్రబోయినట్లు కండ్లుమూసి పరుండుము" నేను మీ నాయనతో నిద్రబోయినాడని జెప్పుదును. అని యనడముతోనె అమ్మ గారి చంకనజేరి ఇంట్లోకి రాగానె నిద్రబోయినట్లు నటిస్తు కండ్లు మూయుచుంటిని, అమ్మ నన్ను దెచ్చి యింట్లో పరుండబెట్టుచుండెడిది. ఆ సమయమున మా నాయనగారు సంతోషముతో నుండిరా! సరేసరి మంచిదే! లేదా! కోపము మితిమీరి పరుండబెట్టుటయే తడవుగా నాలుగైదు దెబ్బలు వడ్డించి "లే ! లేరా : వెధవ ప్రొద్దస్త మానం ఆడుకొని స్కూలుకు వెళ్ళక యిప్పుడు నిద్రబోయినట్లు

నటించుచున్నావా? అని మందలిస్తు ఒక గంట, యరగంట కాలము జదివించనిదే భోజనము పెట్టించకుండెను. ఆ పిమ్మట వంట సిద్ధము కాగా నేను నాసోదరునితో గూడి భోజనమునకు సిద్ధపడుచుంటిని. భోజనానంతరము శయనము.

ఉదయం ముఖప్రక్షాళనము కాగానె నాయనగారు పుస్తక పఠనమును చేయించుచుండిరి. తరువాత బడికి బంపుచుండిరి. కర్రపలుకలు చంకనిడికొని తోడి విద్యార్థులతో బడికి వెళ్ళుచుంటిమి. అక్కడ ఉర్దు పహిలి, తెలుగు వాచక పుస్తకము. చిదప ఉపాధ్యాయులలో నొకరు వీరశైవ మతాధిపతులు కావున వారు నాకు మా ధర్మమునకు సంబంధించిన కొన్ని శ్లోకములను పలుకపై వ్రాసి యిచ్చి దీని వల్లించుమని యాజ్ఞాపించుచుండిరి. బడివదలి ఇంటికి రావడముతోనె మా నాయనగారు నేడు మీరేమి జదివియున్నారని విచారించుచుండిరి. స్నానము, అర్చన, అన్నపానాదులు నెరవేర్చుక తిరిగి మధ్యాహ్నము బడికి వెళ్ళుచుంటిమి. ఉపాధ్యాయులు పాఠముల బోధించిన తరువాత తెలుగు మాస్టరుగారు (ఉపాధ్యాయుడు) బడి వదలు సమయమున మా తరగతి విద్యార్థులతో బాటు నాకును వాచకములో చివరనుండు నీతి బోధికములగు వేమన, సుమతి శతకములలోని పద్యములను కంఠస్థ మొనరింపుడని యాజ్ఞాపించుచుండిరి. అట్టి పద్యములను ఇంటివద్ద జ్ఞాపకము జేయుచుంటిని గాని బడిలో బాలుర సమక్షమున అప్పజెప్పుటకు చాల లజ్జయు మఱియు భయముచేత మౌనముద్రను వహించుటవలన ఉపాధ్యాయులు గట్టిగా బెదరించునరికి ఆ కాస్త జ్ఞాపకమున్న పద్యము సహ బొత్తిగా మఱచిపోవు చుంటిని. తత్ఫలితముగా నేననేక తాడనములకు గురియగుచుంటిని. ప్రతిరోజు క్రొత్తగ దెచ్చిన బెత్తములన్నియు నాపైననే విరుగుచుండెను. ఇట్లున్నప్పటికి బడిలో నున్నంతసేపు భీతిచే పద్యము

యొక్క పాదమైనను జ్ఞప్తికి రాకుండెను. కాని బడి వదలిన పిదప బాలురెల్లరు గృహమునకు వెళ్ళునప్పుడు నా తరగతి విద్యార్థులు నిన్నటి పద్యము నుచ్చరించడముతో నేను వారికంటెను మొట్టమొదలే పూర్తి పద్యమును గట్టిగా నుచ్చరించుచుంటిని. దీనిని నాతోటి విద్యార్థులు "ఇదేమి? రాచయ్యా! యింతవరకు మాస్టరు గారెంత జెప్పుమనిన నీ ముఖము నుండి యీ పద్యము యొక్క స్వల్ప భాగమైన వెడలలేదు. ఇప్పుడు మాత్రము పూర్తి పద్యమును బలికితివి. ఇది చాల యాశ్చర్యకరమే! నీకు దెబ్బలంటే అంత రుచికరమా? అని యెగతాళి జేయుచుండిరి.బాను అక్కడ మాస్టరుఉగ్రస్వరూపమునుజూడడముతోనేనాకు పద్యము వచ్చేది గూడ మరచిపోయె వాడను. ఒక్కొక్కప్పుడా దెబ్బలకు భయపడియే బడికి పోవువాడనుగాను. పలకలు చంక బెట్టుకొని శ్రీ జోగినాథస్వామి వారిగట్టు పొడవుననున్న చెట్ల దాపున దిరుగుచు కాలయాపన మొనర్చి బడి వదలె గంట శబ్దము వినడముతోనె తొందరగా పరుగిడుతు వచ్చి బాలురతో గూడి యింటికి వచ్చు పద్ధతి-గూడ యొక్కొక్కసారి జరుగుచుండెను. ఇంటిపద్ద మా తండ్రిగారు బడికి వెళ్ళినారా? అని యడిగినచో వెళ్ళినామని సమాధానమిచ్చెవారము. పిదప మాస్టరుగారి ద్వారా లేదా పిల్లలను దోడితెచ్చు సేవకునితో గాని మేము బడికి వెళ్ళలేదను వాస్తవ సంగతిని నాయనగారు వినిరా! ఆ దినము రజ్జుదెబ్బలలో శరీరము హూనము అగుట తప్పదు.ఈ బాధలను భరింపలేక ఒకనాడు సోదరునితో సహా మా మాతామహులవారి గ్రామము చిలిపిచేడు (చిలప్చెడు)కు వెళ్ళియుంటిమి. ఈ గ్రామము జోగిపేటకు నాలుగు క్రోసులు. (8మైళ్ళు) మధ్య మార్గమున మంజిరా నది ఉండును. వేసవి కాలము కాపున దీనియందు నీరు తక్కువ

గలదై ఇసుక తిన్నెలతో గొప్ప గొప్ప రాతిగుండ్లతో విశాలముగా అగుపడుచుండును.

మాతామహులుగారు మమ్ముజూచి భయగ్రస్తులై "మీరు చిన్నపిల్లలు, తోడెవరు పెద్దవాళ్లులేనిదే యెట్లు వచ్చితిరి? నదిలో నీరెంత యున్నదో! మార్గమెట్లు దొరకెనో? దారి మధ్యమున దొంగలు. చేతులకు, కాళ్ళకు, ఉండు వెండి కడియములు, చెవులలోని బంగారపు (పోగులు) తీసికొని చంపినచో దిక్కెవరు? అని పరిపరి విధముల విచారించుచు దుఃఖించుచుండిరి. రెండు మూడు రోజుల వరకు మమ్మింటి నుండి కదలనివ్వకుండ నుంచుకొనిరి. జోగిపేట గ్రామము నందలి మా తల్లిదండ్రులు దిగులొంది యెక్కువ బాధతో రేయింబవళ్ళనక మూడు దినములు చెరువులు, బావులు, కుంటలు, అన్నపానీయములు మానుకొని దుఃఖముతో వెదకుచుండిరి. ఇంతలో మాతుఃశ్రీగారి కాలికి తేలు కుట్టినది. అదో బాధ.

ఇంతలో మా మాతామహులుగారు వారివద్దనే మేమున్న సంగతిని మా వారికి కబురు చేసిరి. వెంటనే యెంతో కనికరముగలదై మా తల్లిగారు వచ్చి వెంబడించుక వెళ్ళిరి. మా తండ్రిగారు మేము యింటి లోనడుగిడినతోడనే పట్టరాని యావేశముతో దండతాడనము గావించి. తమ కోపము చల్లార్చుకొనిరి. అప్పటి నుండి జనకులతి జాగరూకతగల్గి యింటిపట్ట బడి సమయము వరకు చదివించి, తదుపరి బడి వరకుసాగనంపుచుండిరి. సెలవు దినములలో వృథాకాలమును వెళ్ళబుచ్చకుండ యెదుట గూర్చుండబెట్టి గణితమును బోధించుచుండిరి. ఈ లెక్కలనిన నాకతం బాధ. నా బుఱ్ఱలోకవి చొరకుండినను ఈ లెక్కలు బోధించునపుడు మా నాయనగారు నాకు పగవాడుగ గోచరించుచుండెను. ఆ

గణితమునందే మాత్రముయే లోపముగాన్పించినను నాకు మిగుల బాధ గల్గుచుండెను.

ఇదే విధముగ నొకసారి లెక్కలను బోధించుచు మా తండ్రి గారు లెక్కలలో మందబుద్ధితనమునకు మండలించిరి. అదే సమయమున నాకు కోపమధికమగుటచే పలకను తండ్రిగారి ముందు పడవేసి లేచితిని. వెంటనే వారు చేత బడిత పుచ్చుకొని నన్ను కొట్టసాగిరి. ఎవరును వచ్చి విడిపించుటకు సాహసము జేయలేదు. ఒక్కొక్కసారి వస్త్రముల సద్దికై గ్రామము వెలుపల కూపమునకొ, తటాకమునకో, మా తండ్రితో బాటు వెళ్ళుచుంటిని. తిరిగి యింటికి వచ్చే సమయమున మధ్య మార్గమున కిరుపార్శ్వముల నుండు అంగడులను గాని, లేక జనమునుగాని, ఏదోక పట్టనమును గాని, దిలకించుచు దటాలున తట్టు దలిగి క్రిందబడితినా సరె. పడిన బాధపోగా పైనుండి తండ్రిగారి దెబ్బలు, పరుష వాక్కులకు లోపము లేకుండెడిది.

మా తండ్రిగారు గ్రామాంతరమున వెళ్ళవల్సిన సమయము దటస్థించినచో నన్ను వెంబడించుక వెళ్ళుచుండిరి. మావద్ద మెల్లవ్వి యొక యశ్వరాజము, పైగా ఒక వృషభరాజములుండేవి. ఆ యాశ్వము పై నన్నధిరోహింపజేసి, వృషభముపై నా పూజా సామిగ్రి మరియు పాఠ్యపుస్తకములు, పలయు వస్తువులను భద్రపబచి ఒక (కంట్లము) యందుంచి దానిపై వేసియుంతురు. ఈ విధముగా గ్రామము పర్యటించు పు భక్తుల నాశీర్వదించుచుంటిమి.

అట్టి సమయమున నా వేషభాషలు చాలా వింతగా నుండెడివి. నా పాదములకు కఱ్ఱపావకోళ్ళు (పాదరక్షలు) తలకు పాగా లేదా

కాషిటోపి. శరీరము నిండ కాషికవని (జుబ్బా) కంఠమున రుద్రాక్ష సరులు. సదా నుదుట త్రిపుండ్రధారణము, కర్ణ ద్వయములందు రుద్రాక్షలు పొదగిన బంగారు ముఖుపులు.

ఒక్కొక్కసారి మా గ్రామమందే ప్రతి పర్వదినములలో మా తండ్రిగారి వెంట ఆదే వేషముతో భక్తులిళ్ళకు వెళ్ళుచుంటిని, అచట వారత్యంత భక్తితో సన్నారాధించుచుండిరి. అప్పట్లో సామాన్య బాలురవలెనున్నను. స్నానము, లింగార్చనలు ముగింపనిదే ఎలాంటి తినుబండారమును బుచ్చుకొనెవాడిని గాదు.

ఇది యిట్లుండగా గొప్ప పర్వదినములందు గ్రామములోని భక్తులు తమ తమ యిండ్లకు దోడ్కొన్ని పాదములను శుభ్రముగా కడిగి వేదిక (జగిల)పై గూర్చుండబెట్టి పాదపూజాది క్రియలొనర్చి, తీర్థ ప్రసాదములను - స్త్రీలు, పురుషులు, పిన్నలు, పెద్దలెల్లరు స్వీకరించు చుండిరి. ఇదే విధముగా మా జనని జనకులును పాదార్చన యొనర్చి నా తీర్థ ప్రసాదముల సేవించుచుండిరి. అప్పుడు నాలో నేను "నాలో నింతటి గొప్పదనమేముందని" మథన పడుచుంటిని.

మా తండ్రిగారు ఈ పూజావిధికి సంబంధించిన మంత్రములను, స్తోత్రములను కంఠస్థము జేయించియుండిరి.

## అగ్నిగుండమును దాటుట

ఒకనాడు నేను బడిలో జదువుకొనుచుండగా బాల్యమున మా తండ్రిగారు విభ్యేసి ముందు మఠమునకు దోడ్కొన్ని ననంతరము.

ష్టా నగరమునకు పూర్వదిశలో గట్టుపై వెలసియున్న శ్రీ మల్లన్న మందిరమునకు దీసికెళ్ళిరి. అక్కడ మల్లన్నస్వామి జాత్ర సందర్భమున అగ్నిగుండముల కార్యక్రమము నిర్వహింపబడుచుండినది. నలువైపుల జనసందడితో కిటకిటలాడుతున్నది. గొల్లవారలందరత్యంత భక్త్యావేశములతో దమతమ దుందుభుల (డోలు)ను మ్రోగించుచు తాళము వేయుచున్నారు.

అట్టి జనసందోహము మధ్యభాగమున చింత మొద్దులను కాల్చుటమువలన గుండములోని నిప్పుకణములు కణకణలాడుచున్నవి. ఈ సమయమున మడుపతి సిద్ధరామయ్య మరియు మడుపతి మల్లయ్య గార్లు ఒక వస్త్రమును తెరవలె నా ఎదుట బట్టుకొనిరి, ఇతరులు జూడకుండగా వారించిరి. ఆ తెరలో ఒక పీఠపై నన్నాసీనుని గావించి, ఒక భక్తుడు నా పాద ప్రక్షాళనము గావించిన యట్టి జలమును యగ్ని గుండముపై యంతటను ప్రోక్షించెను. తరువాత మడుపతివారు తమతమ శంఖములను బూరించుచు, గంటానాదం గావించుచు, ముందునడువ వారి వెనుక నాతోబాటు మా జనకులు నడచి అగ్నిగుండములనుదాటిరి. కాని నేనింకను బాల్యావస్థచేత భయకంపితుడనై ఒడ్డుననే నిలచియుంటిని. అదిజూచి మా నాన్నగారు నన్నొక చేతితో బట్టుకొని అగ్నిలో నడువసాగిరి. అంత నేను భయముతో కేకలువేస్తు నాకుడిచేతిని కాళ్ళను నిప్పులోబెట్టితిని. తత్ఫలితముగా నాయరచేతికి బొబ్బలెక్కినవి. కాని పాదములకు సెగదాకనట్లు నాకుజ్ఞాపకమున్నది. ఇది నా జన్మ ప్రథమ పర్యాయపు అనుభూతి. తరువాత నెన్నియో అగ్నిగుండములను దిలకించితినేగాని, పూర్వానుభవముతో నేనిప్పటికిని యట్టి సాహసమునకు బోనైతిని.

# రథోత్సవ వైభవము

వేసవి చైత్ర మాసము వచ్చినచో "వసంతములో శుకపికములు సంతసించునట్లు మా నగరములోని యాబాలగోపాలము వఱకు సంతసించుచుండిరి. ఏలనన. ఇక్కడ ప్రతి సం॥రము తప్పకుండ చైత్ర శుద్ధదశమినాడు శ్రీ జోగినాథస్వామివారి రథోత్సవం మత్యంత వైభవోపేతముగా జరుగుచుండును. ఇచటి రథనిర్మాణ శిల్పచాతుర్య మతిరమణీయమైనది. కళాకారుల నైపుణ్యమిచటి చూపఱులకు కన్నుల పండుగ నొనర్చును. కాని యిక్కడి జాత్రా మహోత్సవము సుమారు 15 రోజులు జరుగుచుండును. ఈ యుత్సవమును దిలకించుటకై చాల దూరపు గ్రామముల నుండి జనులు తండోప తండములుగా విచ్చేయుచుందురు. జనసమ్మర్థనముచే పట్టణమంతయు కిటకిటలాడుచుండును. నలువైపుల యెటు జూచినను రకరకములైన మిఠాయి మున్నగు తినుబండారములతో నిండియున్న దుకాణములు. విలువైన వస్త్ర భండారములు, లోహపు పరికరములు, వ్యవసాయపు పనిముట్లు, ఎటు జూచిన రేయింబవళ్లు మిన్నును ప్రతిధ్వనించు డప్పు సన్నాయీలు మొదలగు మంగళవాయిద్యముల మ్రోతలు, ఆట పాటలు, తోలుబొమ్మలాటలు, నాటిక ప్రదర్శనములు, మేలిరకములైన సర్కసుల ప్రదర్శనముల చేత నిండియుండుటచే అప్పుడప్పుడు బంధింపబడిన పులి సింహముల ఘర్జనలు, ఏనుగుల ఘీంకారములు, మున్నగు ధ్వనులు నెలంగుచుండెడివి. పల్లెపడుచులు అలంకరించుకొని తమ తమ పురుషులతోను, పరివారముతోను సంతోష ముప్పొంగ విచ్చేసి శ్రీ జోగినాథస్వామిని దర్శించి పూజారి యాశిస్సుల బడయుచు, కాయ కర్పూరముల దక్షిణా

దులు సమర్పించుకొని, పలసిన వస్తువులను కొనుచుండిరి. సందడిగ నున్నచో జనులు కొందఱు గుంపులు గుంపులుగా జేరి పెద్ద సరోవర ముల ప్రక్కన, మామిడి తోటల్లోను, మఠమందిరములలోను, ధర్మ శాలల్లోను, చెట్ల నీడల్లోను వంటలు వండుకొనుచు, తెచ్చిన బండార ముల మెసవుచు, మరి కొందఱు విశ్రాంతి గైకొనుచు చుట్టలు త్రాగుచు, కబుర్లు చెప్పుకొనుచు, జూదములనాడుతు కాలముబుచ్చు చుండిరి. మరో వైపు డప్పు సన్నాయీల ధ్వనిననుకరించి యెరుపుల యువతులు నాట్యమాడడము జరుగుచుండెడి. మరో వైపు పోచమ్మల వాళ్ళు వాయిద్యములతో బాటు కొరడా దెబ్బల "ఫెడిల్ ఫెడిల్" అను శబ్ద ములు మారుమ్రోగుచుండెడివి.

ఈ సమయమున సుమారు 500 (ఐదు వందల) మందికి నివాసయోగ్యమైన మా పెద్ద మఠములో, పైన, క్రింద, లోన. బయట, స్థలమంతయు జనసమూహముచే నిండియుండెడిది. ఒక్కొక్కసారి ఇంటివాండ్లమైన మాకె పండుండుటకు గాని, కూర్చుండుటకు గాని స్థలము దొరకకుండెడిది. చాల యిబ్బంది పడెడివారము.

పెద్ద రథమును శ్రీ జోగినాథస్వామి కడకుత్సవమున నూరే గింపుగా దీసికొని వెళ్ళేరోజు రాత్రి సుమారు 10 గం.లకు నేను కాళ్ళకు కట్టె పావకోళ్ళు (పాదరక్షలు) రేష్మికపని (జుబ్బ ఇది పాద ముల వఱకేకముగా నుండు శరీర కవచము) కంఠమున రుద్రాక్ష సరులు, సిరమునకు పట్టు రుమాలు, నొసట త్రిపుండ్ర భస్మ రేఖలు, పైన పట్టు ఖండువ, ఇట్లు సిద్ధమై కుర్చీలో నాసీనుడనై యుండెవాడిని. మానాన్నగారు పరిచారకులతోగాని, లేదా బంధువులతోగాని,అశ్వతాజము నొకదాన్ని జీను మొదలగు వానితో నలంకరింపజేసి సిద్ధముగానుండెడి

వారు, పిదప అరగంటకు (10-30) ఆ సం॥ము జాత్రా నిర్వాహకులు, శెట్టి, పురప్రముఖులు, మంగళ వాయిద్యములతోను, బిజలీ దీపములతో పలువురు భక్తులు కాగడాలతోను, పూజారి, మఠకూరు వారితో గలసి మఠమునకు విచ్చేసి కుర్చీలో గూర్చొనియున్న నన్ను పూల మాలికలతో నలంకరించి నెల్లను మెడలోవేసి, నమస్కరించి వెంకా యను పాదములకడగొట్టి,కర్పూర నీరాజనమొనర్చి"రథము సంసిద్ధమై యున్నదిచేతాము విచ్చేయుగలరని"మనవి జేసికొనగా నప్పుడు నా కొఱకు అలంకరించియున్న యశ్వరాజముపై నన్నధిరోహింపజేసి, ఆ గుఱ్ఱమున కిరుప్రక్కలనున్న యిద్దఱు పరిచారకులు చామరములు విసరుచుంట, ఇద్దరు గుఱ్ఱము కళ్ళెమును బట్టుకొని మెల్లన సాగుచుంట, మరియు వెండి బత్తిలకలను దాల్చిన యిద్దఱు పరిచారకులు ముందు నడువ, ముందు వెనుకలు దివ్విటీలు వెలుగుచుంట, మంగళ వాయిద్యములు మారుమ్రోగుచుండ, జనసమూహము ముందు వెనుక యిరుప్రక్కల తండోప తండములుగా రథమువద్దకు నడచి, ఐలిహారాదుల నొసగి మంగళ నీరాజనముల గైకొని సిద్ధముగానున్న రథమును సమీపింపగనె మరోసారి అక్కడ గూడ నా పాదపూజ యొనర్చిన పిదప మరల నీరా జనము లొసగి నమస్కరించడముతో నేను రథము నధిరోహించగానె గుఱ్ఱమును వెండి బత్తిలకలను, మఠమునకు తిరుగబంపుచుండిరి.

నేను రథము నధిరోహించడముతోనె ప్రజలు హర్షధ్వానముల్ జేయుచు "జయనమః పార్వతీపతే హరహర మహాదేవ", యనుచు జయ జయ నినాదముంతో నేను గూర్చుండిన రథమును లాగుచుండిరి, రథము కదలుచుండగా ప్రజల యుత్సాహము వెల్లువలై, వారెల్లరు కొందఱు రథముపైనె గూర్చుని యుండిన నా వైపునకు మురముదాలు (అవారిలాజైః) కొందరు మిఠాయి నిర్మితమైన జెండ్లు బత్తిసలను,

పుష్పఫలములను యెగజిమ్ముచుండిరి. రథము ముందు ప్రజలు వెల్లువ వలె చేత కాగడముల బాల్చి మధ్య మంగళ వాయిద్యములు రోదసి యందు ప్రతిధ్వనింపుచుండ రథము సాక్షాత్తుగా పుష్పకము విమానము వలె కదలుతు ముందుకు సాగుచుండెడిది.

ఈ పెద్ద రథము ముందర ఒక చిన్న రథముండేది. ఇందు శ్రీ సంగమేశ్వర విగ్రహ ముండెడిది. ఈ రథము చైత్ర శు॥ ౧ నుండి ఊరేగుచుండెడిది. ఈ చిన్న రథమునకు ముందు భాగమున పల్లకీ సేవా యుండెడిది. ఇందు శ్రీ జోగినాథస్వామివారి మూర్తి పాదరక్షలు, యుండెడివి. దీని ముందర మంగళ వాయిద్యములు మ్రోగుచుండేవి.

నేనధిరోహించియున్న పెద్ద రథమునకు దిగువ నలువైపుల పోలీసులు, సబ్ఇన్‌స్పెక్టర్లు నడుస్తూ జనసమూహమును రథము సమీపమునకు రానివ్వకుండ జూచుచుండిరి. ఇదే రథమున నా ప్రక్కనె గూర్చొనియున్న మఠపతి (భండారి)—(మడుపతి) ఒకడు మధ్యమధ్య (నబీరా)లనూదుచు జనులనుప్రోత్సహించుచుండెడివాడు. ఉత్సాహముతో జనులునటునట ఖర్జూరములను గూడ రథముపైకి విసరుచుండిరి.

ఈ విధముగ నత్యంత సంభ్రమోత్సాహములతో గూడిన రథోత్సవము సుమారు 12 గం. రాత్రివరకు శ్రీ జోగినాథస్వామిగారి గట్టువద్దకు ఈ రథము జేరుచుండేది. అటు తరువాత నేను రథము నుండి క్రిందికి దిగడముతో రెండు దివ్వటీలవారు నన్ను జెరవచ్చి యొక సేవకుడు ముందు నడువగా మా తండ్రిగారితో బాటు శ్రీ జోగినాథస్వామిని దర్శించినపిదప నన్ను మఠమువరకు సాగనంపుచుండిరి.

పిదప మూడు రోజులకు అథవా అవకాశమును పురస్కరించుకొని ఐదు రోజులకు గాని లంకా దహనము జరుగును. ఆ రోజు రాత్రి రామాయణము చరిత్ర యంతయు నక్కటి నానా విధమైన మందు గుండ్ల సామగ్రిచే ఓదురు కాగిదములతో రంగురంగులతో సిద్ధగించిన ప్రతిమలకు నిప్పు అంటింతురు. (తారాజువ్వలు, కాకరవత్తులు, రంగు రంగుల పువ్వొత్తులు) అప్పుడు రకరకములైన ప్రేలుళ్ళు సంభవించి ప్రేక్షకులను ఒక గంటవరకు హర్షమున ముంచివైచుచుండెను. ఇది యత్యంత వైభవముగా జరుగును. ఆనాడింకను జనులధిక సంఖ్యలో పాల్గొనుచుండురు. ఈ సందర్భమున శ్రీ జోగినాథస్వామివారి యర్చకులకవకాశమెంత మాత్రముండదు. ఎందులకనగా శ్రీ స్వామివారి దర్శనాశీర్వాదముల బడయుటకై జనులు తండోప తండములుగా వెళ్ళి తీర్థప్రసాదముల స్వీకరించుచుండురు. స్వామివారి మార్గమున కిరు వైపుల కాషి వస్త్రభూషితులు, త్రిపుండ్రధారులు, రుద్రాక్షాదుల మున్నగు శివ చిహ్నముల దాల్చి ఒక యున్నతాసనముపై యాసీనులై పైనొడ నుండి దప్పికొనుటకై బట్టుకొనియున్న గొడుగులతో తమతమ యాసనముల కమర్చి ఒక తాంబాణమున నంది విగ్రహమును దానిపై పత్ర పుష్పములుంచి విభూతియుండ యొకటి, ఆ స్వాములెల్లరు ఒకచేత గంటనూపుచు "శంభో హరహర శివ శివ" దేవుడు "నీకభమునీయు గాక"యని గట్టిగా నరచుచు తనకడకు వచ్చి దక్షిణ నర్పించిన భక్తుల నాశీర్వదింతురు. మరికొంత దూరమున ఫకీరులు, మిగత యాచకులు, వంబళ్ళవారు మున్నగువారు దక్షిణలకై యాత్రికుల మధ్య మధ్యన చుట్టు మూగుచుండిరి. వీరందరిని దప్పించుకొని బయట రావడమనగా ఒక పద్మవ్యూహము నుండి బయటకు వచ్చినట్లుగా భావించుచుండిరి. తమ యౌదార్యము తీరు దానమొసగుచుండిరి.

లంకా దహనము మరునటి రోజు సాయంత్రము నాలుగు గంటలకు మా నాయనగారు నన్ను గొప్ప స్వామిగా సిద్ధగించి నన్ను వెంబడించుకొని ఒక కూలి మనిషి గూడ వెంటరాగా బజారునకు వెళ్ళి కొట్టులో అమ్మేటకై యుంచిన మురమురాలు (ప్యాలాలు) పుట్నాలు, పండ్లు, బత్తీసలు నానగారి చేతికందిన మట్టుకుదీసికొని మనిషిచేతి బస్తలో వేయుచుండెడివాడు. ఇది ప్రాచీన కాలము నుండి మా పెద్ద మఠాధికారులు ప్రతి కొట్టునకు వసూలు జేయు సుంకము వంటిది. కాని బలవంతపెట్టి తీసికొనుటగాదు. కొందరు ఆ కొట్టువారె తీపి, కార, రకరకాల తినుబండారములను పొట్లములగట్టి మురమురాలతో సంతోషముతో ఇచ్చి నా పాదములకు నమస్కరించుచుండిరి. బస్తల కొలది సంగ్రహించి తెచ్చిన యీ తిను బండారములను మఠమునకు వచ్చిన భక్తులకు ప్రసాదముగా పంచిపెట్టబడుచుండెను. కాని రాను రాను ఇదే పద్ధతిని మఠపతివారు, గ్రామాధికారి మున్నగువారు బలవంతముగా వసూలు జేయదొడగిరి. వీరు స్వార్థపరులై యధికముగా వసూలు జేసి తామెదినడము, లేదా మిగిలిన పదార్థములను విక్రయించుకొనడము జరుగుచుండెడిది.

ఒక తడవ నా బాల్యచాపల్యమును బట్టి కానోపును మా గ్రామపు తాసీల్ కచేరికివెళ్ళి తాసీలు ఆఫీసరుగారి యెదుటనున్న బల్లపై నిర్భయముగా గూర్చుండియుండ వారు నాయమాయకతను గుర్తించియు, నా వేషభాషల దిలకించియు, చిఱునవ్వుతో "అయ్యగారెక్కడికి వచ్చినారని" ప్రశ్నించగా, నేను మా మఠము ఒకవైపు పడిపోయినది, దానిని కట్టుటకు "హుకుమ్" ఇమ్మని యడుగ వారందులకు మందస్మితముఖముద్రతో "హాఁ ఇస్తాను. తప్పకుండ ఇస్తాను." అని చెప్పుతు అంత్ర

నొక సేవకుని రప్పించి ఒక మిఠాయి పొదను తెప్పించి నా చేతికిచ్చి యింటికి పంపుచుండిరి. ఇట్టి వింతను విలోకించిన తత్కార్యాలయపు సిబ్బంది యంతయు నబ్బురపడుచుండిరి.

ఒకతూరి బాల్యలీల ననుభవించుచు క్రీడా సమయమున చిన్న చిన్న గుళ్ళను (దేవళములను) నిర్మించియుండు నేదో యొక విగ్రహము నుంచి నా సహచరులతో బాటు చిన్న జాత్రగా సాగించుచుంటిని. మా నగరమున తొలిసారిగా చలనచిత్రములు ప్రదర్శింపబడుటచే మా మఠ మునకతిథులుగా నితర గ్రామముల నుండి వచ్చిన వారు నన్నును, దయతో చూచుటకై తోల్కొనుచుండిరి. దానిని విలోకించి వచ్చిన మరునటి రోజు, సహచరులతో గూడుకొని భూతద్దము బ్యాటరీ ద్వారా చిన్న చిన్న రీలచిత్రములను చీకటి గదిలో తెల్లని గోడపై ప్రదర్శించు చుంటిని.

మా తీర్థరూపులు మృదంగ వాయిద్యమునందలి నైపుణ్యము గలవారగుటచేత పరిసర గ్రామములందు ప్రఖ్యాతి గాంచియుండిరి. కావున నగరమున నెప్పుడైన కళాభిరుచిగల పుర ప్రముఖులు సామూహికముగా వినోదమునకై కాలక్షేపము నిమిత్తము భాగవతము నాడి నప్పుడెల్లా మా నాయన (తండ్రి)గారిని తోల్కొనివెళ్ళెవారు. వారితో బాటు దర్శించుటకు నేనుగూడ వెళ్ళెవాడిని.

ఈ భాగవతమునందు పాల్గొను కళాకారులెల్లరత్యంత నైపుణ్యముగలవారే. గనుక యేపాత్రకాపాత్ర ముద్రవేసినట్లలంకరించు కొనెడివారు. స్త్రీ పాత్రలు చూడముచ్చగా నుండెడివి. అలాగే పురుష పాత్రలు వీర, శృంగారాది రసములొలికించునవిగా నుండెడివి. లంకా

ప్రహసము నందు రామరావణుల యుద్ధము. చూడముచ్చటైన హను-మంతుని వేషము ప్రేక్షకులెల్ల రసానందసాగరమున ముంచెత్తుచుండెను. తాళమేళములు, లయతో గూడిన పాటలు. (యక్షగానములు) నాట్యము-తెరవెడలు మున్నగు దృశ్యములు జీవితాంతము మరవురానివి.

అశోకవన దృశ్యమును స్టేజిపై కొన్ని కొమ్మలను అకృత్రిమ ఫలముల వ్రేలగట్టిన వానిని గుజ్జు రూపమున హనుమంతుడు గంతులు వేస్తు మధ్య మధ్య చిన్నగా కూతలిడుతూ వింటూ ఉంటే చూపరులకు నిజముగా వానరమేయని దోచెడిది.

బాల్యమున యనేకసార్లు ఇట్టి వీథిభాగవతమును దిలకించిన ఫలితముగా నేను గూడ నా సహచరులతో బాటు ఒక భాగవత మేళమును సిద్ధగించవలెనను కోరిక నాలో రేకెత్తించినది. కొందరు నేస్తులు నా యభిప్రాయము నేకీభవించుటచే ప్రతి స్టేషనరి దుకాణము నకు వెళ్ళి అట్టలనడిగి ప్రోగుజేసి వానినాయా పాత్రల కనుగుణ్యమైన, కిరీటములుగ సిద్ధగించి వానికి సరియైన రంగులు వేసి ఒకనాడు మధ్యాహ్న సమయము నాటకమును ప్రదర్శించుటకాయత్తపడుచుంటిమి. గేయ పద్యముల బాడుటకై పెద్దవారి భాగవతమునకు మేటియైన మా నగరములోని శ్రీ జామిని శివలింగప్పగారి (45)ని విచారింపగా వారు నాతో నెప్పుడు బరిహాసము లాడెడివారు. వారి స్టేషనరి దుకాణములోనే మేమొక మైరావణ చరిత్ర (యక్షగానము)ను విలచితిమి. అందులోని కొన్ని గేయములు, పద్యములు అప్పుడప్పుడు పఠించుటచె అవి కొన్ని మాకు కంఠస్థములైయుండెడివి. ఎట్లైనా సరె ఒక తేదిని నిర్ణయించు కొని మా మఠములోని ధర్మశాలయందే చిన్నగా స్టేజిని నిర్మించుకొని

వేషములు నెవ్వరిష్టమొచ్చినట్లు వారు ధరించుకొని వచ్చి రంగస్థల మందు నేను ముందంటే నేను ముందని పాటలు బాడుటకుద్వరపడుచు బాల్యచాపలము ప్రకారము పరస్పరము వాదులాడుకొని ముష్టి యుద్ధమునకు దలపడుచుండిరి. ఈ సమాజభాగవతము నుపసంహరింప జేయుటకై కాస్తా నేనా జట్టునకు నాయకుడిని, కాబట్టి వారిని సరిదిద్ద గలిగితిని. తరువాత నాలో నుబుసుపోకకై నేను గూడ గడ్డము, మీస ములు ముఖము నలంకరించుకొని, తలకు కిరీటమును దాల్చి చేత చుద్దుకఱ్ఱను బుచ్చుకొని రంగమున ప్రవేశించి సన్నాహకరు పరిచయము గావించుటకు మాజుగా నేనే "గడ్డము మూరెడు బెట్టుక, తెట్టొక్కటి చేతబట్టి ఠై ఠై మనుచును, గుడ్డేలుగు రూపమున..." ఈ పద్యమును బూర్తి గావించి "తంబాకులారెకైసికబేగ..." "ఈశ్వరుకు జానుబందె మాలిక్ తెరా నహిహై" అని కంఠమెత్తి బాడి నా చిలిపి చేష్టలతో ప్రేక్షకుల నవ్వించి, నాటి భాగవత ప్రదర్శనమును సమాప్తి గావించితిమి.

## జలక్రీడ (ఈతనభ్యసించుట)

ఒకానొకసారి సహచరులతోగూడి యీతనభ్యసించుటకై మా నగరమునకు దక్షిణ దిశలోనున్న గొప్ప తటాకమునకు, (అందోలు చెఱువునకు) వెళ్ళి యట నీటిదేలు బెండ్లను నడుమునకు బిగించుకొని సరదాదీరుకొలది యీదులాడుచుంటిని. వేసవికాలమందైతే నీక్రీడకంతు లేకుండెడిది. ఈతనభ్యసింప వలెనను కుతూహలముచే వర్షాకాలము నందును మరియు శీతకాలమునందును ఇంట్లో స్నానమునకై వేన్నీళ్ళుంటినను, వానిని లక్ష్యపెట్టక యెల్లప్పుడు బావులలో, చెఱువులలోనే ఈద

వలయునను కోరికనన్ను సదా ప్రేరేపించుచుండెను. కొన్నాళ్ళకు ఈతనభ్యసించితిని.

## సైకిలు శిక్షణబడయుట

తోడి సహచరుల క్రీడలను జూచి నేను దానినభ్యసింపవలె నను కుతూహలము నాలో మెండుగా నుండినది. కాబట్టి సైకిల్ త్రొక్కుడము నేర్చుకొనవలెనను కోరికనన్ను బాధించుచుండెను. మా తీర్థరూపుల వారు మిగత క్రీడలనుండి నిషేధింపజేసినను ఈత నేర్పుడము, సైకిలు త్రొక్కనేర్వడము నుండి నన్నాపలేదు. వారికి నేను వీనినభ్యసింపవలె నను కోరిక యుండుటచేతనే గాబోలు సైకిలు త్రొక్కుటనభ్యసించుటకై నాకప్పుడప్పుడు కొన్నిడబ్బులు సైకిల్ అద్దెకు దెచ్చుకొనుటకై ఇచ్చేడి వారు. అట్లే ఈతనేర్చుటకై బెండ్లు సంగ్రహించి వాటినిగట్టిగా మూట గట్టియిచ్చేడివారు. రెండును నా జీవితాంతమువరకు నుపయోగపడు చున్నవి. నాకెగాదు ఇతరులెవరికైనను ఇట్టివిమంచి వేగదా!

సరే సైకిల్ అద్దెకు దెచ్చుటకై మా అమ్మగారి వద్దనో లేక నాయనగారివద్దనో మొండిపట్టుబట్టి కిరాయకు సరిపడు డబ్బులు ఇచ్చుకొని సైకిల్ కొట్టుకు వచ్చి, నాకు సరిపోయే(చిన్న) సైకిలను తీ. సైసలకు ఒక ఘంట చొప్పున తీసుకెళ్ళి నేర్చుకొనుచుంటిని. సైకిల్ నేర్వడము కొత్తకాబట్టి సైకిల్‌ను తీసుకొని, ఒక ఎత్తుప్రదేశమునకు దీసి కెళ్ళి దానిపై గుఱ్ఱముపై స్వారిజేసినయట్లు ఎక్కి వల్లపు ప్రాంతమునకు మరల్చగా నది వెగముగా పఱుగెత్తి యెక్కడాగుచుండెడిదో యట క్రిందపడుచుంటిని.

# అగ్ని గండము

మా తండ్రిగారొకొక్కప్పుడు మేనశల్లను నిండుగ గప్పుకొని కుంపటిదగ్గర కూర్చొని దానిపై శల్లను గప్పికొనుచుండెడివారు, అట్లే నేను గూడ సదాశివపేట పెద్ద మఠములో నున్నప్పుడు యొకటి జరిగినది.

మా మాతృశ్రీగారు పాతకాలపు వారు గనుక ఒక పిడుకపై నిప్పుంచి చుట్టు పిడుక ముక్కలను పేర్చియుంచి నీరు దేచ్చుటకై మఠములోని బావి కడ కేగినది, ఆమెతో బాటు మరికొందరు స్త్రీలు గూడ నీరు గొనిబోవుచుండిరి. అట్టి సమయములో నేను నిద్రనుండిలేచి యించుకచలియుంట వలన నేను మా తండ్రివలే నా మేనదొడగిన కావి జుబ్బను పొగరాజి కాస్తమండుచుండిన నిప్పుపై యెండుగడ్డివలెగప్పి కాపు కొనబోతిని, అంతేతడవుగానా నిప్పు మంటలు చెలరేగి నాకపని (జుబ్బ కావిఅంగి)కి అంటుకొనినవి. ఆ మంటలకాగలేక గట్టిగా కేకలు వేస్తిని, ఆ శబ్దమువిన్న మా గురుదేవులు శ్రీ పం॥ విరూపాక్షస్వాముల వారు ఒక్కుదుటున పరుగెత్తుకొనివచ్చి "హాయ్ హాయ్" పిల్లవాడుచచ్చె చచ్చె, నని అరస్తు మంటలనార్పిరట అప్పటికెనేను నిశ్చేష్టుడనై నేల గూలితినని మా వారు నాతోజెప్పిరి. ఆ సమయమున నా ఒళ్ళంతయు గాలి పెద్ద పెద్ద బొబ్బలెక్కినవి. తరువాత మఠము మహాద్వారము ఎదుటనున్న ప్రభుత్వ దవాఖానాలో జేర్చిరి. అప్పటి డా. గారుచాల మంచి వారు పోతే మా పెద్దనాన్నగారిపై గురుభక్తి గలవారుగుటు వలన బాగుగా చికిత్స యొనర్చి నన్నారోగ్యవంతునిగా నొనర్చిరి. ఇట్లు నా చిన్నతనములో అగ్నిగండము నుండి విముక్తుడనైతిని. ఇది దైవానుగ్రహము.

# విభూతి వైశిష్ట్యము

ఒకనాడు నా బాల్యమున ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలకువెళ్ళి యుంటిని, ఉదయం 11 గం.కు మా జనకులు బడికి విచ్చేసి తరగతి ఉపాధ్యాయులవారి యనుమతితో మొదలు మా మఠమునకు ఆటుపిదప శివశ్రీ తడుగూరి వీరప్పగారను భక్తులింటికి దీసికెళ్ళిరి. అతడొక సంపన్న గృహస్థుడు. ఇల్లు ధాన్యపురాసులతో నిండి గొప్పగానుండినది. అటకు వెళ్ళగానే మా నాన్నగారు నామేని (జుబ్బ) చొక్కాను దీయించి స్నానముజేయించి వారుగూడ స్నానమొనర్చిరి.

తరువాత యథాప్రకారముగా నాకు పాదప్రక్షాళనము గావించి భక్తుడిచే పాదతీర్థమును సిద్ధగింపజేసి వసార (పడసాల)లో దర్భాసనముపై వెల్లగిలపరుండబెట్టిన శవముమాదిరిగా తెల్లగుడ్డలతో నున్న ఒక స్త్రీకి, విభూతిరుద్రాక్ష-తీర్థ ప్రసాదములతో సంస్కరించితి. ఆమెను నేను దిలకించినప్పుడు బాల్యవయసు ననుసరించి నాకుకాస్త భయముగూడ దోచినది.

ఆ సంస్కార పరిణామ ఫలస్వరూపమున నామె బిదప ముప్పది సం॥ములు బ్రతికియుండెను. ఆమె యభిధానము సక్రమ్మగారని యుండేది. కాని జీవితాంతమామె మేన తెల్లనివస్త్రములను ధరించి విభూతి - రుద్రాక్షల నెల్లపుడు ధరించి మంచియాచార నిష్ఠావరురాలై యుండెడిది. మరియు ప్రతిదినమామే మహేశ్వరుని పాదోదకముచేత ముఖప్రక్షాళనము, స్నానము తప్పకుండ జేస్తుండేది. ఇది వారికి నిర్బంధము గూడ, ఇది యా విభూతివైశిష్ట్యము యొక్క ప్రభావమేయని నాకాబిదప దెలిసినది, నాటి భక్తిశ్రద్ధలట్టివి. నేడవిమృగ్యములగుట వలన నవి నేటివారికి ఫలింపకున్నవి.

# ఇతరులు సాధించలేని కార్యములను సాధించియున్నారు

—: నా జీవితములో కొన్ని అద్భుతమైన ఘట్టములు సాధింపబడినవి :—

నా విచారములో స్వాతంత్ర్య ప్రజాప్రభుత్వ పరిపాలనలో మానవుడు పట్టుదలతో తాను సంకల్పించినపనికియ్యానుకొనిన యెడల సాధింపలేని పనులంటూ ఉండవనినాదృఢమైన దృఢసంకల్పము. ఆత్మవిశ్వాసము నా హృదయములో మెండుగా నుండినది.

కనుకనే నేను బాల్యములో కర్నాటకము యాదగిరి జిల్లా రాయచూరు ఎస్.ఎస్. కళాశాలలో (శంకర్ సంస్కృత కాలేజిలో) కష్టించి పది సంవత్సరములు చదివి, పట్టభద్రుడనై "బెంగాల్ సంస్కృత అసోషియేషన్," కలకత్తా, దీనినే భారత స్వాతంత్ర్యా వతరణము జరిగిన పిదప "వంగీయ సంస్కృత శిక్షా పరిషత్తు, కలకత్తా"గా మారిన సంస్థ నుండి పుచ్చుకొన్న "కావ్యతీర్థ" అను "ఓరియంటల్ టైటిల్‌ను, కేంద్రప్రభుత్వమువారు ఎమ్.ఎ.బి.ఈ.డితో సమానమనిఅంగీకరించిన దానిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యాశాఖ నుండి పత్రవ్యవహారముల నెరపి చివరికి ఎమ్.ఎ. తో సమానముగా గుర్తింపజేసి గ్రేడుఒకటివ తెలుగు సీనియర్ పండితునిగా వేతనమునుబడసి హైదాబాద్‌లోని ప్రభుత్వ ఉన్నత, అత్యున్నత, జూనియర్ కళాశాలలోను చివరికి డిగ్రి కళాశాలలోను, విద్యార్థులకు విద్యాబోధన గఱపినగౌరవము నా ఒక్కడికే దక్కినదన వచ్చును.

ఎలియన "కావ్యతీర్థ"లో నెగ్గిన నాకిక్కడ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖలోనే మాత్రము గౌరముండేది కాదు. ఒకప్పుడు శీతారాం

బాగులో "వేదాంత వర్ధిని కళాశాలలో'' సంస్కృతములో బి.ఓ.ఎల్. పరీక్షకొరకు విద్యాభ్యాసమును గావించుచున్న సమయములో అచ్చటి విద్యార్థులందరు ఈ శబ్దమునువిని వారు "తీర్థ? ఏమి కీర్తమంది," మంచితీర్థమా? లేదా కాశి తీర్థమా? అని యెగతాళి జేసేవారు.సంస్కృత బి.ఓ.ఎల్ విద్యార్థులందరు "తీర్థ''ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ వారు గుర్తించిన తరువాత ఆ ఎగతాళి జేసిన వారె నన్ను గౌరవింప దొడగిరి.

మొట్టమొదట ఉద్యోగములో ప్రవేశించే ముందు ఈ ''తీర్థ'' పట్టమునకేమాత్రము గుర్తింపు, గౌరవము లేకుండుట చేతనె ఉద్యోగము లభింపలేదు. "అసలు సంస్కృతమే ఇక్కడి విద్యాశాఖలో లేనప్పుడు నీ "తీర్థ" ఎవరికి గావలెనని." డి.ఇ.ఓ. గారు డిప్యూటి డైరెక్టరుగారు, డైరెక్టరు శ్రీ వామనరావుగారు ఉద్యోగమిచ్చుటకు నిరాకరించిరి.

అప్పుడు నిర్వాహము లేక మళ్ళీ ఆంధ్ర సారస్వత పరిషత్తు హైదరాబాదు వారు తెలుగు భాషాభివృద్ధికై నిర్వహించుచుండిన తెలుగు పరీక్షలు ప్రవేశ, విశారద పూర్వభాగము ఉత్తర భాగములను చదివి పరీక్షలలో నెగ్గినందున రాజప్రముఖుని ఆదేశానుసారము విశారదా ఉత్తర భాగమును మ్యాట్రిక్ పరీక్షతో సమానముగా గుర్తించుట వలన మొదలు తెలుగు ఉపాధ్యాయునిగా నియుక్తుడనైతిని. మొట్టమొదలు మెదక్ జిల్లాలో విద్యాశాఖాధికారిగారిచే నియుక్తుడనై మునిమాణిక్యము, చేక్మాలు, ఘనపూరు, రామాయంపేట, సదాశివపేట అటు నుండి స్వప్రయత్నము చేత హైదరాబాదుకు స్థాన మార్పు (ట్రాన్స్‌ఫర్) ను జేయించుకొంటిని.

ఇక్కడ మొట్టమొదట మలక్‌పేట ఆంధ్రాకాలని ఉన్నత పాఠశాలలో సంస్కృతోపాధ్యాయుని స్థానములో నియుక్తుడనైతిని. గాని విద్యార్థులకు తెలుగునే బోధించుచుంటిని. కనుక ఇచటి విద్యార్థులకు నేను సంస్కృత పండితుడనని తెలియుటచేత వారు నన్ను సంస్కృతమును బోధించుమని అర్థించెడివారు. కాని యిక్కడ ప్రధానోపాధ్యాయురాలు క్రిస్టియన్ ఉండుట వలన సంస్కృతమును బోధించుట అంగీకరించలేదు.

ఈ సందర్భములో విద్యార్థుల తల్లిదండ్రులు సంస్కృతమును తప్పకుండ బోధించవల్సిందిగా విజ్ఞప్తిపత్రములను తమ పిల్లలతో పంపించిరి. సుమారు వంద అర్జీపత్రములను తీసికెళ్ళి డిప్యూటీ డైరక్టర్ శ్రీ కప్పగంతుల లక్షణశాస్త్రిగారికి చూపి, ఆంధ్రకాలని ఉన్నత పాఠశాలలో సంస్కృతోపాధ్యాయుని పోస్టు ఉంది.. కనుక అక్కడ సంస్కృతమును బోధించుటకు తరగతులను ప్రారంభించుటకు అనుమతి నొసంగవల్సిందని అడుగగా వారు నాతో ఇది "అంత తేలికైన పనికాదు'' అని చెప్పిరి. అందుకు నాలో పట్టరాని యావేశము ఉబికి రావడముతో "మీరు బ్రాహ్మణకుమారులు. ఇతరులు సంస్కృతము నభ్యసించగూడదనే దురభిప్రాయము మీలో వ్యక్తమగుచున్నది. సంస్కృత పోస్టులో మీరు నియుక్తులై యుండిగూడ ఆ భాషాభివృద్ధికి పాటుపడకుండ అవరోధకులుగా ఉన్నారని" కోపపడడముతో వారు భయముతో తగ్గి, "మీరును సంస్కృత పండితులు గనుక మీ పాదములను నానెత్తిన పెట్టుకుంటాను. కాని యిది ప్రభుత్వము అనగా డైరక్టరుగారు ఆమోదించాల్సిన పని" అని చెప్పిరి. అంతటితో నేను నిరాశగలిగి వెనుతిరిగి వచ్చితిని.

ఇకపోతే, నా ట్రైటిల్ "తీర్థ" ఉపాధిని ఆంధ్రప్రభుత్వ విద్యాశాఖ వారిచేత గుర్తింపు చేయుటకై శ్రీ డైరక్టరు విద్యాశాఖగారివద్ద దరఖాస్తు పత్రాన్ని సమర్పించగా వారు మన ఆంధ్రప్రదేశ్‌లోని ఉస్మానియా యూనివర్శిటీవారు ఎమ్.ఎ.తో సమానముగా అంగీకరిస్తేనే అప్పుడు గాని మేము అంగీకరించెదమనిరి.

అప్పుడు సరే అని చెప్పి నేనా సందర్భమున తెలుగు డిప్లొమా పరీక్షకు మరియు సంస్కృత ఓ. ఎ. ఎల్ పరీక్షకై యత్నించుచుంటిని. కాబట్టి ఉస్మానియా యూనివర్సిటి ప్రిన్సిపాలు శ్రీ ఆర్యేంద్రశర్మగారిని గల్సి కావ్యతీర్థను ఎమ్.ఎ. పరీక్షకు సమానముగా గుర్తింపజేయాలని అర్థించితిని, వారు తప్పకుండా అంగీకరింప జేస్తారనే ఆత్మ విశ్వాసము నాలో నుండెను. అందుకు కారణము ఉత్తరాది వారైనవారు గూడ కావ్యతీర్థ, పట్టభద్రులై యుండిరి. దానితోబాటు వారు ఫ్రెంచి భాషలోను, ఆంగ్లములోను పట్టభద్రులైనందున ఉస్మానియా విశ్వ విద్యాలయమునకు ప్రిన్సిపాలుగా నియుక్తులై యుండిరి. కనుక కావ్య తీర్థ, అభిమానము వారిలోను ఉండియుండెను. నేను రెండు మూడు సార్లు వారిని సందర్శించి చెప్పిన ఫలితముగా వారు "నేను మీ విషయ ములో ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ డైరెక్టరుగారికి వ్రాశాను. అందుచేత మీరక్కడికి వెళ్ళి మీ గ్రేడు కొరకు ప్రయత్నించుకొమ్మనిరి.

వారు చెప్పిన విధముగానే విద్యాశాఖధికారులు నాకు 1965 సం॥ 30వ తేది జనవరి నాడు నాకు గ్రేడు ఒకటి అనగా ఆర్.సి. 130-250 గ్రేడు నొసగిరి. ఈ గ్రేడును బదయు వరకు హైపవర్ కమీటి వరకు వెళ్ళి కాన్వాయిచేశాను. మెదక్ జిల్లా నుండి హైద్రాబాదు జిల్లా విద్యా శాఖకు స్థాన మార్పు జేయించుకొనుట మరియు హైద్రాబాదులో సొంత

ఇల్లు సంపాదించుట. తదుపరి 2 ఇళ్ళు, మెదక్ జిల్లా జోగిపేటలోని పెద్ద మఠమునకు ఏలాంటి ఆదాయము లేనందున కేవలము గ్రామము లోని భిక్షాటనముతో వచ్చిన పిండి, బియ్యములతో జీవితము గడుపు కొనుట దుర్భరముగా నుంటవలన నా విద్యా వ్యాసంగము, (సంస్కృత ములో కావ్యతీర్థ పట్టభద్రుడైన పిదప) పూర్తిగావించిన తర్వాత ఆం. ప్ర. విద్యాశాఖలో ఉద్యోగమునకై నిరంతరం ప్రయత్నించితిని. ఆ ఉద్యోగము దొరికే వరకు వయోజనులకు తెలుగు, హింది పాఠము లను బోధిస్తూ వారి చేత "ఆంధ్ర సారస్వత పరిషత్తు హైద్రాబాదు వారి మరియు దక్షిణ హింది ప్రచార సభ హైద్రాబాదు వారి "పరీక్ష లనిప్పిస్తు నేను గూడ ప్రౌఢ పరీక్షలకై ఒక వైపు స్వయముగా ప్రయత్నిస్తు ఉండేవాడిని.

ఇంతకు పూర్వం నిరుద్యోగిగా నున్నప్పుడు మా నగరమున ప్రభుత్వ కోర్టు మున్సిప్ (జడ్జి) శ్రీ ఉస్మాన్‌అలీఖాన్‌గారికి, శ్రీ తహసి ల్దార్‌గారికి, డా॥ అమృత నారాయణగారికి, శ్రీ పోలీసు యస్.ఐ.గారికి తదితర ప్రభుత్వోద్యోగులకు, తెలుగు హింది బోధించేవాడిని.

ఈ మధ్యన జడ్‌చర్ల (మహబూబునగరు జిల్లా)లోని వీరశైవ భక్తులు శ్రావణ మాసంలో బసవ పురాణము జెప్పించుకొను పండితుని అన్వేషిస్తు సదాశివపేటకు రాగా అక్కడి భక్తులు నాకు "మీరు తప్ప కుండ అక్కడికి వెళ్ళి పురాణము జెప్పమని ఆగ్రహపరచిరి." సరె వారి మాట ప్రకారము వెళ్ళి చెప్పి భక్తుల గౌరవాన్ని బొందాను.

జడ్‌చర్లలోని భక్తులు వీరశైవ పండితులెవరు దొరకనందుకు ఒక వైష్ణవునితో తాత్కాలికముగా చేప్పిస్తు నా వద్దకువచ్చి నన్ను దోళ్కోళ్ళి ఆ వైష్ణవుణ్ణి దొలగించిరి. ఆతడు నన్ను బరీక్షించుట కె

ప్రతిరోజూ పురాణ శ్రవణమునకు వచ్చుచుండెను. చివరిదాక విని సంతసించెను. భక్తులు గూడ విని చాలా తృప్తి బొంది చివరి-రోజు ఒక శకటాన్ని అలంకరించి ఊరేగించి సభలోసన్మానించి కానుక లొసగిరి. ఇక్కడ మా గ్రామంలో శ్రీ జడ్డిగారి అభ్యాసము అట్లే ఆగిపోయినది.

ఇంతవరకు బకాయపడిన డబ్బును ప్రభుత్వజిల్లా విద్యాశాఖాధికారి నుండి రాబట్టుకై కొందరు ఉపాధ్యాయులతో బాటు కొందరి సంతకాలు సేకరించి ఒక సభ నేర్పరచి ఆ సభకుజిల్లా విద్యాశాఖాధికారి నాహ్వానించి వారికి మహాజరు ద్వారా వినతిపత్రమును సమర్పించితిని, ఇంతవరకు మాకు రావల్సిన వేతనపుబకాయ డబ్బును వెంటచేచెల్లించి విద్యాయోగ్యతలు గలవారికి ఈ వరకు కొందరు ఉపాధ్యాయులు కొనసాగిన గ్రేడును రూ. 65 నుండి 115. వేతనము నొసంగ వల్సిందిగా శ్రీ డి.ఇ.ఓ. శ్రీ సోమసుందరము పిళ్ళైగారిని అర్థించనైనది. వారు నా సహోపాధ్యాయులెల్లరకు యోగ్యతానుసారముగా కొందరికి వేతనాభివృద్ధి నొసగి నాకుమాత్రము తగిన యోగ్యత గల్గియున్నప్పటికి (డి.ఇ.ఓ.కు) అతనికి నాపైనున్న కక్ష సాధింపుచేత రూ. 35. నుండి 50 గ్రేడు నొసగి ముది మాణిక్యం ప్రాథమిక పాఠశాల పేరులో నియుక్తుని గావించి (28-8-1954) చేక్మాలు మాధ్యమికోన్నత పాఠశాలలో డిప్యుటేషన్‌గా ఆదేశ పత్రమును బంపిరి. ప్రథమములో బోధన నారంభించుట వలన అక్కడి హెచ్.యం.గారు వారమునకు 30 పీరియడ్సు ఇచ్చియుండిరి. సరేనని నేను ఉత్సాహముతో కొన్ని ఉన్నత తరగతులకు తెలుగును, క్రింది తరగతులకు హిందీ పాఠములను బోధించుట వలన సాంస్కృతిక కార్యక్రమాలను (డ్రామా మున్నగు) నిర్వహిస్తు విద్యార్థులను ప్రోత్సహించుట వలన విద్యార్థులకు నా యెడల అధికంగా ప్రేమపాత్రులై యుండిరి. ఇంతలో ఇక్కడ

పాఠశాలకువచ్చే పరిసరగ్రామ విద్యార్థులు చద్దులు తెచ్చుకొని మధ్యాహ్న సమయంలో భోజనములు జేయుటకు మంచి నీటి వసతి లేనందున వారందరు పాపము బడికి సమీపంలోనున్న చెరువునకు వెళ్ళి చద్దులను దుడంచి వచ్చేవారు. ఈ కొరతను తీర్చుటకై కొందరు విద్యార్థులను మరియు ఉపాధ్యాయులను ప్రోత్సహించి, ఆ బడి ముందు చే ఒక బావిని త్రవ్వించనైనది. అందులో నేను వారితో బాటు కొంత కృషిజేస్తు వారివి పోటోలు దీయుస్తు, విద్యార్థుల కృషిని గురించి పత్రికలలో వార్తలను వ్రాసి వారి పేర్లను ప్రకటిస్తు కొందరిచేతనేనె స్వయముగా ఆ నూతన పక్కిలో (సినిమా పాటల తర్జులో) "దారిద్ర్యపు పెనుభూతము"ను నాటకమును(డ్రామాను)వ్రాసి అభినయింపజేయనైనది. అలా వారు కష్టించిత్రవ్వీన బావిలో త్వరగా పైననే మంచి తీర్థము పడుటవలన దాని చుట్టుగోడ, గిలక, పెట్టించుటకై డబ్బు కోసము విద్యార్థులచేత డ్రామా వేయించి, కొంత డబ్బును టికెట్లద్వారా సంగ్రహించి మిగత డబ్బును శ్రీ డి.ఇ.ఓ.గారి వద్ద వినతిపత్రము నొసగి ప్రభుత్వమునుండి నిప్పించవల్సిందిగా నేనే అర్థించిని. అదే విధముగా వారు డబ్బునిప్పించిరి, దానితో ఆ బావి నిర్మాణము త్వరలోనే జర్గినది. పిదప ఇటనుండి ప్రమోషన్పై బుదిమాణిక్యము ప్రాథమిక పాఠశాలకు, అట నుండి (1955)లో పునఃప్రాక్ ఏకోపాధ్యాయ పాఠశాలకు హెచ్.యం.గాను మార్పు గల్గింది. ఈ మధ్యన గ్రేడు కొరకు శ్రీ డి.ఇ.ఓ.గారితో మళ్ళీ తీవ్రముగా తగదా వదదముతో వార్లు నా పోటులకేలే రూ. 42-54 గ్రేడునిచ్చి (6-7-1956)లో రామాయమ పేట మాధ్యమికోన్నత పాఠశాలకు స్థానమార్పును గలిగించిరి. అక్కడ మలేరియా ప్రదేశము కనుక మా శ్రీమతిగారు మలేరియా రోగముతో బాధపడిరి. ఇక్కడి నుండి వెంటనే స్థానమార్పుకై సదాశివపేటకుగాని లేదా ఉన్నత (డిగ్రి)విద్యనభ్యసించుటకై హైదరాబాదుకుగాని, మ్యార్స్

పర్సిందిగా శ్రీ జ్యాంసన్ రామకృష్ణయ్య డి.ఇ.ఓ. కడ దరఖాస్తు పత్ర మిచ్చి గట్టిగా వాదించితిని వారు నా పోరుబడలేక నా దరఖాస్తును వెంటనే హైదరాబాదు డి.ఇ.ఓ. శ్రీ టి.వి నారాయణగారికి మరియు రీజినల్ డిప్యూటీ డైరెక్టర్ గారికి పంపించిరి. అంతవరకు తాత్కాలిక ముగా (19—11—1958)లో సదాశివపేట మాధ్యమికోన్నత పాఠశా లకు మార్చిరి.

ఇంతలోనే 1959 లో రామాయంపేట నుండి హైదరాబాదుకు నా స్థానమార్పుకొరకు దరఖాస్తు డి.ఇ.ఓ. దగ్గర బెట్టుకున్న ఫలితముగా హైదరాబాద్ (19—1—59)లో మలక్‌పేట ఆంధ్ర కాలనిలోని మాధ్య మికోన్నత పాఠశాలకు సంస్కృత పండితునిగా మార్చిరి.

సరే ఈ మధ్యనే మలకుపేట నుండి డిప్యూటేషనుగా తొన్నాన్న (20—6—61)లో పర్మనెంటుగా అంధమూగ పాఠశాల మలక్‌పేటకు నా స్థానమార్పుజేసి అక్కడ విద్యార్థులకు సంస్కృతము తెలుగు, హిందీ విషయములను పదవ తరగతి విద్యార్థులకు బోధిం చుటకై నియమించిరి. అటనుండి మళ్ళీ (26—2—63)లో మలక్‌పేట ప్రభుత్వోన్నత పాఠశాలకు మార్చిరి. అటనుండి మరల మరల నె ఆలియా అభ్యున్నత పాఠశాలకు (12—2—63)లో స్థానమార్పు గావించిరి.

7వ తరగతి వరకు తెలుగును పన్నెండవ తరగతి పి.యు.సి. విద్యార్థులకు హిందిని బోధించుటకు నియమించిరి. నా నివాసమునకు (యాకుత్పుర) కాలనికి దూరముగుట వలన నాకు సైకిలుపై విహారము వెళ్ళుటకు బాధగా నుండినది. కనుక వెంటనే రీజినల్ డిప్యూటీ

డైరెక్టర్ శ్రీ మహమూదలిగారి వద్ద నా నివాసమునకు సమీపమునను
న్నున్న స్కూలునకు మార్చవల్సిందిగా దరఖాస్తు ఇవ్వగానే వారు నా
యందు దయదలచి వెంటనే (13-3-1964)లో యాకుత్‌పుర
ప్రభుత్వ మాధ్యమికోన్నత పాఠశాలకు మార్చిరి. అక్కడి నుండి తేది
31 జనవరి 1965 న వేతనాభివృద్ధి యిచ్చి (ప్రమోషన్) తెలుగు
గ్రేడు 1 (ఒకటి) ఇచ్చి దారుషిఫా ప్రభుత్వోన్నత పాఠశాలకు
(30-1-1965)లో స్థాన మార్పు జేసిరి. ఇక్కడ ముస్లిం విద్యార్థులధిక
ముగా నుండుటచేత పదవ తరగతి విద్యార్థులకు తెలుగు ద్వితీయ
భాషను ఉర్దు భాషలో పాఠములను బోధించుచుంటిని. ఇక్కడొక
మరపురాని సంఘటన జరిగినది.

ఎప్పుడు గూడ ఏ బడిలోనైన నేను విద్యార్థులతోనైతే నేమి,
సహోపాధ్యాయులతోనైతేనేమి, చనువుగా ప్రేమతో మిగుల ఆదరము
తోను వ్యవహరించేవాడిని. ఐతే ఇక్కడ విద్యార్థులు చాలా ముస్లిములు
ఇరానివారు. షాహాసులు, అరబ్బులు పిల్లలుండేవారు. వారు ఎక్కువగా
శ్రమించి చదువకుండా పరీక్షల సమయములో చాలామట్టుకు కాపీగొట్టి
పరీక్షలు వ్రాసె అలవాటు పడియుండిరి. వ్రాత చివర "మాస్టర్‌సాబు
ముఝె సాట్ మార్క్స్ దేనా చాహియే, వర్నా ఆఫ్ గేట్‌పార్ హోనా
ముష్కిల్ హై" అనగా మాస్టరుగారు నాకు అరువది మార్కులివ్వాలి
లేనిచో నీవు పాఠశాల గుమ్మమును దాటివెళ్ళేది కష్టమగునని వ్రాసి
బెదిరింపులతో మార్కులు వేయించుకొని పాసగుచుండిరి. అచటి
ఉపాధ్యాయులు గూడా విద్యార్థుల చేష్టలకు జడిసి "మా కెందుకులె
లేనిపోని బెడద" అని వారు కోరిన విధంగానే మార్కులు వేయు
చుండిరి. ఈ రహస్యం కొత్తలో నాకు తెలిసినది కాదు. ఇంతలో
త్రైమాసిక పరీక్షలు జరుగుచున్న సందర్భమున నేను నిరీక్షకుడిగా

ఉంటిని. ఒక విద్యార్థి నిర్భయంగా వ్రాయించిన నోటు బుక్కు ఒకటి తనముందు తెరచిపెట్టుకొని తొడల మధ్య నుండి చూస్తు కాపీ కొడ్తు వుండెను. నేను వాడి దగ్గరకు వెళ్ళినప్పుడల్లా కొద్దిగా దాచి ఉంచి నేను మరో వైపు తిరిగినప్పుడు కాపీ గొట్టుచుండెను. దానిని గమనించి ఈ కాలము విద్యార్థులలో ఇది పరిపాటి గదా! యని నేను గూడా చూచి చూడనట్లుగా ఉంటిని. కాని వాడి ప్రక్కనున్న విద్యార్థి ఆ కాపీ గొడుతున్నవాడితో "అరే పండిత్‌జీ ఆరహే హై" అని హెచ్చరించుచుండెను. "చల్ ఆనేదోరే క్యాకర్‌తా" అని రెండు మూడుసార్లు వినడంతో నా ఒళ్ళు మండిపడినది. వాడి ముడ్డి క్రిందనున్న నోటు బుక్కును లాక్కొని "క్యాకహతేహో బేవకుఫ్ ఏక్ తరఫ్ తు కాపికరతే హుయే నఖరా కరతేహో!" అంటూ రెండు చెంపలు గట్టిగా ఇష్టమొచ్చినట్లు వాయించి "చలో నికల్ జావో యహాంసే గధేకహీకే" అంటూ వాడు వ్రాస్తున్న ప్రశ్న పత్రము, సమాధాన పత్రములను లాక్కొని మెడబట్టి గెంటివేసితిని. వాడు ఏడుస్తూ "మైనే క్యాకియా సాబు" అంటూ బయటికి వెళ్ళిపోయెను. మొదటే అబ్బాయి తెల్లగా నాకంటే మూరెడు ఎత్తుగా ఉండి లావుగా ఉన్నాడు. ఆవేశములో వాడిని గొడితినే గాని. తరువాత వాడినెందుకు కొట్టాన్రు, అనే జాలి ఒక వైపు అంకురించగా, మరొవైపు వాడు మొదటే ముస్లిము. ఇదంతా ముస్లింబస్తి. వాడు మళ్ళీ తిరుగుబాటు చేసిన యేమగునో గదా! అనే భయం నాలో కలిగినది.

ఇంతలో తోటి ముస్లిం ఉపాధ్యాయులొకరిద్దరు వాడిని దొడ్కొని వచ్చి "మాస్టారుసాబు బహుత్ అచ్ఛే ఆద్మి హై. తూ ఉనకేసామనే షరారత్ కరతేరే బేవకుఫ్" అని గద్దిస్తు "జావో మాస్టరుసాబుకే పేట్ మేముంది డాల్ కే సలామ్ కర్, ఔర్ మాఫి మాంగో" అని చెప్పి ఆ అబ్బాయి చేత నా కడుపులో తల బెట్టించి, "మాఫ్ కరో సాబు" అని పరీక్షలో

కూర్చోబెట్టి వెళ్ళేరి. తరువాత వాడెక్కడ అగుపడినా "నమస్తే గురుజీ" అని పలకరిస్తూ వెళ్ళేవాడు. గాని నాకు వానిని చూస్తే భయమేసేది. కాని పైకి మాటకు మాత్రము "అచ్ఛాహై బేటే" అంటూ చిరునవ్వుతో వెళ్తు ఉంటిని. నాకు విద్యార్థులంటే చాలా ప్రేమ. కాని అదే చనువును ఆసరాగా తీసికొని అధికంగా పీడిస్తుంటే సహించేవాడిని గాదు.

ఇదే విధంగా మదరసా ఆలయంలో ఒక విద్యార్థి, మరియు ఇసామియా బజారు హైస్కూలులో ఒక విద్యార్థిని, బాగుగా కొట్టియున్నాను. కాని వారు మాత్రము ఈ వరకు గౌరవముతోనే చూస్తూ నమస్కరిస్తు ఉంటారు. ఇప్పుడు అలాంటి విద్యార్థులందరు గొప్ప చదువులు చదివి, గొప్ప ఉద్యోగాల్లో ఉన్నారు. ఎప్పుడైన ఎక్కడైన కలుస్తే వారు ఇదంత మీ యనుగ్రహ ఫలితమే సార్. అని నమస్కరిస్తు ఉంటారు. నేను గూడా వారి చెడు ప్రవర్తనలకే కోప్పడి, ఎప్పుడో ఒకసారి కొడ్తూ ఉంటినే గాని, వారియెడ ఒక మిత్రునివలే ప్రేమతో మాట్లాడుతూ, లాలిస్తు. కవ్విస్తు, నవ్విస్తు పాఠాలు బోధించేవాడిని. అందుకు వారందరు నాపట్ల ప్రేమాదరములను గనపరచుచుండిరి. అంతేగాక పాఠశాలలో నున్నప్పుడుగూడ ఆ విద్యార్థులను నెంతగానో ప్రేమతోను, గౌరవముతోను, జూచేవాడిని. అక్కడున్నప్పుడే నాతోటి ఉపాధ్యాయులలో శ్రీ సైయ్యదుసాబు టిపును పుట్టు (గుడ్డి) బి.ఇ.డి. గారు పాతబస్తి యాకుత్పురా కాలనీలో ఉండేవారు. అతడు నా యందలి మిక్కిలి ప్రేమగలవాడై ఒకనాడు "పండిత్ జీ అప్ హమారే కాలనీమే హౌసింగ్ బోర్డునే ఏక్ ఘర్ లేలో. హమ్ సబ్ మిలకే ఏక్ బస్తిమె రహతేహై" అనేను. నేను అందుకు "ఓ హమ్కో క్యాబస్ హోతా? చోటీజో పిటి కెలైసాహై" అంటిని. అదివిని వాహావా పండిత్ జీ! ఆగే జాకే పహ జీవలసాతో ముష్కిల్ హోజాయెగా? ఆగే పచతావోగే చలో అజీహా!

హౌసింగ్ బోర్డుకు జాకర్ దరఖాస్తు దేకర్ ఆయెంగే" అంటున్న నాన్నాతడే బలవంతంగా దోక్కొని, అప్పట్లో బరకత్‌పూర చౌరస్తాలో ఉండిన ఆఫీసుకు రిక్షాలో నెక్కించుకొని తోలుకెళ్ళి, నాచేత దరఖాస్తు పెట్టించెను. అప్పుడు నేను వారితో జాటే యాకుత్‌పూరా కాలనీకి వెళ్ళి నాకు నచ్చిన ఇంటినెన్నుకొని. దాని నంబరు ఆఫీసులో ఇవ్వగానే వెంటనే అలాటుమెంటు ఆర్డరిచ్చిరి. దానిని దెచ్చి అక్కడి చౌకిదారు కివ్వగానే అతడు వెంటనే ఆ ఇంటి తాళము తీసి మా కప్పగించెను. ఈ విధముగా ఒక ముస్లిం సహోపాధ్యాయుని సహాయముతో నాకు హైదరబాదులో ఒక యిల్లు లభించినది. ఆ ఇంటి శుభగడియ మంచిది. కనుక నేను మొదటి భార్యకు సంతానము లేని కారణముగ టిబి (క్షయ్య) రోగ గ్రస్తురాలై యుండుటచేత నాకు రెండవ వివాహము జరిగి ఇద్దరు మగపిల్లలు ఒక ఆడబిడ్డ గల్గినవి.

గొప్ప మహాస్వాములు కాశీపీఠము జగద్గురువులు. శ్రీ విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములవారు రెండుసార్లు వచ్చి నలుగైదు రోజు లుండిరి. వేల రూ॥లు వెచ్చించినను. రాసకుమంటి జగద్గురువులు నారు నేను ఫలానా తేదికి మీ వద్దకు వస్తున్నానని వరకే వైజనాథ నుండి టెలిగ్రాము ఇచ్చివచ్చారు. అదే విధముగా మా గురువర్యు లైన శ్రీ సదాశివపేట వాసులు కోటగల్లు సంస్థానాధీశులు శ్రీశ్రీ విరూపాక్షానందా మహాస్వాములవారు. శ్రీ చిదుకుంట బసవలింగస్వామి ఎం. ఎ. గారు శ్రీ చంద్రశేఖరస్వామి పావన్నపేట గారు, మైసూరు స్టేటు స్వామి వీరభద్రశివాచార్య మహాస్వాములు హాలగూరుగారు, శ్రీ షడక్షరి మహాస్వాములువారు ఘనగూరుగారు వచ్చియుండిరి.

హైదరాబాద్ రాజధానిలో ఒక ఇల్లు ఉద్యోగముగలిగి యుండ డము నాసుకృతమే అనుకోవాలి. ఎందరో నాతోటి ఉపాధ్యాయులు ఇల్లులేక కిరాయి (అద్దె) ఇళ్ళలోనేఉండి ఈ వరకు కాలము గడపుటను చూస్తే నేనే ధన్యుడననుకోవాలి. అంతే కాకుండ గొప్ప గొప్ప పండిత ప్రకాండులైన శ్రీ డా॥ దివాకర్ల వేంకటావధానిగారు ఉస్మానియా యూనివర్సిటీ తెలుగు శాఖాధ్యక్షులు. మరియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు మద్రాసు యూనివర్సిటీ తెలుగు భాషా శాఖాధ్యక్షులు మా కుమారుల పుట్టిన రోజు పండుగలకు అప్పుడప్పుడు విచ్చేస్తు ఉండేవారు. అంతే గాకుండా మదీయ జ్యేష్ఠ పుత్రునికి డా॥ దివకార్ల వేంకటావధానిగారు అక్షరాభ్యాసము బెట్టిస్తే, శ్రీ నిడుదవోలు వేంకట రావుగారు మా రెండవ అబ్బాయికి అక్షరభ్యాసము బెట్టించిరి. ప్రస్తుతము వీరుభయులు పండిత ప్రకాండులు పరమపదించియున్నారు.

ఇక్కడునప్పుడే స్థానిక వీరశైవులతో సమాజ సంఘములను నెలకొల్పి వీరశైవులలో నవచైతన్యము గలిగించిన ఫలితముగా ఇప్పటికి వీరశైవ సమాజము వారు సభా సమావేశములకు నన్ను సగౌరముగా రప్పించుకొని నాచేత ఉపన్యాసముల నిప్పించుట గలదు. ఇట నుండి ఒక ఉపాధ్యాయ పండిత పరిషత్తును (6—8—69) లో స్థాపించి హైద్రాబాదు, సికింద్రాబాదు పండితులనందరిని కూడగట్టు కొని అప్పుడప్పుడు సభలు సమావేశములు నిర్వహిస్తు ఆయాసంస్థలకు అధ్యక్షులుగాను, ప్రధాన కార్యదర్శిగా నుండి పండితుల కొన్ని సమస్య లను ప్రభుత్వము దృష్టికిదీసికెళ్ళి, వేతనాభివృద్ధి జేయించవైనది. అట్లే ఇక్కడుండగానే శ్రీ పురాణ వీరభద్రయ్య మరియు శ్రీ ఆర్.యం. వీరభద్రయ్య మరికొందరిని మాహేశ్వరులను సమావేశపరచి వీర

మాహేశ్వర (జంగమ) మహాసభ నొకదానిని నెలకొల్పి, దాని ద్వారా శ్రీ బి.డి. జట్టి భారతదేశ వైస్ ప్రసిడెంటు గారితో పత్ర వ్యవహార ములను నెరపి జంగమ వారిని బి. సి. ఏ. గ్రూపులో (వెనుక బడిన తరగతి)లో జేర్పించనైనది. ఈ సంస్థను ప్రభుత్వముచేత రిజిష్టరు జేయించనైనది. నాకు చేదోడు వాదోడుగా ఉన్న శ్రీ పురాణ వీరభద్రయ్యగారు మరణించిన పిదప శ్రీ డా. ఆనందముగారు నా సెక్రేటరీగా ఉండి కార్యకలాపములకు సహకరించి యుండిరి. నేను మొదటి నుండి ఇంతవరకు అధ్యక్షుడిగానే ఉండి సంస్థకు తను మ్మన ధనములతో సేవజేయుచున్నాను.

ఉపాధ్యాయ పండిత పరిషత్తుకు అధ్యక్షునిగా, కార్యదర్శిగా నుండి చివర 25 సం॥ముల రజతోత్సవాన్ని వైభవోపేతముగా ఈ సందర్భమున జరిపించాను. డా॥ దివాకర్ల వేంకటావధానిగారిని విద్యాశాఖామాత్యులు శ్రీ ఆళ్వారు దాసుగారిచేత సన్మానింపజేసాను. శ్రీ సి. నారాయణరెడ్డిగారు శ్రీ పరాయతము కృష్ణమూర్తి గార్లు ఈ సందర్భమున విచ్చేసియుచుండిరి.

వీరశైవ సాహిత్య సేవకై బూనుకొని పది సంవత్సరములు 1974 నుండి 1984 వరకు నిరాటంకముగా "వీరశైవ ధర్మతత్వ ప్రకాశిక" అను త్రైమాస పత్రికను నిర్వహించనైనది. దీనికెందరో అడ్డంకులు వేయుచు తొందరపెట్టిరి, అయినను వారి మాటలను సరకు గొనక నా పనిని నేను నిర్విఘ్నముగా గుండె ధైర్యముతో నిర్వహించు చుంటిని. దీనికి చందాదారులనుగా జేర్చుటకై నేనొక్కడినే ఇక్కడ ప్రభుత్వ విద్యాశాఖలో చంచల్‌గూడ ప్రభుత్వ జూనియర్ కళాశాలలో నేడు ఒకటి సీనియర్ తెలుగు పండితునిగా నా వృత్తిని సక్రమముగా

నిర్వహిస్తు సెలవు దినాల్లో ఎండ,వాన, చలికిఓర్చి ఆంధ్రప్రాంతములో మరికొంత తెలంగాణములో తర్వాత చందాదారులనుగా జేర్పితిని. ఇందుకు కొంత సొంత డబ్బును వెచ్చించితిని.

## జోగిపేటలో పరాధీనమైన పెద్ద మఠమును మరల సాధించుకొనుట

స్థానికంగా జోగిపేటలో నేను ఉన్నప్పటికే మఠములో వీరశైవ సమాజమును నెలకొల్పి తద్వారా ప్రతి సంవత్సరము శ్రీ బసవేశ్వర జయంతిని వైశాఖమాసములో, విజయదశమి పర్వదినములో, మఠము నుండి నందిధ్వజ ఊరేగింపు, శ్రావణ మాసములో పురాణ ప్రవచనము మొదలగు సామాజికముగా ముమ్మర కార్యక్రమములను విజృంతి జముతో సభలు, సమావేశములు జరిపి పరిసర గ్రామాల్లోను కొన్ని సమాజ శాఖలను నెలకొల్పి ధర్మ ప్రచారము గావించుట. స్థానికముగా ఒకరిద్దరికి కినుకగా పరిణమించి ఒకరిద్దరు లింగాయతులే ఆర్యసమాజికులుగా మారిన వారి సలహామేరకు దురుసుగా ప్రవర్తిస్తు మఠము మాది. నీ వెవరవని? ప్రశ్నించినప్పుడు దానికి "నేనెవరు?" అనునొక గ్రంథము ద్వారా వీరశైవ సమాజాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించిన వివరములను తేదీలతోసహా ఆయాయా సం॥ములో ఎన్నుకొనిన కార్యకర్తల పేర్లతో సహా ముద్రించి ప్రకటించనైనది. ఐనను వారు "పిత్తరోగికి" శర్కరరుచింపదన్నట్లుగా నా పై వారు కేసును ప్రవేశపెట్టిరి. కారణమేమనగా కొంత మఠం స్థలమును విక్రయించి యున్నాడని కేసుబెట్టియుండిరి. కాని నేను అంతకుముందే సమాజముకు ఒక దరఖాస్తునువ్రాసి అందులో మరియు క్రమేపిఅన్యాక్రాంతము జరుగు

చున్నది. మేము వారిని నివారించగా ఆ దౌర్జన్యపరులు మాతో పోట్లాడు టకు సిద్ధపడుచున్నారు. ఒక సందర్భములో మా నాన్నగారిపై ఒక దుండగుడు చేయిచేసికొన్నాడు. తత్ఫలితముగా నాన్నగారు కోర్టుకు వెళ్ళి వానిని రిమాండు (అరెస్టు) జేయించియున్నారు. అట్లాంటి సందర్భాల్లో ఇంతమంది లింగాయతులుండియు విడిపించక, దౌర్జన్యపరుడిని శిక్షించక "నిమ్మకు నీరెత్తినట్లుగా'' చూస్తు ఉండి పోయారు. ఇప్పుడు నాతోను కొందరు బస్తీదుండగులు, మన్నుత్రవ్వకుండ, రాలుతీసి వెళ్ళకుండా నివారిస్తే పోట్లాడుతున్నారు. కనుక ఇట్టి స్థలమును విక్రయించి ఉన్న మఠమును శిథిలమైన దానిని భద్రపరచుకుంటే బాగుంటుంది. అందుకు మీరు తగు చర్యగైకొని మఠముసుద్ధరించే మార్గమునేదైన సూచిస్తారా? లేదా! నేనే దానిని విక్రయించి ఆ ఆదాయముతో మఠమును పునరుద్ధ రిస్తాననియు, ఒక ఆరుమాసాల్లో మీ యభిప్రాయమును దెలుపవలసిందిగా అధ్యక్షులు శ్రీ జామిని బొంతప్ప మరియు కార్యదర్శి శ్రీ నడిగే పెద్ద అగప్పగారికి వ్రాతమూలకంగా దెలియపరచితిని. కాని ఆరు మాసముల గడువు ఇచ్చినను, వీరశైవ సమాజము వారుగాని, దాని కార్యకర్తలుగాని ఎవ్వరును బట్టించుకోలేదు. చివరికి నేనే ఒక సమావేశము నేర్పరచి అందు సమాజము ప్రధాన కార్యదర్శిగారైన శ్రీ నడిగే పెద్దఅగప్పగారిని నేను గట్టిగా "మఠము స్థలము విషయముపై మీరేమిచర్యగైగొన్నారని" ప్రశ్నించగా. వారు నిర్ద్వంద్వముగా "ఏంచేయాలి అయ్యగారు! ఈ విషయములో నేనెన్నిసార్లు ఆహ్వానించినను మా వారెవ్వరను బట్టించుకోవడము లేదు. కనుక మీ మఠము విషయములో మీరే పట్టించికోవాలి" అని చెప్పిరి. అప్పుడు నేను "ఈవట్టి మాటలతో ప్రయోజనం ఉండదు." అదే విషయమును కాగితముపై వ్రాసి ఇమ్మని ఆదేశించగా, వారు ఆదేవిధముగా వెంటనే మీ మఠము విషయమై మీరేదాని

యాధ్యతను స్వీకరించాలని వ్రాసి సంతకముజేసి ఇచ్చిరి. అదే విధముగా శ్రీ జామిని బొంతప్ప సమాజాధ్యక్షుడిని మరియు కోశాధ్యక్షులైన శ్రీ నెలిగే రామప్పగారిని గూడ విచారించి వారిలోను దానిపైసంతకాలు కైసికొంటిని. తరువాత నా పేరునపట్టదారుగా అమలైన సర్వేనెంబరు 66. భూమిని విక్రయించుటకై అన్ని విధములుగా ప్రయత్నిస్తున్నాను. మొట్ట మొదట పట్టాభూమి సర్వేనంబరు 66. విక్రయించబడును. కొనదలచిన వారు ఆభూమి యాజమానిని గలసికొని వివరాలను దెల్సికొనవలసినదని ఒక నోటీసును వ్రాసి దానిపై మొదలు భూమికి దగ్గరనున్న వారిని, మరియు పరిసరాలలోనున్నవారిని మరియుఆడ్తి కిరాణము దుకాన్‌దారుల వైశ్యుల, వర్తకుల మొదలగువారి సంతకములను స్వీకరించనైనది. అంతేగాకుండ వాలు పోస్టర్సువంటి పెద్ద పెద్దవైన కాగితాలపై "బాజికాయల్లాంటి"అక్షరాలతో పెద్దమత్తము వేయుచున్న భూమి అమ్మ బడుతుంది కావల్సినవారు వచ్చి విచారించగలరు (సంప్రదించ గలరని). అనివ్రాసి తేదీ సమయములను సూచిస్తూ గ్రామమధ్యమున్న (కాలసూచి) గడియారమున (క్లాక్‌టవర్)కు హనుమాన్ గుడికి, తూర్పు గవినికి, పోచమ్మ గుడికి, మరియు పాత హనుమాన్ మందిరమునకు అతికించ నైనది, కాని యెవరును కొనుటకు హిందువులు ముందుకు రాలేదు.

ఈ తరుణములో సుప్రసిద్ధవ్యక్తి నా బాల్యమిత్రులు. ఆర్యసమాజము ప్రధాన కార్యకర్తయైన శ్రీ బసవమాణయ్యగుప్తగారు సర్వే నెంబరు 66కు ప్రక్కనే ఇల్లు ఉన్న ఒక ముస్లింవ్యక్తి మహమ్మదలి అనునాతనికి అతితక్కువ ధరకు అమ్మవలసిందిగా కోరిరి. దీనినే సులుగంటి శ్రీ చెన్నప్పగారుగూడ బలపరిచిరి "అందుకు నేను వారితో" ఏ ధరతో అమ్మాలో నాకు దెలియదు, నేనెన్నడును ఈ వ్యాపారములో తలదూర్చ లేదని చెప్పగా అందుకువారు "ఏదో ఏదవాడు వాడికి దానమిచ్చినట్లుగా

భావించి ఇమ్మనిరి", అప్పుడు నేను "ఇదేధర మిగతావారికి గూడ మార్గము వేసినట్లే అవుతుంది. కాస్త ఆలోచించి చెప్పండి అంటిని." వారు "మిగతవారి విషయములో అట్లు జరుగనివ్వము, మీరిందుకు అనుమతింప వలసిందేగా ఆగ్రహపరచిరి. ఈ విధముగా వారిద్దరి బలవంతముచేత ఆ మహమ్మదలి అనునాతనికి గజము చతురస్రమునకు రెండు రూ॥లు నిర్ణయించి, అదే ప్రకారముగా ముప్పది గజములకు ఆరువది రూ॥లను పుచ్చుకొని శ్రీ జీడిగే శంకరప్పగారి ఎదుట శ్రీ డి. సంగమేశ్వర బట్టల దుకాణములో రశీదు వ్రాయించి ఇవ్వనైనది. ఇది జరిగిన నాలుగైదు రోజులకు శ్రీదేశ్ముఖ సోమప్పగారు నావద్దకువచ్చి "మీరు ఆముస్లిం మహమ్మదలి గారికి విక్రయించిన స్థలమే నాకుగావాలి. అదినాకు దగ్గరగా అనుకూలముగా ఉంది. వాడిడబ్బు వానికి తిరిగి ఇచ్చివేయవలెను అనిరి." "నేను దానిని విక్రయించుటకై మనవారందరికి మొదలే తెలియపరచి సంతకాలు గూడ చేసికొనియుంటిని. ఇంతవరకు కిమ్మనకుండ ఊరొక్కొని ఆస్థలమును విక్రయించి రసీదిచ్చిన తరువాత మీరడగడము నాకు వరీక్షగా ఉంది. కనుక ఏమైనను నరె మాటజారిపోయింది. అందుకు నేనిప్పుడేమి చేయలేకున్నాను, ఆశూద్రునితో నేను ''ఇది నాలుక కాదా? అనిపించుకునే దురవస్థకు పాల్పడనని ఖచ్చితముగా చెప్పితిని." అప్పుడు శ్రీడి. సోమప్ప తన స్వార్థమునకై అతని బంధువైన శ్రీ నడిగే అగప్పను, శ్రీ అంచెగె ఈశ్వరప్పను పురికొల్పెను. వారితోగూడ నేను అదేమాట చెప్పితిని. అందుకు వారు ముగ్గురు "మేము చెప్పినట్లు విననియెడల, నిన్నేమి చేస్తామో చూడు"మని భయపెట్టిరి. కాని అందుకు నేను ఏ మాత్రము భయపడలేదు. సైద్ధాంతికముగా విరోధులైన శ్రీ సులుగంటి చంద్రయ్య ఆర్యను, శ్రీగాండ్ల సంగమేశ్వరుడను, కూడగొట్టుకొని,

నాపై తాలూకా కచేరిలో కేసు పెట్టిరి. (మున్సిపల్)లో అప్పుడు నా బాల్యమిత్రులైన శ్రీ బసవమాణయ్య గుప్తగారే దానికి ఛైర్మన్‌గా ఉండుటవలన వారు "పట్టాదారెవరో వారికే అమ్ముకునే అధికార ముంటుంది. కాని మీకు విచారించే అధికారమేలేదని" తీర్పు చెప్పిరి.

అంతటితో ఊరుకుండక, మెదక్ జిల్లాకు కూడ ఈ కేసును తీసికెళ్ళిరి. అక్కడ కూడ నాపై పే తీర్పు నిచ్చిరి. అటనుండి ఏండో మెంటులో నాపై షికాయతి జేస్తు దరఖాస్తు ఇచ్చిరి. అక్కడి నుండి ఆంధ్రప్రదేశ్ ఏండోమెంటు నాకు ప్రతికూలపార్టీగా చూచి నన్ను కొన్ని నాళ్ళు సమాధానమివ్వ వలసిందిగా మాటిమాటికి నోటీసు లివ్వడము మొదలుపెట్టింది. అప్పుడు నేను విధిలేక శ్రీ బచ్చు శ్రీనివాస గుప్త అడ్వొకేటుగారికి వకాలతు నామను ఇచ్చి రెండు సం॥ములు సుదీర్ఘముగా పోరాడిన తరువాత జిల్లాలో గూడ నావైపే తీర్పు జరిగినది. ఏండోమెంటువారు పరాజితులైరి. అటనుండి మళ్ళీ స్థానిక సులుగంటి చంద్రప్ప ప్రేరణవలన ఏండోమెంటువారు హైకోర్టుకు ఈ కేసును దీసి వెళ్ళిరి. అక్కడ హైకోర్టు ఏండోమెంటువారికి ఇంకముందుదెప్పుడు గూడ జోగిపేట పెద్ద మఠము అధ్యక్షులవారి జోలికి పోగూడదని హెచ్చరిక జేసినది, ఆ తీర్పు ప్రతిని (కాపిని) ఇక్కడ జతపరచ నైనది.

శ్రీ గాండ్ల సంగమేశ్వర్‌గారు నాకు విరుద్ధముగా మాడుటకు వారి తండ్రిగారికి వారికున్న విరోధమే నాపై పెంచుకున్నారు. ఇక్కడ నేను జేసిన పొరపాటు, వారికి స్థలమిచ్చుటే. శ్రీ గాండ్ల సిద్రామప్ప గారు సుమారు మూడు సంవత్సరముల నుండి మఠం ముందట నాకు కొంత స్థలమును ఇల్లు కట్టుకొనుటకిమ్మని ప్రాధేయపడుచుండిరి. నేను

అనేకసార్లువలదని నేనుచెప్పినను వారువినలేదు. చివరకు నేనురామాయంపేటలో ఉపాధ్యాయ వృత్తిలో నున్నప్పుడు ఆయన అక్కడికి వచ్చి నా కాళ్ళపైబడి "మీరు నాకు స్థలమిచ్చెదనని చెప్పేవరకు నేనిక్కడి నుండి వెళ్ళనని" పట్టుబట్టెను. అందుకు నేను ఏమి చేయునది లేక వారితో నేనిట్లు చెప్పితిని. "సిద్దరామప్పా! ఇప్పటికే జోగిపేట వీరశైవ భక్తులు నాపైన కక్ష్యను సాధిస్తూ కేసును బెట్టియున్నారు." "దానితో నేను చాలా బాధ జెందుచున్నాను. కనుక నీకిచ్చిన స్థలమును గూర్చి ముందేదైన వివాదమొచ్చిన దానికంతటికి నీవే బాధ్యత వహించి ఎదిరించి పోరాడాలి సుమా? నేను మాత్రము ఎట్టి పరిస్థితిలోను నా ఉద్యోగమును విడచి తిరిగేవాడినిగాను." అని ఖచ్చితముగా జెప్పితిని. అందుకాతడు సరే అని, "అన్నిటికి నేనే బాధ్యుడనని" అంగీకరించి, మరము చింతచెట్టుక్రింద ఎటు పది పదరపు గజాల స్థలము రూ. 260-00 (రెండువందల అరువది రూ.లకు) మాట్లాడి, నాకు వంద రూపాయలు మాత్రమే ఇచ్చిరి. మిగతవి తరువాత ఇచ్చెదనని ఇవ్వకుండానే తన కొడుకు సంగమేశ్వర్ ఒడ్డిన విపత్తులకులోనై కుమిలి కుమిలి బాధతో తన ఉంపుడుగత్తె ఇంట్లోనే అనగా నేనిచ్చిన స్థలములోనె కొత్తగా ఇల్లు గట్టుకొనియుండి అందులోనె కూడు గుడ్డలకు కరువై చివరికి అసువుల వీడిరి. ఈ విధముగా వారి తండ్రికి నేను స్థలమిచ్చుటవలన నాతో వారు ప్రతిఫలముగా మారి ఇంతకు మొదలే నాకు విరోధులైనవారికి చేదోడువాదోడుగా ఉండి సలహా నొసగుచుండిరి.

ఒకప్పుడు నాకు విరోధముగా కేసును పెట్టుటకై నాసోదరుడు (తమ్ముడు) వీరంతయ్యకు లేనిపోనివి నూరిపోసి వాడే నాపై కేసు బెట్టినట్లుగా ఒక దరఖాస్తును తానే వ్రాసి దానిపైన సోదరుడిచే వ్రాలు జేయించుకొనియున్నారు. వాడు చదువరి గాక సంస్కారమేమాత్రము

లేకుండెను. ఎల్లప్పుడు మురికి బట్టలను ధరించి, నెల్లలతరబడి స్నానము చేయకుండ ఉండేవాడు. మంది నాకు విరుద్ధముగా చెప్పిన మాటలువిని. వినిపోని మాటలతో నిరంతరము తాను నన్నుచచ్చేవరకు వేధించియు న్నాడు. పిడు జీవించి మఠములో ఒకడుగానున్నప్పుడే ఇదేఅదను జూచి నాకుబద్ధ విరోధివాడు సులుగంటి చంద్రప్ప శ్రీ సంగమేశ్వరుగారు చెప్పిన మాటలతో ప్రేరితులైన తెనుగువాళ్ళు ఆర్యసమాజము నుండి వ్యాయామ సామానులన్నింటిని తెచ్చుకొని మా మఠములో ఉంచి రేయింబ వళ్ళంటు వ్యాయమశాలగా మార్చియుండిరి. అందులోకి నేను వెళ్ళితే చంపుతామనుచే గాకుండ, మఠము స్థలములో నేను కొద్ది స్థలము (ఒక చిన్న గదిని మాత్రమే) ఎట్టి 2 చ. గ. లో కిరాయకుండిన పుట్టాలబట్టి ముస్లింలకు నన్ను కొట్టుటకై సిద్ధపరచి యుండిరి. ఆటు తరువాత ఈ సంగతినా చెవిన బడినది. నన్నేగాదు. రానురాను. తెనుగువాళ్ళు సొంత స్థలముగా మార్చుకొని, స్థానిక వీర శైవ భక్తులను గూడ ఎవరిని మఠములోనికి రానివ్వకుండ “ఇందులోకి ఎవరొచ్చినా వాడిని చంపివేస్తామని” భయపెట్టిరి. అందుకు జడిసి యెవరు గూడ మఠములోకి వెళ్ళుటకు సాహసించకుండిరి. మేము మాత్రమే అప్పుడప్పుడు వారెంతగా వేధించినను, భయపెట్టినను, విని పించుకోకుండ వెళ్ళి గురుమఠములో ఉండి, కాలక్షేపము చేయుచుంటిమి. మా శ్రీమతి పి.యస్. (పి. సంగమణి)గారు మాత్రము మా అందరి కంటెను ఎక్కువ ధైర్యము గలది. కావున వారెంతగా భయపెట్టినను వినిపించుకొనకుండ అందులోనే ఉండి తన టీచరు ఉద్యోగమును సాగించుకొను చుండెడిది.

ఇంతగా పట్టుబట్టి నన్ను వేధించిన శ్రీ డి. దేశ్ముఖు సోమప్ప ప్రయత్నమంతయు వృథాకాగా, మరల తానే నావద్దకు వచ్చి “అయ్య గారు! మా ఇంటి వెనుక దిడ్డి ద్వారముకదనున్న స్థలములో నాకు

కేవలము 30 (ముప్పది) గజాలివ్వండి. దాని వెల యెంత అయితే అంత చెల్లిస్తానని" ప్రాధేయపడగా నేనాతనితో "ఇంతవరకు నీకు అండదండలుగా నుండి నన్ను పీడించుటకై దావా (కేసు) వేసినవారు మీకు స్థలము నిప్పించరా? పోయి వారినే విచారించమంటిని." అప్పుడు "ఏదో నావల్ల పొరపాటు జరిగినది. మీరె నాకివ్వాలిగాని వారేమి నాకిప్పించరని" చెప్పగా. "సరె అట్లయితే నీవు అర్థించినట్లు ఒక వినతి పత్రమును వ్రాసికొని తెమ్మని చెప్పితిని." అతడట్లు చేయగా నేను అతనికి ఆ స్థలమును కేవలము గజమొక్కంటికి రెండు రూ.లు చొప్పున అరువది రూపాయిలు తిసికొని రసీదు వ్రాసి ఇస్తిని. అతడిప్పుడు నావద్ద దీసికొనిన స్థలము కంటె రెండింతల స్థలము నాక్రమించుకొని పెద్ద భవనమునే గట్టుకొని అద్దెకిచ్చుకొని దానిపై తన జీవితమును గడుపుతున్నాడు. ఈ విధముగా స్థానిక వీరశైవ భక్తులు కొందరు నన్నెంతగా పీడించవలెనో అంతగా వేధించియున్నారు. ఈ సందర్భములోనే మాతుఃశ్రీగారు గతించిరి. ఆ దుఃఖము నుండి తేరు కొనకముందే మా పెద్ద సోదరి రెండవ ఆమె శ్రీమతి శివ్వమ్మగారు గూడ తేది 11-11-71న గతించిరి. ఈ వ్యధతో నున్నాననే జాలికూడ వారి హృదయాల్లోనేకోశమున లేకుండినది.

ఏ వీరశైవ సమాజమును నాదని భావించి రేయింబవళ్ళు సమాజాభివృద్ధికై అనేక పాట్లుబడితినో అట్టి వీరశైవ సమాజము వారిలోనే కొందరు నాకు హితశత్రువులుగా మారి నన్ను బాగా పీడించిరి. అందుచేత "ఊరికి జేసిన ఉపకారము పీనుగకు జేసిన సింగారము వృథా" అను సామెత నాస్వమాజమును వారిదైనది. అని భావించి తదభివృద్ధికై నిరాహారదీక్షలు సల్పుతు జేబునుండి యెంతగానో డబ్బు వెచ్చించు

కొంత్తు వచ్చినను లాభము లేకపోయినది. ఏ సమాజము కొరకైతె నేను సహాయపడితినో అదే నాకు ఎదురు తిరిగినప్పుడు చేయునది లేక విసుగొచ్చి మెదక్ జిల్లా నుండి హైద్రాబాదు జిల్లా విద్యాశాఖకు నా స్థాన మార్పును నా ఇష్ట పూర్వకముగా జేసికొని వచ్చియున్నాను. అప్పుడు నాగ్రేడు కేవలము రూ. 35 నుండి 50 మాత్రమే ఉండేది.

ఇక్కడికొచ్చిన పిదప మా శ్రీమతిగారు టి.బి. గ్రస్తురాలై బాధ జెందుచుండి జీవించె ఆశే లేకుండినది. ఎవరు గది అద్దె కివ్వడానికి గూడ అంగీకరించలేదు. కనీసం బంధువులు గూడ దరి జేరకుండిరి. దూరముగా నుండిరి. అప్పుడు విధిలేక ఒక మిత్రుని (శ్రీ అర్.యం. వీరభద్రయ్యగారి) సలహామేరకు ఇసామియా బజారులోని శ్రీ చంద్రమౌళీశ్వర దేవాలయములో ఒక గదిని అద్దెకు తీసుకొని అందులో ఉంటిమి. అక్కడ గూడ ఆ దేవాలయపు పూజారిలా అన్నాడు. "టి.బి. ఉన్నవారిక్కడ ఉండకూడదు. ఇక్కడికి పలువురు వస్తూపోతూ ఉంటారు. కావున మీరు వేరెక్కడైన చూచుకొమ్మనెను." ఈ సందర్భమున ఎవరును అద్దెకివ్వడానికి సమ్మతించనందున దిక్కులేనిపక్షిలా నేనామెనువెంటపెట్టుకొని తిరిగాను. అయితే ఆపరేషన్ జేయించిన పిదప బాగుపడ్డ ఆమె ఇప్పుడు తన బంధువుల అండదండలతో వారు చెప్పినట్లువింటు "నీవునాకేమి చేశావు. నేనె నీకు చాలా సేవచేశానని" గద్దించిమాట్లాడుతుంది. ఇదినాదుర్దెమనాలి.ఫిషేషన్ జేయుటాక మలక్‌పేట హైస్కూలు క్లర్కు పొరపాటుచేత నాకు కేవలము మాసికవేతనము క్రింద మొత్తము 80-00 (ఎనుబది రూ.లు) మాత్రమే నా చేతికి డబ్బు వచ్చేది. దానితోనె నేనున్న ఇంటి అద్దె చెల్లించుకోవాలి. నెలవరకు సాహిత్యమును సమకూర్చుకోవాలి. పోగా ఇదే సమయంలో మా భార్య (శ్రీమతి ఈశ్వరమ్మకు) టి. బి. (క్షయ) రోగము సంక్రమించుట వలన నామెకు తగిన రీత్యా చికిత్స

జేయించుకోవాలి. ఈ రోగము సంగతి విన్న బంధువులు, మిత్రులందరు నాదరిజేరకుండా ముక్కు మూసికొనిఉండేవారు. ఆమెనుపోషించిన తల్లి, తండ్రి, తోబుట్టువులు గూడ ఈమె ఈ దురవస్థనుజూచి దూరమునవెళ్ళే వారేగాని, సమీపించి పలకరించేవారుగాదు. అంతెందుకు మేమే ఇంట్లో అద్దెకుంటిమో వారుండనీయక వేరే అద్దె చూచుకొమ్మని మోమాటము లేకుండా చెప్పేవారు. కనుక ఆమెకు భర్తనైన నాకు తప్పినది కాదు గదా? అన్ని విధాల కాసిపోస్తూ, ఉపచారము చేస్తు, బడికి వెళుతూ ఉండేవాడిని. కొందరు సన్నిహిత మిత్రులైన శ్రీ శెట్టి శివరావు, వకీలు గారు. శ్రీ గాండ్ల సంగమేశ్వర్‌గారు జోగిపేట నుండి ఎప్పుడు హైదరబాదుకు వచ్చినను మా ఉంట్లోనే ఉండేవారు. అలాంటి వారే ఆమెను దూరముంచాలి. అది సాంక్రమిక రోగము. అందుచేత అది నీకును సోకుతుంది. అని చెప్పి భయపెట్టిరి. అయినను నేను వారు చెప్పిన మాటలను బట్టించుకొనక "మంచి ఆరోగ్యముతో నున్నప్పుడు ఆమెతో సేవ జేయించుకొంటిని. ఇప్పుడీయవస్థలో బాల్యములోనే కన్నతల్లిని గోల్పోయిన అమెకు ఎవరు చేయాలి." అని మొండిగా ఆమెను ఆనంతగిరి సనిటోరియం హాస్పిటల్‌కు, అటనుండి మరల ఎఱ్ఱగడ్డ టి.బి. హాస్పిటల్‌కు ప్రతివారము తోల్కొళ్ళి తగిన మందులిప్పించి చికిత్స జేయించుచుంటిని. చివరికి వైద్యులు (డాక్టర్లు) విసిగివేసారి "ఈమెకు ఒక ప్రక్కనున్న ఊపిరితిత్తి యేమాత్రము పనిజేయుట లేదు. ఇప్పుడీమెకు శస్త్రచికిత్స జేయకుంటె ఆ రెండవ ప్రక్కనున్న ఊపిరితిత్తి గూడ పనిజేయకుండా ఉండి తప్పకుండా మరణిస్తుందని" తమ నిరాశను నాముందు వ్యక్తపరచిరి. అందుకు నేను శస్త్రచికిత్స జేయించకొనే ఆమెకు మీరె నచ్చజెప్పి అంగికరింపజేయమని చెప్పితిని.

ఇంతలో నేను "అంధమూక పాఠశాలలో సంస్కృతాంధ్ర హిందీ భాషాబోధకుడిగా నున్నప్పుడు ఆ ప్రభుత్వోన్నత పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీ సుబ్బుస్వామి (మద్రాసు. తమిళనాడుకు చెందినవారు) గారికి నాయందు జాలికలిగెను. వారికి నాయీ సంగతి వినిపింపగా నతడు ఒక మంచి సలహా నాకివ్వటమే గాకుండ ప్రభుత్వ చట్టాన్ని బాగా పరిశీలించి "నీవు హైదరాబాదు జిల్లా విద్యాశాఖాధికారికి. నా భార్యకు టి.బి. (క్షయ) రోగము సంభవించింది. ఇంత వరకు సంతానము కలుగలేదు. కావున నాకు రెండవ వివాహము జేసికొనుటకనుమతి నొసంగ వల్సిందిగా కోరుతూ ఒక దరఖాస్తు ఇచ్చి మీరు మరో యువతిని పెండ్లాడవచ్చునని దోహదపరచిరి." నేను వారి సూచన మేరకట్లు జేసితిని.

ఇప్పుడు దీనికి కారణమేమనగా ప్రభుత్వోద్యోగిగానున్నవాడు రెండవ పెండ్లి చేసుకొనకూడదని ప్రభుత్వపు నిషేధపు టుత్తర్వు ఉండుటను ఉల్లేఖించి వారట్లు జేయమనిరి. కాని నాకా సమయములో కొద్దిగా వేతనముండుట, ఇంటి (మఠము) నుండి యెలాంటి ఆదాయము లేక పోవుట. ఇది తెల్సినవారు నాకు కన్యనిచ్చుటకు ఎవరు ముందుకు రాలేదు! అప్పటికి నా వయస్సు గూడ 25, 30 సంవత్సరాలు. కాని ఒకటి మాత్రము నేను హైదరాబాదుకు వచ్చినప్పటి నుండి జంటనగరాల లోని వీరశైవులతో గల్సి అప్పుడప్పుడిక్కడ జరిగే శ్రీ బసవ జయంతి ఉత్సవ సందర్భాల్లో ఉపన్యాసములొసగుటవలన మరియు శివానుభవ సమితివారి ఆధ్వర్యమున ప్రతి ఆదివారము సాయంత్రం 6 గం.లకు శివానుభవ గోష్ఠిని నిర్వహించుట వలనను, వీరశైవ సాహిత్య గోష్ఠిలో పాల్గొని, వీరశైవ తరుణులనందరిని కూడగట్టుకొని "వీరశైవ తరుణ సంఘము, మరియు సాహిత్య సాంస్కృతిక సంఘము, ఆంధ్రప్రదేశ్

ఉపాధ్యాయ పండిత పరిషత్తు, ప్రాచ్యకళాశాల విద్యార్థిసంఘములలోను, విరివిగా పాల్గొనుటచేతను, మరియు శ్రీశైలప్రభ, గోలకొండ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ, స్వధర్మ మున్నగు పత్రికలకు వీరశైవ సాహిత్య పరమైన వ్యాసములను ప్రకటించుటచేతను "వీరశైవ తరుణ" గేయ ములను రచించి (ఆంధ్ర, కర్నాటక, సంస్కృత, హింది భాషలలో) గేయసంపుటిని పుస్తక రూపమున వెలువరించుటవలన నా పేరు జంట నగరాల్లోనే గాక ఇంచుమించుగా ఆంధ్ర, తెలంగాణా వీరశైవులందరికి పరిచితుడనై, సన్నిహితుడనైతిని. అంతేగాకుండ ఈ ప్రభావమువలన శ్రీ బందారు తమ్మయ్య, శ్రీ చిదిరెమఠము వీరభద్రశర్మ, డా॥ దివాకర్ల వేంకటావధాని, నిడుదవోలు వేంకటరావు, శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ పాటిబండ మాధవశర్మ, శ్రీ బి. రామరాజు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, శ్రీ పల్లాదుర్గయ్య, శ్రీ పం॥ పెరవలి లింగయ్యశాస్త్రి, శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, శ్రీ దేవులపల్లి రామానుజా రావుగారివంటి ప్రసిద్ధి జెందిన గొప్ప గొప్పవారి పరిచయ భాగ్యము నాకు గల్గియుండెను. త్వరలోనే ఇంత వ్యాపకత్వాన్ని పొందిన నన్ను జూడగానే వీరశైవులందరు ప్రేమతో జూచుచుండిరి. పైగా నా కృషిని, విద్యాయోగ్యతలను గుర్తించిన వారెవరైనను నాకు తమ కన్యనిచ్చు టకు సిద్ధముగా నుండిరి. కాని మొదటి భార్య ఉండగా, రెండవ వివాహనికి జంకుచుండిరి. ఇంతలో ఒక భక్తుడు భద్రప్ప మరియు మహేశ్వరుడు శ్రీ పి. శరణప్పగార్ల ద్వారా దూద్‌బౌలి పంచాక్షరి మఠములో కర్నాటక నుండి ఇక్కడికి వచ్చి నివాసమేర్పరచుకొని యుండి తాను పౌరోహిత్యము జేయుచు, తన కడగొట్టు బిడ్డను నృపతుంగ హైస్కూల్లో కన్నడలో హెచ్.యస్.సి. వరకు చదివించు చున్న శ్రీ సిద్ధలింగస్వామి హైదరాబాదుగారు తన కూతురిని రెండవ సంబంధమునకైనను ఇచ్చుటకు సిద్ధముగా నున్నారని దెల్పినది.

అప్పుడు శ్రీ పి. శరణప్పగారిని వెంబడి చేసికొనివెళ్ళి కన్య తండ్రిగారిని సంబంధిత విషయమై విచారించగా వారంగీకరించిరేగాని, మీ విద్యాయోగ్యతలనుబట్టి మేము మా కన్యనివ్వడానికి సిద్ధముగా నున్నాముగాని, వివాహ సందర్భమున పిల్లపై మీద కనీసము ఒక మూడు తులాల బంగారైనపెట్టి మీరే పెండ్లిజేసుకొనాలి. అని ఆంష (శర్తు) పెట్టెను. కాని అప్పటికి నావద్ద వెండి సామానులు కొన్ని బంగారు కమ్మలు మాత్రమె నా మొదటి భార్యవద్ద ఉండెనే గాని, అవె తేలికగా ఇచ్చేదేనా? నావెంట వచ్చిన మిత్రులు తరువాతదానిని గురించి విచారించుదాము. ఇప్పటికైతే సరెఅని అంగీకరించుమనిరి.

కనుక నేను విధిలేక సరే అని అప్పుడంగీకరిస్తినే తప్ప అది అసలు జరుగుటెట్లు? బంగారము సమస్య ఒకటేగాదు. దానితోబాటు పెండ్లికి సరిపడెటంత సాహిత్య సంగ్రహము, అలంకరణమునకు కావల్సినన్ని వస్త్రములు, పైపెచ్చు ఖర్చులకు (బాజాబజంత్రలకు) డబ్బు కావాలి. ఎవరిస్తారు? బంధువులను సమాధానపరుచుటెట్లు? ఇవన్ని సమస్యలతో సతమతమవుతున్న నాకు తగు సలహాలిచ్చు ఆప్తులొక్కరును లేకుండిరి. ఏమైతేనేమి? నేను బాల్యము నుండి భగవంతుడిని ఒకడినే విశ్వసించినవాడిని. అందుచేత నాతనిపై భారమువేసి నా నిత్యకర్మలను నేను నిర్వర్తించుచుంటిని.

ఒకవైపు ఉస్మానియా యూనివర్సిటీలో తెలుగు బి.ఓ.యల్. పరీక్షకు యత్నించుచు, ఉపాధ్యాయ వృత్తిని నెరవేరుస్తూ, సమాజ కార్యక్రమాల్లో పాల్గొనుచు, జోగిపేట పెద్ద మఠమునకు సంబంధించిన సమస్యలకు తగు సమాధానములన్వేషించుచు, సంపూర్ణ ధైర్యముతో నన్ను ముట్టడించిన విపత్తులను ఎదుర్కొనుచుంటిని.

ఇదే సమయంలో జోగిపేట పెద్ద మఠమును బస్తి తెనుగు వాండ్లు, నాకు గిట్టనివారి ప్రేరణచేత ఇంతవరకు ఆ మఠమును స్థానిక కళాశాల విద్యార్థులకు హాస్టలుగా మారుస్తామని, నేను శ్రీ బసవమాణయ్యగుప్త, శ్రీ జీడిగె శంకరప్ప, శ్రీ అంబిశిగెపేర బసవప్పగార్లు కల్సి తన్మఠమును శిథిలావస్థ నుండి పునరుద్ధరించుటకై ఇల్లిల్లు తిరిగి సంగ్రహించిన సిమెంటు బస్తాలను పదమూడింటిని, శ్రీ బసవమాణయ్యగారికేదో నచ్చజెప్పి, నేను స్థానికముగా లేనిది జూచి ఆ సిమెంటు బస్తాలను తీసికొని మఠమునకు మాత్రము ఏదో ఒకటి రెండింటినుపయోగించి, మిగత వాటిని వారే కాజేసి, అందులో ఒక వ్యాయమశాలను నెలకొల్పి, ఉదయం, సాయంత్రము దేహపరిశ్రమ జేయుచు ప్రొద్దస్తమానము అందులోనె ఉంటూ, రాత్రి గూడ త్రాగుతూ తందానాలాడు ఉండేవారు. ఈ సందర్భములో స్థానిక వీరశైవులేమియు జేయలేకపోయిరి. పైగా వారు మఠములోకి వస్తె చంపుతామని భయపెట్టిరి. అందుచేత ఎట్టి పరిస్థితిలోను వారందులోకి వెళ్ళకుండా ఉండిరి. ఇంతవరకు నేనున్నప్పుడు నా ఆధ్వర్యమున జరుపుకొనుచున్న శ్రీ బసవేశ్వర జయంతి, ఆశ్వీజ మాసంలో ఝండా ఊరేగింపు కార్యక్రమములన్నింటిని (మరో చిన్న మఠము) ఈశ్వరాలయములో జరుపుకొనుచుండిరి. తెనుగువాండ్లకు జడసి సభలు, సమావేశములను గూడ అందులోనె జరుపుకొనుచుండిరి. ఇంతెందుకు పెద్ద మఠమునకు తిలాంజలి వదలి యుండిరి.

ఇక్కడ హైదరాబాదులో నా మిత్రులు కొందరు నాకు సంబంధమును గురించి వివాహ తేదిని నిర్ణయించిరి. ఈ గడ్డు పరిస్థితిలో

నేనేమి చేయున్నది లేక ఈ సందర్భములోనే మిత్రులను పరీక్షించిచూడ
వలెనని నాకు తోచినది, అందుచేత మొదట జోగిపేటకు వెళ్ళి శ్రీ శెట్టి
శివరాప్ప అప్పారావుగారిని గల్సి ఏమండీ: నా మిత్రుడు నాదీనావస్థను
గమనించి ఒక అమ్మాయి సంబంధమును నిశ్చయించినాడు. కనుకమీరు
నాకు సద్యః అప్పుగా కొంత ద్రవ్యమొసగి సహాయము జేయవలెనని
అడగడముతోనే వారు "మీరు ఆ అమ్మాయికి యేదయినా బంగారము
పెడ్తామన్నారా" అని అడిగిరి. అప్పుడునేను దానండి ఒకరెండు, మూడు
తులాలుపెడ్తానని మిత్రుడు వాగ్దానము (మాట్లాడినాడు) చేశారండీని.సరే
నేను మూడు తులాల బంగారు నాకు ఇస్తాను. నీవు దీసికెళ్ళి వివాహ
సందర్భమున కన్యకలంకరింపజేయుము. మరల మీ భార్యగారు ఇష్ట
పడి ఇచ్చినప్పుడు తెచ్చియిమ్మనిరి. సరే అని ఇంతకు ఒక మిత్రుని
సహాయమువలన బంగారం సమస్య ఒకటి పరిష్కరింపబడినది గదా?
అని నాలో కొంత తూరట కలిగినది.

నా రెండవ మిత్రులైన శ్రీ అంబిగె వీరబసవప్ప బట్టల
దుకాణము జోగిపేటగారిని ఆర్థికముగా అప్పుగా కొంత దబ్బు ఇవ్వ
వలసిందిగా కోరగా వారు వెంటనే నీకు వివాహ సందర్భములో బట్టల
వసరమే గదా: కావున నీకాసమయములో ఎన్ని బట్టలు గావలెనో తీసి
కెళ్ళి నీకెప్పుడు వీలైతే అప్పుడుబాకీల్లు ప్రకారము డబ్బుదెచ్చి చెల్లింప
మని చెప్పి లగ్నమునకు అవసరమైన చీరెలు, ధోవతులు మరియు
ఇతర బట్టలను మూటగట్టి ఇచ్చిరి. దీనితో బట్టల విషయమైన చింత
కొంత తగ్గినది.

ఇకపోతే సాహిత్యము విషయమై నా బాల్యమిత్రులైన
శ్రీ పి. నాగప్పంగప్ప వడేలు. బరహన్ దిబ్బగారివద్దకు వెళ్ళి నా

వివాహ సంబంధమై కొంత డబ్బును అప్పుగా ఇచ్చి సహాయపడ వల్సిందిగా అడుగగా వారును "మీకు వివాహమప్పుడు సాహిత్యమవసరమే గదా! దానికి పట్టినంత సాహిత్యము అనగా గోధుమలు, పప్పులు, మిరపపొడి, పసుపు మున్నగువాటిని ఇచ్చెదననిచెప్పిమూటలు గట్టి పంపించిరి. ఈ విధముగా అనుకోకుండా జరిగినదానికి నెనెంతయో సంతసించితిని. ఇది నేనింతవరకు విశ్వసించిన ఆ పరశివానుగ్రహమే నాకిట్లుతోడై సాయమొనర్పజేసినదనక తప్పదు. అందుకే "కక్కు వచ్చినా! కళ్యాణము వచ్చినా ఆగదను"సామెత నాపట్లరుజువైనది. కాని ఆ సమయంలో బియ్యపు బస్తానిప్పిస్తానన్న వ్యక్తి మాత్రము నన్ను వంచించాడు. నగదు డబ్బిస్తేనెగాని బియ్యము బస్తా ఇవ్వనని నిర్మొహమాటముగా చెప్పడముచేత ఆ నెలవేతన మాతనికి పూర్తిగా ఇచ్చివేసి బియ్యము ఒక బస్తాను దీసికొంటిని. ఈ విధముగా నా బాల్య స్నేహితులు ముగ్గురు నాకు సహాయపడినందుకు నెను వారికి నా జీవితాంతము వరకు కృతజ్ఞతలను దెల్పుకుంటూ ఉంటాను. ఎప్పుడు ఏ పరిస్థితిలోను వారిని మరువలేను. తేది 7—5—1961 సం॥ములో రెండవ వివాహము జరిగినది.

ఈ వివాహము జరిగిన మూడు మాసముల కే మా శ్రీమతిగారి కెట్లొ నచ్చజెప్పి బంగారు నాను దీసికెళ్ళి మొదటి మిత్రుడైన శ్రీ శెట్టి శివరావు అడ్వొకేటుగారికిచ్చాను. మరియు రెండవ మిత్రుడైన బట్టల వర్తకుడైన శ్రీ అంబిళిగె వీరబసవప్పగారికి బట్టల డబ్బిచ్చి ఋణము దీర్చుకొన్నాను. ఐతే మూడవ మిత్రుడైన శ్రీ పి. నాగసంగప్పగారిచ్చిన సాహిత్యమునకు మాత్రము డబ్బివ్వలేదు. ఏలన నాతడు భూస్వామి కాబట్టి నేను దీసికోనని తానిచ్చేటప్పుడే స్పష్టముగా చెప్పాడు. అందుకని వారికి డబ్బివ్వలేదు.

హైదరాబాదు మరియు సికింద్రాబాదులో దినదినము నా ఫ్రండి తోపాధ్యాయ వృత్తికి యెలాంటి భంగము వాటిల్లకుండ, దానిని నెర వేర్చుకుంటూ మళ్ళీ వేతనము హెచ్చింపు కొరకు ప్రభుత్వ విద్యాశాఖ ఉన్నతాధికార్లతో పోరాడుతు, సమాజములో పాల్గొంటు, నా కార్యకలా పములను ముమ్మరముగా సాగించుచు, అక్కడ జోగిపేటలోని మా పెద్ద మఠమును, ఒక కంటజూస్తు ఉంటిని. బస్తి తెనుగు వారు దానిని ఆక్రమించుకొనియుండి నేనెప్పుడైన అక్కడికి వెళ్ళితే "నిన్ను చంపుతాము, కొడుతాము, కోనెరులోపడ వేస్తాము, నీవు ఇందులో ఉండగూడదు. ఇది మా మఠము దీనిని మేము మా పెద్దలు కట్టుకున్నామని" సాయంత్రములో త్రాగివచ్చి నన్ను మా శ్రీమతులను నానా బండబూతులు తిడుతుండేవారు. అలా జేస్తేగాని మేము వారికి జడిసి మఠము విడిచి వెళ్ళిపోతామని వారి ఆర్భాటము. ఇంతకు మేమెుక్కరమె వారి భూతులను కిమ్మనకుండ సహించు కుంటు ఉండి, అప్పుడో ఇప్పుడో వెళ్ళి మఠములోని గురుమఠములో ఉంచి తలుపులు వేసుకొని ఉండేవారము.

బయట పడసాలలోసాం॥ 5 నుండి రాత్రి9.30 గం॥ల వరకు బస్తి యువకులు కొందరు దేహపరిశ్రమజేసి వెళ్ళేవారు. వారందరు వెళ్ళిన పిదప మేము బయటకు వచ్చి పడసాలలో కూర్చుండి మాట్లాడడము, వ్రాయడము, చదవడము, పరుండడము చేసేవారము. వీరందరికి బస్తి నాయకుడుగా నున్న చందూరు విఠల్ అనువాడు సాక్షాత్తుగా ఉదయ భానుడో, అథవా బకాసురుడో అన్నట్లుగా ఉండేవాడు. అతనికెందుకో నన్నుచూస్తే గిట్టేది కాదు. ఉరిమి ఉరిమి చూసేవాడు. ఏమైన అంటే పైనబడి కొడ్తామా అన్నట్లు దారులుకాస్తు, సమయము చూస్తు ఉండే వాడు. ఇతనికి మరికొందరు అండదండగా ఉండిరి. అందుచేత నాతడట్లు ఎగిరి పడుతు ఉండేవాడు. ఇతనికిగూడ తాను అడిగినప్పుడు

స్థలమవ్వలేదనే నాపై కోపము. అతడు నాతో ఒకనాడు రాత్రి 9.30 బాగా చిత్తుగా త్రాగివచ్చి "ఏమి నీకు బుద్ధిబలముండవచ్చును. కాని నాకు జనబలముంది, కండబలముందని" పొగరుతో మాట్లాడే వాడు.

వీరి బాధను పడలేక ఒకనాడు పోలీసు స్టేషన్‌కు వెళ్ళి వాడిపై దరఖాస్తివ్వగా పోలీసువారేమి చేయకమిన్నకుండిరి. ఈ సంగతితెల్సు కున్న కొందరు దౌర్జన్యపరులు, స్త్రీలు, పురుషులు సుమారు వంద మంది సాయంత్రం మఠములోకి వచ్చి బయట పడసాలలో గూర్చుంచిన నన్ను చుట్టుముట్టి కూర్చొని తలాఒకటి నానా దుర్భాషలాడిరి. నీవు పోలీసు స్టేషన్‌లో ఇచ్చిన దరఖాస్తును వాపసు దీసుకుంటే మంచిది. లేకపోయిన నీవు ప్రాణాలతో ఇక్కడుండేది కల్ల. అనుచు "నీయమ్మ-అలు, ఉం ఏం చూస్తారు వీడి ముఖముపై ఉమ్మండిరా!" అంటూ నోటి కొచ్చిన రీతిగా వాగుతు ఉండిరి. ఈ సమయములో స్థానిక వీరశైవ సమాజము అధ్యక్షుడైన శ్రీ జామిని మల్లప్ప నాకు ఎడమ ప్రక్కన, శ్రీ నడిగే చన్నబసప్ప కుడి ప్రక్కన కూర్చొని వింటూ నోరుమూసి కొని యుండిరే కాని, పెదిమి విప్పి "వీరినెందుకలా దుర్భాషలాడు తున్నారనే పుద్యానబోలేదు. నేను చెవులుండి లేనట్లుగా, కన్నులుండియు లేనట్లుగా" కిమ్మనకుండ మౌనముతో నుంటిని.

ఆ సమయములో నేనేమైన నోరు విప్పి మాట్లాడినచో వారి దెబ్బలకు గురియగుచుంటిని. "సరే అంతటితో ఊర్కొనక పద ఇప్పుడే పోలీసు స్టేషన్‌కు వెళ్ళి నీవిచ్చిన దరఖాస్తును వాపసు తీసికొని రమ్మని" నావెంట యమభటులవలె ముగ్గురు నల్గురు వాండ్లు లీదర్లు పోలీసు స్టేషన్‌కు వచ్చిరి. అక్కడ నేను యస్.ఐ. గారిని "నేనిచ్చిన ధరఖాస్తిమ్మని" అడగ్గావారు "మీరిచ్చిన దరఖాస్తును తిరిగి ఇవ్వ

మనిరి." నేను చేయునది లేక ఖిన్నమనస్కుడనై అక్కడే ఒక చోట కూర్చొని ఉండగా, అటెగె అదవయ్య మరియు చండూరు విఠల్ ఆ పోలీసుల ముందటే నోటికి వచ్చినట్లుగా మళ్ళీ నానా బండ బూతులు కూసిరి. నేను మాత్రము కిమ్మనకుండ మౌనముతో నుంటిని. ఈ విధముగా నన్ను చాలా వ్యథకు గురిచేయుటవలన నేను పోలీసు స్టేషన్ముందటి వేపచెట్టు క్రిందనున్న అరుగుపైన కూర్చొని నిరాహారదీక్షను బూనితిని. ఇంతలో శ్రీ బసవ మాణయ్యగుప్తగారు దూరము నుండి చూస్తూ రోడ్డుగుండా వెళ్ళిరేగాని, సమీపించి విషయమును తెల్సికొన లేదు. ఎండకాలము వేడి గాడ్పులు వడదెబ్బతో నేను లోలోన బాధ జెందుచుంటిని. ఉదయము 11 గం.లకు కూర్చున్నవాడిని మధ్యాహ్నము 3 గం.లవరకు దాహమేసినను, వడదెబ్బలు సోకినను, భరిస్తు కూర్చుంటిని. కాని ఆనాడు ఉదయము నుండి నేను నీరుగాని, ఆహారముగాని తీసికోనందుకు నాలో నీరసమేర్పడెను. అయినను ఇంతవరకు గ్రామములోవీరశైవులలో ఒక్కరుగాని వచ్చి పలకరించినవారులేరైరి. కాని మోచివారందరు నాపై జాలికలిగి నావద్దకు వచ్చుటకాయత్త పడిరి, నేనుగూడ ప్రాణముపోయిన పిదప సాధించేదేముంది? "బ్రతికియుండిన బడయవచ్చు శుభంబులన్" అను సామెత మేరకు బ్రతికియుండి సాధించవలెనని ధైర్యమును దెచ్చుకొని అటనుండి లేచి మఠమునకు వచ్చి మా తమ్ముడైన చి॥ వీరంతయ్యను కోపగించి "నీకు గూడ నేను చావవలెనని ఉంది గదా!" ఇప్పటికైనా శ్రీ శెట్టి శివరావుకు ఈ సంగతి చెప్పిరమ్మని చెప్పి పంపి, నేను ఒకరిద్దరి స్నేహితుల బలవంతము వలన నిమ్మరసము ఒక గ్లాసు తీసుకుంటిని.

సాయంత్రము 6 గం.లకు ఆనాడు వీరశైవ సమాజము పక్షమున మా మఠములో సమావేశము జరుపుటకు తెనుగవాండ్లను జడిసి

స్థానిక ఈశ్వరాలయములో సమావేశము జరుపుటకు ప్రధానకార్యకర్తలు నిర్ణయించిరి. శ్రీ శెట్టి శివరావుగారు పెద్ద మఠములో నేయున్న నా వద్దకు వచ్చి మీరు మాయింటికి వచ్చి శివపూజ జేసికొవాలి. ఈ రాత్రికి జరిగే స్థానిక వీరశైవ సమాజములో చర్చించి తెనుగువారిపై తగినచర్యను గైకొంటామని హామీఇచ్చి, వారు బలవంతముగా తమ గృహమునకు దోక్కొపోయి నాకు స్నానము జేయించి. శివపూజ కాయత్త పరచిరి. లింగార్చన అయిన పిదప కొద్దిగా ప్రసాదమును దీసికొనుమని ఆగ్రహము చేసిరి, అందుకు నేను "మీ తీర్మానమేమిటో ఈ విషయమై ఏమి చర్య గైకొందురో. అది నిర్ణయించిన తదుపరి నేను తప్పకుండ ప్రసాదాన్ని స్వీకరిస్తానని" చెప్పినను వారు వినిపించు కొనకుండ బలవంతపెట్టిరి. కాని ఒక దినము తీక్షణమైన ఎండ వేడిమి వలన నా నోరెండుకపోయి నాలుక పిడుచగట్టి ప్రాణము సొడసొడరు బోవుచుండ, ఒకటి రెండుబుక్కలు తినడమే అతికష్టముగా దోచినది. ఎంత మాత్రము తినుట కిష్టముగాలేదు. ఆరోజు రాత్రి వారనుకున్నట్లుగా 7. గం. కు స్థానిక ఈశ్వరాలయములో వీరశైవులందరు సమావేశమైరి. ఈ సమయములో తెనుగు వారు నిన్నేవిధముగా పీడించిరో చెప్పుమని నన్ను ప్రశ్నించిరి. నాకు జరిగిన పరాభవాన్నంతటిని పూసగ్రుచ్చి నట్లు నేను చెప్పనదేగాకుండ. వారు నన్ను దుర్భాషలాడుచున్న సమయలో నా ఇరుప్రక్కల కూర్చొని సంపూర్ణముగా దిలకించిన వీరశైవ సమాజము అధ్యక్షులు, కార్యదర్శులు గూడ సభకు దెలియ పరచిరి. మరల నాచేత నాపై తెనుగువారు జరిపిన దౌర్జన్యపు వివరాలను

ఒక దరఖాస్తులో వ్రాసిఇస్తే దానితోపాటు మా సమాజము వారుగూడ ఒక దరుఖాస్తును వ్రాసి పోలీసులకు ఇస్తామని వ్రాయించిరి. మరునాడు మధ్యాహ్నము నా వద్దకు కొందరు వచ్చి పోలీసు స్టేషన్‌కు వెళ్దామని చెప్పి తోడ్కొనిపోయిరి. కాని పోలీసు స్టేషన్‌కు వెళ్ళినా కొద్ది ఒకరిద్దిరు జారుకొనిరి. అందును అప్పటి ప్రధాన కార్యదర్శి పోలీసు స్టేషన్‌కు రాకుండా తప్పించుకపోయాడు. పోతే ఒకరిద్దరు మాత్రమే నా వెంట నుండిరి. ఏమైకానిండు నా పరంగా, వ్యక్తిగతంగా ఒకటి మరియు వీరశైవ సమాజము పక్షమున ఒకవినతిపత్రములను సమర్పించితిమి. కాని దానిపైన స్థానిక పోలీసు వారు గూడ ఆదౌర్జన్యపరులకు జడిసి కాబోలు ఎలాంటి చర్యను దీసికొనలేదు. మఠములో లైటు మీటార్‌ను గూడ "ముదిరాజ సంఘము కార్యదర్శి పేరిట బెట్టించి యుండిరి. కాని లైటు బిల్లు కొన్ని సం॥ములవరకు చెల్లింప నందులకు కొన్ని బకాయి బిల్లులు అట్లై బడియుండెను. విద్యుచ్ఛక్తిని సరఫరాజేసే (బిల్లు కలెక్టర్) వారివద్దకు నేను వెళ్ళి ఆ బకాయబడియున్న డబ్బును నేను గట్టాను. మఠంలో బెట్టిన మీటరు నా పేరగాని, లేదా మఠము పేరగాని, రిజిష్టర్‌లో అమలు జేయవల్సిందిగా, అడుగగా, వారు దానికి "నీ బకాయ డబ్బును పూర్తిగా చెల్లించినచో నీకులైటు సప్లై జేస్తామే గాని, నీపేరగాని మఠముపేర గాని, మార్చుటకు వీలులేదని" ఖచ్చితముగాచెప్పిరి. స్థానిక వీరశైవ సమాజము వారుగూడ "ముదిరాజ వారికి ఈ మఠముకు ఏలాంటి సంబంధము లేదు. అది వీరశైవులకు సంబంధించిన మఠము కనుక ముదిరాజ సంఘము కార్యదర్శి "జంగిలి నర్సిములు" పేరును రద్దు జేయవల్సిందిగా, ఒక దరుఖాస్తు ఇచ్చినను ఫలితము లేక పోయినది.

# In the High Court of Judicature: Andhra Pradesh at Hyderabad

Friday, the ninth day of September. On thousand nin3 hundred and eighty three.

PRESENT :

The Honourable Mr. Justice. Reghuvir CIVIL REVISION PETITION No 1908 of 1980 (Petition under Section 115 C P.C. to revise the order in I A. 409/1976 in O S. No. 22 of 1976 on the file of the court of the subordinate Judge, Medak, at Sangareddy dt. 26-7-1978).

**Between:**

The State of Andhra Pradesh

represented by commissioner of Endowment Petitioner (Respondent)

and

Rachaveera devera Respondent (fetitioner).

FOR THE PETITIONER : The Govt. pleader for Finance and planning

FOR THE RESFONDENT : not appearing in person or by advocate

The court made the following :

1/kr

**Order :**

**In the order undr revision the lower refused to condone the delay of 40 days u/s. 5 of the Limitation Act. I see no reason to interfere with the order under revision. The CRP fails and it is accordingly dismissed. No costs.**

**Sd/T.A.N. Murthy**
**16/9.**
**Asst. Registrar**

**Supdt. of 6. D.**
**(True copy)**

ఒకప్పుడు స్థానిక వీరశైవ సమాజము వారు నాతో విరోధించినప్పుడు. వారు రేయింబవళ్ళు, తెల్లవారులు లైటుబెట్టి గాల్చినను, నేను హైదరాబాదులో నున్నప్పటికిని "ఇది నీ మఠము కనుక నీవే కరెంటు బిల్లును చెల్లించాల్సిందిగా" అప్పటి అధ్యక్షుడు మడువతి వీరభద్రయ్య, కార్యదర్శి అంబిశిగే ఈశ్వరప్ప నాచేత రెండు, మూడు సం॥ల బిల్లునకు రెండు వందల రూ॥లు గూడ వసూలు జేసి తీసుకున్నారు. ఇంకనుకొన్ని లైటు రసీదులు వారి వద్దనే ఉండినవి. మఠమునకు డబ్బుఖర్చు జేసే సమస్యవచ్చినప్పుడు మాత్రము "నీది మఠము నీవు ఖర్చుబెట్టాల్సింది"గా "వీరశైవ సమాజము వారైతేనేమి" ముదిరాజ సంఘము వారైతేనేమి, చెప్పుతూ ఉంటారు. మిగతా వాటి విషయములో మఠము మాది, మీరు మమ్మల్ని విచారించనిదేపని జేయగూడదని వాదిస్తూ ఉంటారు, ఈ విధమైన దౌర్జన్యమునకు పాల్పడుతూ ఉండేవారు.

నేను మా గ్రామము (జన్మభూమి) జోగిపేటలోని రెండు మూడు చీలికలుగా నేర్పడిన వారిని ఐక్యపరచాలనే ఉత్కంఠేచ్ఛతో నేను మా కళాశాల నుండి వేసవి సెలవుల్లో జోగిపేటకు వచ్చినప్పుడల్లా రేయిం బవళ్ళు ఆలోచిస్తూ ఉండెవాడిని. భక్తుల ఐక్యత కొరకు నానావిధము లుగా ప్రయత్నించెవాడిని.

ఈ గ్రామములో చీలికలు కేవలము ఒకే కులమునకు జెందిన స్త్రీపురుషుల అక్రమ సంబంధమువలన యెర్పడిన ఒకరిద్దరి వ్యక్తుల దుష్టచర్యలవల్ల ఈ విధముగా ఉన్న ముప్పది భక్తులిండ్లలో మూడు పార్టీలు యేర్పడడము విన్న వారికి, చూచెవారికి అసహ్యమును గల్గించు చుండెను. వారివారిండ్లలో నేశుభాశుభ కార్యములు జరిగినను ఒకరి కొకరు పలుకరించెవారుగాదు. ఒకరింటికి మరొకరు వెళ్ళకుండిరి. కాని నా బాల్యములో మాత్రము భక్తులిండ్లలోనే శుభాశుభ కార్యములు జరిగి నను పెద్ద మఠమును గౌరవించి మమ్మాహ్వానించనిదే ఏ పనిని జరుపు కునె అందుకు సాహసించకుండిరి. కాని నేను కాలేజికి వెళ్ళివచ్చె సరికి. వాండ్లలో మూడు చీలికలేర్పడినది జూచి చాల బాధ జెందితిని.

సెలవుల్లో నేను మా గ్రామమునకు దిరిగిరావడముతో మా యాజ్ఞను కాదనకుండ అనుసరించె మఠపతి సిద్ధరామయ్యగారితో చెప్పి ఫలానా తేదిన, ఫలానా సమయంలో (రాత్రి 9 గం.కు) స్థానిక పెద్ద మఠములో వీరశైవుల సమావేశమని మఠాధిపతిగారి యాదేశముమేరకు జరుగుతుంది. కనుక రావల్సిందిగా ఆ మఠపతి అయ్యగారు ప్రతి ఇల్లు దిరిగి చెప్పడముతో ఆ రాత్రి భోజనానంతరము 9.30 పఱ 10. గం.ల వరకు భక్తులందరు నాకంటె వయసులో పెద్దవారైనను, నేను

పిలిచినంత మాత్రాముననే మతమునకు చేత కంచిళ్ళు (లాంతరు) బుచ్చు కొనివచ్చి నా పాదములకు నమస్కరించి కూర్చునేవారు. వారిలో ప్రముఖులు శ్రీ జామిని బొంతప్ప, శ్రీ నెలిగె రామప్ప, శ్రీ అంబిళిగె గౌరప్ప, కజ్జపు వీరన్న, అడాల శంకరప్ప, శ్రీ గాంట్ల సిద్ధిరామప్ప, శ్రీ కాసాల వీరప్ప, శ్రీ బొగుడమీది వీరప్ప, శ్రీ సడిగె పెద్దఆగప్ప, శ్రీ శెట్టి నీలకంఠరావు, శ్రీ తడుగూరి వీరప్ప, మడుపతి మల్లయ్య, మడుపతి సిద్రామప్ప, శ్రీ సుబుగంటి వీరణ్ణ మొదలగువారు విచ్చేయు చుండిరి. నేను వయస్సులో అతిచిన్నవాడినైనప్పటికి పెద్ద మతము గౌరవాన్ని పురస్కరించుకొని నా అధ్యక్షతలోనే ఈ సభ జరుగు చుండెను.

అందులో (భక్తులలో) ఒకరైన శ్రీ అంబిళిగె గౌరప్పగారు నన్నుద్దేశించి "స్వాములవారు మమ్మల్ని ఇక్కడికి పిలిపించిన కారణ మును తెల్పవలెను." అని ప్రశ్నించగా నేను వారందరిని సంబోధించి "మన గ్రామంలో భక్తులిండ్లున్న" ముప్పది. అందులోను మూడు చీలికలుగా నేర్పడుట నాకు నచ్చుటము లేదు. అందరు కల్సిమెల్సి ఐక్యతోనుండి యెవరింటిలోనే శుభాశుభ కార్యము జరిగినను, అంద రక్కడికి వెళ్ళాలి. అది ఆ యింటివారికి సంతోషమును గల్గిస్తుంది. ఇతరులకు గూడ (మనందరికి) సంతోషదాయకమే అగుచున్నది: కావున మీరందరు మీమీ భేదములను పరస్పర వైషమ్యాలకు స్వస్తి జెప్పి నేటినుండి అందరము కల్సి ఐక్యతతో నుండాలని నా కోరికను వెలిబుచ్చితిని.

అందుకు వారిలో కొందరు (ఒకరిద్దరు) మనలోని ఒక వ్యక్తిని వేరే ఉంచినట్లైతె మనమందరము కల్సియుండుట కేలాంటి

పర్యంతరముండదనెను అప్పుడు నేను మీరొక వ్యక్తిని పూరముంచు మనినచో, ఆ పక్షమువారు గూడ మరొక వ్యక్తిని పూరముంచాలనే ప్రశ్న వస్తుంది. అప్పుడొకరొక్కరిని పూరముంచిన మనలో ఐక్యత ఎట్లేర్పడుతుంది? మళ్ళీ యథారీతి వాదోపవాదములకు, ఘర్షణలకు మనమే అవకాశమిచ్చినవారమౌతామని చెప్పగా వారు. మరో సమావేశమువరకు మేమాలోచించి చెబుతాము. ఇప్పుడు రాత్రి చాలా అయిందని మళ్ళీ నమస్కరించి భక్తులు తమతమ ఇండ్లకు వెళ్ళిపోయెడివారు. వారందరట్లు వెళ్ళిపోయాక "వీరందరేవిధంగా కల్సి ఉంటారు? దీనికెలాగైతే పరిష్కారము జరుగుతుందని" రాత్రి నాకు నిద్రవచ్చే పర్యంతము నాలోనేను ఆలోచించేవాడిని. ఇదేమాదిరి ఎన్నిమాటలు భక్తులను మఠానికి రప్పించి నచ్చజెప్పినను వినలేకపోయిరి.

ఒక దినము వీరిలో ఐక్యతను నెలకొల్పుటకై నిరాహారదీక్షను బూని శ్రీ జోగినాథస్వామివారి మందిరమువద్ద ఒకగదిలో గూర్చుంటిని, ఈ సంగతిని పసిగట్టి గ్రామప్రముఖులు భక్తులలో కొందరు శ్రీ జామిని బొంతప్ప, శ్రీ నెలిగె రామప్ప, శ్రీ నడిగె ఆగప్పగార్లు నావద్దకు వచ్చి మేమందరము ఐక్యతతో ఉంటాము, మీరు మా శ్రేయస్సుకొరకు పాటుబడుచున్నారు. కనుక దయజేసి మా ప్రార్థనను మన్నించి మీరు ఈ నిరాహారదీక్షను విరమించాల్సిందిగా మనవి జేసికొనిరి.

అందుకు నేను సరేయని వారి ప్రార్థనను గౌరవించి నా నిరాహార వ్రతము నుండి విరమించుకొంటిని. ఇట్లు కొన్ని మాసములు గడచినవి.

గ్రామ పరిస్థితి గమనించి పరిశీలించగా భక్తుల మనుగడ "కుక్కతోక వంకర" అన్న సామెత సార్థకముగా గోచరించినది.

మరల సమావేశపరచగా అదే మొండివాదము, మొండి వైఖరే వారిలో గోచరించెను. మరోసారి సమావేశపరచి వారికి గట్టిగా నచ్చజెప్పితిని. అందుకు మీరు వినని పక్షమున నేను మరల నిరహారదీక్షకు బూనుకుంటానని హెచ్చరించితిని. ఐనను వారు లక్ష్యించుకునే స్థితిలో లేకుండిరి. అప్పుడు నా మదిలో పట్టరాని యావేశమువచ్చి వీరవైరాగ్యముతో మఠమును గూడ వదలిపెట్టి మా తల్లిదండ్రులు గూడ వలదని వారించినను వినకుండ వెళ్ళి జోగిపేటకు రెండుమైళ్ళ దూరముననున్న "అన్నా సగరము" పల్లెకు అరమైలున ఉన్న మా క్షేత్రములో అప్పుడు తెల్లజొన్నవిత్తియుండిరి. దానికి చేరువలో అన్నసగరము చెరువు మత్తడిచుట్టూ పచ్చగా పండిన వరిపొలాలు, జొన్న చేలున్నవి. అక్కడ మా క్షేత్రములోనె మా కౌలుదారు చెనుకాపలాకొరకు వేసుకున్న ఓ చిన్న గుడిసెలో కొన్ని రోజులు నివాసమేర్పరచుకొంటిని, భక్తులపై నాకు చాలా విరక్తి గలిగినది.

ఆ నిర్జన క్షేత్రముల మధ్యన సస్యశ్యామలముగా, నున్నతముగా బెరగి చల్లనైన పిల్లగాడ్పులకు తలలూపుచున్న పంట పెరుగులతోను వరిపొలాలకు జలజల పారుచున్న నీటి కాలువలు యా క్షేత్రములలో క్రిమికీటకములకై మత్స్యములకై వేటాడుచున్న తెల్లని బక పక్షులు మా క్షేత్రమునకు కొద్ది దూరములో ప్రవహిస్తున్న సజీవ మంజీరా నది. దానికిరువైపుల నున్నతముగా బెరగిన లేతబచ్చిక. అటనట వేప తుమ్మ మరియు నితర వృక్షములతో కళకళలాడె ప్రకృతి సౌందర్యం నన్ను కొంతవరకు ముగ్ధుని గావించి తపించిన హృదయమునకు ఊరట గలిగించినది.

ఐతె ఇక్కడ మా చెనులో నున్నప్పుడొక విచిత్ర సంఘటన జరిగినది. అదేమనగా నాకు అనుభవము లేనికతమున మా చేని

ప్రక్కనున్న ఒడ్డున చేను కావలాకొరకు ఒక చిన్న గుడిసెను మా ఆసామివేసి దానిపై వరి గప్పియుండెను. నేను పగలంతయు అందులోనె ఉండి, రాత్రి నేను ప్రేమతో అధిక వెలను వెచ్చించి తెల్ల కంబళము (గొంగడి)ను కప్పుకొనుటకై దెచ్చుకొనియుంటిని. అప్పుడు వేసవి కాలము కనుక దాన్ని నెలపై బరచుకొని పరుండియుండ, తెల్ల వారు నిద్రలేచి చూచేసరికి చిరిగి ముక్కలు ముక్కలైంది. అది జూచి నేను దిగాలు పడితిని. విలువైన కంబలమిట్లు పాడైనదని చింతించి తిని. దీనిని చెదలు దినేసినది. ఈ సంగతిని మా ఆసామి నర్సయ్యతో చెప్పగా నతడు నవ్వి, గొంగడి చెదలకు ఆహారము. కిందవట్టిగొంగడి వేయక దాని క్రింద వరిగడ్డి వెయాలని చెప్పెను.

అక్కడే నిరంతరము ప్రవహించె మత్తడి నిర్మల జాలతో స్నానమాడి మడిగుడ్డలను ధరించి ప్రశాంతమైన మనస్సుతో ఇష్టలింగ పూజను గావించుకొని, మా చిన్నసోదరుడుగాని, అథవా మా మాతుశ్రీ గారు గాని, మా గ్రామము నుండి ప్రతినిత్యము దెచ్చిఇచ్చేదు ప్రసాదము నారగిస్తు, స్వాధ్యాయమును సాగిస్తు మధ్యమధ్యన నావద్దకు వచ్చె మాచేను కౌలుదారు (బటాయిగా వ్యవసాయము జేయునాసామి) శ్రీ సింగారు నర్సయ్య (గొల్లవాడు) నాయందలి భక్తిచేత వచ్చి నన్ను బలకరించి కొద్దిసేపు విశ్రాంతిగా గూర్చుండి నేనొకప్పుడు సంగ్రహించి వ్రాసికొన్న సంస్కృత సూక్తి సుధానోటుబుక్కు (పుస్తకము) నుండి కొన్ని నీతిబోధకము, హాస్యము, దేవతాస్తోత్రములను జదివి వాటి తాత్పర్యములను వినిపింపగా విని యాతడు బహుగా సంతసించేటి వాడు.

ఇట్లుండగా ఒకనాడు మా చేను ప్రక్కనె ఆనుకొని ఉన్న చేను యజమాని శ్రీ మదిరే నారాయణగుప్తగారు జోగిపేటలో మా

మఠమునకు చెరువలోనే వారి ఇల్లు ఉండుటే గాకుండ, మా నాన్న గారిపై వారికి మిగుల ప్రేమ ఉండేది. వారు నేనున్నచోటునకు వచ్చి నన్నాప్యాయతతో "ఏమయ్యాగారు మీరిక్కడున్నారని" విచారించగా, నేను నా మనసులోని విచారములను వారికి వినిపింపగా వారు "ఈ నిర్జన ప్రదేశములో మీరొక్కరే రేయింబవళ్ళిక్కడుంట మంచిది గాదు. పోగా గ్రామమునకు దూరము, పైగా పురుగుబుసి, ఉంటవి గనుక మీరు ఈ అన్నసాగరము అవతలి భాగములో మా మామిడి తోటలో ఒక ఇల్లుంది. అక్కడ రేయింబవళ్ళు మా మనుషులుంటారు. మేము ప్రతినిత్యము ఉదయమో, సాయంత్రమో అక్కడికి వచ్చి మా వ్యవసాయమును గురించి, మా సేవకులను విచారిస్తు, పశువుల బాగోగులను పరామర్శిస్తు ఉంటాము. మీకు అక్కడ ఉండుటకు ఒక గది ఇచ్చెదము. అక్కడ మీ స్నానమునకు మోటబావి ఉంది. తోటలో మీకు ప్రతినిత్యము పూజకు కావల్సిన బిల్వపత్రి పుష్పములు పుష్కలముగా లభించును. కావున దయచేసి మీరక్కడుండుట నాకెంతో ఆనందదాయకమని చెప్పెను. అందుకు నేను సంతోషముతో నంగీకరించి, నాటినుండి నా నివాసమును శ్రీ నారాయణగుప్తగారి తోటకు మార్చుకుంటిని. మా గ్రామములో శైవకోమట్లలో వీరొకరు అందుకే వీరికి మాపై యెనలేని అభిమానముండేది. అంతేగాక మెదక్ జిల్లాలో సిద్దిపేట, సదాశివపేట, జోగిపేట, సంగారెడ్డి, నారాయణఖేడు మున్నగు నగరములలోని వైశ్యులు, రెడ్లు, ముదిరాజు వారందరు చాలా మట్టుకు శైవసాంప్రదాయము వారైయుండి. వీరు తమ శుభకార్యమునకు మొదలు వీరణ్ణప్రస్తాయము జరుపుకొనెడివారు. అధికముగాశివారాధకులే. వీరిపై వీరశైవుల ప్రభావమధికంగా ఉండేవి.

# కళల పరిచయము

చిత్రములనుగీసే కళలోను, మట్టితో బొమ్మలుజేయు కళలోను, సంగీతములోను, డ్రామాలోను, నటుడుగా నటించడములోను, కొంత వరకు నాకు సహజముగానే ఈ కళలయందు ప్రవేశముంటినది. సాహిత్య రచనలలో నాటికలు, నాటకములు, కథలు, చరిత్రలను, గేయరచనలు, పద్యరచనలలో కొంత ప్రవేశముండబట్టి ఈ వరకు కొన్ని సొంత రచనలు మరికొన్ని కన్నడము నుండి తెలుగులోకి అనువదించి పది పుస్తకములను ముద్రింపజేసి ప్రకటించియున్నాను. ఇంకను నా రచనలను సాగిస్తూనే ఉన్నాను. సంస్కృతము, కన్నడాంధ్రా, హిందీ భాషలలో చక్కగా ప్రవేశముండుటచేత కొన్ని ధార్మిక గేయములను రచించి ప్రకటించియున్నాను.

మా తండ్రిగారైన వీరయ్యగారు అన్ని కళలలోను, అన్ని పనులు జేయుటలోను "ఆల్‌రౌండ్ ఛాంపియన్" అన్నట్లు అన్ని రంగాల్లోను ఆరితేరినవారై యుండిరి.

డ్రాయింగు గీసిన బొమ్మలను కొన్నింటిని ఈ జీవిత చరిత్రలో ముద్రించనైనది. డ్రాయింగ్‌లో ఔట్‌లైన్ (స్కేలు) వేసి తీయడము, ప్రకృతికి సంబంధించిన చెట్లు, పువ్వులు, ఆకులు, పశువులు, పక్షులను గీయడము, వాటికి దగిన రంగులు వేయడము, చూచినవాటిని అట్లే దించడము కొంతవరకు సాధించియున్నాను.

మరికొన్ని వ్యాసములను, ధార్మిక-సామాజికము, వైజ్ఞానికము, సాహిత్యములకు సంబంధించిన వాటిని కొన్ని తెలుగు, కన్నడ, సంస్కృత పత్రికలలోను గోల్కొండ, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, ఈనాడు, ఆంధ్రభూమి మున్నగు వాటిలో విపులముగా వ్రాసి ప్రకటించి యున్నాను. మచ్చునకు కొన్ని వ్యాసములను ఇందు ప్రకటించాను. ఇకపోతే ఆకాశవాణి, అమరవాణి, కార్యక్రమ ప్రసంగాల్లోను పాల్గొని యున్నాను. మరియు దూరదర్శన్‌లోను పాల్గొన్నాను.

మరియు "వీరశైవసమాజము," "ఉపాధ్యాయ పండితపరిషత్తు", "ఆంధ్రప్రదేశ్ వీరమాహేశ్వర (జంగమ) మహాసభల్లోను" వారివారి ఆహ్వానాలపై వెళ్ళి సభల్లో ధార్మిక ఉపన్యాసములొసగియున్నాను. ఆంధ్రప్రభుత్వము నుండి మరియు కొన్ని సమాజముల నుండి అవార్డులను బడసితిని.

## బాల్యానుబంధము 2వ భాగము

మా పితృవ్యజ్యేష్ఠులైన శ్రీ గొల్లాళప్ప (షడక్షర) స్వాములవారు సదాశివపేట పెద్ద మఠములో నున్నప్పుడు వారివెంట మా తీర్థరూపులైన శ్రీ మూలమఠము వీరయ్యగారు మా మాతుశ్రీ నాగమాంబగారు శ్రీవారివెంటనే ఉండి సదాశివపేట నగరములో శివభక్తులిండ్లలో జరుగుచుండెడు భక్తుల నిమంత్రణముపై వారి గృహములకు వెళ్ళి శుభాశుభ కార్యక్రమములను మా నాన్నగారె నిర్వహించుచుండిరి, మరియు మఠము యొక్క వ్యవహారములన్నింటిని సరిజూచుకొనుచుండిరి.

మా నాన్న, పెద్దనాన్న శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారు మొదలామఠము పెంకుటిల్లుగా ఉండినదాన్ని నగరములోని సుప్రసిద్ధులు మరియు పెద్దనాన్నగారికి సన్నిహిత మిత్రులు మరియు భక్తి ప్రపత్తులతో నిండియున్న శ్రీ మనసాని మాణిక్యముగుప్తగారి వద్ద కొంత ఋణము (అప్పు)గా డబ్బునుదెచ్చి మఠమును గచ్చు సిలలతో దృఢమునా గట్టించిరి. అంతెగాదు తమ అధికారమునకు దగిన రీతగా ఒక పెద్ద అశ్వరాజమును, రంగురంగుల అద్దాల బండిని, వింజామరములను,వెండి బత్తశికలను ఒక రుద్రాక్షకిరీటమును, మఠము హోదాకుదగ్గట్టుగా సమస్త హంగులను సమకూర్చిరి, దీని ప్రభావము వలన నగరవాసుల యొక్క భక్తి ప్రపత్తులు శ్రీవారిపట్ల పెచ్చు పెరిగినవి. అంతె గాకుండ శ్రావణములో పురాణ ప్రవచనము నిర్వహించుట. ఏరువాక పర్వదినమున అద్దాల బండిలో అథవా గొప్ప అశ్వరాజముపై ఊరేగుచుండిరి. పౌరులందరు వీరపట్ల భక్తివిశ్వాసములు పెంపొందిన కారణమున 1333 ఫసిలల్‌లో 169. మంది భక్తులు తమ సంతకాలను సంగ్రహించుకొని పెద్ద మఠమునకు సంబంధించిన పట్టా భూములు మరియు ఇనాము భూములన్ని శ్రీ గొల్లాళప్ప మహాస్వాముల పేరిటపట్టా అమలు జేయాలి. అని జిల్లాకలెక్టరు కార్యాలయాధిగారికి ఒక వినతి పత్రమును సమర్పించుకున్నారు. దాని ప్రతినేటికి మా వద్ద నున్నది. నగర పురప్రముఖులందరు శ్రీవారాదేశించిన మేరకు కిమ్మనకుండ నడచుకొనుచుండిరి.

సరిగ్గా ఇదే సమయంలో కోడంగల్లు సంస్థానము నిరంజన పెద్ద మఠమునుండి శ్రీ విరూపాక్షనందస్వామి అనువారు సదాశివపేట పెద్ద మఠమునకు వచ్చి యుండిరి. వీరు కాశిలో తర్క వేదాంత సాంఖ్య

మీమాంసాదిశాస్త్రములు పఠించియున్నవారైయుండిరి. కోడగల్లు నిరంజన పెద్ద మఠమునకు అధికారియైన శ్రీ గురు బసవలింగ మహాస్వాముల వారికి శ్రీ శంకరయ్య మరియు శ్రీ విరూపాక్షస్వామి ఇద్దరు శిష్యులై యుండగా, శ్రీ గురు బసవలింగస్వామి అంత్య సమయంలో శ్రీ శంకరయ్య గారు స్వాముల వారి సేవలో యుండిరి. కనుక శ్రీవారు అతని పేరమీతవల్లిగా తాము బ్రతికియున్నప్పుడే అమలు జేయించారు. శ్రీ విరూపాక్షస్వామి తమ గురువులవారి యాజ్ఞనుల్లంఘించి కాశికి వెళ్ళిడంచేత వీరిని దూరగించిరి. శ్రీవారు లింగైక్యమైన పిదప నామఠములోనెవరును లేనికారణమున, తాలూకా కచేరి అధికారికి వీరు వినతి పత్రము నిచ్చుకొనగా, వారు వీరిని మునద్దిగిరిగా (గుమాస్తగా-నిరీక్షకులుగా) ప్రభుత్వము నియోగించిరి. కాని మఠాధిపత్యము వీరికి సంక్రమించలేదు.

ఇట్టి శ్రీవారు సదాశివపేట మా పెద్దనాన్న శ్రీ గొల్లాళప్ప గారి వద్దకు వచ్చియుండిరి. మా పెద్దనాన్నగారి ప్రభావము సదాశివపేట నగరవాసులపై యధికముగా ప్రేమనుండుటచేత ఒక గొప్ప విద్యావంతుడు వచ్చారని వారికాశ్రయమిచ్చిరి. అంతేగాదు వారి విద్వత్తునకుసంతసించి శ్రీ గొల్లాళప్పగారు గ్రామమువారందరిని మఠమునకు రప్పించి శ్రీ విరూపాక్షస్వామివారి పరిచయము గావించిరి. శ్రీ విరూపాక్ష స్వామిగారు ప్రకాండ పండితులై నప్పటికిని "శ్రీ గొల్లాళప్పమహాస్వాముల వారినిజూస్తె నాకు చాలభయమేస్తుందేదని" శ్రీ విరూపాక్షస్వాములవారే నాతో ననేకమారులు చెప్పియుండిరి. మా పెద్దనాన్నగారు మఠములో వీరిచేతనొక సంస్కృత పాఠశాలను స్థాపించి నిర్వహింప జేయవలయు ననే కోరిక వారిలో మెండుగా నుంటవలన అందుకు దగిన ఫర్నీచరు, బెంచీలు, టేబులు కుర్చీలు, మెజాబల్లలు, నల్లబల్లలు దెప్పించిరి.

ఇంతలో దుర్దైవవశాత్తు ప్లేగు బీమారి రావడముచేత సదాశివ పేట నగరవాసులందరు ఊరువిడిచి, నగరము వెలుపల ఎవరి అనుకూలముతీరు వారు గుడిసెలు వేసుకొనియుండిరి. నగరము వెలుపలకో పూరుగవని (కమాను) అనుకొనియున్న చౌకిమఠములో నుండిన శ్రీ చెన్నమల్లప్పస్వామి, శ్రీ రాచోటిస్వాములు ప్లేగు బీమారి సోకి నాలుగైదురోజుల్లోనే పరమపదించిరి. ఈ మఠాధిపతులు తమ జీవిత కాలములో స్థానిక సుప్రసిద్ధ ధనికులైన దేశెట్టి, షడక్షరి కుటుంబము వారికి ఇంటి గురువులైయుంటవలన ప్రతిదినము వీరిని తమ గృహమునకు రప్పించుకొని వీరిపాదపూజ గావించి తత్తీర్థ ప్రసాదములను సేవించనిదే వారెవ్వరును భుజించకుండిరి. వీరి ఆశ్రయమువలన ఈ స్వాములు. రాజటీవితో కాలమును వెలిబుచ్చి, చాలా పేరు ప్రఖ్యాతులను బడసి. భూములను బంగారు, వెండి ఆభరణములను (ఉంగరములు, బటువులు) రుద్రాక్ష కిరీటాలు, వెండి బత్తిశిలను, పాత్రలను, మేన, అడ్డపల్లకి, రంగురంగుల బండ్లను, పెద్ద అశ్వరాజములను ఆర్జించిరి. వెంటఏబది మంది సేవకజనపరివారముతో సంచారము జేసి గ్రామాల్లో. శ్రావణమాసములందు శ్రీ ఎబ్బనూరు చంద్రయ్యగారు సంస్కృతాంధ్రములలో నుద్దండ పండితునకాశ్రయమొసగి వారిచేత పురాణ ప్రవచనములను జెప్పించి వీరశైవ ధర్మప్రచారమును గావించిరి. వీరుభయస్వాములు దినాలు నగార శంఖనాద పూజజేయుచుండిరి. అట్టి మహాస్వాములు ఒకరి తరువాత నొకరు త్వరగా కైలాసవాసులైనందుకు మొట్టమొదలు జోగిపేట నుండి భక్తులపోరును భరించలేక మా పెద్దనాన్న శ్రీ గొల్లాళప్పగారు సదాశివపేటకు వెళ్ళినప్పుడు కొన్నాళ్ళు శ్రీ చెన్నమల్లప్పగారి సహవాసములో చౌకి మఠములోనే ఉండిన అభిమానముచేత శ్రీవారి నాదపూజనాపగూడదని దలంచి చౌకిమఠమునకు వెళ్ళి వారినాదపూజనారంభించిరి.

సరె అక్కడె వారి వీపుపైన యేదోదెబ్బగొట్టినట్లైనది, అందుకు జడిసిరి. పైయంతట ముచ్చెమటలు గ్రమ్మిముందు మెల్లగా జ్వరముగూడ నాక్రమించుకోవడముతో, "అనుమానమే పెనుభూతమన్నట్లు" వారు నాకును అదే రోగము సోకినదనుకొనిరి. ఆ అనుమానము కొలది చంకలో నొకగడ్డ పొడమినది. అద్దాని ప్రభావముచేతనే కాపోలు రోగము ప్రబలముగా మారి, ఒక కచ్చురముగట్టుకొని మా నాయనగారి వారితోబుట్టులైన శ్రీమతి సంగమ్మగారిని, మా తాతయగు, శ్రీ చిలప్ప చెడుమఠము బక్కయ్యగారిని వెంబడించుకొని జోగిపేటకు రాగా ఇక్కడ గ్రామాధికారి పటేలు పట్వారీలు శ్రీవారికి సోకిన ప్లేగు సంగతిని విని వారు గ్రామప్రవేశమును నిషేధించిరి. అటనుండి తమ జన్మభూమియైన చెవేళ్ళకు వెళ్ళగా, అక్కడ గూడ గ్రామాధికారి వారిని గ్రామములోనికి రానివ్వలేదు. చివరికి నిరాశతో మళ్ళీ జోగిపేటకు వస్తు మార్గమధ్యలోనే శ్రీవారు అసువులనుబాసిరని, మా నాన్నగారు చెప్పగా వింటిని. ఆ కాలంలో ప్లేగు, గత్తర, పేర్లను వింటూనె ప్రజలు భయగ్రస్తులగుచుండిరి. ఈ కాలములో వాటి స్థానములో హృద్రోగము (గుండెనొప్పి). క్షయ, టి.బి. రక్తపోటు, పక్షవాతపు రోగములు ఆక్రమించుకొనియున్నవి.

ఇట్లు శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారు లింగైక్యము జెందిన కొలది మాసములకు మా నాన్నగారు స్వకుటుంబయుక్తముగా సదాశివపేట నుండి జోగిపేట పెద్దమఠమున తమ నివాసమును మార్చుకొనిరి. ఇంతవరకు మా పెద్దనాన్నగారే నియోగించిన శ్రీ మల్లయ్యగారే ఈ మఠములో ఉండిరి. వారును గతించుటచలన మా తీర్థరూపులుగారు ఇక్కడికి తమ నివాసమును మార్చుకొనిరి. అక్కడ సదాశివపేట

మఠములో కొన్నాళ్ళు ఎవరును లేని కారణమున మా పెద్దనాయన గార్లునప్పుడు వచ్చివెళ్ళిన శ్రీ విరూపాక్షానందస్వాములవారు వచ్చి యుండిరి. అతడు మహాపండితుడు గనుక గ్రామభక్తులకు మొదతే మా పెద్దనాయనగారు పరిచయము జేయించిన ఫలితముగా వీరియెడ గూడ స్థానిక భక్తులకు గౌరవప్రపత్తులేర్పడినవి. యేతత్ప్రభావముచేత శ్రీ విరూపాక్షానందస్వామికి కోటగల్లుమఠాధిపత్యము సంక్రమించనందు లకు సదాశివపేట పెద్దనగరము కనుక వీరకై వులే ఇక్కడధికముముగా నుండు (4. పందలిండ్లు) టపలనను భూమి వసతి బాగుగా నుండుట చేతను గొప్పవ్యాపారాపు నగరముకనుక ఇక్కడే స్థిరనివాసమేర్పరచు కొనుటకై పునాదులు వేసికొనుటకుప్రారంభించెను. వారిఆశయముమేరకు వారికిచేయూత నొసంగుటకు ఒకపెద్దరు సంసిద్ధపడిరి. కాని ప్రభుత్వ చట్టమందుకంగీకరించాలి గదా? ఈ విషయమును పసిగట్టిన పటేలు పట్వారీలు, (గ్రామాధికారులు). గ్రామ ప్రముఖులు మాలి పటేలు శ్రీ శివలింగప్పగారిచేత జోగిపేటలో నున్న మా తండ్రిగారికి ఒక పత్రమును వ్రాయించిరి. వారు వ్రాసిలేఖ ఇవ్పటికి నావద్ద నున్నది.

## శ్రీ శివలింగప్ప మాలిపటేలుగారి లేఖ ప్రతి (నకలు) యిక్కడిచ్చాను

"శ్రీర్థస్వరూపులైన మహారాజే శ్రీ మఠంపీరయ్య మొకాం జోగి పేటగారికి తోటశివులింగం మొ॥ మాలి సదాశివపేట పదివేలు నమస్కారములు ఇవ్వడు వుత్తరం వ్రాసినదీగరు వాఖ్యాతు యేమనగా యిక్కడ మాగ్రామం ఇనాంమటం వగైరాతమరి అన్నగారు చేసినవి బావజూషు హక్కుఉండంగ విడిచిపెట్టి అక్కడ ఉన్నారు. అయితే ఇది

మీ యధీనమైనట్టయితే నీకు ఇంతకు పూర్వముండిన మఠాధికారి కేవిధమైన సంబంధముండినట్లు (అనగా ఆహారసుద్దార్లకు నీకు గురు శిష్య సంబంధమో లేదా తండ్రి కొడుకుల రక్త సంబంధమున్నట్లు) ప్రమాణ పత్రమవసమనిరి. అది దెబ్బట్టకై వారివద్ద ఏలాంటి ప్రమాణ పత్రము లేకుండెను. కనుక ఒకరిద్దరిని గ్రామస్థులను దొక్కాళ్ళ, నావద్ద నేలాంటి ప్రమాణపత్రములు లేవుఅనిరి. కాని పిదప ఏదో ఒకటి కల్పనజేసి కోడన్‌గల్లు సంస్థాన మఠమనియు దానికి సంబంధించిన శాఖా మఠమిదనియు, కోడన్‌గల్లులో మొట్టమొదలు శ్రీ నిరంజనస్వామి ఉండెననియు, అతని శిష్యుడు శ్రీ గురు లింగస్వామియనియు, అతని శిష్యుడు శ్రీ బసవలింగస్వామి, అతని శిష్యుడిని తాను (విరూపాక్ష స్వామిననియు) ఇట్లు ఒక శాఖను మరో శాఖను నిరంజన స్వామి శిష్యుడు సదాశివపేట మఠములో శ్రీ మాదయ్యస్వామి ఉండెననియు, ఆతని శిష్యులిద్దరు, శ్రీ గొల్లాళప్పస్వామి సదాశివపేట పెద్ద మఠాధిపతిగాను, శ్రీ మల్లయ్యస్వామి జోగిపేట పెద్దమఠాధిపతిగా ఉండిరనియు, వారిద్దరు ఇప్పుడు మరణించి యున్నారు. కనుక ప్రస్తుతములో సదాశివపేట పెద్ద మఠములో ఎవరులేరు. కావున ఆ మఠమునకు నన్నుముతవల్లిగా (యజమానిగా) ఆర్డరుఇచ్చి ప్రకటించ వల్సిందని కోరెను, కాని ప్రభుత్వము నాటి కలెక్టర్ వీరి వాదనను వినతి పత్రముతో తృప్తిజెందక మఠములో ఎవరు లేనిచో మీరు మాత్రము తాత్కాలికముగా (టెంపరరీ) పూజారిగా, ముత్సద్దిగిరి, బాధ్యతతో ప్రస్తుతము సదాశివపేట పెద్దమఠములో తాత్కాలికముగా ముత్సద్దిగా ఉండి, పూజారి వృత్తితో ఉండాల్సిందిగా నాదేశించెను. అప్పుడు విధిలేక మా పెద్ద నాన్న శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారు బ్రతికియున్నప్పుడే నన్ను తనకు ఉత్తరాధికారి నియామకమునకై మఠాధిపత్యమునకు మొదటి సంస్కారమైన కారణాలు (అయ్యాచారములు) తాలూకజిల్లాలో

సుప్రసిద్ధులైన మహాస్వాములను తనకడకు రప్పించుకొని ప్రథమ సంస్కారమును పూరిజేసి. నాపేర నొక ఫీలుసామును వ్రాసి దానిపై పుర ప్రముఖులచేతను మరియు సంస్కారమునకు విచ్చేసిన మహాస్వాములయొక్క సంతకాలు జేయించి యుండిరి. అట్టి ప్రమాణపత్రము నేటికీ నావద్ద సురక్షితంగా ఉంది.

ఇది గమనించి శ్రీ విరూపాక్షనంద స్వామి వెంటనే జోగిపేటకు ఒక కచ్చరము ఒకరిద్దరు సేవకులను, మరియు శ్రీ బ్రహ్మయ్య అనుష్ఠుపత్రి అయ్యను, శ్రీ ఎంపల్లి శంకరప్ప, మరియు శ్రీ ఎంపల్లి బసప్పను జోగిపేటకు బంపించి వెంటనేనన్ను సదాశివపేటకు దోడ్కొని రమ్మన్ని పంపించెను, అది గమనించి మా నాన్నగారు గూడ సంతోషముతో వారి వెంటనన్ను సదాశివపేటకు బంపించిరి. అప్పట్లో ఇప్పటిలాగా బస్సులు లేకుండెడివి. కనుకనే ఎక్కడికైనా ఇతర గ్రామములకు వెళ్ళాల్సివస్తె, గుఱ్ఱమో, ఎద్దుపో, లేదా రెండెద్దుల బండిలోనో, ప్రయాణించవల్సియుండెను, కనుకనే స్వాములవారు రెండెద్దుల కచ్చరము బంపియుండిరి. జోగిపేటలో ఉ. 4 గం.లకు బయలు దేరి సాయంత్రము 4-5 గం.కు సదాశివపేటకు జేరుకుంటిమి. జోగిపేటలో మానాన్నగారు కుటుంబయుక్తముగా యుండిరి. గనుక మాతుః శ్రీ గారు సమయమునకు వంటజేసి నాకు భోజనమును బెట్టుచుండెడిది. సదాశివ పేటలో ఇప్పుడు శ్రీ విరూపాక్షనంద స్వామివారి మఠశిష్యుడు మహాంతయ్య అను నాతడు వంటజేయుచుండెను. రాత్రిభోజనము నారగించి నేను అలవాటు ప్రకారముగా "ఉచ్చస్థానం మహాశ్రేష్ఠం" అనే పద్ధతికి మా నాన్నగారు శత్రులిండ్లకు వెళ్ళినప్పుడు అలవాటు జేసియుండిరి. గనుక నేను కసాలలో ఒక కుర్చియుండెను. అద్దానిపై జంకుగొంగులు లేకుండ గూర్చుండితిని. ఇదిజూచి విరూపాక్షస్వామి లోలోన నవ్విరి.

ఇంతలో మహంతయ్య వచ్చి "ఏమయ్యా పెద్దవారు క్రింద గూర్చుండగా నీవు కుర్చీపై గూర్చున్నావా?" అని మందలించెను. నేను వెంటనే పశ్చాత్తాపముతో క్రిందకుదిగి కూర్చుంటిని.

ఇక సదాశివపేట మఠములో ఎవరును పనిజేసెవారు లేకుండిరి. గనుక శ్రీ మహాంతయ్యకు తోడుగా ఉండి శ్రీ స్వాములవారికి నీరు వేడిచేయడము, నీరు తోడి పెట్టడము, ఇంట్లోకసుగూడ్చి స్వాములవారి పూజకు పత్రిపుష్పములను సంగ్రహించి, పూజకాయత్తపరచడము జరుగుచుండెను. ఇకపోతె వాకిట్లోకసుగూడ్చి పేడనీళ్ళు చల్లుటకై ఒక "అమ్మణ్ణి" అను ఆంధ్ర వృద్ధురాలు ఒకతి యుండెను. శ్రీ మహాంతయ్య ఊళ్ళో పిండిభిక్షాటనమొనర్చి మధ్యాహ్నము వంటనుసిద్ధగించుచుండెను. ఇతడన్ని వస్తువులు జేయుటలో చాకచక్యముగలవాడే. అయినను అతడు స్త్రీ విషయలోలుడై యుంటవలన స్వాములవారికి పీడిచేష్టలు ఏమాత్రంనచ్చక మధ్యమధ్యన అతనిని మందలించుచుండిరి. ఇది భరించలేక ఒకొకప్పుడు ఎక్కడికో గ్రామాంతరమునకు వెళ్ళి మరల దిరిగివచ్చేవాడు. కాని చివరికి ఒక యువతితో లేచిపోయి, తన ఊళ్ళో పాలమూరులో వైవాహికుడై తిరిగిరాకపోయెను. ఇప్పుడతని పనియంతయు నాపైన బడినది. అప్పుడికి నా యువసు 6-7 సంవత్సరములు. కనుక పైపనులు నేనుజేస్తు ఉంటినిగాని, వంటపని మాత్రము మా విరూపాక్షస్వామే చేసేవారు. జొన్నరొట్టెలు, పప్పుకూరలు చాలా రుచికరముగా జేసెవారు. నామేన ఇప్పుడు చిన్ననాటి కావి వస్త్రములు లేవు. వీటిని స్వాములవారే స్వయముగా దీయించి మాములుగా అందరు బాలుర మాదిరిగా తెల్లని దుస్తులనే ధరించుమని ఆజ్ఞాపించెవారు.

ప్రతిదినము మఠము లోపలి భాగమంతయు నేనే కసువూడ్చి శుభ్రపరచి, నీరు బావినుండి నీరుతోడి మైలబట్టలు శుభ్రపరచి, ఆ కాలమున కొళాయీలు లేని కారణమున మంచినీటికై నగరమునకు వెలుపల మా మఠము భూమి మావయ్యచౌకి అని యుండెడివి. ఆ భూమి ఆరేడు ఎకరములుంటుంది. ఇందులో అన్నీ పెద్ద పెద్ద చింత చెట్లుండెవి. పోతే నగరములో మృతిజెందిన వీరశైవులనందరిని ఇందులోనే ఖననము చేయుచుండిరి. మిగత భూమిని కొంత కౌలునకు ఇచ్చుచుండిరి. నగరములోని అధిక సంఖ్య వీరశైవులు, ఇతరులు కొందరు మంచినీటిని ఇక్కడి బావినుండే దీసికెళ్ళుచుండిరి. నేను గూడ స్నానం జేసి మడిబట్టలు ధరించి అటనుండె తలపై నీటిబిందెనెత్తుకొని తెచ్చెవాడిని. మఠంలో రెండు చేమడు బావులుండేవి. కాని అందులో ఒకటి ఉప్పునీటిది. ఈ బావినుండి గూడ బస్తీవారు నీరును దీసికెళ్ళుచుండిరి, నేను బట్టలుతుకుటకు పాత్రలు శుభ్రపరచుటకై వాడుచుంటిని. మరో బావి మా పెరట్లో ఉండేవి. దాని నీరు ఎవరును వాడకుండిరి. కాని నీరు కాస్త మంచిగానె ఉండేవి. దీనినుండి నీరుతోడి పెరట్లో బెట్టిన నిమ్మ, జామ, దానిమ్మ, మందార, పత్రిచెట్లు గన్నేరు మొదలగువాటికి పోయుచుంటిమి.

మఠము పక్షమున గుమాస్తాగా, శ్రీ రుమాళ్ళ (శివదానం) మల్లయ్యగారుండిరి. వారు ప్రతిరోజు గ్రామసంచారముజేసి పిండిభిక్షాటనం జేసికొని మధ్యాహ్నము ఆ తెచ్చిన దాంట్లో సగ భాగమును మఠమునకిచ్చి, సగ భాగము గ్రామ పర్యటన జేసిన ప్రతిఫలముగా దీసికెళ్ళుచుండెను. వీరు గ్రామాంతరమునకు వెళ్ళినప్పుడు శ్రీ విభూతి బసవయ్యగారు అథవా పత్తిపులు శ్రీ రంగయ్యగారు గ్రామములో భిక్షాటనమునకై వెళ్ళుచుండిరి. ఈ భిక్షాటనమునకు అయ్యగారు భక్తులిండ్లకు వెళ్ళినప్పుడు వట్టి దినాలో పిండి

శేర్ల బియ్యమును అయ్యగారి జోలెలో బెట్టి నమస్కరించుచుండిరి. గురువారము రోజు కేవలము మంచినూనె (తైలము) ఉప్పును భిక్షముగాను, శ్రావణము మున్నగు పర్వదినాల్లో కేవలము బియ్యమును, మరియు దీపావళి పర్వదినముల్లో సేవెలు, ఉప్పు, తైలము, చింతపండు, బెల్లము కూరగాయలను, సాధ్యమైన రూపముగ దానమొసగుచుండిరి. వీటితో పాటు మరికొందరు దక్షిణనుగూడ నొసగుచుండిరి.

ఈ దీపావళి పర్వదినమునందు మాత్రమే మత్రము పక్షమున మఠాధిపతిగా నేను వెళ్ళుచుంటిని. ఆ దినము మా విరూపాక్ష స్వాముల వారు నా మీందని ప్రేమతో తానెప్పుడో ఒకప్పుడు ఏ గ్రామములో పురాణ ప్రవచనము గలిపిన సందర్భమున పురాణ సమాప్తి వినమ్మవారికి దక్షిణతో పాటు ఒక సిలకు సెల్లనుగప్పి సన్మానించిన ద్దాన్ని ఎంతొ తరబడి తాను వాడుకొనక (బీరువా) ఆల్మారాలో దాచియుంచినది నాకు కొత్త బట్టలను ధరింపజేసి ఆ సెల్లను గప్పెడివారు. అది పెట్టినచోటే చికిపోయినందున ఒకటి రెండు రోజుల్లోనే మడిచినట్లుగానే ముక్కలు ముక్కలుగా చిరిగిపోయెడిది. స్వాములవారు ధాన్యమునో, (తెల్లజొన్నలు) దినుసులను అడ్డిదుకొనదారు తమ శిష్యులవద్ద టోకు ధరకు ఖరీదు జేసి కోటగా బోసి కొన్ని మా సాలల్లేయుంచి ధర హెచ్చినప్పుడు దాన్ని విక్రయించి ధనమును గడించెవారు. వారు ఎంతకు దాను సన్యాసాశ్రమంలో నున్నప్పటికిని ధనమును కూడబెట్టెవారేగాని, ఖర్చుబెట్టె రకముగాదు. ధనము హెచ్చినకొలది వారికి వ్యాపారాభిరుచి మెండయ్యెను. రాను రాను డబ్బును కొందరికి వడ్డి సంపాదనకై అప్పుగా ఇచ్చెవారు. అట్టి వీరి ఆసాముల్లో కొందరిచ్చిన ఋణమును దీర్చుకొనెవారైతే, మరికొందరు ఎగ్గొటెవారు కొందరుండిరి. వీరెక్కువగా ఆసాములను పీడించి అడిగిన

యెడల వారు తిరుగబడి మీరు సన్యాసులు, మీకు డబ్బుతో నేమి పని. తరువాత నిదానంగా చెల్లిస్తామని చెప్పి తప్పుకొనెడివారు.

బాల్యములోనున్న నన్ను ఆ నగరములో ప్రైవేటు బడి బెట్టుకొని బాలురకు బోధన గఱపు చుండిన శ్రీ కలము చంద్రయ్యగారి బడిలో జెర్చిరి. ఈ బడి నగరములో సుప్రసిద్ధ ధనికులైన శ్రీమతి చేశెట్టి పీరమ్మగారి భవనము ఎదురుగా నుండి ఆ ఇంటి బంగ్లాపై యుండెను. ఈ యుపాధ్యాయులు మహేశ్వరులు కావున నాయందు వారికి యెనలేని అభిమానముండేది. నాకుతోడి విద్యార్థులతోబాటు అమరకోశములోని శ్లోకములను వల్లింపజేసెడివారు. వీరికి నాపైమిక్కిలి అభిమానము గలుగుటకు మరోకారణము గూడ ఉండెను. కారణమే మనగా మా పెద్దనాన్నగారైన శ్రీ గొల్లాళప్ప మహాస్వాముల వారికి వీరిపైకడుప్రేమ యుండేదట. ఒకప్పుడు ఈ చంద్రయ్యగారు కడు గడు బీదస్థితిలో నున్నప్పుడు మా పెద్దనాన్నగారు వీరిని చెరదీసి, ఒక కన్యను తానేమాట్లాడి వివాహమునకు నిశ్చయించి తానే వారికి (ఇంటికి) యజమానత్వమును వహించి, వివాహకార్యమును నిర్విఘ్నముగానే కొరత లేకుండ నిర్వంచిరట. అది వారిలోనున్న నాపై అభిమాన రహస్యము, ఒక్కొకప్పుడు మా స్వాములవారు గ్రామాంతరమునకు సంచారమునకై వెళ్ళియున్నప్పుడు, తామె నన్ను బడినుండి తమఇంటికి దోళ్కొళ్ళి భోజనము జేయించెడివారు. అంతేగాదు వీరి మాతుఃశ్రీగారు గూడ నన్ను ఏక్కువగా మక్కువతో జూచుటే గాకుండ, ఒకొక రాత్రి వారింట్లోనే జదువుతు ఉండి, రాత్రి చాలాఅవుతే తమవద్దనే పరుండ బెట్టుకొనేడి వారు. ఇట్లా యుపాధ్యాయులవారి కుటుంబము వారందరు మా పెద్దనాన్న గారు చేసిన ఉపకారమును ఎల్లప్పుడు నా ఎదుటచెప్పి తమ కృతజ్ఞతను దెల్పుకొనెడివారు. ఆ ఉపాధ్యాయులు గూడ

వాకంటేను వయస్సులోను, జ్ఞానములోను పెద్ద వారై నప్పటికిన్ని "నన్ను" మాత్రము పేరునుబట్టి పిలువకుండ "ఏమి శివుడా!" అని సంబోధించి పిలిచెడివారు.

ఇదేవిధముగ నేను ఉదయము బడికి వెళ్ళినప్పుడల్లా ఆగర్భ శ్రీమంతురాలైన శ్రీమతి దేశెట్టి వీరమ్మగారు, వీరికిన్ని "విభూతి వీశ్యము" సంస్కారము జరిగిన కారణమున ఆమె గూడ ఎల్లప్పుడు తెల్లనిబట్టలు మేనధరించి, నొసట విభూతి, మెడలోను ముంజేతులకు రుద్రాక్షలు ధరించుకొని ప్రతిదినము ఉదయము 6-7 గం॥లకే తన భవనము వెలుపల మహాద్వారమునకిరు ప్రక్కలనున్న అరుగులపై యెడమ ప్రక్కన ఒక చిన్నపరుపు, (గద్దె) వెనుక తెల్లనితెక్కె (మెత్తను) వేసికొని గూర్చుండి వ్యవసాయపు పనివారికి, సేవకులకు, సరైన ఆదేశాలిస్తు, పశువులను గురించి పరామర్శిస్తు ఉండేది. ఇంతలో నేనచటికి వెళ్ళగానే నన్నుజూచి "వచ్చావా శివుడా? రా నావద్దకురా? నీవు గొల్లాళప్పగారి శిష్యుడివి. దయజేసి ఏదినాకు నీ పాదమిమ్ము" అని ఆమెకుకాస్త వీపుపైగూనియుండుటవలన వంగుటకు వలనుపడకుండెను కనుక, ఏది నీ పాదమును పైకిలేపుమనెడిది. నేనట్లు నా పాదమునుపైకి ఒకటొకటిగా కుడియెడమ పాదములను లేపగానే నామెతనచేత బుచ్చుకొని నమస్కరించుచుండెను. మరియు నీవు బాగుగాచదువుకొని పెద్ద పండితుడవు గమ్మని చెప్పుచుండెడిది.

ఆ తరువాత మేడపైనున్న బడికివెళ్ళగానే వరుసగా తరగతిలో గూర్చుండబెట్టి నిన్నటిదినమున జెప్పిన పాఠములను వరుసగా ఉపాధ్యాయులవారు ఒకరొకరిని తమవద్దకు బిలుపించుకొని, అప్పగించుకొని, మరల కొత్త పాఠములను వల్లింపజేయుచుండిరి. ఉపాధ్యాయుడెదేని

అత్యవసరపు పనిని గురించి వెళ్ళిన సందర్భములో శ్రీ జీర్లపల్లి సంగయ్య అనునాతడు ఆ క్లాసు మొత్తమునకు పెద్ద (మానీటరు)గా ఉండి విద్యార్థులకు పాఠములను జెప్పి ప్రశాంతముగా కూర్చుండబెట్టెవాడు. ఇతను త్రికాండ అమరకోశమునందలి శ్లోకములనుకంఠస్థముజేసి ధారాళముగా జెప్పెడివాడు. సంస్కృత పదజాలమును శుద్ధముగా బలికెడువాడు. ధారణాశక్తిగలవాడు. గుప్త (వైశ్య) కులము నలంకరించినవాడు. ఇప్పుడితను ఆర్యసమాజములో ఒకగణ్యవ్యక్తిగా పరిగణింపబడుచున్నాడు. వీరితోపాటు మరికొందరు నా సహాధ్యాయులలోనివారు. శ్రీ మునుపల్లి మఠము ఈశ్వరయ్యగారు మాహేశ్వరుడు. వీరేశలింగగుప్త. కోరెగుత్తప్ప భక్తుడు. దానము బచ్చన్న మొదలగు వారు నలుబదిమంది విద్యార్థులుండిరి. ఒక దినము వేసవిలో (జడివాన)చెడువర్షమాకస్మికముగా కురియుట వలన వడగండ్లు బడినవి. ఇంతవరకు వేసవిలో ఉక్కపోతకులోనైన నల్లనితేళ్ళు (ఇంగిలీకములు) చేరడేసి పరిమాణముగలవి. శీతవాతములు కాకర్షితములై బయలువెడలి బయలులోనవి గుంపులు గుంపులుగా కీస్సుమని శబ్దముజేయుచు పొడుగాటి వాటి కొండ్లతో నిక్కపొడచుకొని గరగర శబ్దముప్పతిల్లగా దిరుగుచుండెను. వాటి స్వరూపాన్ని నేనిదే ప్రథమముగా సందర్శించితిని. బాలురు వాటిని జూడగానే భయముతో ఎక్కడివారక్కడ పరుగెత్తుకొనిపోయిరి. నేను నివ్వెరబోయి దూరమున నుండి దిలకించుచుంటిని. ఇవి యెక్కడైతే ధనము నిక్షేపముగా ఉంటుందో అక్కడ దానిపై కావలగానివి, నాగుపాములు, ఉంటవని పురాణ కథల్లోను వసుచరిత్ర మున్నగు కావ్యాల్లోను సందర్భములు వచ్చుట పెద్దలు కథల రూపమున వివరించిచెప్పగా తొలికాలమున వినుచుంటిని. ఇప్పుడు కన్నులతో ప్రత్యక్షముగా జూచితిని.

ఇక్కడ దేశెట్టివారి వైభవమును గురించి కొద్దిగ ప్రస్తావించ వలసిన అవసరమెంతైన ఉంది. ఈ వంశపువారు పరమశివభక్తులు, గురు-లింగ-జంగముల యందపారమైన భక్తిగలవారు. కావుననే ఇంతకు పూర్వములో పేర్కొనబడిన చౌకిమఠము యొక్క మహాస్వాములైన శ్రీ చెన్నమల్లప్ప, శ్రీ రాచోటప్ప, శ్రీ అకిపయ్యస్వాముల్లలోనే ఒక్కరైన ప్రతినిత్యము మధ్యాహ్నం పూజలతోబాటు, పాదతీర్థ ప్రసాదములను స్వీకరించని దినము లేకుండినది. వీరి ఆశ్రయము దీక్షతో స్వామహాస్వాములు రాజయోగమును చవిచూచిరి. అంతేగాదు తెల్లంగాణాలోనే వీరికి సాటియైన స్వామి ఒక్క మా పెద్దనాన్నగారు తప్ప మరొకరెవ్వరును లేకుండిరి; శ్రావణమాసములో వీరికి ప్రతినిత్యము పర్వదినముగా నుండెడిది. శ్రావణమాస సమాప్తి దినమున గణారాధనో త్సవమున దేశెట్టివారి విశాలమైన భవనము గురు-జంగమామూర్తులతో కిటకిటలాడుతు ఎటుజూచినను వారియిల్లు సుగంధ విశిష్టమైన అగరు ధూపదీపజ్యోతి. సగానావాయిద్యములతో ఇల్లంతయు మారుమ్రోగు చుండెను. వారి దేవగృహమున జంగమామూర్తి విరాటపాదపూజను తిలకించినప్పుడు సాక్షాత్తుగా కైలాసముగా సగుపడుచుండెను. ఎవరి నోట జూచిన పాదపూజకు సంబంధించిన స్తోత్రములు, లింగాష్టకములు "శరణార్థి రక్షింపవే అతిఘోర జననమరణము ద్రుంచవే లింగా" "శరణార్థి రక్షింపవే" ఈ స్తోత్రముపాడినప్పుడు ఎట్టికఠిణ హృదయము గూడలింగమునందలి భక్తిపొంది కరగి ఆనందపరవశముతో మనసు డోలాయమానముగా డెలియాడుచుండెడిది. అట్లె పుష్పాంజలి "ఉత్సాహంబున మోక్షదాయక ఇచ్చెదనొక పుష్పాంజలియో" ధూపాము శివలింగ, ధూపామిష్టలింగ "శివదుర్గనాథంగ" శివదుర్గనాథంగ, నీకు ధూపాము. అనియు "పాదపూజ ఆగుతాదన్నా యావాగనోడలు పాదపూజియాగుతాదన్నా", ఇట్టివే భక్తిరసపూరితములైన స్తోత్రములు;

ప్రతిపీఠశైవుని ముఖమునుండి నాడు వెలువడుచుండినవి. వీటిని కొన్నింటిని మా నాన్నగారు గూడ నాకు కంఠస్థము జేయించియుండిరి. వీరిని శిష్యులింట్లకరిగినప్పుడు అక్కడ పాదపూజ వారుజేయు సందర్భమున తప్పకుండ నేను పాడాలి. ఈ నగరమునకు దగ్గరనున్న ముద్దెకుంటి మున్నగు పరిసర గ్రామములలోని మాహేశ్వరులందరు పెద్దసంఖ్యలో వచ్చి వీరాచరించె గణారాధనలో పాల్గొనుచుండిరి.

ఇక అందరు భోజనమునకు గూర్చున్న తరువాత గాఢ మౌనముతో గూర్చుండకుండ విస్తాళ్ళువేసి, అన్ని వంటకములు వడ్డించేది సమాప్తి అయ్యేవరకు "పాహిమాం శరణు బసవ, పాహిమాం శరణు బసవ" అను బసవ స్తోత్రమును ఆ మహాత్ముని మహిమలను భక్తియావేశముతో పాడుతు చప్పట్లు చరుస్తు (కరతాళ ధ్వనులతో) మిన్నంటుచు ఇల్లంతా ప్రతిధ్వనించుచుండెడిది. ఇట్టి తతంగములచేత శివభక్తుల గృహాల్లోకి భూతపిశాచముల గ్రహపీడనములుగాని జేరకుండెను. ఆనాడు భక్తులకు మహేశ్వరులపై ఎనలేని భక్తియుండెను. జంగములండె భక్తులకు ప్రాణము, శ్రీ బసవన్నగారు గూడ అట్లే ఉండిరిగదా!

ఈ దేశెట్టి అనుపదము ఇంటిపేరు ఆ వంశానికి జెందిన వారంతా దేశెట్టి వారుగానే వాడుకలోకి వచ్చియున్నది. ఈ సంపన్న కుటుంబములో షడక్షరి అనే పేరుగలవారు సంపదచేత చాలా ప్రసిద్ధి గాంచిరి. వీరిది ప్రత్యక్షంగా రాజఠీవిదై యుండేదని శ్రీమతి వీరమ్మ గారే స్వయముగా చెప్పగావింటిని. ఈమె ఆయన భార్యగనుక ప్రత్యక్ష దర్శిని. శ్రీ షడక్షరిగారు ధరించె దుస్తులన్నియు కేవలము పూర్వ కాలపు పురాణ కథల్లోని రాజులు ధరించె మకమల్ బట్టలతో సిద్ధ గించిన! ఆకుపచ్చని లేదా ఎఱుపు, ఎండ మెరుపు రంగులుగల కోటు

దానిపై జరీపోగులతో నలంకరించబడి, తలకు కలాపతురుమాలు సుంద్రముగా నుండి, చేతికి పది వ్రేళ్ళకు పది బంగారు ఉంగరములు (ఉంగరములను) ధరించి, ముంజేతులయందును బంగారు కడియములను ధరించి, జరీపట్టంచు ధోవతిని గట్టుకొని, తెల్లని పెద్ద అశ్వరాజము నధిరోహించి తిరిగెవాడనియు, ఆ అశ్వరాజము ముంగాళ్ళకుగూడ బంగారు కడియములను దొడగించేవాడనియు, విలాస పురుషుడు గనుక ఏవైన క్రొత్త నాటక ప్రదర్శనలు జరిగినప్పుడు వాటిని దర్శించుటకై వెళ్ళెవాడనియు, అట్లు వెళ్ళెముందు వారివెనుక ముందు సేవక జనపరివార ముండేదనియు చెప్పుచుండిరి. వీరి ఛాయచిత్రము నేటికి వీరింట్లో గూడ అట్లే యుండినది, దాన్ని నేను ప్రత్యక్షంగా జూచాను.

వీరి హయాములో అయిదారుమంది గుమాస్తాలు (వ్రాయస కాండ్రు) ఉండిరనియు, సంపదచేత వీరు సదాశివపేట నగరమునకు పరిసరములోనెటు 12 పండ్రెండామెడ వరకు కీర్తిప్రతిష్ఠల గాంచిరనియు వింటిని. ఐతే నేను వీరి గృహవైభవమును దిలకించినప్పుడు కొంతవరకదే రాజఠీవి నాకు గోచరించినది. నేను జూచినప్పుడు మాత్రము ముగ్గురు నలుగురు గుమాస్తలుండిరి. వారిలో పెద్ద గుమాస్త శ్రీ నెడిదివీరబసప్పగారు, శ్రీ గంగాధరయ్య, శ్రీ చంద్రయ్య గార్లుండిరి. వీరు కుడివైపున బంకుల్లో తెల్లని పరుపులు, తెల్లని తెక్కియలపై గూర్చుండి వారి లెక్కపత్ర వ్యవహారములను సరిజూచుకొనుచుండిరి. ఎడమవైపు బంకులో ఒకరు పరుండె మంచము, దానిపై తెల్లని పరుపు కుర్చీలు, సోఫాలు, అందులోనే ఒకవైపు ఎదురుగా తెక్కియకు ఒదిగి శ్రీమతి వీరమ్మగారు గూర్చుండేది. నగరములో దేశాయి వారివే సగము ఇండ్లు, దుకాణాలుండేవి, నగరమునకు తూర్పుగనున్న

కొలతమూరమున వీరితోట ఉండేది. అది చూడడానికి చాలా అందముగా నుండేది. అందులో స్వర్గములోని ఇంద్రభవనములాంటి భవనము, రంగురంగులతో నలంకరించబడియుండేది. రకరకాల రంగురంగుల సుగంధ విశిష్టములైన మల్లె, జాజి, గులాబీల పూలచెట్లు, మామిడి, అరటి, ద్రాక్ష, బదామి, అశోక వృక్షములతో భవనమునకు నలువైపుల చక్కగా బారులుదీరిన చెమను, మధ్యన ఎఱ్ఱని మొరముతో నిర్మించిన మార్గములు, ఒకవైపు దిగుడుబావి,పీటితోగూడియున్న ఆ తోటను ప్రతి వారి చూపరుల హృదయముల నాకర్షించుచుండెను. దాని ప్రక్కన అవతల శ్రీ జేలూరురామన్నగుప్తగారి తోట. దాని కుడివైపున నిర్మించిన ధర్మశాల యొకటి. వీరవైపులలో గొప్పధనవంతులు, దానికి ప్రక్కనే నేటిప్రభుత్వ జూనియర్‌కళాశాల భవనముంది.నగరమునకు దక్షిణ భాగమున శ్రీదుద్దాల బుచ్చప్పగారు వీరును ధనవంతులే,వీరికి సంబంధించిన మామిడి తోట యుండేది. ఈ విధముగా నగరమునకు నలువైపుల తోటలు, చెరువులు, వరిపంటలతో నెప్పుడును కళకళలాడుచుండెను. నేను మొట్టమొదటిసారి ఆశ్వీజ విజయదశమి రోజున పాలపిట్టలను దర్శించబోయిన, వారితో వెళ్ళి చూడగల్గితిని. కాని ఆనాటి వైభవము ఈనాడులేదు. ధనవంతుల వంశీయులందరు ఇప్పుడు దరిద్రులై యత్యంత దీనావస్థలో నున్నారు. అది కాలవైపరీత్యమనక తప్పినది కాదు. దేశెట్టివాడు యెంతటి వైభవాన్ననుభవించిరో వంశాభివృద్ధికై దెచ్చుకొన్న శ్రీ బసవరాజగారి యనౌచిత్యపు నడతలవలన దేశెట్టివారి గౌరవప్రతిష్ఠలు కుప్పగూలి మంటగల్సిపోయినవి. ఇందుకు వారివారి ఆచారవిచారములే వారివారి యెగుడు, దిగుడులకు మూలకారణమని నేననుగ్రహించాము. వీరితరువాత పేరుప్రతిష్ఠలు సంపద ఆచారవిచారము

ఉలో శ్రీ సిందోలు వీరప్పగారు, శ్రీ దుద్దాల బుచ్చప్ప మొదలగు వారుండిరి. సద్యః వారి స్థితిగతులు మారినవి. వీరమాహేశ్వరులపై అట్టి దృఢవిశ్వాసము నాటి శివభక్తుల్లో ఉండేది. గురు, లింగ-జంగములంటే నాటి శివభక్తులకు ఎక్కడలేని యుత్సాహము వారి హృదయాల్లో పెల్లుబికి వచ్చేది. అంతేందుకు భక్తులకు గురు-లింగ-జంగమాదులే ప్రాణమై మెరయుచుండెను. (పరిఢవిల్లుచుండెను) కనుకనే నాడు శివభక్తులు గురు-లింగ-జంగములయందు ఎనలేని భక్తిశ్రద్ధలుంటవలనను, కొందరు భక్తులు ప్రతినిత్యము తమ ఇంటికి రప్పించుకొని జంగమ తృప్తిగావించుచుంటె, మరికొందరు సోమవారము లేదా మంగళవారము, శుక్రవారములోనో జంగములు లేనిదే వారు ఆహారము భుజించెడివారుకారు. ఇది నా బాల్యములో గూడ జరిగిన వాస్తవ విషయము. నేను కొన్ని ఇండ్లకు వెళ్ళి పాదతీర్థ ప్రసాదములను భక్తులకిచ్చి, మఠమునకు వచ్చేడివాడిని. అందులోను అన్ని నగరములకంటెను సదాశివపేట శివభక్తులు సదాచార సంపన్నులై యుండిరి. అందును శ్రీ చెట్టి రేవప్ప, శ్రీ కొనుగుర్తి తోటప్ప, శ్రీ సిందోలు వీరప్ప, శ్రీ గందిగె సిద్దరామప్ప మున్నగువారు జంగమానుగ్రహాన్ని బడసి ప్రసాదీకులై జీవితాంతము వరకు తమ వీరవ్రతమును కొనసాగించిరి. వీరు శివభక్తులిండ్లలోనేదేని కార్యమును బురస్కరించుకొని భోజనానికి బిలిచినచో తమకు ప్రత్యేకమైన కంచము, చెంబు, స్టీలి (గ్లాసు) ఆసనము వస్త్రములను వెంటనిడుకొని వెళ్ళేవారు. వీరు ఇతరుల పాత్రలను ఎట్టి పరిస్థితిల్లోను నుపయోగించకుండిరి. వీరి యాచారసాంప్రదాయములకు సరిపడనిచో టుకు వెళ్ళకుండిరి. వీరియాచార విచారములను నేను ప్రత్యక్షముగా జూచితిని. ఎందువల్లననగా అక్కడ నేనే మఠానికి ఉత్తరాధికారిని గాబట్టి భక్తులు తమ శుభాశుభకార్యము

లకు రెండు మూడు పర్యాయములు పెద్ద మఠమునకు వచ్చి నన్ను దర్శించుకొనెళ్ళేవారు. గ్రామములోని శెట్టిమహానాడు (శైవము-సమాజసభ్యులు) వీరినే కారణీకులనియు, వ్యవహారముండేది. ఒకవేళ వారు పెద్ద మఠాధికారి మడుపతి వీరువరాకున్నను యిలుతప్పనిసరి ఉండాల్సిందే, ఒకవేళ పెద్దమఠమువారు లేనిచో చౌకిమఠాధికారి, వారు లేనియెడల మునుపల్లి మఠాధికారి వెళ్ళి భక్తుల కార్యములను నిర్విఘ్నముగా నెరవేర్చుకొనుచుండిరి. ఈ గ్రామములో నాడు వీరశైవుల గృహముల సంఖ్య నాలుగువందలుండేదని విన్నాను. కనుకనే ఆ సంఖ్యనుబట్టి మూడు మఠాలు, రెండు మడుపతి వారి యిండ్లు, రెండు శెట్టివారియిండ్లు ఉండేవి.

ఏలనన ఇంత పెద్ద నగరములో ఇంత పెద్ద సంఖ్యగల శివ భక్తులిండ్ల శుభాశుభ ఇండ్లలోనేదోయొక కార్యము తప్పక రేయింబవళ్ళు జరుగుతు ఉండేది. పెండ్లి సమయాల్లో మఠస్థులు మడుపతి శెట్టి వీరికి తీరిక ఉండేది కాదు. ఒకొక్కప్పుడు ఇంటిలో వంటలుగూడ జేయకున్నను చెల్లుచుండెను. ఇక్కడ మరో కారణము, మఠం మడుపతివారు భక్తులిండ్లలో భోజనము జేయడమేగాకుండ "ఎడ" అనే పేరుతో భక్తులు వడ్డించిన ఆహార పదార్థములను వేరొక విస్తరి (కంచము)లో పెట్టించుకొని తమవెంట దీసికెళ్ళేదువారు. ఇది మఠమునకెవరైన అతిథులు విచ్చేసినచో వారికొరకు దీసికెళ్ళే సాంప్రదాయముండెను. ఈ పద్ధతి బ్రాహ్మణులకంటెను ఒకందుకు శ్రేష్ఠమైనదే అని అంగీకరించవలెను. బ్రాహ్మణులు పదైదు మందికి సరిపడే సాహిత్యమును దీసికెళ్ళితే, మఠస్థులు ఒక అతిథి పేరిట దీసికెళ్ళిన తప్పేమియుండదుగదా! అట్లు దీసికెళ్ళినఆహారపదార్థములు పక్వమైనవి. కావున ఒక దినమునకంటె ఎక్కువ సమయముంచడానికి వీలులేదు.

చెడిపోతుంది. కాని బ్రాహ్మణులు దీసికెళ్ళిన సాహిత్యము ఎన్ని దినాలకైన చెడకుండ ఉంటుంది. వారికిచ్చే సాహిత్యమధికమే, సంభావన గూడ అధికమే విలువైనదిగా ఉంటుంది. ఈ వ్యవహారము నుండి బ్రాహ్మణ మరియు బ్రాహ్మణేతరుల సంబంధము దూరమగుట భక్తామాహేశ్వరుల వ్యవహారము, సన్నిహితత్వమగుట, ద్యోతకమగుచున్నది. బ్రాహ్మణులయొక్క జాతి వర్ణవివక్షత ప్రత్యేకత ఆధిక్యత, స్వార్థపరత్వములు స్పటముగా వ్యక్తమగుచున్నవి.

## సదాశివపేట నగరములో ఏరువాక పర్వదినవిశేషము

భారతదేశమున ప్రచలితమునసున్న పర్వదినాలలో ఏరువాక పర్వదినమొకటి. ఇది వేసవి కాలమంతరించి వర్షాకాల ప్రారంభమున ఆచరించె పండుగ. దీనిని భారతదేశములోను, అందును ఆంధ్ర కర్నాటక ప్రాంతములలోను రకరకాలుగా ప్రజలు ఆచరిస్తు ఉంటారు. ఇది పశువులకు అందులోను వృషభములతో (ఎద్దులతో) ఆనాడు ఏలాంటి పనిని దీసికొనక పూర్తిదినము విశ్రాంతి నిచ్చుటకై ఉదయం పశువులను, ఎద్దులను నదికో, చెరువునకో లేదా మోటబావికో వాటిని దీసికెళ్ళి వాటి శరీరములను శుభ్రముగా రాచి కడిగి, మరల తమ ఇండ్లకు దీసికొనివచ్చి ఏకసువులేకుండ శుభ్రపరచిన కొట్టములలో గట్టివేసి, నాడు గృహిణులుత్సాహముతో పెందలకడనే లేచి ఇల్లంతా సమ్మార్జన మొనర్చి, ముంగిళ్ళలో కలియంపి (గోమయనీరును) జల్లి రకరకాల ముగ్గులు వేసి, మామిడి తోరణములతో ద్వారములు సలంకరించి, స్నానమాచరించి, మడిగుడ్డలను ధరించి, రకరకాల రుచికరములైన పంటకములను సిద్ధగింతురు. అందులోను ప్రధానముగా ఆనాడు

పక్షములు (పోలెలు) మామిడిపండ్లు దిగుబడియయ్యే సమయము గనుక వాటి రసమును సిద్ధగించి, పశుసంపదను; ఎద్దుల కొమ్ములకు తైలలేపనము కొందరు రంగులు బులిమి. శరీరముపై జూలువేసి, కొమ్ములకు ఇత్తడి లేదా వెండితొడుగులతో పింజామరాలు వస్త్రాళ్ళతో, సలంకరించి పాదముల గిట్టలకు, కొమ్ములకు వస్త్రమును ధరించి, చిత్రవిచిత్రములుగా నల్లని త్రాళ్ళతో వాటి ముఖములకు గట్టి. కాళ్ళకు అందెలు (గజ్జెలు), కొందరు వెండి కడియాలు తొడగి, ధూపదీప నైవేద్యములతో, మిగుల భక్తితో బూజించే సాంప్రదాయము. అంతటా సామాన్యముగా జరిపి, ఎద్దులకు భక్షములను తినిపించి, మామిడిపళ్ల రసమును గూడ త్రాగింతురు.

ఆ తరువాత సాయంకాలమాచరించే సాంప్రదాయమును ఆయా ప్రాంతములు రకరకాలుగా మార్చుకొన్నవి. జోగిపేటలో నాడు సాయంత్రము ఎద్దులను శకటములకు (బండ్లకు) గట్టి గ్రామము మధ్యనున్న కాలసూచి (గడియారము) స్థూపమునుండి, శ్రీ జోగినాథ స్వామి గట్టు సమీపమువరకు నాబండి ముందంటె, నాబండి ముందు పరుగెత్తాలని ఎద్దులను బాగా తన్నిస్తు (కొరడాలతో కొడుతు) పరుగెత్తిస్తారు. దీనివలన పశువులకు విశ్రాంతిఉండదు, మరికొందరు గుర్రాలపై, సైకిళ్ళపై గూర్చుండి ఊరేగుతారు.

పెద్దలోడి, బరహన్‌డిబ్బ, చేవెళ్ళ గ్రామం మున్నగు ప్రాంతాలలో సాయంత్రము ఎద్దులను నానా రకాలుగా సలంకరించి, మంగళ వాయిద్యములతో ఊరేగిస్తు గ్రామమునకు పూర్వ (తూర్పు) దిక్కున నున్నగవినికి (కమానుకు) గట్టి ఉంచిన మామిడి తోరణమును త్రెంచి వేస్తారు.

కాని సదాశివ పేటలోని యేప వాత పర్వదినము మరో విధముగా నుండినది. నాడు మధ్యాహ్నమునుండే శ్రీమంతులుగా ప్రసిద్ధి గాంచిన దేశెట్టి వారి భవనముముందు ప్రజలందరుచేరి, ఆ భవనమువారి రెండు పోత్తరించి చూపరుల నాకర్షించే ఎద్దులను సిలకు (పట్టు) జూలు, కొమ్ములకు, పాదములకు బంగారు లేదా వెండి తొడుగులు తొడగి, ఫణమున రుద్రాక్షసరులతోను, కొమ్ములకు గిట్టలకు, భస్మపుండ్రములతో నలంకరింపజేసి, భవనము మహాద్వారము ముందట వాటిని నిల్పి వాటికి రెండింటికిని ముందు వెనుకలుగాకుండ అథవా ఎడముగాకుండ నొకా త్రాటితో సవిసమానముగానడచె అట్లు బంధించి, అట్లు అలంకరించిన రెండెద్దులపై ఒక మహేశ్వరుడు, శ్రీరుమాళ్ళ మహాంతయ్యగారు కాషివస్త్రములను ధరించి, నుదుట త్రిపుండ్ర భస్మధారణము, కంఠమున రుద్రాక్షమాలను ధరించి పంచెకచ్చను బిగించి. వాటిపై నిలబడి చేత కాషాయపు నందిధ్వజమును గైకొనియుండ, మంగళవాయిద్యములు ముందువైపున మ్రోగుచుండ వారు శంఖమును బూరించి, మరోచేత గంటను మ్రోగిస్తు "చత్రేదాల్" అని చెప్పటముతో సర్కాడిసుంచి ఊరేగింపు బయలువెడలుచుండెను.

ఆ రెండెద్దుల వెనుక భాగమున రంగురంగుల అద్దాల శకటాలతో మఠాధిపతులు, గురువులు, పురప్రముఖులు దానివెనుక పురంద్రీలు, ఒక హాస్యకాడి వేషముతో పొడుగాటి తెల్లని గడ్డము, మీసములు, పొడుగాటి కుళ్ళాయిని ధరించి, శ్రీ సిందిరి శేరి బుచ్చప్ప అను నాతడు ఒక ఎనుబోతుపైతోకవైపు ముఖముజేసికూర్చుండి ఊరేగుచుండెను. తరువాత ముందు వెనక జనసందోహము. ఆ రెండెద్దులముందుభాగమున పెద్దదైన ఆభరణములతోనలంకరించబడిన అశ్వరాజముపై దేశెట్టివారికి

సంబంధించిన యజమానో లేదా వారి సంతానమును గూర్చుండబెట్టి ఊరేగుతూ జై జైకార నినాదములతోను మంగళవాయిద్యముల ధ్వని మిన్నుముట్టగా పడమర వైపుననున్న గవినికిగట్టియుంచిన, మామిడి తోరణమును గొట్టి త్రెంచి దానికానుకొని యుండిన, చౌకిమఠములోకి వెళ్ళి అక్కడ స్వాములవారి దర్శనాశిస్సులబడసి, మరల ఊరేగుతు వచ్చి దేశెట్టివారి భవనము ముందుకు రాగానే, రెండెద్దులపై నూరేగి వచ్చిన స్వామికి స్వాగత సూచకముగా నీరాజనమొసగి, టెంకాయను గొట్టి విసర్జించుచుండిరి. ఇప్పుడీ వైభవము తగ్గినది.

## శ్రీ విరూపాక్షస్వాములవారి కొద్దిపాటి ప్రభావము

వీరు సంస్కృత విద్యాపారంగతులైనను. తెలుగు భాషా సరిగ్గా రాని కారణమున స్థానిక భక్తుల సంపర్కమువలన ఏకొద్దిపాటి బగ్గడు భాషలో వచ్చిరాని పదాలతోమాట్లాడుచుండిరి.భక్తులు వారి భాషను విని నవ్వుచుండిరి.కన్నడ భాషలోఅంతగా అరితేరినవారును గాదు.ఏభాషకైన కొంత పరిశ్రమ జేయాలి. ప్రతి భాషకు ప్రత్యేక పదాలుండుటచేతనే, దాని స్వరూపము ఇతర భాషలకన్నా భిన్నంగా ఉండి తీరుతుంది. దాని వ్యాకరణము, సాహిత్య ప్రక్రియలు భిన్నముగా నుండును. కాని ఆ వచ్చిరాని తెలుగు భాషలోనే ప్రతియేట స్థానిక సొంత మఠములో గాని, ఇతరత్రాగాని, శ్రావణమాసములో నెలరోజులు బసవపురాణమును గాని అథవా ఇతర పురాణ ప్రవచనము గావించుచుండిరి. భక్తులు వినడానికై మఠమునకు విరివిగానే వచ్చుచుండిరి.

ఈ సమయములో స్థానికముగా అటకరి-జాండ్ల అనగా గుడ్డలునేసే లింగబలిజలకు లింగదీక్షా సంస్కారమును గొప్ప ప్రమాణమున నేర వేర్చిరి. పురాణ సమాప్తినాడు శ్రీ టీచుకుందా బందప్పస్వామిని, మరియు పాపన్నపేట మఠాధిపతి శ్రీ చంద్రశేఖరస్వామిని రప్పించి, వారికి భక్తులచేత పాదపూజలు జేయించిరి. రాజయోగియైన టీచుకుంద సంస్థానాధీశులైన శ్రీ బందయ్యప్పగార్కి రుద్రాక్ష కిరీటమును ధరింప జేసి భక్తులచేత వారి పాదములకు బిల్వార్చన గూడ జేయించిరి. నాటి నుండి శ్రీ బందయ్యప్పగారికి నాకును పరిచయమేర్పడినది. నేను ఒక్కొక్కప్పుడు మహాశివరాత్రి మహోత్సవాహ్వానముపై టీచకుంద నగరమునకు వెళ్ళివచ్చేవాడిని. వారికి రానురాను నాపై మిక్కిలి ప్రేమ యేర్పడెను. కనుకనే అప్పుడప్పుడు తమకడకు రప్పించుకొని పదిమూడు రోజులుంచుకొనుచుండిరి. సికింద్రాబాదులో, రాణిగంజ్, లాలాగుడ యెదుట వీరి శాఖామఠమైన గొల్లమఠము (కుడుము మఠము) అని యున్నది. అక్కడికి పలుసార్లు వస్తూవెళ్ళేవారు. ఇక్కడికి గూడ నేను వారి వద్దకు వెళ్ళేవాడిని. నా విద్యాభ్యాసమునకు వారు ప్రసన్నులై "నీవు ముమ్ముందు మా సంస్థాన మఠమునకుగాని, పాపన్నపేట మఠమునకుగాని, లేదా సదాశివపేట మఠమునకుగాని, ఆధిపత్యమును తప్పక వహించగలవని" నాతో జెప్పెడివారు. ఇప్పుడు వారు లింగైక్యమైనారు. వారిస్థానే శ్రీ బసవలింగస్వామి హిందీ ఎం.ఏ. గారు పట్టాభిషిక్తులైయున్నారు. వారు సంస్థాన భారమును వహించినప్పటి నుండి యేదోఒక అనారోగ్యమునకులోనై రోగముతో బాధపడుచున్నారు. వీరికి సంపాదన ఒకటే లక్ష్యము గాని, శ్రీ బందయ్యప్పగారివలె త్యాగనిరతి, ఆత్మీయత వీరిలో మృగ్యమైనదనవచ్చును. వారు (బందప్పస్వామి) తమ మఠమును క్రొత్తగా నిర్మించుటకై ధనసంగ్రమునకై సంచారము

బయలువెడలిన సమయములో (చౌకబారు) అమందగోడి కాలములో ఎటువంటి బీదవాడుగూడ స్వామివారికేదో కొంత దానమొసగవలెనను ఉదారబుద్ధిగలిగేది. ధనికులు వేల రూ.లను దానమొసగుటవలన లక్షల ధనమును సంగ్రహించి తమ మఠమును దృఢముగా నిర్మించిరి.

పాపన్నపేట శ్రీ చంద్రశేఖర స్వాములవారు మా పెద్దనాన్నకు సంతానము లేనందుకు మఠమునకు దత్తుగా అరుగొండ గ్రామమునుండి దత్తతగా తెచ్చుకున్న సంతానము, ముందు శ్రీ విరూపాక్షస్వాములవారి చేత సంగ్రహింపబడి పాపన్నపేట మఠమున కాధిపత్యమును వహించిరి. మా పెద్దనాన్న శంకరయ్య నాగమ్మ దంపతుల కాలములో పుష్కలముగా ధనసంప్రాప్తిచేత, వీరుసుఖభోగముల ననుభవించిరి. వీరు మాకు సోదరస్వరూపులగుటవలనను, నేను వీరికధికారమొసగుటచేత గురువుగా చెలామణియైన శ్రీ విరూపాక్ష మహాస్వాములవారితో బాటు, శ్రావణమాసములో పాపన్నపేటకు వెళ్లి ఒక మాసమక్కడే యుండెడివారము. మాకు తోడుగా ఆలంపల్లి శ్రీ శంకరస్వామి గూడ అక్కడికి వచ్చెడివారు. అక్కడ నెలరోజులు పురాణ ప్రవచన కాలక్షేపము జరుగుచుండేది. నేను వారందరి సేవలో ఉండి, వారి శివపూజకాయత్త పరచటము, బిల్వపత్రములను పుష్పములను, గంధాక్షతలను సంగ్రహించి ఉంచేవాడిని. మరియు వీరు ప్రతిదినము స్నానము జేయగానే వారి మైల బట్టలన్నింటిని దీసికెళ్లి గ్రామమునకు కొద్దిదూరముననున్న చెరువులో ఉదికి తెచ్చేడివాడిని. బట్టలను చాలా శుభ్రముగా ఉదికేవాడిని. గనుక మా విరూపాక్షస్వామి తమ దుస్తులను వేరేవారితో ఉదికించకుండిరి. ఒకవేళ తప్పెవరైన ఉదికి మడిబట్టలతో దండెముపై నారవైచినను. నేను తెల్లవారకు బయలుదేరగానే, తాను ఇంకను స్నానము జేయక

మైలబట్టలతో ఉండియు, మడిబట్టలో ఆరవేసిన తన దుస్తులను తీసి ఇచ్చేడివారు, "ఏమండి మీరు మడిబట్టలను ముట్టితిరి. అవి మైలబడెను గదా?" అని నేనన్నప్పుడు వారు నవ్వుతు "ఎక్కడి మడి, యెక్కడి మైల" తీసికెళ్ళరా. అని ఇచ్చి వెళ్ళేవారు. అన్నట్లు మా విరూపాక్ష స్వాములవారు లింగార్చనను చాలా సమయమువరకు జేయుకుండిరి. (ఐదు) నుండి పది నిమిషాలు మాత్రమే పూజ చేసేవారు. చాలా సమయమును పూజతో గడుపకుండిరి. మనస్సు శుద్ధముగా నుండిన సమయంలోనే లింగపూజ జేయాలిగాని, "భక్తిలేని పూజ పత్రిచేటు" అను సామెత. ఆ పూజ వ్యర్థమని వాదించేవారు. అది నిజమే గదా? మరి మనస్సు లేకున్నను చాలాసేపు పూజచేయడము అదిపట్టి ఆడంబర పూజే. కేవలము చూపరులనాకట్టుకొనుటకే కొందరట్లు జేయుచుందురు. చిత్తశుద్ధితో కొద్ది సమయములో దేవునర్పించిన భక్తి తప్పక ప్రతి ఫలిస్తుంది. బసవన్నగారు భక్తియే ప్రధాన కారణమని చాటి చెప్పిరి. అదెంతేనిసార్థకమైనది. "చిత్తశుద్ధి లేని శివపూజలేల?" అని వేమన యోగి కథనమున్నది.

## జలగ రక్తమును పీల్చుట

పాపన్నపేటలో నున్నప్పుడు గ్రామమునకు చెరువలో పెద్ద చెరువులో నీరు గ్రామమువారికినీరు అందుగలువడము చేత కలుషితమైన నీరని దలచి గ్రామమునకు కొలది దూరములో గుట్టలకు దిగువ ప్రదేశములో నుండిన చెరువు నీరు పరిశుభ్రముగా ఉండి అందులో బట్టలుదికిన యెడల బహుతెల్లగానగుననే అభిప్రాయముతో అక్కడికి స్వాములవారివి నాలు మైలబట్టలను దీసికెళ్ళితిని. నీటిలో తడిపాదేముంచి బండపై

బట్టల నుదుకుచుంటిని. ఇంతలో నొక నీటి "జలగ"పురుగు వచ్చి నా కుడి పాదమునకు వెనుక భాగము మడిమకు పైన బట్టుకొని రక్తమును పీల్చుచుండినది. నేను గబాలున పాదమును పైకిదీసి చూచి వెంటనే దానిని గట్టిగాబట్టి పెరకివైచితిని. అది రక్తమును పీల్చినయంత స్థానము రక్తము లేక గుంటబడియుండినది. ఈ కీటకము నీటిలో దిగిన పశువులకు గాని, మనుషులకు గాని బట్టి పూర్తిగా రక్తమును పీల్చుకుంటుందని మా నాన్నగారు చెప్పగా వింటిని. ఆ విషయము నేడునా అనుభవమునకు వచ్చినది.

## పాపన్న పేట పూర్వమొక సంస్థానము

పాపన్న పేట పూర్వములో ఒక సంస్థానముగా నుండెదనియు, దానికి చుట్టుప్రక్కలందు చెరువులు, మరియు మంజీరా నదిపై ప్రాజెక్టును నిజాం కాలములో నిర్మించుటఁజేసి, అద్దానికి నిజాం నాగరము అని పేరుండినది. దానిదిగువ భాగమున ఈ పాపన్న పేటకు జెందిన కేదార క్షేత్రములు బాగుగా సమృద్ధిగా(వరిపైరు)బండుచుండును. మా మఠాధికారికి గూడ కొంత భూవసతి యుండెను. అందును కొంత భాగములో మామిడి తోటను, మరికొంత భాగములో వరిపైరును, బక్కగా పండించుచుండిరి. ఆ మామిడి తోటకు ప్రక్కనే రాజావారిది కొబ్బరి తోట యుండేది. ఆ గ్రామమునకు చుట్టు పరిసరాల్లో ఘనారణ్యములు. ఎత్తైన గుట్టలుండుటవలన క్రూరమృగముల కాలవాలమై యుండేది. ఒక్కొక్కప్పుడు పులులు గూడ వచ్చి ఆ కొబ్బరితోటలో నుండేవి. ఒకరెండుసార్లు వాటిని తుపాకితో గాల్చిచంపియున్న సంఘటన నేనక్కడుండగనే జరిగినది. దీని ప్రక్కగొప్ప చెరువుంది. సాయంత్రము దానిపై నాస్నేహితులతో వాహ్యాళికివేళ్ళేవాడిని.

కాలక్షేపమునకై పాపన్నపేటకు సమీపములోయున్న రామతీర్థమను గ్రామములో మా పెద్దమ్మ నాగమ్మగారు కొంత భూమిని గొని అందులో ఒక గృహమును గట్టుకొని, మరికొంత వెనుక భాగము పెరటో మామిడి మునిలగు పండ్ల చెట్లను, పూలమొక్కలను, కూరగాయలను నాటి పండించుచుండిరి. నేను మా గురువులవారు శ్రీ విరూపాక్ష స్వామిగారు, శ్రీ అలంపల్లి శంకరస్వామిగారు అక్కడకు కాలక్షేపమునకై వెళ్ళి వేసవిలో ఉండెవారము. ఇక్కడికి నిజాంసాగరు చెరువు నీరు విశాల వ్యాప్తితో ఎటు జూచిన మహాసాగరము మాదిరిగా అగుపడుచుండెను. దీనికి చెరువలో నొకగుట్టపై రామేశ్వరాలయము ప్రాచీనకాలములో నిర్మితమై చుట్టు ప్రాకారముతో నున్నది. పూర్వము రామతీర్థ గ్రామమిక్కడె ఉండెదని ప్రజలు చెప్పారు. సాగరు నీటివ్యాప్తితో అంత దూరమైనదిగా నుండినది.

ఎప్పుడైన మా బంధువులలో వివాహాది కార్యములు జరిగే సమయములో, వారియాహ్వానముపై వెళ్ళి, అక్కడికి ఆహూతులైనమరియు అక్కడే కొంతకాలము బాల్యములో విద్యనభ్యసించుటకై యుండిన నా బాల్యమిత్రులైన శ్రీ పి. నాగసంగప్ప, వారి సోదరుడు చెన్నబసప్ప గార్లతో గలిసి ఆడెవాళ్ళము. ఇంటికి తిరిగివచ్చేప్పుడు వాంకిచ్చరవు బండిలోనే ప్రయాణమై వచ్చేవాడిని. మధ్యన యెక్కడైన ఎండను చల్లపుచ్చుటకై యే మోటబావివద్ద మామిడిచెట్టు నీడలో కొంతవడవిశ్రాంతి గైకొని, బావిలో ఈదులాడ స్నానముచేసి, వారుతెచ్చిన చద్దిమూటను విప్పి తలా ఇంత దుటించి నెమ్మదిగా సాయంత్రము బయలుదేరి ప్రయాణమగుచుంటిమి.

ఒకసారి నేను పాపన్నపేటకు వెళ్ళినప్పుడు మా పెద్దమ్మగారు నన్ను ప్రేమతో జూచుచుండెను. కొన్ని దినములు తనవద్దనే ఉండుమని ఆగ్రహపరచి ఉంచుకొనెడిది. పాపన్నపేటకు చేరువలో నార్సింగి అను గ్రామంలో పద్మవ్యూహము, జాతర కార్యక్రమముండెను. అప్పుడు మా పెద్దమ్మగారు, అన్నయ్య, వదినె శ్రీమతి అడివమ్మగారు తాము కచ్చరములో గూర్చొని, నన్ను మాత్రము ఒక గుఱ్ఱముపై గూర్చుండ బెట్టుకొని అక్కడికి దోడ్కొనిపోయిరి. రాత్రంతా అక్కడే ఉండి యా పద్మవ్యూహమున మాచిన్న అన్నయ్య శ్రీ శంకరయ్యతోబాటు జాత్రకు వచ్చిన జనసమూహముతో దిరిగిజూచితిని. ఇట్టి ఈ పద్మవ్యూహ రచనను దిలకించుట నాకిది క్రొత్త. దీపాలవరుసలు ఎటు జూచినను వెలుగు చుండెను, ఉదయము మళ్ళీ పాపన్నపేటకు వెళ్ళితిమి. వీరికి వ్యవసాయముండినది. దానికితోడుగా పశుసంపద యుండబట్టి స్వాములవారు ఎక్కడికివెళ్ళినను కచ్చరములో వెళ్ళెవారు. వీరికి పరమభక్తులు బరహన్‌దిబ్బ వీరసంగప్ప పటేలుగారు. వీరెక్కడికి వెళ్ళితే వారును కుటుంబ యుక్తముగా వెళ్ళుచుండిరి. ఒక పర్యాయము శ్రీ చంద్రశేఖర మహాస్వాములవారు తన మాతుఃశ్రీ నాగమ్మతోబాటు శ్రీ విరూపాక్ష మహాస్వాములవారి ఆనతిమేరకు కోడన్‌గల్లు మఠాభివృద్ధిని గావించుటకై వెళ్ళినప్పుడు, శ్రీ వీరసంగప్ప పటేలు దంపతులుగూడ అక్కడే యుండిరి. పాపన్నపేట శ్రీ చంద్రశేఖరస్వామి కొన్నాళ్ళు కోడన్‌గల్లు మఠములోనేయుండి తదభివృద్ధికి పాటుబడి, మఠమును బాగుపరచిరి, గ్రామమువారందరు వీరికృషికి ఆనందించి వీరికి చెదోడు వాదోడుగా నుండిరి. విద్యార్థి వసతి - గృహమునుగూడ సొంతధనమును వ్యయపరచి గట్టించిరి.

కాని వీరిదినదినాభివృద్ధి శ్రీ విరూపాక్షస్వామికి యెంతమాత్రము గిట్టదయ్యెను. రానురాను తానే ఈ మఠాధికారిగా మారుతాడేమోననే శంకా వారిలో పొడమినది. ఏలనన ఇదిగొప్ప సంస్థానము. దీని క్రింద భూములు వందలాది యెకరములున్నవి. వాటన్నిటికి భోక్తతానే అవుతాడేమోననియు అందుకు తార్కాణముగా గ్రామములో భక్తులు, పరిసర గ్రామప్రజలు వీరికండదండలుగా ఉండిరి. వీరుగూడ మహాయుక్తి పరులై యుండిరి. వీరు ధనికులు పావన్నపేట చుట్టుప్రక్కల ప్రజలకు ఋణము ఇచ్చి పుచ్చుకొనుటవలన మహాప్రసిద్ధిగాంచియుండిరి. ఎంతైన వీరిది కోమటి యుక్తియని శ్రీవారు భావించి కోడన్‌గల్లు మఠము పునరుద్ధారపు పనులు ముగియడముతోనె శ్రీ విరూపాక్షస్వామి శ్రీ చంద్రశేఖరస్వామిని త్వరలోనె ఉద్వాసన బట్టించిరి, అందుకు ప్రతిఫలముగా దొరకినదే మహాగొప్పగా భావించి రాత్రోరాత్రి తనసేవకావృత్తిలో నుండిన మఠపతి మల్లయ్యతో అక్కడ కోడన్‌గల్లులో ఉన్న వెండి ఇత్తడి సామానులనన్నింటిని పావన్నపేటకు చేరవేసెనని వినికిడి. వీరుభయులు పేరుకు సన్యాసులేగాని, అంతులేని ధనాశాపరులు. పరస్పరముగా ఒకరి ఆస్తిని మరొకరు కాజేస్తామనేదురాశగలవారే. పరస్పరముగా "నీవు గుడ్డుమా అంటె నీవు గుడుమా" అనే వివాదము జరుగుచుండెను. ఈ గురుశిష్యుల అనుగ్రహము ద్వేషముగా అంత్యదశలో మారిపోయినవి. ఎక్కడిగురువు? ఎక్కడిశిష్యుడు? అవి ధనము నాశ్రయించే అమర్యాదలుండినవి, ఒకరు కర్నాటకపు గురువైతే, మరొకరు తెలంగాణపు శిష్యుడు, వీరిద్దరిలో పొంతనయెక్కడ? తాత్కాలికమైనదనే నా భావన.

# జోగిపేట మరియు సదాశివపేటలో వనభోజనములు

నా బాల్యములో నొకసారి శ్రావణ మాసములో మా నాన్నగారి సలహా మేరకు జోగిపేట భక్తులతో గూడ నగరమునకు తూర్పు దిక్కునయున్న శ్రీజోగినాథస్వామివారి గుట్టకు వెళ్ళితిమి. అప్పుడక్కడ మందిర పరిసరాలలో పలురకాలచెట్లుండేవి. గాని ఇప్పటిలాగ ఇండ్లు, కళాశాల,కోర్టు,బాలబాలికల వసతిగృహాలుండేవికావు. గనుకనే ఆక్షేత్ర మంతప్రశాంతమైన వాతావరణముతోనుండేది. భక్తులందరు ఆనాడుతమ తమ ఇండ్లలో సిద్ధగించి తెచ్చిన వంటకములను ఒకచోటబెట్టి మళ్ళీ అక్కడ గూడ రూఢి ప్రకారముగా సాంప్రదాయము మేరకు, మందిరమునకానుకొనియున్న యొక వేదికపై ఆసనమునువేసి, నన్నా స్థలములో గూర్చుండబెట్టి పాదార్చన, తీర్థప్రసాదములను సేవించి, ఆవారు గొనివచ్చిన, ఆహారపదార్థములపై పాదోదకమును ప్రోక్షించి, అన్న పూజను జేసి, ఒకరెండు వరసలుగా మొట్టమొదట పురుషులందరు గూర్చొని, బసవస్తోత్రముల నుత్సాహముకొలది పాడుతు విస్తాళ్ళలో అన్ని వంటకములను వడ్డించడముతోనే, శెట్టి లేదా భక్తప్రముఖుల్లో ఒకరు సాష్టాంగ నమస్కారము జేసి, ఆరగించవల్సిందిగా ప్రార్థించగానే సరే, ఎల్లప్పుడిలాగె జంగమ తృప్తి జేయాలి. అని ఆజ్ఞాపించి "గజతురగ సహస్రం గోకులంబువిదానం" అను మంత్రానుచ్చరిస్తు మఠపతివారు వలచేత గంటనూపుతూ, శంఖమును పూరించి "జయ నమః పార్వతీపతే హరహర మహాదేవ" అని ప్రసాదమును తమ ఇష్టలింగములకు నివేదించి, ప్రసాదమును సేవించుచుండిరి. ఆ కార్యక్రమము ముగియగానే, స్త్రీల భోజనానంతరము కొంతసేపు విశ్రాంతి గైకొని తమ తమ గృహములకు బోవుచుండిరి.

ఇదేవిధముగా నేను సదాశివపేటతో నున్నప్పుడుగూడ మఠముతో బసవ పురాణ ప్రవచనము సమాప్తికాగానే, ఇదే సమయము బీచుకుంద బండప్ప మహాస్వాములవారు గూడ విచ్చేసియుండిరి. సరే మా విరూపాక్షస్వామివారి ఆజ్ఞానుసారము వనభోజన కార్యక్రమమును నిశ్చయించిరి. తమ తమ ఇండ్లలోనే తినుబండారములను సిద్ధగించు కొని, తీసికొని రావల్సిందిగా తాకీదు ఇచ్చిరి. స్థానము క్రొత్తగా నిర్మించినందుకు క్రొత్త చెరువనియు, సదాశివ నగరమును సదాశివుడను పటేలు నిర్మించుటచేత సదాశివపేట అను నామకరణ మేర్పడె ననియు, అట్లే ఇప్పుడు క్రొత్తగా నిర్మించిన తటాకము పేరు గూడ సదాశివ చెరువని గూడ నామకరణ మేర్పడియుంటవలన, వనభోజన మునకదే స్థలము యోగ్యమైనదిగానెన్నుకొని, మరునాడుదయము తొమ్మిది గంటలకు నగరములోని భక్తులు, స్త్రీలు, పురుషులంద రక్కడికి వచ్చిరి. ఒకచోట పరిశుభ్రమైన స్థలములో ఎలితే (బిదురు) తడకలు బరచి వాటిపైన శుభ్రమైన మడిగుడ్డలను బరచి అన్నమును రాసివలె బోసి, మిగత వంటకములను గూడ, భక్ష్యములు, నూనె పోళెలు, బేగోడులు, సేవు, బజ్జీలు, పులిహోర, పెరుగన్నము, సజ్జజొన్నరొట్టెలు,పూరీలు, చపాటీలు (గోధుమ)రొట్టెలు, ముద్దవంకాయ, ముద్దపప్పు, బీర, సోరకాయ శాఖములు, గడ్డినువ్వులపొడి, ఇంక రకరకాల పచ్చళ్ళు, నెయ్యిపాలు-పాయసము, (చెక్కె) గట్టిపెరుగు, లడ్డూలు, సాజ్జపోలెలు ఇట్లురకరకాల వంటకములను అన్నపురాసి ప్రక్కనె వేరువేరుగా కుప్పలుగా పెర్చిరి.

తరువాత పెద్దమఠము విరూపాక్షస్వామివారు స్నానమునుజేసి, మడివస్త్రములను ధరించి, తమకొరకు ప్రత్యేకముగా నేర్పరచిన

ఆసనము నలంకరించిరి. తక్షణమె శెట్టిరేవప్పగారు, వచ్చిపాదార్చన గావించి. వంటకములపైనను, అన్నపురాసిపైనను, బ్రోక్షించిరి. మళ్ళి పాదతీర్థమును సిద్ధగించగా భక్తులందరు స్వాములవారి పాదతీర్థ ప్రసాదములను సేవించిరి. తదుపరి అందరు వరుసగాగూర్చొని బసవ స్తోత్రమును. ఇష్టలింగాష్టకమును, శ్రీ మునుపల్లి మఠముర్గాయ్యగారు తమ మధురమైన కంఠముతో బాడిరి. ఇంతలో విస్తాళ్ళలో వంటకము లన్నియు స్త్రీలు కొందరు పురుషులు వడ్డించిరి. అది పూర్తిగా గానే శెట్టిరెవప్పగారు సాష్టాంగమేసి ఆరగించవలసిందిగా ప్రార్థంచిరి. మడుపతి విరూపాక్షి మరియు మడుపతి బ్రహ్మయ్యగార్లువల (కుడి) చేతగంటనూపుతూ శంఖములను పూరించిరి. అప్పుడు స్వాములవారు.

"శివయోగినిసంతృప్తేతృప్తోభవతి శంకరః
తత్తృప్త్యాతన్మయం విశ్వంతృప్తమేతిచరాచరం"॥

అని మంత్రమును బంఠించగానే భక్తులంద రేకకంఠముతో "జయనమః పార్వతీపతే హరహరహరమహాదేవ"అనిచెప్పి ప్రసాదమును తమఇష్టలింగమునకునివేదించుకొనిభుజించిరి. ప్రసాదీకులైనశ్రీ శెట్టిరేవప్ప శ్రీ కొనగుర్తితోటప్ప, శ్రీ సిందోలుషీరప్ప, శ్రీ గందిగెసిద్ధరామప్పగార్లు శ్రీ స్వామివారిచేత లింగార్పితముగావించి, వారు ప్రసాదము కొద్దిగా అనుగ్రహించగా వారును అందరితో బాటు భుజించిరి. మధ్యాహ్నము కొంతసేపు అక్కడే విశ్రాంతి గైకొని సాయంత్రము నాల్గుగంటలకు భక్తులెవరి గృహములకు వారు స్వాములవారికి నమస్కరించి వెళ్ళిరి. ఉపయోగమేముగూడ అనగా నేను మరియు శ్రీ జీచుకుంద బండయ్యప్ప స్వామిగారి శిష్యుడు స్వాములవారిగద్దిగె పూజోపకరణములను దీసికొని

వచ్చేతొందరలో పీఠాధిపస్వామివారు దినాలువేడినీళ్ళు త్రాగేటొంగి చెంబును అక్కడేమరచివచ్చితిమి. మఠమునకువచ్చి సామానువిప్పి చూడగా నారాగిచెంబు లేకుండినది. అయ్యోస్వాములవారు కోపగిస్తారు, కొడ్తారు ఏమిజేయాలని భయకంపితుడనైతిని, ఆచోటునకువెళ్ళి తీసికొని వచ్చుటకు నగరమునకది దూరముగానున్నది. ఐనను ఇంతవరకా చెంబు ఉంటుందా? పోతేనాయంత్రమగుచున్నది. అక్కడ వేయాళ్లు, ఘాతములు, దొంగలభయ మొకటి, ఐనను విధిలేక ఉభయశిష్యులము ఒకింతధైర్యము దెచ్చుకొనికొంతదూరము నగరవెలుపలనున్న రైట సంగప్పగారి ఇంటికి మరియు దుద్దాలబుచ్చప్పగారి తోటమధ్యకు వెళ్ళే సరికి ఒకభక్తుడుఆ చెంబునుచేతబట్టుకొని మావైపేవచ్చియేమండి!యింత అజాగ్రత్త! మీరీచెంబునక్కడే మరచివచ్చారు. ఇదిమీదేనా? వేరెవారిదా? అనిప్రశ్నించగా అయ్యా! అదిమాస్వాములవారిది. వారు కోప్పడుతారనే భయముచేత మేముదాన్ని వెదకి దీసికొనిరావడానికయ్యే వచ్చుచుంటిమి. మీరు తెచ్చియిచ్చినందుకు మేమెంతగానో మీకు కృతజ్ఞులముని యా చెంబును దీసికొని మఠమునకు వెళ్ళితిమి. ఈ విధముగా నేడోకార్య రూపమునస్థానిక భక్తులను ప్రోత్సహించుట వలన నగరభక్తులందరు వారానతిచ్చినట్లు చైతన్యవంతులై నడచుకొనుచుండిరి.

మాది పెద్దమఠము గనుక స్థానిక భక్తులిండ్లలో శుభాశుభ-కార్యములేవి జరిగినను, వారు మఠమునకు వచ్చి ఆహ్వానించినంతనే నేను వారిండ్లకు తప్పకుండ వెళ్ళాల్సిందే. రాను అనడానికి వీలు లేకుండేది. అథవా మాకు ప్రతినిధిగానైన, మరొకరినెవరినైన బంపాల్సిందే. ఎవరింట్లోనో ఒకరు మరణించినచో! వారి అంత్యక్రియలయ్యేవరకు వారితోబాటు ఉండాల్సిందే. శిశుజననము జరిగిన యెడల

ఉదయము 9-10 గంటలకు వెళితే మధ్యాహ్నము 2-3 గంటలవరకు లింగధారణ జరిగి భోజన సమాప్తి అయ్యేవరకు వారింట్లో స్వంత పని యెంతవసరమైనదున్నను దాన్ని మరచి యుండవల్సిందే. వివాహ కార్యముండిన యెంతరాత్రి అయినను ఒక్కొక్కప్పుడు 12 - ఒంటి గంట సమయము మీరినను అక్కడే ఉండవల్సిందే. వగలైతే భోజన సమయము మీరిపోయినను వస్తులుండి, ఆ యింటివారు భోజనమునకు లేపేవరకు గమ్మనుండవలసిందే. కార్తీక మాసము వచ్చిందంటే సరెసరి. నోములకు మమ్మదొక్కొక్కళ్ళ పాదాలను గడిగి దేవునింట్లో (దేవుని గృహములో) వేదికపై కూర్చుండబెట్టి, తమ నోమువ్రతమున కవసరమయ్యే సామగ్రిని అమర్చుకొని, ఆ వ్రతకార్యమును పూర్తిగావించుకొని నపిదప నాకు పాదపూజ గావించి తీర్థప్రసాదములను సేవించి, భోజనము జేయించి తిరిగి కందిలి లేదా బిజిలి ఒక మనిషినిచ్చి మఠమువరకు బంపేవారు. ఇదంత తతంగము సమాప్తియయ్యేవరకు రాత్రి 12-1 గం.లు అయ్యేది. అంతవరకు గాలి వెలుతురులేని యా గదిలోని కొండదోమలు నన్ను ముట్టడించి శారీర రక్తమంత పీల్చుకతినేవి. ఐనను భక్తుల కొరకాబాధను భరించవల్సిందే గదా! మరి కష్టసుఖములను సమభావముతో ననుభవించినవాడే నిజమైన సత్పురుషులంటారుగా?

ఇట్టి బాధను స్థానిక శ్రీ రైట సంగప్పగారింట్లో ననుభవించాను. వీరేగాదు, ఏ భక్తునింటికి వెళ్ళినను మఠాధిపతి తన గౌరవమును గాపాడుకొనుటకై యిట్టి కారావాసము (గృహనిర్బంధము) ననుభవించవల్సిందే. సరే ఈ రైట సంగప్పగారు చాలా పట్టుదల గలవారు. వీరు ప్రతి సోమవారము ఇంటివద్ద స్నానమును, పూజాదులను దీర్చుకొని

మఠమునకు వచ్చి శ్రీ స్వాములవారికి మరియు నాకును నమస్కరించి, శ్రీ నిరంజనస్వామివారి సమాధికి కర్పూరము వెలిగించి, అగర్బత్తీలను ముట్టించి టెంకాయనుగొట్టి సగభాగమునక్కడేయుంచి, జుత్తుగల సగభాగమును దాను దీసికెళ్ళేడివాడు. ఇతడు రజాకారుల కాలములో సదాశివపేట నగరములోని కొన్ని దుకాణములను ముస్లిములు కాల్చివేసిరి. ఆ సమయంలో హిందువులందరు తమ ఇండ్ల తలుపులు మూసికొని ఉండగా. ఇతడొక్కడు తన దుకాణము (కొట్టులోని) ఖాతాను (లెక్కలు వ్రాసే బుక్కును) దెచ్చుటకై ఇంటి నుండి బయలుదేరివచ్చెను. మధ్యమార్గములో శ్రీ శెట్టి రేపప్పగారు వారి బంధువులు "ఇది సమయము గాదు, వెళ్ళగూడదని ఎంతగా వారించినను" వినలేదు. అతడు తన కొట్టునకు వచ్చి తలుపుచెక్కలు దీసేలోపున ముస్లిములు కొందరాతనిని ముట్టడించిరి. అతని శరీరమునకు బట్టలుజుట్టి కిరోసీను బోసి నిప్పుపెట్టిరి. ఆ బాధను సహించలేక నడుపను శక్తిజాలక ఆ మంటలతోనే కొంత దూరము దొర్లిబోయెను. కాని ఆ దుస్సంఘటన పరిస్థితిలో అడుకొని అతనిని రక్షించే సాహసమెవరికుంది? తనకు ఏ విధముగా మరణము ఘట్టిల్లునో ఎవరికి తెలుస్తుంది. దానిని దప్పించుట ఎవరికి సాధ్యము? భూమిపైనున్నందే ఋణముదీరితే జీవుడు తన శరీరమును విడిచివెళ్ళె అప్పుడు ఎవరు? తానే ఆపగలరు?

సదాశివపేటలో అటకరివారు, జాంగ్డవారు, అనే లింగాయతులు కొందరుండిరి. వీరందరికి శ్రీ విరూపాక్షస్వాములవారు శ్రావణమాసమున, శివదీక్షనొసంగియుండిరని, ఇందులో ఈమొదలే వివరించుటమైనది. ఈ అటకరి వారుండే వాడకు "అటకరిపేట" అని బిలువ

బడుచుండెను. వీరు నివసించే బస్తీలో, వీరి కులదేవతయైన చౌడేశ్వరి మందిరమొకటుండినది. ఒకయేడు ఈ దేవత పేరిట రథోత్సవమును జరిపిరి. అప్పుడు నేనే పెద్దమఠాధిపతిగానున్నందున, మంగళ వాయిద్యములతో మఠమునకు వచ్చి, నన్ను శాలువతో సత్కరించి, తోడ్కొని, రథములో గూర్చుండబెట్టి ఊరేగించిరి. ఈ అటకరి వారి గృహములలోను ఏ శుభాశుభ కార్యములు జరిగినను, మమ్మల్నె దోడ్కొనుచుండిరి. మఠము అధిపతి నేతృత్వములోనే, మడుపతివారు వారి కార్యములను నిర్వహించేవారు. వీరిలో కొందరు ధనవంతులు గూడ ఉండిరి.

సదాశివపేట నగరవాసులైన వీరశైవులలో సబాయపువారు అవగా రాచోట్లు వీరందరికి చాలామట్టుకు వ్యవసాయమే వీరికి ప్రధాన వృత్తి. వీరుండే నగరంలోని సగభాగము ఉత్తరదిశలో నున్నదానిని పాతబస్తి, అని వాడుకలో ఉంది. మిగత దక్షిణ భాగములోనున్న దానిని శివభక్తులందరు కొత్తబస్తి అథవా ఎడ్లబజారు. అని పిలువ బడుచుండినది. ఈ బస్తి నివాసులందరిలో ఆచార విచారవంతులే. అధికముగా నుండుటవలనను వీరిలో దీక్షవంతులు, శీలవంతులుగా వ్యవహరింపఁబడిరి. వీరు నివసించే బస్తిలో శ్రీ బసవన్నగారి ఒక ప్రాచీనమైన గొప్ప దైవగుడి ఉంది. కనుక ఎడ్లబజారని బిలుచుటలో సార్థకతయెంతేని ఉంది.

ఇక్కడ చూడముచ్చటగానున్నది రామ మందిరము. ఇందులో చిన్నవి శ్రీరామ, సీత, లక్ష్మణుల పాలరాతి విగ్రములు గర్భగుడిలో నున్నవి. గర్భగుడి యెదురుగా, హనుమంతుని

మరియు గరుడుని విగ్రహములున్నవి. ఇవిగూడ పాలరాతి విగ్రహములే. గర్భగుడిపై రామలీలకు (చరిత్రకు) సంబంధించిన విగ్రహములు చూడ ముచ్చటగా నుండినవి. ఇందులో పూజారిగా హరిదాసు, శ్రీ గోవిందప్ప అనేవారు ఉత్తమ సాత్వికగుణసహితుడు. వినయ, విధేయతలతోను, మృదుమధురమైన మాటలతో మొట్టమొదట కోమట్లను, తరువాత వీరశైవులను క్రమేపి రానురాను హరికథ, శ్రావణ మాసములో పురాణ ప్రవచనాది కార్యక్రములతో, నగరములోని అన్ని జాతుల, మతములవారి హృదయముల నాకర్షించిరి. వీరిపట్ల వైశ్యులకు యెనలేని భక్తియుండెను. రానురాను శివభక్తుల హృదయములను చూరగొన్నారు. వీరి కాలములోనే, రామమందిరమన్నిహంగులతో నభివృద్ధిని సంతరించుకొన్నది. ఎల్లప్పుడేవేవో, కార్యక్రమములు మందిరములో నిర్వహింపబడుచుండును. కొన్ని సం॥ముల క్రితమే వీరు దీర్ఘవ్యాధిచేత పరమ పదించిరి. ప్రస్తుతము వారి కుమారులు న్నారు. వారిలో శ్రీ పండప్పగారుగూడ తండ్రిగారు జూపిన మార్గ ములోనే నడచుకొను చున్నారు.

నేను బాల్యములో సదాశివపేటకు వెళ్ళినప్పుడు, శ్రీ గోవిందప్ప గారు ఒక్కరే మహారాష్ట్రము నుండి వచ్చి, రామమందిరములో నొక చిన్నగదిని దీసికొని, గుడికి దక్షిణముననున్నదానిలో నివసించిరి. కొందరు నాతోటి బాలురను జేరదీసి వారికి హార్మోనీయము, తబలా, భజనకీర్తనలను నేర్పుచుండిరి. వారారోగ్యముతో నున్ననాళ్ళలో గ్రామములో భిక్షాటన జేయడము మానలేదు. ఐనను వారు బ్రతికి యున్నప్పుడే భవిష్యత్తు సంతానమునకు గావల్సినంత స్థిరాచరాస్తిని సంగ్రహించిపెట్టారు. వీరి శిష్యులు ధనికులైన కోమట్లు ఉండుట వలన, వారన్నివిధముల తమ అభివృద్ధిని సాధించిరి. నన్నొక్కడైన

జూచిన తక్షణమే నమస్కారమని, రెండు చేతులెత్తి దండముబెట్టి "కుశలమేనా?" అని మృదువుగా బలకరించేవారు. వయస్సులోను, జ్ఞానములోను నేను చిన్నవాడినే. ఐనప్పటికి, సంస్కృతాధ్యయనము జేస్తున్నానని, వారికి నాయెడ అట్టి ఆదరభావముండేది. అందుకే "విద్వానేవ విజానాతివిద్వజ్జన పరిశ్రమః" అన్నారు. అంతేగాకుండ నేను సెలవుల్లో కళాశాల నుండి సదాశివపేట శ్రీ శివుదాసపు బక్కయ్యగారి పిలుపుపై వచ్చి వారి అభ్యర్థనమేరకు స్థానికములోని నగరానికి దక్షిణ దిశలో వెలుపలనున్న చేవెళ్ళవారి మఠములో ప్రతి దినము సాయంత్రము 5 గం. నుండి రాత్రి 9 గం.ల వరకు పురాణ ప్రవచనమును నిర్వహించుచుంటిని. అందుచేత కొందరు భక్తులు గూడ నావట్ల విధేయులై యుండిరి. ఇది కూడ వారు గౌరవించుటకు గొంత కారణము.

ఇట్లు రామమందిరమే గాకుండ నగరమునకు తూర్పుదిక్కున "దుర్గాదేవి" మందిరముంది. ఇక్కడ గూడ ఒక్కొక్కప్పుడు గొప్ప జాత్ర, ఉత్సవము, అత్యంత వైభవోపేతముగా జరుగుచుండినది. ఇక్కడ రథముగాక రంగురంగులతో నలంకరించినశకట (బండ్లను) ములను,ఎద్దుల నలంకరించి, ఆ దుర్గాదేవి గుడిచుట్టు త్రిప్పేవారు. కాని ప్రాణిహింస ఇక్కడ బాగుగా జరిగేదని విన్నాను. దీనివట్ల (జాతరలో) గ్రామాధికారులే అధిక శ్రద్ధవహించి నిర్వహించుచుండిరి. ఈ మంది రమునకు ముందుగానే మొదలు ప్రభుత్వోన్నత పాఠశాల యుండెడిది. ఇప్పుడు దీన్నే కళాశాలగా మార్చియున్నారు. ఈ నగరమిప్పుడు వట్టి నగరమే గాకుండ జనాభను, పట్టణాభివృద్ధిని, ఇట్టి ప్రభుత్వము, తాలూకగ గుర్తింపు ఇచ్చినది.

దక్షిణదిశలో శ్రీ సంగమేశ్వరాలయముంది. శ్రీరామమందిర మునకు పశ్చిమదిశలో కొద్దిదూరములో మాణిక్య ప్రభుమందిర ముంది. మాచిన్నతనములో ఇందులో నాటకములను ప్రదర్శించెడి వారు. ఒకొక్కప్పుడు మా పెద్దనాన్నగారు బ్రతికియున్నప్పుడు మా పెద్దమఠము పెరడుమైదానములోను నాటకప్రదర్శనలు జరుగేవి. ఇక్కడినాటకమును దిలకించుటకయై అప్పుడు నగరములోని సుప్రసిద్ధులైన శ్రీమంతులైన దేశెట్టి, శ్రీ షడాక్షరి నామదేయుడిక్కడికి రాజఠీవితో వచ్చితిలకించేవారని వింటిని. శ్రీ విరూపాక్షస్వామి గ్రామాం తరములకు పురాణప్రవచనమునకై వెళ్ళినప్పుడు అక్కడిభక్తుల యాహ్వా నముపైతాము వెళ్ళేముందు నాభోజనవ్యవస్థకొరకు శ్రీ ఎంపల్లిశంకరప్ప గారింట్లోగాని, లేదా కొనుగుర్తి తోటప్పగారింట్లోగాని, భోజనము జేయు మని నాతోచెప్పిరి. ఇంటియజమానులను మఠానికిపిలిపించి చెప్పివెళ్ళే వారు. సరేఇక వారుతిరిగి సదాశివపేటకువచ్చే పర్యంతమువారిండ్లల్లోనే రెండుపూటలు భోజనముచేసి (ఉ॥ - సా॥) మఠమునకువచ్చి రాత్రి పరుండేవాడిని. ఒకొక్కప్పుడు ఆ భక్తులిండ్లలోనే పరుండు మని చెబితె అలాగే అని అక్కడే పరుండేవాడిని. ఎందులకనగా మఠము చాలపెద్దది, విశాలమైనది, యెల్లప్పుడు పనియిరువదైదుమంది ఉండదగినదాంట్లో నీవొక్కడివే చిన్నవాడివి, పరుండటము మంచిది గాదని వారు వాదించుచుండిరి. ఐనను రామయ్య అనే పుట్టుండువా పగలంతా యెక్కడికోవెళ్ళి చాలారాత్రిగడచినట్లు మఠమునకు వచ్చి పరుండెవాడు. ఇతడు శూద్ర (తెనుగు) కులములో జన్మించినప్పటికి బాల్యము నుండి సుప్రసిద్ధులైన చౌకిమఠము శ్రీ చెన్నమల్లప్పగారి సేవలోను,మరియు మా పెద్దనాన్నగారి సేవలో ఉండబట్టి, ఇతడుస్వ

శ్రేణికిజెందిన వీరశైవుల భక్తులవలె ప్రతిదినము స్నానముచేసి, మడిగుడ్డలనుదాల్చి లింగార్చన, రుద్రాక్షమాలతో జపము, నుదుటపైనిండ భస్మత్రిపుండ్రరేఖలు మెడలో దొడ్డువి రుద్రాక్షమాలలు ధరించి, ప్రసాదీక్షుల మాదిరితాను దినేకంచమును, నీరుద్రాగే చెంబును, శుభ్రముగా తోమి తనవద్దనే జాగ్రత్తతో బెట్టుకొనెవాడు. భక్తామాహేశ్వరుల గృహాల్లోనే ఒకపూట మధ్యాహ్నము భుజించేవాడు. తాను స్నానము జేసినపిదప యెవరైన ముట్టిన (తాకిన) మరల స్నానముజేయు చుండెను. ఇంతటి ఆచారవిచారముగల వాడు. ఇంకపోతె ఈ మొదలే పేర్కొనినట్లుగా మఠముయొక్క వాకిలి, అంగణము, వరాండాలలో కసుపూకి కలియంపి (పేడనీళ్ళు-చాన్పి) చల్లడానికి ఆంధ్రానుండి నాటక కంపినితోజాటు వచ్చిన అమ్మణి అనే ఒక వృద్ధురాలుగూడ మఠములోనే ఉండెడి. వీరిద్దరు మఠమునకు కొద్దిదూరములోనున్న మహాద్వారమునకులోతట్టున ఉండిన కుడిబంకులో ఒకరు (అమ్మణ్ణి) ఉండేది. ఎడమబంకుల్లో శ్రీ రామయ్య ఉండేవాడు. అమ్మణ్ణి చాల జాగ్రతగలది. ఇద్దరు పొగత్రాగెవారు, కాని అమ్మణికి రామాయణ-మహాభారతములోని కథలన్ని పరిచయముండినవి, కనుక పక్కింటి ఆడవాళ్ళతో ఈ కథలను జెబుతు కాలక్షేపము జేయుచుండెను అప్పుడు నేనుగూడ ఆ ప్రక్కనే గూర్చుండి, మిక్కిలి ఆసక్తితో వినేవాడిని. ఇతర కథలనుగూడ ఈమె రసవత్తరముగా చెప్పేది. భాష బాగుగా ఉండేది. పగలంతా బజారు అడితి దుకాణాలలో ధాన్యముసు, బిచ్చమడిగి తెచ్చుకొనేది. రెండుపూటలు కాఫి త్రాగేదిగూడాను, అప్పట్లో నాకాఫి, టీ, అంటే ఏమిటో నాకుదెలియ కుండెవి. అప్పుడు నేను వేరేవారివద్ద ఎక్కడబడితే అక్కడ

త్రివడముగాని, అథవా నీరుత్రాగడముగాని, చేసెడివాడినిగాను. ఏలనన బాల్యమునుండి నాకు మా తల్లిదండ్రులు గఱపిన శిక్షణ అట్టిది. అందును నేను మఠమునకుత్తరాధికారిని. కావున ఇతరులకు ఆదర్శప్రాయముగా ఉండి చక్కనైన సంస్కృతి సాంప్రదాయములకు కట్టుబడి వుండాల్సింది.

మా స్వాములవారు సదాశివపేటను దిరిగి రావడముతో నేను వారి పరిచర్యలో తొడగి వారి స్నానమునకు నీరు వెడిజేయడము, వారివస్త్రములను ఉదికి శుభ్రపరచడము, పాత్రలుతోమడము బావినుండి నీరుదోడి స్నానమునకాయత్తపరబడము, గద్దిగెవేసి, పత్రి-పుష్పాలు గంధాక్షములను సంగ్రహించి, దేవగృహములో ఉంచి, చౌకిబావినుండి మంచినీటికడవనుతలపై మోసుకొనితెచ్చేడివాడిని.

ఒకతూరి ఇతరత్ర పనులలో నిమగ్నుడనై స్వాములవారి స్నానమునకు నీరు వేడిజేయడములో మరచియుంటిని. మంచినీటికై వెళ్ళివచ్చితిని. స్వాములవారికి పట్టిరాని యావేశమువచ్చి నన్ను తనదగ్గరకు బిలుచుకొని నాస్నానమునకు నీరు వేడిజేయనిదే నీరు దేవడానికి వెళ్ళావా! అని గద్దిస్తూ ఒక సన్నని పచ్చిచింతకఱ్ఱతో నావీపుపై బలంగాకొట్టెను. ఆ దెబ్బకు మాంసము పైకివచ్చియుండెను. ఆ బాధను భరించలేక రొదిస్తువుండగా, ద్వారముకడనుండి దిలకించుచున్న అమ్మణ్ణివచ్చి స్వామివారిని "చిన్నపిల్లవాడిని అట్లగొడ్తారా? పరాయిపిల్లవాడు. వాడితల్లిదండ్రులిక్కడుండి యిదిజూచినచో వారూరుకునేవారెనా?" అని కోపపడినన్ను తన వద్దకు దీసికెళ్ళి యెంతగానో ఓదార్చినది.

ఇట్లు మఠముయొక్క పనులు మరియు వారి సేవా, వృత్తిని ఒకవైపు నిర్వహిస్తు, మరోవైపు పోలాలు, చక్కగా జూచుకోవడము, ధాన్యపుకల్లాలప్పుడు అక్కడే రాత్రిళ్ళు పరుండడము. మరియు గ్రామములోని కార్యక్రమములకు వెళ్ళడము, ఊళ్ళో భిక్షాటనకుగూడ నన్నే వెళ్ళరమ్మని స్వామివారు ఆజ్ఞాపించెడివారు. ఇంతపని జేసినను మా స్వామి ఒక్కనయాపైస గూడ ఇచ్చేవాడుగాదు. పైగా భక్తు లింట్లలో శుభాశుభ కార్యములకు వెళ్ళగా, వారు సంభావనారూపముగా నిచ్చిన డబ్బులను వెంటనే తెమ్మని అడిగి పుచ్చుకునేవారు. పిన్న ప్రాయమున జోగిపేటలో మా నాన్నగారుగూడ అంతె.దీనితో బజారులో ఇష్టమొచ్చిన తినుబండారములను, ఫలములను, ఆటవస్తువులను కొన డానికవకాశముండేది కాదు.

గ్రామములో భిక్షాటనము నుండి దెచ్చిన జొన్నపిండిని గూడ విక్రయించి డబ్బు జేసుకునేవారు మా విరూపాక్షస్వామిగారు. దినాలు శ్రమ యనుకొనకుండ నగరములోని సగము బస్తీలోని ఇళ్లిల్లు దిరిగి తెచ్చినపిండిని విక్రయించి వారుడబ్బులు కూడబెట్టుచుండిరి. ఒక్కొక్క పర్యాయము సం॥మున కొకతడవ, నేను ధరించే బట్టలు గూడ ఇట్లు పిండిని విక్రయించిన డబ్బుతోనే కొనియిచ్చేవారు. ఐతే జోగిపేటలోని మా తీర్థరూపులు (తండ్రిగారు) నగరములో దాను దిరిగి భిక్షాటనము వలన వచ్చినట్టి పిండి, బియ్యము, వస్తుసామగ్రిని మఠమున కతిథు లుగా వచ్చిన భక్తులకు భోజనాది ప్రక్రియలతో తృప్తిబరుచుచుండిరే గాని, భిక్షాటనము నుండి వచ్చిన వస్తుసామగ్రిని విక్రయించకుండిరి. వారు తరచుగా పోగాకు మంచి నెయ్యి, దూలములు, తలుపుచెక్కలు, టోకధరలకు గొని, వాటి ధర హెచ్చినప్పుడు విక్రయించి డబ్బును,

సంగ్రహించెవారు. డబ్బును వృధా ఖర్చుపెట్టెవారు గాదు. అప్పుడప్పుడు ఫలములను మా కొరకు గొనిదెచ్చెవారు. వీరు వ్యవసాయము జేసి ధాన్యమునధికముగా పండించి, డబ్బును సంగ్రహించుకొని ఆసాములకప్పుగా ఇచ్చిపుచ్చుకొనే వ్యవహారము గూడ పెట్టుకుండెను.

వీరు గృహస్థులు గనుక అట్లు జేయవలసినదే గదా? తన భార్యాపిల్లల సంరక్షణ కొరకు ఏదో ఒక న్యాయమైన వృత్తిని నవలంబించక తప్పినది కాదు. కాని సన్యాసియై ధాన్యము కొనుగోలు ద్వారా డబ్బును సంగ్రహించి, కూడబెట్టుట మా గురుగారైన శ్రీ విరూపాక్షస్వామికి దగినది గాకుండినది. డబ్బును కొందరాసాములకు ఋణముగా నిచ్చిపుచ్చుకొనుట వీరి యోగ్యతకు దగినది గాకుండెను. నానురాను వీరిలో అంతులేని దురాశ గూడుకట్టుకొని పోయెను. దీని ఫలితముగా స్వాములవారు భక్తుల అపవాదమునకు గురువైరి. స్వాములవారికి "నాబుద్ధిబలమునుపయోగించి డబ్బు నార్జించుకొనుచున్నాను. నేనెవరిని బిచ్చమడుగలేదు గదా? అథవా ఎవరికన్యాయమును దలపెట్టి ధనార్జన జేయలేదు గదా?" అనే ధీమా స్వాములవారికుండేది. ఈ ధీమాతో భక్తులను లెక్కజేయకుండిరి. కొందరికిచ్చిన డబ్బును ఆసాములు తిరిగి చెల్లించలేదు. నిగ్గరగా, దట్టించి వారిని అడగడానికి స్వామికి ధైర్యము లేకుండినది. పైగా తనకడ వేల డబ్బును అప్పును దీసికెళ్ళిన (కొందరు భక్తులు), ఆసాములు మీరు సన్యాసులు, మీకు డబ్బుతో పనేముంది? తిరిగ్గా మా చేతినిండా డబ్బు ఉన్నప్పుడు మీ ఋణమును దీరుస్తాములే. అని తప్పుకునిరి. ఈ డబ్బు మూలమున మొదలు తమకు సన్నిహితమైన వారందరు దూరమైరి.

...

శ్రీవారు డబ్బిచ్చినవారిని మరల ఇమ్మని అడుగగా, కోపముతో డబ్బివ్వకుండగానే దూరమైరి. పూర్వానుభవముతో తాను డబ్బిచ్చి మోసపోయినందులకు కొత్తగా డబ్బునడిగిన వారికివ్వకపోవడముచేత అట్టివారును కోపముతో దూరమైరి. డబ్బేమి జేయించదు? డబ్బుతోనే లోకములో మిత్రులు, శత్రువులు గూడ అగుదురు. ఈ లోకమతీరింతె గదా? రానురాను వీరిని సందర్శించే భక్తుల సంఖ్య తగ్గెను. తత్పరిణామముగా నగరములో కలకాలముండుటకు ఇష్టపడకుండిరి. పరిసర గ్రామభక్తులు వచ్చి, వారిని గ్రామములో పురాణప్రవచనములకు రమ్మని యాహ్వానించి దోడ్కొనిపోయినచో తామువారి గ్రామమునకు వెళ్ళుచుండిరి. భక్తులలో వీరివద్ద డబ్బును అప్పుగా గైకొని తిరిగి చెల్లించకుండా ఉండినవారిలో శ్రీ దుబలగుండి శరణప్పగారు సుప్రసిద్ధులైనవారు.

ఒక్క ధనార్జన విషయములో వారికి కళంకమేర్పడినది గాని, మిగత ఆచారవిచారములోను, విద్యా విషయములోను, బ్రహ్మచర్యము లోను,వారికివారేసాటి,మరేవరును లేకుండిరని ధారాళముగాచెప్పవచ్చును. ఇంద్రియ నిగ్రహములో ఈ కాలములోని అపరభీష్ముడనియె చెప్ప వచ్చును. శ్రీ దేశెట్టి బసవరాజుగారివంటి రాజకీయ నాయకులు, భక్తులు, వీరియెదుట నిలబడి యెదిరించి గట్టిగా మాట్లాడే సామర్థ్య మెవరినికి లేకుండెను. ఒకసారి శ్రీ దేశెట్టి బసవరాజుగారే నాతో చెప్పగా వింటిని. "స్వాములవారిని యెదిరించి మాట్లాడే ధైర్యము నాకు లేదు." ఎందుకనగా వారు దృఢమైన బ్రహ్మచారులు, (జితేంద్రియము గ్గలవారు). కనుక వారి ముఖము నుండి కోపపూరిత వాక్యము వెలు వడిన, అది నాపాలిట శాపముగా నుండేదని జంకుచుండిరట. బసవరాజుగారు గూడ సామాన్యులుగారు. వారు దిట్టమైన రాజకీయ జ్ఞతగలవారు. నగరవాసులెవరైనా వారినెదిరించి మాట్లాడుటకు భయ

పడుచుండిరి, వీరి కాలములో దేశెట్టివారి ఆర్థిక బలము తగ్గినను, ఆ గంభీరము, వాగ్ధాటిలో నేమాత్రము లోటులేకుండినది. కనుకనే నేను ఇక్కడ వారినొక్కరినే, స్వాములవారి కోపజ్వాలకు వెరచుచుండిరని, ఉదాహరణముగా వారిపేరునిట నుట్టంకించితిని.

ఒకసారి స్వాములు గ్రామాంతరమునకు వెళ్ళియుండగా నగరమున్నకు పశ్చిమ దిశలో ఒకమెత్తు మట్టిదిబ్బపై యేపుగా పెరిగి యున్న ఒకటి రెండుమఱ్ఱిచెట్లు ఉండినవి. వాటిక్రింద ముస్లిముల గోరీలు, వాటి ప్రక్కనే మా మఠమునకు సంబంధించిన వరిపొలము, మూడు ఎకరములుండినది. అందులోని వరిపైరు కోతకు వచ్చియుండెను. దాన్ని స్థానికముగా లింగాయతగాండ్లవారు బటాయికి, (కౌలుకు) జేయు చుండిరి. వారు మఠమునకు వచ్చి "రేపు మేము వరికల్లము జేయు చున్నాము. గనుక ఆ సమయములో మీలో నెవరైన ఒకరు ఉండాలని" నాతో జెప్పివెళ్ళిరి. ఆ సమయములో మఠమున నేనుదప్ప మరెవ్వరును లేకుండిరి. కాబట్టిమఠములోని దినచర్యలనన్నింటినిత్వరగాముగించుకొని వరికల్లము వద్దకు వెళ్ళితిని. వయస్సులో ఇంకను చిన్నవాడినే. కౌలు దారు, ఆసామి ఎద్దులతో గడ్డి దొక్కించెను. గడ్డిమోపులు గట్టి ఒకవైపు కూలివారితో బెట్టించెను. ఆనాడు ధాన్యము నూర్చుడము. తూర్పారబట్ట డము పూర్తికానందులకు రాత్రంతా ఆసామితోబాటు అక్కడే ఉండ వల్సి వచ్చినది. రాత్రి 8 గం.కు నేను ఇంటికి వెళ్ళి భోజనము చేసి వచ్చెదను, అంతవరకు మీరిక్కడే ఉండమని నాతోచెప్పివెళ్ళెను. రాత్రి పదునొకండు గంటలవరకు రానేలేదు. నేనొక్కడినే వరిగడ్డిని క్రింద కొంత, పైనకొంత వేసికొని,పరుండియుంటిని. ఎక్కడెవరువస్తారో, ఆకారు

చీకటిలో దిక్కుదిక్కుమంటున్న హృదయముతో దిగాలుపడియుంటిని. మఱ్ఱివృక్షముపైనున్న పెద్దపిట్టల ఘూత్కారములు, నక్కలు కొంత సేపటికి "కూకూ" అని అరవడము మొదలుపెట్టినవి. ఏ క్రూరమృగ మిచటకు వచ్చునో గదా! అని భయముతో వణికిపోవుచుంటిని. ఏటు ఏవైపున దొంగలు వచ్చి నన్ను గొట్టి ధాన్యము దీసికెళ్తారో, అనే నానా విచారములు నాలో సముద్రతరంగాలమాదిరి నా హృదయమును కలత పరచుచుండెను. ఇంతలో ఒకరిద్దరు మనుషులను వెంబడించుకొని వచ్చిన మా ఆసామి చుట్టను వెలుగిస్తు, దగ్గుతు "ఏమి స్వామి వున్నారా? మేలుకున్నారా?" అని పలకరించెను. అందుకు నేను ఆసామి కంఠధ్వని గుర్తించి ఆ వరిగడ్డినుండి వెలుపలికి లేచివచ్చి "ఏమయ్యా! నన్నొంటరిగా ఇక్కడుంచి యింతరాత్రి వరకు గ్రామములోనే గడిపావా?" అని కోపగించితిని. అతడును "మా యింటివారు వంటను ఆలస్యముగా జేసిరి. నాకు తోడుగా వీరిద్దరిని వెంటబెట్టుకొని వచ్చుటలో, ఆలస్యమైంది స్వామి యేమిజేయను." అని కల్లమునకుకొంచెం దూరములో మంటబెట్టుకొని, కొంతసేపు మాట్లాడి వారును పరుండిరి.

నేను స్వామివారి ఆదేశానుసారము నగరములో ఎండ-వాన-చలికాలములను లెక్కపెట్టకుండ కష్టపడి, దినాలు ఉదయము 8-30 గం.ల నుండి మొదలుకొని మధ్యాహ్నము 12-30 గం.ల వరకు పిండి భిక్షాటనము గావించి, మరల మధ్యాహ్నము మఠమునకు వచ్చి స్నానముచేసి, ఇష్టలింగార్చనను ముగించుకొని, ఊళ్ళోకెళ్ళి, వీరశైవ భక్తులిండ్లలో మాధుకరము (కంతిభిక్షము, రొట్టెలు, అన్నము) వండిన పదార్థముల భిక్షాటన గావించి తెచ్చేవాడిని. ఇదిదెందులకనగా

మఠములో పక్వాన్నము జేసెవారెవరును లేకుండిరి. కనుకనే ఈ కంతి భిక్షాటనము గావించెవాడిని.

ఐతె ఉదయము పిండి భిక్షాటనకు వెళ్ళినప్పుడొక యింటి యజమానురాలు నేను సరాసరి ఇంట్లోకి వెళ్ళకుండ, ఇంటి మహా ద్వారము లోపలి రెండరుగుల మధ్యన నిలుచుండి "గురుధర్మ స్వయంపాకద భిక్ష" అని శబ్దము నుచ్చరించగానే ఆయమ్మగారు పిండిని తన దోయిటినిండ బట్టుకొని, గృహము వసార (వడసాల)లోకి వచ్చి నన్నుజూచి "ఏమప్పగారు! మీరు ఇక్కడిదాక రాకుండ అక్కడే నిల్చుంటారు. వేరే బిచ్చగాళ్ళమాదిరిగా మీరల్లంత దూరమున నిలబడ గూడదు. మీ మర్యాద వేరు. మీకు మేము భిక్షముబెట్టి, పాదాభివంద నము జేయాలికదా!" ఆ బంకుల్లో వేరేపురుషులెవరైన వచ్చి కూర్చుండి, మాట్లాడుతూ ఉంటే మేమక్కడికి యెలా వస్తామని? ప్రశ్నించెను. అందుకు నేను "సరేలేమ్మ రేపట్నుంచి అట్లే జేస్తానని" చెప్పి అట నుండి బయలుదేరితిని. మరో ఇంట్లోకి వెళ్ళినప్పుడు సరాసరి నేరుగా వసారా (వడసాల)లోనికి వెళ్ళి "గురుధర్మ స్వయంపాకదభిక్ష" అని శబ్దముచ్చరించడముతోనే ఆ యింటి యజమాని వచ్చి నన్నుజూచి "ఏమయ్యా! ఇంతలోపలికి చొచ్చుకొని వచ్చావు? ఇక్కడ ఆడవాళ్ళుం ట్నారు. కనుక నీవు మహాద్వారము లోపలి అరుగుల మధ్యనే నిల్చుం డాలని" గద్దించి చెప్పెను. ఆ రెండు సంఘటనలు నన్నయోమయంతో బడవైచేను. లోనికి వెళ్ళితే ఒకబాధ. వెళ్ళక బయటేనిల్చుంటే మరొక బాధ, ఏమి చేయను? అని సుదీర్ఘముగా నాలోనేను ఆలోచించుకొని, యేమైనగానిండు వసారాకు కొంత దూరముగా ఉంటేనె మంచిదని నిర్ధారించుకొంటిని. "లోకోవభిన్నరుచిః" అన్నట్లు ఒక్కొక్కరి

విచారము ఒక్కొక్క రీతిగా ఉంటుంది. ఒక విచారము మరొకరికి సరిపడదు గదా! అందుకే అనుభవజ్ఞులైన పెద్దలు "భీక్ నిధాన్" భిక్షమెత్తువాడు ఏవరేమన్నను వారికెదురాడకుండ శాంతముతో వారాడిన మాటలను సహించుకోవాలి. ఐతె మా మఠాధికారుల భిక్ష మాలాంటిది గాదు. మఠాధికారులకు భిక్షము బెట్టి పాదములకు నమస్కరింతురు. కూర్చొమ్మని గౌరవింతురు. ఇతర సామాన్య భిక్షువులకు దానమును నీడి పాదాభివందనము జేయరుగా! ఎవరి యోగ్యత వారికుంటుంది.

ఈ భిక్షాటన మఠముయొక్క పనులధికమగుటవలన నేను కానిగి (ప్రైవేటు) బడికి బోవడము మానుకుంటిని. మఠములోనే మధ్యాహ్నముగాని, లేదా సాయంత్రము వేళ్ళలోగాని మా స్వాములవారే వీరశైవ ధర్మమునకు మూలగ్రంథమైన శతకత్రయములోని పద్యములను జెప్పి, నాచేత వల్లింపజేయుచుండిరి. కాని స్వామివారికి కోపమధికము గనుక కొద్దిగ అపశబ్దమును బల్కినచో దాన్ని వారు విని సహించేవారు గాదు. ఏలననవారు సంస్కృతజ్ఞులు కాబట్టి, కానీ తామభ్యసించిన సంస్కృతము ఇతరులెవరికిని బోధించనందువ "అజాగళస్తనముల్లాగ" అనగా మేకమెడలోని చన్నులవలెనిష్ప్రయోజనమయ్యెను. కాని వారి మనసులో ఒక పాఠశాలను లేదా శివానుభవ కాలేజిని స్థాపించవలెననియు, మరియు నొక ధార్మిక పత్రికను నిర్వహించవలెననుత్కంఠేచ్ఛ వారిలో నుండినది. అప్పుడప్పుడు నాతోను, ఇతరులతోను జెప్పేవారు. వారికోరిక ప్రకారము నేను "వీర శైవధర్మ" అను పత్రికను నిర్వహించాను. పాఠశాల, ధార్మికకళాశాల స్థాపనకై నిరంతరము యత్నించుచున్నాను. అది సిద్ధిస్తుందనుకుంటాను.

వేసవి కాలములో అమృతముల్లాంటి మామిడిపడ్ల సుగ్గిరావడముచేత చాలమట్టుకు భక్తులీ సమయములో గణారాధన నాచరించేవారు

తరచుగా భక్షాలు - మామిడి పండ్ల రసమును తాజా నెయ్యిలతో మహేశ్వరులను తమ ఇండ్లకు రప్పించుకొని, తృప్తిపరచుచుండిరి. వివాహాది కార్యములందును పూర్వములో భక్ష్యభోజనములు అనగా సొజ్జపోలెలు విరివిగాజేసి ఒక గదిలో క్రింద వరిగడ్డి బరచి దానిపై వరసగా పేర్చుచుండిరి. ఆగంతుకులకు వాటిని కోరినంతవరకు వడ్డించి, ముద్దబప్పు, నెయ్యి వానిపైవేసి తృప్తిపరచి సాగనంపేవారు. మఠము, మఠపతివారు తమ ఇండ్లలో సుష్ఠుగా భోజనము జేయించడమే గాకుండ, వివాహ సందర్భమున సారెగంపలో మొదలే మఠము, మఠపతి, శెట్టి వారికి లెక్కజేసి యుంచిన సొజ్జభక్ష్యములను, హప్పడములను షండిగములను, ఆకులు, పోకలు, కజ్జురపండ్లు, పసుపుకొమ్ములు, కుడుకలు, బాదాముకాయలు, ముగ్గురిలో ప్రతివారికి ఇరువదియొక్కటి ప్రకారము లెక్కజేసి ఇచ్చేవారు. ఇట్లు ఆ సమయములో ఎన్ని వివాహములున్నవో నాయిండ్లవారిదేవిధముగా ఇచ్చే సాంప్రదాయముండేది. నేను వీటన్నిటిని దెచ్చి దేవగృహము ద్వారముపైన గూటిలో వరుసగా క్రింద ఒక గుడ్డను బరచి వరుసగా పేర్చి పైన మరో వస్త్రాన్ని గప్పి ఉంచేవాడిని. ఒకటి రెండు దినములలో వాటిని భుజించడమువలన కంటగించి పోయెడిది. మిగతవాటిని దినలేక అట్టే ఉంచగా నవి బూజుబట్టి పాడయ్యేవి. వాటిని కచరాకుండిలో బటపైచేవాడిని. కజ్జురపండ్లనుగూడతినగా మిగిలిన వాటిని పడసాల ప్రక్కగూటిలో బటపైచేవాడిని. కొబ్బరి కుడుకలు గూడ ముక్కవాసనతో బూజుబట్టి పాడగుచుండెను.

సదాశివపేటలోని ప్రజలైతేనేమి, జోగిపేటవారులైతేనేమి. ఆ కాలములో ఆహారపదార్థములన్నియు చౌకగా నుండుటవలన సుఖమయు

భోజనము జేసెడివారు. ప్రతివారి ఇండ్లలో జొన్నరొట్టెలు,సన్నబియ్యపు (రాజహంసలు) బోగిరము, ముద్దబప్పు, తాజా నెయ్యి, పప్పుచారు దీనినె ఉళిబ్యాళి అనేవారు. చారు రెండుమూడు రకములైన కూర గాయలు, రకరకాల పచ్చళ్ళతోను భోజన పదార్థములను శుభ్రముగా పక్వము గావించుకొని, సుష్టుగా భుజించి సుఖముగా కాలయాపనము జేసెడివారు. తిండికొరత యేమాత్రము లేకుండినది.

ఇట్లు సదాశివపేటలో కొన్నాళ్ళు కాలక్షేపము జేసిన పిదప మా విరూపాక్షస్వాములవారికి శంషాబాదు నుండి సుప్రసిద్ధ ధనవంతులైన శ్రీ సాయం సిద్ధరామప్పగారి నుండి తమ కూతురి (సుశీల) వివాహ సందర్భమును బురస్కరించుకొని ఆహ్వానము వచ్చియుండెను.ఆవివాహ ముకు దుద్దాల శ్రీసంగమేశ్వరుగారిని వెంబడించుకొని సదాశివపేటనుండి ముగ్గురము ఉదయము బయలుదేరితిమి. మధ్యాహ్నము హైదరాబాదులోని "నయాపూలు" వద్ద బస్సుదిగితిమి, ఇటనుండి బస్సుమార్గాలి. శంషాబాదుకు వెళ్ళుటకై సర్వీసు లేదాగుఱ్ఱపు టాంగాలోనైన బోవల్సి యున్నందునటాంగాకు బయలుదేరివెళ్ళితిమి, హైదరాబాదు నగరమును నేను ప్రప్రథమమున సందర్శించాను. గావున దాని సౌందర్యమును చిలకించిననాకుచాలా సంతోషమనిపించినది. ఏలనన ఇంతటి సౌందర్య పట్టణమును నేను బాల్యమునుండి యెప్పుడు ఎక్కడను దిలకించలేదు. గనుక అప్పటి నిజాం "ఉస్మానలీఖాను" కాలములో,పట్ట ణము యొక్క వైశాల్యము ఎటు12-చ. మైళ్ళుందనివింటిని. రాజవీథులు (మేయిన్‌రోడ్లు) కొన్నిమాత్రమే అనగా కోఠి, చార్‌మినార్, నాంపల్లి,

కాచిగూడ స్టేషన్‌రోడ్డు. ఇవి బహువిశాలములుగానుండి చాలా పరి శుభ్రముగాను, అటనట అందమైన చెట్లు, మార్గమున కిరుప్రక్కలందు న్నందున చాలాఅందముగనగుపడు చుండెను. అక్కడక్కడ పురోద్యాన ములుగూడరకరకాల పూలచెట్లతోను, రకరకాలక్రోటీను చెట్లతోను అలం కరించబడియుండేవి. మా బాల్యములో నిది సౌందర్య నగరాలలోని దినాలగవదని చెప్పుకొనుచుండిరి. ఒకటవది న్యూయార్క్, రెండవది కలకత్తా, మూడవది బొంబాయి, నాలుగవది హైదరాబాదు, నగరమును బేర్కొనుచుండిరి, నిజాం, నవాబుమిగుల ధనవంతుడనియు. అతని వద్ద నవరత్నాలు, వజ్రవైడూర్యములుండెవనియు, అతనికి "రాజా నోబహువల్లభాః" అను ఉక్తిమేరకు నిజాంనవాబుకు రెండు వందలమంది ప్రియురాండ్రుండిరనియు చెప్పేవారు. ఇతనిక్రిందనున్న సామంతులు, భూస్వాములు, జాగిర్దారులు, నవాబులెందరో ఉండిరనియు, ఇతనిహయా ములో హిందువులలో శ్రీ కిషన్‌ప్రసాదు అను పేరుగల మంత్రి మఱియు రాజాబహదూరు, శ్రీ వెంకటరామారెడ్డి, పోలీసు కొత్వాలుగా ఉండే వారనియు, నిజాంగారు ఏపనిజేయదలపెట్టినను ప్రజల కల్యాణమునకై వీరుభయుల మరియు పురప్రముఖుల సలహాలను దీసికొనెడివారనియు, హిందు-ముస్లిములను నవాబు తనరెండుకన్నులవలెజూచి, పరి పాలించేవాడనియు, వింటిని. మొత్తానికి వీరిహయాములో ప్రజలు నేకరువు కాటకములులేక పంటలు సస్యశ్యామలమై సమృద్ధిగా పండు చుండుటేగాకుండ, దొంగల భయము గాని, దౌర్జన్యములుగాని, లేక సుఖసంపదలతో హిందు-ముస్లిమను భేదభావము లేకుండ పరస్పర మైత్రిలో మెలగుచుండిరి. అంతెగాకుండ దైవభక్తి, ప్రభుత్వ భయము ప్రజలలో మెండుగా నుండెడిది. ఇట్టి వాతావరణములోనే నేను బుట్టిపెరిగితిని.

జోగిపేటలో నున్నప్పుడొక పర్యాయము మెదక్ జిల్లాగా నిప్పుడు గూడ పిలువబడుచున్న సంగారెడ్డి పెద్దమఠములో అరువది మూడు మంది పురాతనుల పూజా కార్యక్రమము, ఒకటి మా గురువుల వారైన శ్రీ విరూపాక్షస్వామి నేతృత్వములో, శ్రీ చంద్రశేఖరస్వామి పావన్నపేటగారి మరియు శ్రీ గొంగులూరు మఠము సోమయ్యగారి సంచాలకత్వములో గొప్ప పరిమాణములో జరిగినది. ఈ సందర్భమున మా నాయనగారికి నన్ను దోల్కొనిరమ్మని ఆహ్వానమును బంపి యుండిరి. అప్పుడు ఇప్పటివలే బస్సుల ప్రయాణ సౌకర్యము లేనందులకు మావద్ద యెప్పుడు ఒక తెల్లని గుఱ్ఱము, నల్లని యెద్దు ఉండేది. అ గుఱ్ఱముపై నధిరోహించి ప్రయాణము జేసేవాడిని. నల్లని ఎద్దుపై నా పూజా సామగ్రి యుండేది. దీనిని "కంట్లము" బరువుమోసే ఎద్దుగా వ్యవహారములో ఉండేది.

ఇదే విధముగా ప్రయాణమై సంగారెడ్డి పట్టణమునకు అరువది మంది పురాతనుల పూజా కార్యక్రమములో పాల్గొంటిని. అప్పుడు మా సోదరులైన మా చంద్రశేఖర స్వామిగారు, మరియు మా విరూపాక్షస్వాములవారు నన్ను జూచి పలకరించి, ప్రసన్నులై నాకును మిగత స్వాములతోబాటు, స్థానిక మఠములో ఒక గద్దుగెను నాకును గల్పించి, మిగత స్వాములందరికి పాదపూజా కార్యక్రమ మొనర్చిన మాదిరిగానే, నాకును పాదార్చన యొనర్చి, పూజా సామగ్రి, వస్త్రములను, సంభావన లొసంగిసత్కరించిరి, ఇట్లే మరోసారి గూడ సంగారెడ్డి తాలూక పెద్దలోడి యనే గ్రామములోను డెబ్బదిమంది అమర "గణంగులు" అను పూజా కార్యక్రమమును, శ్రీ మునుపల్లి సంగప్ప

పచేలుగారు నిర్వహించిరి. వీరు మహా గొప్ప ధనికులుగా నా కాల ములో చలామణి యగుచుండిరి. ఏదో విధముగా తాము కోట్లకొలదిగా నార్జించిన ధనమును సత్కార్యములొనర్చి సద్వినియోగమొనర్చి సత్కీర్తిని బడయవలెయుననే కోరిక వారిలో నుండుటవలననే ఆ కాలపు భక్తులు ఇట్టి పుణ్యకార్యములకు బూనుకొనుచుండిరి.

ఇట్టి వీరి యాహ్వానమును నేను జోగిపేటలో నున్నప్పుడు రాగా మా నాన్నగారు అశ్వారోహకునిగావించి, అప్పుడు అనగా ఈ పైన పేర్కొనబడిన కార్యక్రమాల్లో బాల్గొనునప్పుడు నేనింకను కావి వస్త్రములనే ధరించేవాడిని. కనుకనే నన్నుగూడ ఒక గొప్ప మహా స్వామిగానే, మఠాధిపతిగానే పరిగణించి భక్తులు నన్నాదరముమీర పూజించుచుండిరి. ఇట్లు ఆ పెద్దలోడి పూజా కార్యక్రమములో పాల్గొని యుంటిని. అక్కడ మహాసముద్రమువలే, ఎక్కడ జూచినను జనసమూహము ఈ కార్యక్రమమును దిలకించడానికి వచ్చియుండెను. ఎక్కడెక్కడి మహాస్వాములు, కర్నాటక, మహారాష్ట్ర, ఆంధ్ర ప్రాంతముల నుండి వచ్చియుండిరి. శ్రీ మునుపల్లి సంగప్పగారు ఓ పెద్ద భూస్వామి. పెద్దలోడి చుట్టుపట్లనున్న భూములు, బావులన్నియు వారివే. గ్రామములోను పెద్దగా విశాలమైన ఇండ్లుండేవి. వచ్చిన వారందరి స్వాములకు దగినట్లు వసతి, భోజనాదులను బాగియెత్తున వ్యవస్థను గావించి యుండిరి. ప్రక్కనే నది ప్రవహించుచుండేది. దానిలో నుండిన పెద్ద గుండ్లపైనదుగిదుతు. అతి ప్రయాసముతో మేము నాగ్రామములో ప్రవేశించితిమి. మాకును ఉండడానికి వసతిని గల్పించిరి.

కాని ఇక్కడ పూజా కార్యక్రమములో నేను ఖాల్గొన్నేముందు ఒక చిక్కు సమస్యగా నేర్పడినది. అక్కడి కార్యనిర్వాహకులు స్వాముల లిష్టును సిద్ధగించునప్పుడు, మఠము పేర్లను వ్రాయకుండ కేవలము "రాచయ్యస్వామి" అని వ్రాయడముచేత, సదాశివపేట నుండి చౌకిమఠము రాచయ్యస్వామి ఒకరు వచ్చియుండెను. ఇక్కడ నేను అప్పటికే సదాశివపేట పెద్దమఠమున కుత్తరాధికారిగా వెళ్ళియుంట వలన, శ్రీ గందిగే శిద్ధరామప్ప, శ్రీ గందిగే రాచప్ప, శ్రీ సిందోలు వీరప్ప మున్నగువారు నా పేరునే ధృవపరచిరి. మొత్తానికి ఇద్దరికి పూజార్హతను గల్పించి, (వేదిక) గద్దెపై గూర్చుండబెట్టిరి. పాద పూజలు గావించి, పూజా సామగ్రియంతయును సమర్పించి, సత్కరించిరి. పూజా కార్యక్రమములో విశేషమేమనగా, పాదపూజతో బాటు ప్రతి స్వాములవారికి గోదానము గూడ పటేలు సంగప్పగారు సమర్పించిరి. కాని వాటిని దూరప్రాంతముల నుండి విచ్చేసిన మహాస్వాములు తమ గ్రామములకు దీసికొనిపోవుట గడ్డు సమస్యగా మారుటవలన, కొందరు తాము దానరూపమున బుచ్చుకొన్న గోవులను అక్కడే విక్రయించిరి. మరికొందరు ఆ గ్రామములోనే వదలేసి వెళ్ళిరి. ఇక్కడి పూజా కార్యక్రమములో శ్రీ విరూపాక్షస్వాములవారినే గొప్ప వైసహాన్య సింహాసనాధిష్ఠితుని (అగ్రపూజ) గావించియర్చించిరి.

శ్రావణ మాసములో వీరశైవ భక్తులు ఒక్కొక్కరు ఒక్కొక్క వ్రతము నవలంబించి తమ మనోరథములను పూర్తి గావించుకొనుచుండిరి. ఒక గ్రామములో ఒకరు బసవ పురాణము లేదా జగద్గురు రేణుకాది మహాచార్యుల పుణ్యచరిత్రలను పండితులచేత జెప్పించడము, లేదా శివకథా సంకీర్తనము, సప్తభజన, శివపురాణము, శివసహస్ర

పారాయణము, శివలింగమునకు రుద్రాభిషేకము, చివరిలో మహాగణా-రాధనలు గావించెవాడివారు.

ఇట్టి మహాభక్తుల్లో ఆ కాలమున మహేశ్వరారాధన గావించి, వారికి దగినట్లుగా పాదార్చన, భోజనాదులచేత దృప్తిపరచి. పరిసమాప్తి సమయమున మహేశ్వరులకు వస్త్రములలోఒకొక్క విభూతుండనుగట్టి సదక్షిణము (ఒక్కరూపాయి)గా ఇచ్చిసాగనంపెడివారు కొందరుండిరి. ఇట్టి కోవకు జెందినవారిలో మెదకు నగరము సమీపముననున్న తూప్రాను గ్రామములో శ్రీ బజారు వీరన్నగారు సుప్రసిద్ధులు. వీరు శ్రావణ మాసాంతములో ఎందరో మహేశ్వరులు తమ గ్రామమునకు వేంచేసిన యెడల వారికమితమైన యానందముప్పొంగివచ్చేది. వీరి కీర్తి ప్రతిష్ఠల కాకర్షింపబడి దూరదూర గ్రామములనుండి వీరమహేశ్వరులు నడుస్తువచ్చెడివారు. కొందరైతే, మరికొందరు అశ్వారూఢులై వచ్చేవారుమరి కొందరు. నన్నుగూడ మా నాన్నగారు బాల్యములో ఒకసారి తూప్రాణి గ్రామమునకు దీసికెళ్ళిరి. మావెంట మడుపతి శ్రీ సిద్ధయ్యగారు, మరికొందరు వారి మిత్రులుండిరి. అప్పుడు రోడ్డు లేవు. కనుక నామహాఘనారణ్యములో ఒకవైపు వర్షము గురుస్తు ఉంటెను, గొంగళ్ళను కొప్పెరగా జేసి కప్పుకొని, తుంగ చాప కొప్పెర్లను, తట్లను కొన్నింటిని గప్పుకొని వెళ్ళుచుండిరి. మార్గమధ్యాన వాగులు వంతలు, దాటుతు వెళ్ళేవారు. ఆకికారణ్యములో క్రూర మృగముల భయమొకటియుండేది. ఇట్లే హైద్రాబాదునకు చేరువలో నుండేఉందానగర్ (శంషాబాదు)లో సుప్రసిద్ధులైన శ్రీమంతులు, శ్రీసాయశిద్ధరామప్పగారు గూడ గురు-లింగ-జంగములయందు అపారమైన భక్తిగలవారై యుండిరి. వీరు లింగపూజాదురంధరులు, జంగమ

పాటోధ్థక గ్రహణాసక్తులై యుండిరి. వీరుదయము నిద్రనుండి లేవడము తోనె మొట్టమొదట తన లింగపుకాయ (వెండికరండకము) నుండి తన లింగమునుదీసి నమస్కరించి కొద్దిసేపు రెప్పగొట్టకుండ నిరీక్షిస్తు (చూస్తు) ఆ లింగానందమున దెలియాడుతు చిఱునవ్వుతో వికసిత ముఖముగలవాడగుచుండెను. కావున వీరు ప్రతిదినము జంగమ తృప్తి జేయించనిదే తాము భుజించెవారు గాదు. వీరు ప్రతి సం॥ము శ్రావణ మాసము చివరి దినమున గణారాధన గావించేడివారు, ఇప్పుడు వీరులేరు లింగైక్యమైనారు.

నేటికిని వారి సంతానములలో ఒకరైన శ్రీ సాయంశాంతి వీరప్పగారు తండ్రి జూపిన మార్గములోనే ప్రవర్తిస్తు సదాచార సంపన్నులై, తండ్రివలెనే వీరు ప్రతి సం॥ము శ్రావణ మాసాంతము గణారాధన గావించుచున్నారు. ప్రస్తుతములో వీరుగూడ శ్రీమంతులు గానే తమ వ్యవహారములను సాగించుచున్నారు. వీరు కొన్ని సం॥ముల క్రితమే తండ్రిగారి సమయములోనే తమకు జన్మభూమియైన శంషాబాదు గ్రామాన్ని వీడి, హైదరాబాదు నగరములో కొన్నాళ్ళుండిరి. ఇక్కడినుండి కొన్నాళ్ళ క్రితమే, సికింద్రాబాదు రాణిగంజిలో సొంత భవనమును నిర్మించుకొని వ్యవసాయ పనులకుపయోగపడే నీటి పంపుల వ్యాపారము జేయుచున్నారు.

శ్రీ సాయం సిద్ధరామప్పగారు బ్రతికియున్న సమయములో వారి కూతురి వివాహాహ్వానముపై శంషాబాదునకు మా విరూపాక్షస్వాముల వారితోడాటు నేను వెళ్ళియుంటిని. గదా! వీరి భవనము శంషాబాదు రైలు స్టేషనునకు సమీపములోనే యుండినది. బహుశః ఆ స్థలమువారికి సంబంధించిన ఒక చేనుగా సాగుబడి చేయుచుండెడిది కాబోలు. అందులో

ఓ మంచి బంగాళాను నిర్మించుకున్నారు. ఆ బంగ్లా వెనుక భాగమున ఒక మోటబావి. దానికి చుట్టుప్రక్కల కొంత క్షేత్రము (చేను) ఉండుటవలన అందులో సేద్యము జేయుచుండిరి. ఇది గ్రామమునకు వెలుపల పశ్చిమ భాగమున నుండెను. వీరికి జ్యేష్ఠసోదరులొకరు శ్రీ సిద్ధప్పగారుండిరి. కాని వారు సిద్ధరామప్పగారివలే సదా లింగార్చనా తత్పరులు గాదు. వారు సామాన్యులుగా నుండిరి. వీరికి నాయంపలి అనురాగముండేది. ఒకప్పుడు వారు తమ టాంగాలో హైద్రాబాదునకు పోట్కాని వారి గురుపుత్రులైన శ్రీ మహాంతు మఠము నాగభూషణయ్య గారింట్లోకి పోక్కాళ్ళియుండిరి.

వీరాగర్భ శ్రీమంతులు కనుక ఆసాములకు డబ్బును వడ్డీకిచ్చి పుచ్చుకొనే వ్యవహారముండెను. అందుచేత వారి హోదాకనుగుణ్యముగానే వివాహ వైభవమును నిర్వహించిరి. మాకు విడిదిగా నాగ్రామమునకు తూర్పుదిక్కున కొద్దిదూరములో నుండి, సుప్రసిద్ధమైన శ్రీ వైరాగ్య చెన్నబసవస్వాములవారి మఠములో నుంటిమి. ఇది విశాలమైన మఠము గచ్చుతో గట్టబడినది, పురాతనమైనది. ఈ మఠాధిపతులలో చెన్నబసవస్వాములవారు నేలపై నడచినప్పుడు అడుగులగుపడేవి కావట. ఎక్కడో మాయమై, మరియెక్కడో అగుపడేవారట. ప్రజలతో వారికి సంపర్కము లేకుండెడిదని వింటిని. నేటికిని, ఈ మహాత్ముని ప్రభావముంది. కాబట్టి భక్తులొచ్చి సందర్శిస్తుంటారు.

ఒకప్పుడు ఈ మఠములో నొకస్వామికి అధికారమొసగే సందర్భమున ఆహూతులైన మా జేష్ఠ పితృవ్యులైన శ్రీ గొల్లాళప్ప మహాస్వాములవారు గూడ వెళ్ళి, ఆ స్వామికి పట్టాధికారమొసంగినట్లు ఆ సందర్భమున అక్కడికి విచ్చేసిన మిగత భక్తా-మహేశ్వర-చర

మూర్తులతో దిగినట్టి చాయాచిత్రము, (ఫోటో) ఇప్పటికిని నా వద్ద నున్నది. ఈ సంగతిని శ్రీ సాయం శిద్ధరామప్పగారె నాతో చెప్పి యుండిరి. వారు ప్రత్యక్షముగా మా పెద్దనాయనగారిని దర్శించి యుండిరి. ఈ మఠము సదాశివపేట పెద్దమఠమునకు శాఖామఠమై యుండినది. కనుక ఆ మఠాధికారే ఇక్కడికి వచ్చి స్వామికి అధికార మిచ్చె పద్ధతి యుండినది.

శ్రీ సాయం సిద్ధరామప్పగారి వివాహోత్సవముపై శంషాబాదుకు శ్రీ విరూపాక్షస్వామి వారితోవెళ్ళి సుమారు నెలరోజులక్కడే ఉండడము జరిగెను. సన్యాసుల స్థితి యిట్లాంటిది. ఎక్కడికి వెళితే అక్కడే ఉండుట, అందును శ్రీసాయమువారికి నచ్చిననమ్మిన గురువులు గావున ప్రతిదినము వారికి గొప్ప జంగమ పాదతీర్థము సునాయాసముగా లభించుచుండెను. పోగా వారి కోరిక ప్రకారము అతిథి తృప్తి గూడ వారనుకొనకుండ జరుగుచుండెను. మేముండిన మఠమునకుత్తరాధికారిగానున్న మరి "దేవరగారు" సంస్కృతాభ్యాసమునకై అప్పుడు గుల్బర్గా జిల్లాంతర్గతమై యుండిన తాలుకా యాదగిరి శంకర సంస్కృత కళాశాలకు విద్యార్జనమునకై ఒక సం॥ము మొదలే వెళ్ళివచ్చిరి. కళాశాల వేసవి సెలవు దినాల్లో తమ గ్రామమునకు తిరిగి వచ్చిరి, ఒక రాత్రి. భోజనానంతరము మఠము ప్రాంగణములో నిండు పూర్ణిమ, చల్లని వెన్నెలరాత్రి. మెలమెల్లన వీచేగాలికి, కొద్దిగా కదిలే పెద్దగుండు మల్లెపుష్పములనుండి గుబాళించివచ్చే, కమ్మనిసువాసనలతో నిండినస్థలమది. ప్రక్కనున్న మామిడితోటచెట్టు క్రిందనున్న విశాలమైన అరుగుపై తెల్లని పరుపుపై ఆసీనులై యున్న మా స్వాములవారు కొంత సమయమువరకు నిశ్చలముగా నేకాగ్రతలో నుండి యా పిదప, ఆ మఠముయొక్క ఉత్తరాధికారి "దేవరగారిని" తమవద్దకు రప్పించుకొని

నా విషయమై కొద్దిసేపు చర్చించిరి. విషయమేమనగా మీవెంట మా అబ్బాయిని గూడ సంస్కృతాధ్యయనమునకై యాదగిరి పాఠశాలకు మీవెంట బంపిద్దామని నాకు కోరిక ఉన్నదని చెప్పిరి. అదివిని వారు అందుల కభ్యంతరమేముంది. తప్పకుండ బంపుమనిరి. నేను గూడ వారికి సమీపములోనే వరుండి యుంటచేత, ఆ ఉభయులు పరస్పర ముగా మాట్లాడుకొనే సంభాషణలు నా చెవిలోబడుచుండెను.

అదివిని నేను కొంతవరకు తృప్తిచెందితిని. ఆ తరువాత రెండు మూడు రోజులు గడచిన పిదప స్వాములవారు స్వగ్రామమునకు వెళ్ళుటకై సిద్ధపడుచుండుగా, శ్రీ సిద్ధలింగస్వామి మరి దేవరగారు, "ఏమండి మీరు వెళ్ళుచున్నారు గాని, మీయబ్బాయికి అక్కడ వరుం టకు, కప్పుకోవడానికి బట్టలవసరము గదా!" అని అడుగగా, అందుకు మా స్వాములవారు అక్కడే పాఠశాలలోనేదైన పరచుకోవడానికి ఒక తట్టుకు ఇప్పించుము. కప్పుకొవడానికై యిదోనేనింతవరకు గప్పుకునే దుప్పటిస్తున్నానని చెప్పిదానినొసగిరి. మరియు వాడి ఖర్చులనిమిత్తమై అక్కడ నా భక్తులున్నారు. వారివద్ద నా పేరుచెప్పి అడిగి తీసికొను మనిచెప్పి వెళ్ళిపోయిరి. అక్కడనా మరిదేవరగారు (అయ్యగారు) సంస్కృతముయొక్క దేవనాగరిలిపి (అక్షర విన్యాసమును)ని నాకు నేర్పడానికి మొదలుబెట్టిరి. వారము దినాల్లో దేవనాగరిలిపిని నేర్చు కొంటిని. పిదప త్రికాండ అమరకోశములోని శ్లోకములను వల్లించ డానికి ప్రారంభించిరి.

నా మనసులో ఆ సంస్కృత పాఠశాల ఎట్లుంటుందో, ఎప్పుడు విద్యార్థులతోగల్సి సంస్కృతము నభ్యసింతునో, అను కుతూహలము

గలుగుచుండెను. నా మెదడులో గూడ నవే విచారములు చెలరేగు చుండెను. ఆ పాఠశాలను జూడక మొదలే ఒక్కొక్కసారి రాత్రిపూటి స్వప్నములో దానిని దర్శించుచుంటిని. అక్కడికి ఎప్పుడు వెళ్తామో, పాఠశాల నెప్పుడు దర్శిస్తానో, అని వెళ్ళడానికి దినములను లెక్కించు చుంటిని. శంషాబాదుకు వెళ్ళినను అక్కడగూడ లింగైక్యమైన మహా స్వాములయొక్క సమాధుల పూజయొనర్చుటము, ఉదయము నిద్ర లేవడముతోనే, కాలకృత్యములను దీర్చుకొని, ముఖప్రక్షాళనానంతరము స్వామివారి పూజకు పత్రిపుష్పములను సంగ్రహించిపెట్టడము. బావి నుండి మంచినీరుతోడి కడవల్లో నింపడముచేయగా స్వాములవారు మధ్యాహ్నము కంతి భిక్షాటనము జేయుచుండిరి. ఇట్లు కొన్ని దినములు గతచిపోగానే పాఠశాలకు వెళ్ళేసమయము సమీపించెను. ఏరువాక పండుగనాడు పెందలకడనే నిద్రలేచి, మరము పనులన్నింటిని దీర్చు కొని, స్నానము, శివపూజలు ముగించుకొని, శ్రీ సిద్ధలింగస్వామిగారు కంతిభిక్షమునకై గ్రామములోకివెళ్ళివచ్చిరి. వారుదెచ్చిన పర్వదిన పంచ పక్వాన్నములను కడుపునిండారగించి, మధ్యాహ్నము సామానులను సదిరి మూటగట్టుకొని, రైలుకు శంషాబాదు నుండి 12 గం.కు బయలు దేరి హైదరాబాదులోని శ్రీ మఠం వీరయ్యగారి గృహమునకు వచ్చితిమి. వారును మమ్మల్ని చూడగానే, ఎంతో మర్యాదతో జూచిరి. ఆ రాత్రి వారింట్లోనే గడిపి, ఉదయము శివపూజను దీర్చు కొని రైలుబండికి వెళ్ళడానికి సిద్ధబడితిమి. సరే ఇంతలో ఒక టాంగా (గుఱ్ఱపుబండి)ని దెప్పించి, అందులో శ్రీ వీరయ్యగారితోబాటు మేము ఉభయులము గూర్చుండి, నాంపల్లి రైలుస్టేషన్‌కు వచ్చితిమి. అక్కడ శ్రీమఠం వీరయ్యగారే మాయుభయులకు యాదగిరికి వెళ్ళే రైలు టికట్లను ఇప్పించి రైలుబండితో గూర్చుండబెట్టి, సాగనంపిరి. నేను

నేను రైలుబండిలో కూర్చొనడము నాకదె క్రొత్త, అయినను ఆశ్చర్య చకితుడను గాలేదు.

నేను శ్రీ సిద్ధలింగస్వామి వద్ద కొద్ది దూరములో గూర్చుండి, వాతాయనము (ఖిడికి) నుండి వెలుపలి ప్రకృతి సౌందర్యాన్ని దిలకిస్తు స్వామితో నాకుదెలియని విషయముల నడిగి తెల్సుకొను చుంటిని, ఇంతలో వాడి జంక్షన్ వచ్చెను, అక్కడ మేము బండిని మార్చుటకై యన్. యస్. ఆర్ వచ్చిన రైలు నుండి దిగి జి.ఐ.పి. రైలుకు వెళ్ళాలి. గనుక దానికొరకు రెండు గంటలు ఆ వాడిలోనే వేచియుండాలి. కావున ఆ స్టేషన్‌లో కొంత సేపు అటు ఇటు షికారుజేస్తు కాలక్షేపము జేస్తిమి. ఈలోగ ఆ బండిగూడ వచ్చెను. దానిలో గూర్చుండి యాదగిరికి ప్రయాణమై సాయంత్రము (అయిదు) గం.కు స్టేషన్‌కు జేరుకుంటిమి. అక్కడ రైలుదిగి వెలుపలికి వచ్చి అయ్యగారు ఒక టాంగా (గుఱ్ఱపుబండి)ని మాట్లాడుచుండగా నేను వారితో "ఇదే గ్రామముగదా? ఇక టాంగా ఎందుకని" అడుగగా వారు నాతో "ఇది రైలుస్టేషన్" అదో సల్లంత దూరమున కనుపడుచున్న ఉన్నతముగానున్న గుట్ట అగుపడుతుంది గదా? దాని చుట్టూర వ్యాపించయున్నదే. యాదగిరి నగరము. అక్కడే మన కళాశాల ఉంటుంది." అనగానే మేము టాంగాలో కూర్చుంటిమి. యాదగిరి రైలుస్టేషన్ నుండి మూడు మైళ్ళుంటుంది. మేము వెళ్ళుచున్న మార్గమునకు రెండు వైపుల అత్యున్నతముగా పెరిగిన వేపమున్నగు వృక్షములుండినవి. పోగా ఇరుప్రక్కలలో పెద్ద పెద్ద (జన్నలు)దూది, సూచె, మిల్లులు, (గింజీలు) ఆదారిపొడుగునా అనేకములున్నవి. స్టేషన్‌కు కొద్ది దూరములో ఒక తటాకముంది. ఆ తటాకము కట్టపై మధ్యన

పోలీసు స్టేషన్‌గూడ ఒకటుంది. కట్టకుపొడుగునా పొడుగాటి ఇనుపరాడ్లు మూడువరసలుగా బండ్లు వగైరాలా చెరువులో బడకుండా అడ్డముగా పాతబడి యున్నవి.

ఇంతలో యాదగిరి నగరములోకి ప్రవేశించితిమి. పార్శ్వ భాగములు వరుసగా బారులుదీరియున్న పెద్దపెద్ద రకరకాల వస్తువులను-విక్రయమునకై యుంచిన దుకాణములు (షాపులు)న్నవి. టాంగా మా కళాశాలను సమీపించెను. మొదట కళాశాల నగరములోనే ఒక గొప్ప విశాలభవనములో నుండినది. కాని ఇంకను కళాశాల తెరవ బడలేదు. కావున మహాద్వారము తలుపులకు తాళము వేయబడినది. ఇంతలో కళాశాలకు సంబంధించిన కార్యాలయపు వ్యక్తి వచ్చి, విద్యార్థులింతవరకు రానందులకు కళాశాలను దెరువలేదు. అనేను. సరే మంచిదనిచెప్పి, ఈ అయ్యగారు తమకింతకు పూర్వమే పరిచయముండిన ఒక భక్తునింటికి నన్ను దీసికెళ్ళెను. వారింట్లోనే కళాశాల దెరచేవరకుంటిమి. రాత్రి యెనమిది గంటలకు స్నానము, పూజ భోజనాదులు జరిగినవి. తదుపరి ఆ ఇంటి యజమాని శ్రీ శరణప్ప సాహుకారి వచ్చి యీ విద్యార్థి యెక్కడివారు. అని కన్నడ భాషలో శ్రీ దేవరగారిని ప్రశ్నించిరి. అందుకు వారు "ఈ విద్యార్థి కోడన్‌గల్లు శ్రీ విరూపాక్షస్వాములవారి శిష్యుడు. ఇక్కడ సంస్కృత విద్యాధ్యయనము కొరకు నారు దోలించియున్నారని" చెప్పిరి, "మంచిదియని" చిఱునవ్వుతో వెళ్ళిరి. ఈ భక్తుడు. పీరమాహేశ్వరులయందు, లింగార్చనయందును మిగుల భక్తిగలదు. పీరు రాజకీవిని మొదట్లో అనుభవించిరి. ఒకప్పుడు గొప్పగాసాగిన సంసారము వారిది. ఇల్లు కేవలము. పాతికట్టడముతో నున్నతముగాను, బహువిశాలముగా నుండినది.

అతని భవనమునకానుకొనే వారికి సంబంధించిన ఆయిల్ మిల్లు పాతబడి, ప్రాచీన విశాలభవనములో అట్లే నుండినది. ముందు మహా ద్వారము ఎదుట చెదుడుబావి యుండినది. ఈతడు తన సుఖమునకై, మరియు జంగమారాధన- తన ఇష్టలింగార్చనా వైభవమునకై తన పెద్దలార్జించిన ధనమునంతయు మండుచున్న కర్పూరములాహరింప జేశాడని చెప్పిరి. అంతెగాకుండ, కొంత డబ్బును మా కళాశాల స్థాపకులైన యజమాని నుండి గూడ అప్పుగా తీసికొనెనట. వీరికి ఒకే ఒక కూతురుండెను. శరణప్పగారు మాతో కొంతసేపు మాట్లాడిన తరువాత రాత్రి పరుండడానికై తమఇంటి రెండవ అంతస్తు బంగళాపై నున్న ఒక గదిని జూయించిరి. మా సామానులను అందులో బెట్టు కొంటిమి. నాకు పరుచుకోవడానికి యేమియు లేకుండినది. ఆ రాత్రినా చలువరాళ్ళపైననే ఇక్కడికి వచ్చేముందు మా గురువుల వారొసగిన కప్పుకొనే దుప్పటిని నేలపై బరచుకొని, ఒక వస్త్రమును పైనవేసికొని పరుంటిని.

ఉదయము నిద్రలేవడముతోనే మైలబట్టలన్నింటిని చంకనిడు కొని, చెంబును చేతబుచ్చుకొని, గ్రామమునకు కొద్దిదూరములోనుండిన, చిగుడుబావికి వెళ్ళి అక్కడ బయలు ప్రదేశములో శౌచాది క్రియలను ముగించుకొని, వేపపుల్లతో దంతధావనం బొనర్చి, ముఖప్రక్షాళనము గావించి,బట్టలను శుభ్రముగానుదుకొని,మరల మా నివాసమునకుజేరుకుం టిమి. కాస్తఉదయమున కొంతసేపువెనుకటి పాఠశాలను పునరావృత్తము గావించితిని. సుమారు ఉదయమున పదిగంటల సమయమునకు ఇంటి వారు స్నానమునకు రమ్మని యాహ్వానించిరి. నాకందెను శ్రీ సిద్ధలింగ స్వామి పూజాకు చాలా సమయముబడుతుంది. కనుక వారినే మొదలు

వెళ్ళుమని చెప్పితిని. వారు స్నానమాచరించి పూజకై దైవ (పూజ) గృహమునకు వెళ్ళగానే నాకు గూడ పిలుపువచ్చెను.

నేను స్నానముకొరకు స్నానపుగదిలో నిలచితిని, ఆ క్రొత్తగా వెళ్ళిన సమయములో నాకు కన్నడభాష రాకుండెను. కాని వారాడిన మాటల్లోని సారాంశమును గ్రహించే యోగ్యత నాలో నుండెను. అదెట్టులనగా మాగ్రామములోనుమా నాన్నగారుశ్రీ శెట్టివారింట్లోనుమరియు మోచివారిండ్లల్లోను కన్నడమునే మాట్లాడుచుండిరి. అప్పుడప్పుడు వారి భాషను వింటూఉంటిని, కన్నడ మాత్రమురాకుండెను. తెలుగు నా మాతృభాష. కాబట్టి అలా వారింట్లోకి వెళ్ళగానే ఆ ఇంటి యజమాని యొక్క కూతురు నా చేతికి నీళ్ళందివ్వడానికై వచ్చెను. అప్పుడా ఆమ్మాయి వయస్సు పండ్రెండు సం॥ములు. ఆయమ్మ నా చేతులు కడుగుకొనుటకై నీళ్ళుబోయగానే. నేను దంతధావనమునకై "బొగ్గు"అని అంటిని. ఆ అమ్మాయికి అదేమిటో తెలియకనన్నొక పరిబాగుగాచూస్తు నివ్వెరపోయి నిలుచుండెను. ఇంతలో నేను మరోసారి "బొగ్గు" అని అంటిని. ఆమెకు దెలియక పరుగెత్తుకొని తల్లి వద్దకుబోయి నామాటను జెప్పెను. ఆ పిదప తల్లివచ్చి "ఏనయినోరు, ఏనుబేకు" అని కన్నడ ములో నన్నడిగెను. మరల నేను ఆమెతోను "బొగ్గు" అని చెప్పి నా చూపుడు వ్రేలితో పండ్లను దోముటను జూపితిని. అది గ్రహించిన యాతల్లి పండ్లు దోముటకై బొగ్గును దెచ్చియిచ్చినది. అనంతరమామె వేరెగదిలోకి వెళ్ళి తల్లిబిడ్డలొకరికొకరు జెప్పుకుంటు నవ్విరి. అంతె గాదు వారింట్లో అద్దెకుండినవారితోను చెప్పి నవ్విరి. నాటినుండి ఆ యింట్లోనివారు నన్ను చూడగానే తమ ముఖమునకు చీరకొంగును అడ్డము జెట్టుకొని నవ్వుచుండిరి. మాకు ఇక మున్ముందు ప్రథమ

సంస్కృత ఆద్య పరీక్షకు పాఠములను బోధించనున్న గురువుగారు శ్రీ చోళప్పశాస్త్రిగారు అదే ఇంట్లోనే అద్దెకుండిరి. వారికి మొదటి సంబంధమైన భార్య కూతురు బూదెమ్మ అను పేరుతో నుండెను. రూపములో నావలె నలుపుగానే ఉండెను. గాని అక్కడి (కర్నాటకము లోని) స్త్రీలందరు ఉదయమున నిద్రలేవడముతోనే ముఖప్రక్షాళనానంతరము మరియు స్నానముజేసి లింగార్చన గావించే సమయములో భస్మత్రిపుండ్రమును నొసట ధరించుట వలనను, మరియు నాభస్మ త్రిపుండ్రముపైన కుంకుమబొట్టు బెట్టుట-కతమున ఎటువంటి కురూపులైనను కాస్తంత కళాయుక్తముగా నగుపడుచుండిరి. మన ఆంధ్రస్త్రీలు భస్మమును భర్తను గోల్పోయినవారే నుదుట ధరించాలి-గాని ముత్తైదువలు ధరించగూడదని వక్కాణింతురు. ఇది యేశాస్త్రములో చెప్పబడినదో వారికే దెలియాలి. స్త్రీ పురుషులందరు సమానముగా వీరశైవులకు ప్రధాన సిద్ధాంతమునకు మూలభూతమైన "అష్టావరణ" ములలో నీ విభూతి యొకటి. శరీరమునకాభరణము లేదా కవచము వంటిది. ఇట్లుండగా పురుషులే భస్మము ధరించాలి. స్త్రీలు ధరింపగూడదని చెప్పుట చాల విచిత్రముగా నున్నది. పవిత్రమైన భస్మము ధరించుట అందరికిని శ్రేష్ఠమైనదనిఆగమములుద్బోధించుచున్నవి. ఇట్లుండగా ముత్తైదువలునుదుట భస్మమును ధరింపగూడదనుట వట్టి మూర్ఖతనమే అనక తప్పదు.

కళాశాలను తెరచారు. విద్యార్థులు తమ తమ గ్రామములనుండి ఒక్కొక్కరే రావడము మొదలైంది. పదైదు దినాలో చాలామంది విద్యార్థులు విచ్చేసిరి. ఆ సమయములో నా కళాశాల అధ్యాపకులు

నెలుగురుండిరి. ఈ నలుగురిలో ప్రాచార్యులుగా (ప్రిన్సిపల్‌గా) వే॥పం॥ శ్రీ చిదిరేమఠము వీరభద్రశర్మగారు కేవలము వీరు సంస్కృత ప్రౌఢ విద్యార్థుల తరగతులకే పాఠములను బోధించుచుండిరి. పం॥ పగడదిన్ని బసవరాజశాస్త్రిగారు. సాహిత్య మధ్యమ మరియు వ్యాకరణ మధ్యమ విద్యార్థులకు పాఠములను బోధించుచుండిరి. పం॥ శ్రీ చోళప్పశాస్త్రిగారు వీరు అమరకోశము మొదలుకొని ఆద్య పరీక్షవరకు విద్యార్థులకు పాఠములను బోధించుచుండిరి. మరియు శ్రీ మల్లెశప్ప అను అధ్యాపకులు ఉర్దు-ఇంగ్లీషు విషయములను బోధించు చుండిరి. ఇద్దరు వంటలుజేసేవారు ఒకరునీరు దెచ్చేవారు. ఒక గుమాస్త మరొకరు సెక్రటరీ, ఆ గ్రామమునసబు (పటేలు)గారుండిరి. వీరు నాలుగు నెలలకొకసారి నివేదికను (ఆయ-వ్యయ) పట్టికను సిద్ధ గించి, సదరు పంచులకమేటికి (మెంబర్లకు) మీటింగుకు అందజేసెడి వారు. ఇద్దరు సేవకులుండిరి. వీరు ఆసాములవద్ద బాకీలు వసూలు జేయుచుండిరి. ఈ విధముగా సిబ్బందిని నియమించి శాశ్వతముగా నీ కళాశాలకు ఏలాంటి కొరత వాటిల్లకుండ జరుపుటకై యేర్పాటు జేయించిన ధనదాత ధర్మకర్తలు శ్రీ సజ్జనశెట్టి శంకరణ్ణగారు. వీరి ధర్మపత్ని శ్రీమతి గంగాంబగారు. వీరుభయులలో శ్రీ శంకరణ్ణగారు బతికియుండగా వారి సొంత ఆస్తి ఒక లక్ష రూ॥లవరకు ఈ కళాశాలను నిర్వహించుటకై తమ ఉదారబుద్ధితో దానమొసగుటకై వారసులుకాగా తమకు మగ సంతానము లేని కారణమున, ఆ పిదప శ్రీ శంకరణ్ణగారి ధర్మపత్ని శ్రీమతి గంగాంబగారు గూడ తరువాత యేబదివేల ఆస్తిని కళాశాలకు దానమొసగి వారుగూడ కైలాసవాసులైరి. వీరిద్దరికి గలిగిన కూతురు కస్తూరి యను నామె వివాహమైన తదుపరి ఆమెగూడ కైలాసవాసియైనది.

ధర్మవీర శ్రీ శంకరణ్ణగారు తాము దానమొసగినదంతయు నగదు రొక్కమునగాకుండ, కొంత నగదు రూపమున, మరికొంత తన కున్న ఆస్తిలో తాముండిన గొప్ప ఇండ్లను, ఇనుము విక్రయించే దుకాణములు అడ్తి, కిరాణము ఇంకను ఏవేవున్నవో కోతాలు-జిన్నులు, ఈ సమగ్రమైన ఆస్తిని తాము హృదయపూర్వకముగా అర్పించియుండిరి. కళాశాల నిర్విఘ్నముగా, చిరకాలమునియుంటకు దాను విశ్వసించదగిన మంచి వారినెన్నుకొని వారి నేతృత్వమున తత్సంబంధిత కార్యకలాపములు సుగమముగా నెఱపుటకు సమర్థులైన మెంబర్ల (సభ్యులను)ను నియమించి రిజిష్టరు బాడిగా తయారు జేసిరి.

ఈ సందర్భములో ధర్మవీర శ్రీ శంకరణ్ణగారి సంక్షిప్త పరిచయమును గురించి అక్కడి జనముతో నేనువిన్న విషయమును కొద్దిగా వివరించుట యసందర్భము గావనుకుంటాను.

శ్రీ శంకరణ్ణగారు యాదగిరికి సమీపములోనున్న ఏలేరి అను నొకచిన్న గ్రామములో ఒక సాధారణ కుటుంబమున జన్మించిరట. వృత్తిచేత వీరు గాండ్లవారు. మొదలు వీరు కూరగాయలను యాదగిరికి దెచ్చి, విక్రయించెవారట. అందులో కొద్దిగా లాభార్జనతో తమ వృత్తి ననుసరించి ఒక నూనె గానుక వేసిరట. అందులోను లాభము రాగా, ఒక దుకాణమును బెట్టి తైలము (నూనె)ను విస్తృతముగా విక్రయించుట చేత, క్రమేపి ధనార్జనము అధికమగుటవలన అడ్తి, కిరాణ, లోహ విక్రయము, పత్తిగిర్ని మొదలగునవెన్నెన్నో విస్తృతపరిచిరట. ఏ తత్ఫలితముగా కొద్దిదినాలలోనే వీరి పేరుప్రతిష్ఠలు నలుమూలలకు వ్యాపించెను.

వీరి పేరుప్రతిష్ఠలను విన్న యాదగిరి సమీపములోనున్న గురుమఠకల్ పూజ్య శ్రీ శాంతివీరస్వాములవారు మఠాధీశులు. వీరును శివయోగమందిరములో కొన్నాళ్ళుండి విద్యాధ్యయనము జేసి, అప్పుడే వచ్చియుండిరి. వీరు లింగపూజాధురంధరులని ప్రఖ్యాతిగాంచియుండిరి. శివపూజానంతరము తమ ఇష్టలింగమునకు ఇత్తడితో నిర్మించినదీ పోత్సవరథములో ప్రతిష్ఠింపజేసి, జాగటి, నగారాలధ్వనులు మ్రోగుచుంగ రథోత్సవాన్ని జరిపెవారు. ప్రతిదినము వీరి లింగార్చన, దీపోత్సమునకు సుమారు రెండు కిలోల తైలమవసరమయ్యే దని. వీరు ఆయుర్వేదకోవిదులు గూడ, వీరి పూజోత్సవ వైభవాన్ని దిలకించుటకై దూరప్రదేశముల నుండి తండోపతండాలుగా జనము వచ్చేవారని. వీరి పూజ వైభవాన్ని నేను దర్శించలేదు గాని, వీరి పేరు ప్రతిష్ఠలను విని, నేను యాదగిరిలోనున్న సమయములోనే గురుమఠకల్ వెళ్ళి స్వాములవారి దర్శనము జేసికొనివచ్చియుంటిని. పోగా మా విరూపాక్షస్వాములవారు వీరికి చిరపరిచితులని వారినోటనే వింటిని.

ఇట్టి వీరు ఒక సం॥ము శ్రావణ మాసములో యాదగిరికి విచ్చేసి యెవరి గృహములకు వెళ్ళక, ఊరి వెలుపల ఒక మందిరములో నివసించి, ప్రతిదినాలు దనపూజా కార్యక్రమముతోబాటు, సాయంత్రం పురాణప్రవచనమును చెప్పించుచుండిరట. ఈ పురాణ శ్రవణమునకై పురప్రముఖులతో సహా శ్రీ శంకరణ్ణగారున్ను, శ్రీవారి సన్నిధికి వచ్చేవారట. అది వింటు వింటు శ్రీ స్వాములవారిపై శ్రీ శంకరణ్ణగారికి యెనలేని భక్తిగుదిరెను. ప్రతిరోజు పురాణ కాలక్షేపము సమాప్తియైన, పిదప కొద్దిసేపు శ్రీ స్వాములవారితో గురుభక్తిచేత మాట్లాడించేవారు. ఒకనాడు స్వాములవారితో మాట్లాడుతు ఉండగా, స్వాముల

వారు శంకరణ్ణనుద్దేశించి. "శంకరణ్ణా! నాదోకోరిక ఉంది. దాన్ని నీవు నెరవేర్చాలి సుమా!" అందుకు శ్రీ శంకరణ్ణగారు అదేమిటి స్వామి. "నేను మీముందు అల్పుడిని. నావల్ల మీ కోరిక దీరుతుందా!" అనియు, "సరే ఏమిటాకోరికయని ప్రశ్నించెనట." అందుకు శ్రీవారు ఇప్పట్లో నీప్రాంతములో వీరశైవధార్మికవిజ్ఞానమడుగంటినది. గనుకదానినభివృద్ధి పరచుటకై యొక్క ధార్మిక సంస్కృత పాఠశాలను నెలకొల్పవలేనను సంకల్పము నాలో గలిగినది. ఈ కోరికను పూర్తి జేయుటకు నీవె అందుకు దగిన సమర్థుడవనెను.

అప్పుడు శంకరణ్ణభయముతో ఇంతటిగొప్ప భారమును నాపైనబెట్టకండి మహాస్వామి! అనేను. అప్పుడు శ్రీ స్వాములవారు మీరునేను జెప్పిన ప్రకారము నడచుకొనినయెడల మనవీరశైవ ధర్మోద్ధారమగును. మీరెదానిని ఉద్ధరించినవారవుతారు సుమా! దానివల్ల మీజన్మము సార్థకమౌతుందని నచ్చజెప్పడముతో సరేననిరి, ఒకరిద్దరు విద్యార్థులకు సరిపోయె వ్యయభారమును వహించెదననెను. అదేమిగాదు ఒకరిద్దరితోనేమౌతుంది. ఒక సంస్కృత పాఠశాలను నేలకొల్పి అందులో వందయేబది విద్యార్థులకు సరిపడ భవనమిచ్చి, అందులోనే వాండ్లకు భోజన వసతి విద్యార్థులను సమకూర్చవలేనని యాదేశించిరట. అదివిని శ్రీ శంకరణ్ణదిగ్భ్రాంతిజెంది, ఇంతగొప్పకార్యము నావల్ల కాదుస్వామి క్షమించాలి అనేను. ఐననుస్వాములవారొకె పట్టుబట్టిరి సడలించలేదు.

శ్రావణమాసపురాణసమాప్తినాడు రాత్రి శ్రీ శంకరణ్ణగారిని శ్రోతలమద్యన ఒకకుర్చీవేసి కూర్చుండబేట్టి, అతని మెడలోనోక

పెద్దపూలదండనువేసి. సభికులనుద్దేశించి శ్రీ స్వాములవారు ఉపన్యసిస్తు చివరిలో "శ్రీ ధర్మవీర శంకరణ్ణగారు యాదగిరి నగరములో త్వరలోనె మనవీరశైవ ధర్మోన్నతికై, వీరశైవ సంస్కృతిని సంరక్షించుటకుగాను, ఒక సంస్కృతకళాశాలను స్థాపించుట కంగీకరించి యున్నారు, ఇది మనందరికి సంతోషదాయకమైన సంగతి," అనిచెప్పడముతో శంకరణ్ణస్వామి స్వామిఇదేమని సెలవిస్తున్నారు, అనియుచ్చరిస్తుండగానే సభలోనిసభ్యుల కరతాల ధ్వనులు మిన్నుముట్టినవి, సరే ఆరాత్రి స్వాములవారితో సెలవును బుచ్చుకొని శ్రీ శంకరణ్ణగారు స్వగృహమునకువెళ్ళిరి. మరునాడు మళ్ళి స్వాములవారినిసందర్శించి, అందులకెంత ధనమువ్యయమౌతుంది - ఈ కార్యమంతా మీనేతృత్వములోనే పూర్తిజేయాలని ప్రార్థించి యీకళాశాలకు బూనుకునిరని అక్కడివారు జెప్పిరి. ఏమైకానిండు ఈ పుణ్యకార్యమువలన వారిజన్మసార్థకమైనది. వారి పేరు ప్రతిష్ఠలు ఆచంద్రార్కము ఉంటుందని నావిచారము.

ఈవిధముగా పూజ్యులైన శ్రీ గురుమఠకల్ శాంతివీర స్వాముల వారి సలహామేరకు ఈకళాశాలను శ్రీ సజనశెట్టి శంకరణ్ణగారు నెల కొల్పియున్నారు, శ్రీ వారుతమ అంతిమసమయంలో ఆనాటి (పిన్సిపాలుగా నియుక్తులైయుండిన శ్రీ వీరభద్రశర్మగారి కంటె పూర్వములో) వే॥ పం॥ వ్యాకరణ తీర్థ శ్రీ చంద్రశేఖర శాస్త్రిగారిని తన చెంతకురప్పించుకొని తలదాపున గూర్చుండుమని చెప్పివారి కుడిచేతిలో తనహస్తమునుంచి తమ ఎదుటగూర్చొనియున్న విద్యార్థి సమూహమును కరుణారసపూరితమైన దృష్టితో ఒకింత సేపుజూచి ప్రాచార్యులనుచిద్దేశి తమ కంటతడిబెడుతు విశాలభావముచేత

"శాస్త్రిగారూ! నేను మహీరశైవ ధర్మాభివృద్ధి కొరకు ప్రారంభించినట్టియీ సత్కార్యము మీరుబ్రతికియుండే పర్యంతము చిరకాలము వరకును నిర్విఘ్నముగా నిర్వహించే భారము. మరియు నిస్సంతునైన నాకుసంతానస్వరూపమైన ఈ విద్యార్థులకేలాంటి కష్టములురాకుండ సుఖముగానుండి నిశ్చింతతో విద్యాభ్యాసము జేయించుభారము మీపైనుంటుంది. మరియు నిజాంప్రాంతములో ఎక్కడజూచినను నా సంతానమె విస్తృతముగా నుండునట్లుగా జేయుట మీప్రథమ కర్తవ్యమసుమా! అనగానె శ్రీ శాస్త్రిగారి కన్నులుగూడ చెమ్మగిల్లినవి. సరెఅట్లేకానిండు, మీయాకోరిక నేరవేర్చుటకు నేనెంతటివాడిని. సమస్తజగత్కర్తయైన ఆపరమశివుడున్నాడు. మీయాసత్సంకల్పమును నేరవేర్చువాడతడు, కనుక ఆవిషయమును గురించి మీరేమాత్రము బెంగబెట్టుకోనవసరములేదని యోదార్చేను. అదివిని శ్రీ శంకరణ్ణ గారు తమయసువులను నిశ్చింతతో వీడినారట. ఇట్లు ఆశాస్త్రిగారె మాకుజెప్పిరి.

ఆసమయములో కంటతడిబెట్ట నివారొక్కరును లేరనగావింటిని, దయార్ద్రహృదయులు శ్రీ శంకరణ్ణగారు, ఒకప్పుడు వీరు విద్యార్థులకే పరిమితముగాకుండ ఆనగరములోని మరియునితరపరిసరగ్రామాలలోని బీదలందరికిన్ని తండ్రిగానుండి అధికమైనకరువుబారినుండిరక్షించారట, ఎడతేరపిలేకుండ మూడు మాసములవరకు ఈ యుభయదంపతులు తానార్జించిన దబ్బును వ్యయపరచి వారిని తమకంటికిరెప్పలవలేగాపాడియుండిరట, కంకణబద్ధులై ప్రజలకు అన్నదానముజేసియున్నారు. నిజమైన ప్రజాసేవ అట్టిది, కనుక వారియుభయుల నామములనుచ్ఛరించినంతనే ప్రతివారును వారు "మహాధర్మరాజులాంటివారు. మళ్ళీ

మాకగు పడుతారా? అని కంటతడిబెట్టుచుండిరి. అట్టిపుణ్య దంపతులు వారు.

ఇల్లాంటి ధర్మాత్ములు ఇంకెందరో కర్నాటకా మహారాష్ట్ర ప్రాంతములలో ఉదారగుణవంతులైన వీరశైవ భక్తపుంగవులు అఖండమైన కీర్తిశేషులైయున్నారు. ఒకరు బీదవిద్యార్థులకొరకు వసతిగృహమును నిర్మిస్తేను, మరొకరు విద్యాలయములను నేలకొల్పుతు ఉండిరి. ఒకరు బీదలకొరకుఅన్నసత్రములను స్థాపించినచో మరోకరు ఔషధములతో చికిత్సాలయములను స్థాపించిరి. ఇట్టి వారి కొవకు జేందినవారిలో ప్రాతఃస్మరణీయులైన శ్రీ వారదమల్లప్పగారు సోలాపూర్, శ్రీ లింగరాజ దేశాయిబెళగాంవు. శ్రీ హానగల్లు కుమార స్వాములవారు. శ్రీ మురుఘురాజేంద్ర మహాస్వాములవారు చిత్రదుర్గ. శ్రీ మృత్యుంజయ స్వాములవారు ధారవాడ, శ్రీ కుమారస్వాములవారు సిద్ధగంగా, జగద్గురు విశ్వేశ్వర శివాచార్య మహాస్వాములు కాశీ జంగమవాడిమఠము మొదలగు వారెందరోనున్నారు.అనుకనె ఇప్పటికిని మనవీరశైవధర్మము ఆయాప్రాంతములలో అత్యున్నత దశలోనున్నది.

ఉట్లు మరి కొన్నిదినములు (నెలరోజులు) గడచినట్లు విద్యార్థులు అధ్యాపకులు అందరు కళాశాలకువిచ్చేసిరి, ఆయాతరగతులు సక్రమ పద్ధతిలో జరుగనారంభించెను. నన్నుమాత్రము ఇంకను కళాశాలలో జేర్చుకొనలేదు. ఏలననగా సంస్కృతమునకు ప్రథమపుస్తకమైన బాంకాకెకర్ (వ్యాకరణ) అను పుస్తకములో కనీసము పది పాఠ ములను కంఠస్థముజేసిన విద్యార్థులనే కళాశాలలో జేర్చుకునేనియమ ముండెను. మొట్టమొదట నాకు కన్నడభాష రాని కారణమున ఉపా ధ్యాయులు నాకు పాఠములను బోధించకుండిరి. కనుక నన్ను దోక్కొన్నిన శ్రీ సిద్ధలింగస్వామినే నాకు తెలుగులోబోధించుటకై మొదట

నియమించిరి. వారు సంస్కృతమునకు మూలగ్రంథమైన త్రికాండ అమరకోశమును నాకు జెప్పనారంభించిరి. ఈ గ్రంథము సంస్కృత భాషకు శబ్దకోశమును (డిక్షనరీ) లాంటిది. ఐతే నిది శ్లోకముల రూపమున ఉంటుంది. కంఠస్థము త్వరగా జేయడానికనుకూలముగా ఉంటుంది. సంస్కృతములోనే శబ్దకోశమైనను ప్రాయముగా శ్లోకముల రూపములోనే ఉంటవని నాకు తరువాత దెలియవచ్చినది. ఆ పద్ధతి ననుసరించే తెలుఁగులోగూడ ఆంధ్రనామసంగ్రహమువంటి పద్య గ్రంథము వెలుపడినది. కాబోలు.

సరే ప్రతిదినము అమరకోశమున అయిదునుండి యెనమిది శ్లోకములవరకు కంఠస్థముజేసి అప్పగించుచుంటిని. కళాశాల నిర్వహణ పద్ధతి మాత్రము చాలబాగుగా నుండినది. అది నాకు నచ్చినది. విద్యార్థులకవసరమైన వసతి, భోజన సౌకర్యములుండినవి. శ్రీమంతుల ఇళ్ళలోనేవిధమైన కొరతలేకుండ,ఆనందమయమైన జీవితము జరుగునో, అదే విధమైన చీకుచింతాలేకుండ విద్యార్థులు తమ విద్యాధ్యయనము జేయుచుండిరి. ప్రతి అమావాస్య దినమున భక్షాలు, రెండు మూడు పొగిరింపుబెట్టే గంటెలపాలు, చిన్న చెంచాతో నాలుగైదు చంచాల మంచినెయ్యి, రెండు మూడు శాఖములు, ముద్దపప్పు, రెండుపచ్చళ్ళు, కొసుమీరి (వెల్లుల్లి ముక్కలతోను నానబెట్టిన పెసరిపప్పు లేదా సెనగను పప్పు, ఉప్పు, కోతిమీరి మిశ్రితము జేసినది) అన్నము, చారు, బాలురకు తృప్తియగునట్లు సేవకులు వడ్డించుచుండిరి.ఇందులోఒకరికిచంచానెయ్యి వనివాడు తక్కువ వడ్డించినచో నావిద్యార్థికోపముతో తన కంచమునే నేలకువిసిరేవాడట. అప్పుడు గంగమ్మగారువచ్చి యెక్కువగా వడ్డించి ఓదార్చేవారట. మాతృ హృదయము వారిది.

ఇట్లే ప్రతి పౌర్ణిమానాడు గూడ గోధుమ రొట్టెలు, చపాతీలు, బెల్లము శనగపప్పు మిశ్రితముగా ఉడికించిన పాయసము అందుకు చాలి

నంత నెయ్యి శాకములను వడ్డించుచుండిరి. అంతెగాకుండ ధనికుల గృహాల్లోనెయేపండుగలకేయె వంటకములను సిద్ధగించవలెనో, అట్లేనే కొరత లేకుండ సిద్ధగించి విద్యార్థులను తృప్తిపరచుచుండిరి. ఈ నైజాం ప్రాంతములో ఇంతగొప్ప సత్కార్యమును జేపట్టిన మహా ఉదారవంతులు, త్యాగపురుషులు మరొకరు లేరని చెప్పినయది యతిశయోక్తిగానెరదు, ఉదారగుణములో శ్రీ శంకణ్ణ దంపతులు వారికి వారెసాటి.

ప్రతి దినము సాయంత్రము ఫుట్‌బాలు (బంతి) ఆట ఉండేది. ప్రతి సం॥ము మే నెలలో ఈ కళాశాలను స్థాపించినపుణ్యాత్ములైన ధర్మవీర శ్రీ శంకరణ్ణగారు శ్రీవారి ధర్మపతిగారైనశ్రీమతిగంగాంబికా గారి పుణ్యతిథిని కళాశాల విద్యార్థులు ఉపాధ్యాయులు నగర ప్రముఖులు గల్పిఘనముగా జరుపుచుండిరి. ఈ పుణ్యతిథిదినమునందు విద్యార్థులలోగొప్ప ఉత్సాహము పెల్లుబుకుచుండెను. కళాశాలను రంగురంగుల కాగిదాలతోను, కొబ్బరికొమ్మలతోను, మామిడితోరణములతో, నలకరింపఁజేయుచుండిరి, నాడు తీపి వంటకములు, రకరకాల పదార్థములను సిద్ధగించుచుండిరి. నగరమునకు ఒకమైలు దూరములో శ్రీ శంకరణ్ణగారి క్షేత్రములోనే నా పుణ్యదంపతుల సమాధులున్నవి. ఆయనగారి పేరట ఒక చిన్నగుడి పైకప్పు ప్రక్కస్తుపాలు ఇనుప ఓీములు గచ్చుభిత్తులు (గోడలు)నలువైపులనుండిన ఒక దేవాలయము. అందులో పాలరాతి లింగము-దానికెదురుగా పాలరాతిదేనందివిగ్రహము స్థాపించబడియున్నది. పుణ్యతిథి నాడు పెందలనిద్రలేచి విద్యార్థులు కొందరీతవచ్చినవారు గుడికి సమీపములోనుండిన దిగుడు బావిలో ఈదులాడుతు స్నానము జేయుచుండిరి. అందులో నేను గూడ ఒకడిని. కాని లావుగామాకంటెను వయస్సులోపెద్దగానున్నవిద్యార్థులును నీటిలో

మమ్మముంచుచుండిరి. ఒకరిపైనొకరు వరుసగా ముంచుటవలన దిగువ-నున్న నాబోటివాడు బావియొక్కతలమునకు జేరుచుండెను-ఈ విషయములోవారికె ప్రాత్రము కసి కరములేకుండెను. కొందరు భయపడి తీరమున గూర్చుండేవీరిక్రీడలిను దిలకించుచుండిరి, గంటలతరబడి యీబావిలోఈదులాడేవారు కొందరు మోటగట్టెగిలకపైనెక్కి తల క్రిందుగా జేసిబావిలోకి దూకేవారు. మరికొందరు చక్కగా దూకేవారు-కర్నాటకపు విద్యార్థులందరు దినాలు దేహపరిశ్రమజేయుటవలన దృఢకాయులై యుండిరి.

ఇకపోతే ఈతరాని బాలురు. శ్రీ శంకరణ్ణగారి గుడి కెదురుగానున్న చేదుడు బావినుండి నీటినితోడుకొని స్నానము జేసేవారు, నాడు ఆ మందిరాన్నిగూడ కొబరికొమ్మలతో, మామిడి తోరణములతో, రంగుల కాగిదాలతోను, చుట్టుప్రక్కల అలంకరించు చుండిరి. స్నానము జేసిన విద్యార్థులందరు ఇద్దరు ముగురు చొప్పున గుడిలోకి వచ్చితమఇష్టలింగములకభిషేకములు జేసికొను చుండిరి. ఎఱ్ఱగన్నేరు పువ్వులు పుష్కలముగా నుండినవి, కావున శంకరలింగమునుగూడ షోడశోపచారములతోపంచామృతము,పత్రిపుష్ప ధూప-దీపములతోను, శ్రీ రుద్రనూక్తముల నుచ్చరించుచు ఆనందముతో లింగమునకు రుద్రాభిషేకము గావించుచుండిరి. స్తోత్ర పాఠములతో మందిరము మారుమ్రోగు చుండినది, మరల.

సాయంత్రము సుమారు 4-5 గంటలకు నగరములో కళాశాలనుండి విద్యార్థులందరు సరికొత్త స్కౌటు దుస్తులను ధరించి, మంగళ వాయిద్యములు మారుమ్రోగుచుండగ, జేజేకారములు జేయుచు, మధ్యన శ్రీ శంకరణ్ణ మరియు గంగాంబగారి భావచిత్రమును ఊరేగిస్తు నగరము వెలుపల మైలు దూరాననుండిన శంకరాలయమునకు

అత్యంత వైభవముతో వెళ్ళి అక్కడ కబడ్డి, లోన్‌పాటు, ఫుట్‌బాలు, కుర్చీలఆట మొదలగు క్రీడలపోటీలుజరిగి, రాత్రి శంకరాలయము ప్రాంగణములో శ్రీ ప్రిన్సిపాల్‌గారి అధ్యక్షతలో సభను సమావేశ పరచి, అందు మావిద్యార్థుల వక్తృత్వ పోటీలను నిర్వహించుచుండిరి. ఇందులో జడ్జీలు నిర్ణయించిన మేరకు ప్రథమ, ద్వితీయ, తృతీయ శ్రేణిలో నెగ్గినవారికి బహుమతులను బంచిపెట్టి, మరల అదే రాత్రి ఏనిమిది గం.కు మంగలవాయిద్యములతో జేజేకారములతో కళాశాలకు జేరుకొని, భోజనాది క్రియలను దీర్చుకొని, రాత్రి 9 గం. నుండి కల్యాణ శ్రీబనవేశ్వరులవారిదిగాని, లేదావీరనారియైన బ్రిటిషుసామ్రాజ వాదులతో డీకొని, కత్తిదూసి కదనమొనర్చినకిత్తూరు చెన్నమ్మ నాటకమునుగాని,ప్రదర్శించుచుండిరి. ఈడ్రామరిహాల్సు (ప్రాక్టీసు)పుణ్య తిథినెల, రెండునెల్లు ఉండగా జరుగుచుండెను. అందు నేను గూడ శ్రీబస వేశ్వర నాటకమున పెద్దముభట్టు, కీలిక పాత్రను మరియు జకిత్తూర చెన్నమ్మ మొదలగు డ్రామాలో హాస్యపాత్రలను ధరించి, అభిన యించుచుంటిని. దీనిని దిలకించిన మా ప్రిన్సిపాలుగారు, తోడి విద్యార్థులు బహుగా సంతసించుచుండిరి. ఈ రిహాల్సు రాత్రి భోజనా నంతరము 9 గం.ల నుండి మొదలుకొని రాత్రి ఒక్కొక్కప్పుడు 2-3 గం.ల వరకు అభినయ అభ్యాసము జరుగుచుండెను. మాకు శ్రీ కాడయ్య అనునాతడు ప్రాక్టీసు జేయించెడివాడు. ఈ డ్రామకుదగిన దుస్తులు, అలంకారములు, పరదాలను, (తెరలను) ఈ వరకు నాటక ములను ప్రదర్శించి ప్రసిద్ధిగాంచిన నాటక కంపనీవారివద్ద అరువుగా (అద్దెకు) దెచ్చుకొనుచుండిరి. పుణ్యతిథికి సంబంధించిన సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమములు ముగియగానే. ఇంకను వారివారి విద్యా భ్యాసమునకై విద్యార్థులు ఆసక్తిని జూపుచుండిరి. అందరు తమ తమ

యోగ్యతానుసారముగా "బెంగాలు సంస్కృత అసోసియేషన్ కలకత్తా" అను పేరును స్వాతంత్ర్యము మనకు సంక్రమించిన పిదప "వంగీయ సంస్కృత శిక్షాపరిషత్తు కలకత్తాగా" మార్చారు. కనుక నాకు ఆద్య-మధ్యమ, పరీక్షలను మొదటి పేరుతోను మరియు "తీర్థ" టైటిల్ పరీక్షా ప్రమాణ పత్రములు అయాయా పరీక్షల్లో ద్వితీయ శ్రేణిల్లో నెగ్గిన పిదప, తరువాత పేరుతో లభించినది. పూర్వకాలములో కాశి-కలకత్తా పట్టణములే సంస్కృత భాషా ప్రచారములకై ప్రసిద్ధములై యుండెడివి. తరువాత 1957 నుండి తిరుపతి ఉస్మానియా విశ్వ విద్యాలయములలో సంస్కృత కోర్సులు, విద్వాన్. బి.ఓ.యల్., ఎం.ఓ.యల్., ,పిఓ.యల్. పరీక్షలను ప్రవేశ పెట్టిరి.

పరీక్షార్థులు తమ తమ యోగ్యతాను గుణ్యముగా కలకత్తాకు సంబంధించిన సంస్కృత పరీక్షలకు అభ్యర్థి పత్రములను పూర్తిజేసి శుల్కముతోబాటు కలకత్తాకు బంపుచుండిరి. ఇప్పటి నుండి విద్యార్థులు తమఅధ్యయనములనుమిగులపట్టుదలతోరేయింబవళ్ళుసాగించుచుండిరి. ఈలోపున నేను శబ్దసమాసములను అధ్యయనము జేయుచుంటిని. ఇంత వరకు నేను నగరములోనున్న మళిబగి మఠములో ఉండి, మధ్యాహ్నం పీరశైవభక్తులిండ్లకువెళ్ళి కంతిభిక్షము(మాధుకరము,రొట్టెలుభిక్షము)తో దెచ్చుకొన్న ఆహార పదార్థములను భుజిస్తు, కొంతకాలము కాలేజీలో విద్యనభ్యసించితిని. ఈ భిక్షాటన వలన కేవలము జొన్నరొట్టెలే లభించుచుండెను. గాని అన్నము లభించకుండెను. ఆ ప్రాంతములోని ప్రజలు చాలామట్టుకు రొట్టెలే తమకు ప్రధాన ఆహారముగా నుపయోగించు చుండిరి. నాకు బాల్యములో మా మెదకు జిల్లాలోని జోగిపేట, సదా

శివపేట ప్రజలు చాలామట్టుకు జొన్నరొట్టెలను, అన్నము సమానముగా భుజించుచుండిరి. అదే అభ్యాసము నాకు గూడ ఉండినది. కళాశాలలో గూడ వీటిని సమానముగా విద్యార్థులకు వడ్డించుచుండిరి. ఫోగా కర్నాటక ప్రాంతములోని రొట్టెలను చాలసన్నముగాను, తెల్లని కాగితములా జేయుచుండిరి. అందుకే అక్కడివారు ఒకొక్కరు ఏడెనిమిది రొట్టెలను దినెసేవారు. నాకా కంతిభిక్షముగా తెచ్చికొన్నవి సరిపోకుండెను. అది గమనించి ఆ మఠములోని వృద్ధురాలు నాయందలి ప్రేమ చేత కొద్దిగా జొన్ననుచ్చు(గటిక)చల్లానో, అథవా పెరుగు బెట్టియిచ్చేది. దానితో నాకుద్తృప్తి యయ్యేదిగూడ.

కళాశాలబోర్డింగులో విద్యార్థుల భోజనాదిసువ్యవస్థనుజూచిన నాకును మనస్సులో ఎప్పుడు నేను భండార్కర్ వ్యాకరణము ప్రథమ పుస్తకములోని పదిపాఠాలను పూర్తిగానభ్యసిస్తానో, ఎప్పుడాకళాశాల బోర్డింగు వసతిగృహములో జేరుతానో మరియు తోటివిద్యార్థులతోగల్సి సహపంక్తిలో నేనుగూడఎప్పుడు పాల్గొంటానోఅనిచాలాకలవరముజెందుచుంటిని, ఈ ప్రకారముగా వారైదు మాసములు గడిచిపోగా ఒక వీరభక్తుడు బాల్యవయ్కడనైన నన్ను జూచి తన ఇంటిబయట అరుగుమీద గూర్చుండి యుండెను.

ఈతడు నన్ను తనదగ్గరకు బిలుచుకొని, ''స్వామిః మీరీవిధముగా కంతిభిక్షా చేస్తు, విద్యాభ్యాసము జేయుట జూచి, నాకు బాధగా దోచుచున్నది. కాబట్టి రేపటినుండి యీకాయకమును(వృత్తిని విడచి) మాని మా ఇంట్లోనే రేయింబవళ్ళు శివార్చనను దీర్చుకొనుటకు మీరు కళాశాలలో జేరేవరకు మా ఇంటికి రావచ్చు,వెళ్ళొచ్చునని చెప్పిరి. నేను ఇంత

వరకు శ్రద్ధాభక్తులతో ఇష్టలింగమును బూజించిన పరిణామమే ఇదని నాకు దోచినది. చాలును. "పాలంబయసిద రోగిగే పాలిందౌషధము దొరెథతెరది." అను సూక్తి మేరకు పాలతోనన్నము దినవలెనను కోరిక గలిగిన రోగికి వైద్యుడు గూడ పాలతో ఔషధమును సేవించుమని యాదేశించినట్లుగా,నేను అనుకున్నట్లు జరిగెనుగదాః అని మనసులో ఎంతగానో సంతసించి, సరె యంటిని. వీరిపేరు "జాకగురణ్ణగారని వాడుక, వీరును పూర్వకాలమున గొప్ప ధనవంతులనియు వారి గృహామును జూస్తెనే తెలుస్తుంది. శ్రీ ధర్మవీర శంకరణ్ణగారి విశాలమైన భవనము వీరి భవనమునకానుకొనియే యున్నది.వీరి ఇంటి బంగ్లాపైనుండి జూచితిని. శ్రీ శంకరణ్ణగారి భవనము బహువిశాలమైనది. అందె రెండు మూడు మంచినూనె దీసే గానుగులుండినవి. ఈ భవనములో ఒకరిద్దరు ఉండేదిగాదు. ఎల్లప్పుడు వందల మందితోగూడియుండి కళకళలాడుచుండేది. ఒకరు చెప్పగా వింటిని. ఒక సేవకుడు సాయంత్రము సమయములో శంకరణ్ణగారి యింట్లో యిప్పుడెవరు లేనందున వారిబంధువు శ్రీ సజ్జనశెట్టి హంపణ్ణ తన వ్యవసాయము పనిముట్లన్నియు అందులోనే మరియు పశుగ్రాసము చొప్ప మున్నగునవి ఉంచడముచేత నా మనిషి చోప్పదేవడానికై వెళ్ళి యా విశాలమైన చీకటి భవనములో నటు ఇటు జూచి భయపడి దిగులుతో క్రిందబడి యకస్మాత్తుగా తన ప్రాణములనువీడెనని చెప్పిరి. అందులకేనేమో ఆ విశాలమైన భవనములో నేటికిని యెవరును ఉండడానికి సాహసించరైరి. పోతె ఇక నేనున్న ఇంటివారును ఒక వార్తను వినిపించిరి. ఒకప్పుడు శ్రీ జాకవారు గూడ గొప్ప ధనవంతులుగా నుండిరని చెప్పితినే, వారింటి వెనుకనున్న ఖాళీస్థలమును శ్రీ సజ్జన్నశెట్టి శంకరణ్ణగారికి విక్రయించగా నా స్థలములో

కోట్లకొల్లలుగ దాచియున్న నిక్షేపము ధనము వారికి లభించుటచేతనే వారంతటి గొప్పధనవంతులైనారని చెప్పిరి. అది ఇంతవరకు నిజమేనేమో నమకున్నాను. ప్రతి మానవునికి వారివారిదశలనుబట్టి లక్ష్మీసంపన్నుడు గావడము గాని, దరిద్రుడు గావడముగాని జరుగుతుందని ప్రాచీన కథలను వింటూంటె మనకవగహనము గాకపోదుగదా!

సరే శ్రీ "జాకగురణ్ణగారి" కోరిక ప్రకారము మరునాడుదయమే వారింట్లోకి ప్రవేశించితిని, వారిధర్మపత్నీ శ్రీమతి గురమ్మ గూడనన్ను యెంతో ఆప్యాయతతో, నిష్కల్మషహృదయముతో తమ పుత్రుని వలే తామేమి భుజింతురో దానినే నాకు వడ్డించి తృపితిపరచు చుండిరి. ఈ గృహముతోబాటు కలకాలమక్కడేయుంటచేత మిగత వారి గృహముల యొక్క పరిచయముగూడ క్రమేపియేర్పడినది.

శ్రావణ మాసము సమీపించినది. ఈ సమయములో మహేశ్వరుడు తమకుసమయానికి దొరకడమరుదు. కావున మొట్ట మొదలు నేనున్న ఇంట్లోని ఎజమాని దంపతులిరువురు నాపాద తీర్థమును మొదలే స్వీకరించుచుండిరి. శ్రీ శంకరణ్ణగారి దిగుడు బావికి యానాడు పెందలకడనే నిద్రలేచి ఈతగొట్టి స్నానముజేసి మైలబట్టలను నుదికి శుభ్రపరచుకొని ఇష్టలింగార్చనకు మరియు వారి దేవగృహములోని దేవవిగ్రహారాధనకు గావల్సినయన్ని పత్రిగన్నేరు ఎర్రనితెల్లవిపుష్పములనుసంగ్రహించుకొని నాభక్తుని గృహమునకువచ్చే వాడిని, నేనున్న ఇంటియెజమాని శ్రీ గురణ్ణగారు నా పాదములు శుభ్రముగా గడిగి దేవగృహమున ఉన్నత వేదికపై గూర్చుండబెట్టి పాదతీర్థము (క్రియా) పాదోదకమును సిద్ధగించి వారితోబాటు ఇంట్లోని

వారందరు తీర్థమును స్వీకరించుచుండిరి. తరువాత నాకొరకు గృహమునకు వెలుపల వచ్చియున్నచుట్టుప్రక్కలోనున్న భక్తులందరు భోజనానికని దొక్కొళ్ళేవారు. నా పాదార్చనగా వించి తీర్థ ప్రసాదములను స్వీంరించు చుండిరి. భోజనానంతరము వారివారి యథాశక్తి దక్షిణను సమర్పించి నమస్కరించుచుండిరి. మాహేశ్వరులన్నివింటే నేనాటి భక్తులకు అందును కర్నాటక భక్తులకు మమ్మజూచినచో వారికి యెనలేని సంతోషముండేది. అంతెగాకుండా శ్రావణ సోమవారము గూడ నాపరిచయ మేర్పడడముతో రాచయ్యస్వామిగారు మా ఇంటికి మొదలు రావాలంటే, మా యింటికి మొదలు రావాలని ప్రతి పండుగలకును బిలువనారంభించిరి. వారందరికి నాయెడ అమితమైన భక్తి, విశ్వాసములు క్రమేపి బలపడినవి. ఈ పవిత్ర శ్రావణ సోమవారములో ఆ నగరమునకు సుమారు రెండుమైళ్ళ దూరమున నున్న ఎత్తైన గుట్టల్లో శ్రీ రాచోటి వీరభద్రస్వామివారి విశాలమైన మందిరమొండుగలదు. రెండు గొప్ప గొప్ప రాతి గుండ్లయొక్క దిగువ స్థానమున గుహనుబోలియున్నది. అదే గుహను ఒక గదిలా మార్చి, అద్దానికి తలుపులు జేయించారు. లోపల ఒక యెత్తైన వేదికపై వెండివిగ్రహముంది. అక్కడి పూజారి ప్రతిదినము అర్చకత్వము జేసి, గ్రామమునకు దిరిగివచ్చేవాడు. మందిరమునకు ముందు భాగమున చుట్టు విశాలమై, ఎత్తుగానున్న ప్రహరిగోడ, దానికి ఇనుప జాలి తలుపులు. ఈ మందిరమునకు ఎదుట దిగువ బయలుప్రదేశమున చిన్నదొక దిగుడు గుండముంది. అందలి నీరు చాలా స్వచ్ఛముగా త్రాగడానికుపయుక్తముగా నున్నవి. ఇట్టి దేవస్థానముయొక్క జాత్రా శ్రీ రాచోటి వీరభద్రస్వామివారి ఉత్సవము శ్రావణ మాసములో జరుగుతుంది.

ఇట్టి సందర్భములో ప్రతి సం॥ము ఈ కళాశాల విద్యార్థులక్కడికి వెళ్ళి దర్శించి వచ్చె సాంప్రదాయముండెను. అదే ప్రకారముగా నేనక్కడున్నప్పుడు గూడ అందరు విద్యార్థులతో బాటు నేను వెళ్ళితిని. నగరమునకు ఉత్తర భాగమునుండి అక్కడికి వెళ్ళాలి. మార్గమధ్యలో కొన్నిరబ్బరు చెట్లు, ప్రక్కనే ఒక గుండీల (బటన్‌ల) ప్యాక్టరీ, దాన్ని దాటి కొద్దిగా ముందుకు నడువగా, ఒక విశాలమైన వాగు, వర్షాకాలములో బాగుగా నీరు నిండుగ ప్రవహించి, మిగత సమయములో కొద్దిపాటి నీరుండుట వలన కృషీవళులు (రైతులు) దాన్ని దాటేసి తమ తమ క్షేత్రములకు వెళ్ళుచుండిరి. ఆ వాగులో ప్రవాహముదెచ్చి మేట వేసిన తెల్లని స్వచ్ఛమైన ఇసుక దిబ్బలతో నిండియుండి, రెండువైపుల తీరముల (ఒడ్డులందు) తమ నానారకముల ఎత్తైన వృక్షములు వాటి శాఖలు క్రిందికివాలి యుండినవి. వాటి మధ్యమధ్యన ఎఱ్ఱగన్నేరుచెట్లు, విశాలముగా బెరిగియున్నవి. వాటి పువ్వులయొక్క శోభా-సుగంధములతో ఎఱ్ఱగులాబీ పుష్పముల శోభను గొల్పుచుండెను.

ఒకొక్కప్పుడు అనగా ఆశ్వీజ కార్తీక మాసాల్లో సరస్వతి మరియు మహాలక్ష్మిపూజకై ఈ ఎఱ్ఱగన్నేరు పుష్పములనే సంగ్రహించుకొని దీసికెళ్ళి గొప్పగొప్ప లావటి దండలను (పూలమాలను జేసి) ఫోటోలకువేసి యర్చించుచుంటిమి. వాగునకు ఇరు పార్శ్వభాగములందున్న పచ్చనైన గుబురుగాను, దట్టముగా బెరిగియున్నచెట్లయొక్క సౌందర్యమును దిలకిస్తు ముందుకు వెళ్ళగా, ఎక్కడ జూచినను విశాలమైన క్షేత్రములలో రైతులు బండించిన జొన్నచేలు, ఏపుగా పచ్చగా పెరిగి చూపరుల దృష్టులనాకర్షించుచుండెను. అక్కడక్కడ వేరుశనగ క్షేత్రములు గూడ విశాలముగా రైతులు బండిస్తారు. కనుక

ఇక్కడ వేరుశనగ నూనె ప్యాక్టరీలు గూడ అధికముగానున్నవి. అక్కడక్కడ కొద్ది దూరములో చెరుకుతోటలు బెరిగియున్నవి. దాదాపు ప్రకృతి సౌందర్యముతో నగరము నలువైపుల బహుసుందర ముగా నగుపడును. ఇట్టి సస్యశ్యామలముగా బెరిగియున్న క్షేత్రములను దర్శిస్తు, పూజ్యశ్రీ రాచోటివీరన్నస్వామివారి మందిరమునకు వెళ్ళి స్వామివారి దర్శనము జేసికొని కొద్ది సేపు ప్రాంగణములోని అరగులపై గూర్చుండి, గుట్టల వరుసలను, పచ్చని పైరులతో నిండిన అందమైన దృశ్యమును దిలకించితిమి. జనులు తండోపతండాలుగా స్వామి వారి దర్శనార్థము వచ్చుచుండిరి. కొన్ని తినుబండారములు-ఆటవస్తువుల విక్రయ దుకాణాలుగూడ ఉండినవి. యాదగిరి నగరమునకు పశ్చిమ దిశనుండి ఉత్తరదిశకు ప్రవహించె వాగునుండి వేసవికాలములో అక్కడక్కడ ఊట (గుంటలు) చెలిమలు త్రవ్వి అటనుండి గ్రామస్థులు మంచినీరు దీసికెళ్ళుచుందురు. అక్కడనీరు తెచ్చుటకు వాడేవి ఇనుపవి పెద్దబిందేలు. ఇక్కడివారు వాటిని సామాన్యముగా మోయలేరు, మనవైపు వాటిస్థానే మట్టికుండలను వాడుతుంటాము.

ఒకొక్కసారితోటి విద్యార్థులతో సాయంత్రము నగరమునకు పశ్చిమదిశలోనున్న వాగునకువెళ్ళి అక్కడ దానికి ఇరువైపులతో బెరిగియున్న తోటలోని జామపండ్లు-రేగుపండ్లు పెద్దగానున్నవిజూచి వాటిని త్రెంచుకొని తినేవారము. సాయంత్రము వసతిగృహమునకు వచ్చి రాత్రిభోజనముచేసి నాడుచెప్పించుకొన్న పాఠములను జదువుచుంటిమి. మరో శ్రావణసోమవారము నగరముమధ్యనఒక గుట్టచాలఉన్నతముగాను, ప్రాచీన కోటగోడలతోను, పురాతన రాజభవనములతోను, ఈశ్వర దేవాలయము. ముస్లిముల మసీదులున్నవి. మందుగుండు సామగ్రిని మరియు ఆహారధాన్యము భద్రపరచె పాతరలుగూడ ఉండేవి.

చతుర్దశి అమావాస్య-పౌర్ణిమా-పాడ్యమి ఈ మూడు అనధ్యాయ దినములు కావున కళాశాలకు వరుసగా సెలవులుండును, మరియు అష్టమియందును పాఠాలు చెప్పరు. సరే ఈ యనాధ్యాయ దినములలో గురువులు తమకుబోధించిన పాఠములను విద్యార్థులు సింహావలోకనముజేయుచుండిరి. సుమారు మధ్యాహ్నము 3. గలకు చరిత్ర ప్రసిద్ధమైన పూర్వము యాదవులు రాజధానిగా జేసికొని పరిపాలించిన యాదగిరి (కిల్లాను) గుట్టనుదర్శించాలనె కోరికయున్న విద్యార్థులందరముగల్సి వెళ్ళితిమి. ప్రతిదినము మేము ఆ కిలాయొక్క మొదటి మహాద్వారముగల ప్రాకారమును దాటేసి బయలు ప్రదేశమునకు వేళ్ళి వచ్చేవారము. ఆకాలములో మరుగుదొడ్లులేకుండెను కొద్దిదూరననున్న మైదానమునకు వేళ్ళాల్సిందే. ఇంతకుమించి పైకిల్లాకు వెళ్ళకుంటిమి. ఈ కిల్లాచుట్టు అయిదు కోటగోడలతో శత్రుదుర్భేద్యముగా దృఢముగా గట్టబడినది. గొప్పగొప్ప శిలలనుజోడించి గట్టియున్నారు. వాటికి నలువైపుల అక్కడక్కడ మహాద్వారములుండినవి. వాటిపై శిలాశాసనములు గూడ ఉన్నవి, స్నానపుగదున్నవి. ఒక తటాకము గూడయున్నది. అశ్వశాలలు - గజశాలలుగూడ ఉన్నవి. ఇప్పటికి చెక్కుచెదరకుండా యున్నవి. వైరివర్గము నెదుర్కొని పోరాడుని మిత్తము కిల్లాకు నలుదిక్కులలోనక్కడక్కడ గొప్పతోపులున్నవి. పైశిఖరమున నున్నది, అన్నితోపులకంటెను గొప్పదైనది. సుమారు ఐదుజముల పొడుగు, రెండుగజముల వెడల్పుగల తోపుఒకటియుండి, దానియొక్కగురి సుమారు పంద్రెండుమైళ్ళ దూరమువరకు పోవుచుండెడిదని వింటిని,దానిగుండ్రనిలావటికొండ్లను పైనన్రమోంచిగినచో నా శబ్దము దిగువనున్న నగరమంతయు వినబడుచుండును, పైనుండి దిగువనున్న నగరములోనత్యున్నతములైన ఇండ్లు (మేడలు)

అన్నియు అతిచిన్నవిగాను గుండును. ఇంతటి చరిత్ర ప్రాముఖ్యతగల ఆబిల్లానుజూచి సాయంత్రము 6-7గం. కు మరల మా కళాశాలకు జేరుకుంటిమి. దానినధిరోహించునప్పుడు ఆయాసముతో నక్కడక్క-కూర్చుండుకుంటు వెళ్ళితిమి. కానిదిగివచ్చెప్పుడంతటి ప్రయాసమునకు లోనుగాకుండ సుఖముగాదిగితిమి.

ప్రతిదినము సాయంత్రము ఆరు గం.కు విద్యార్థులంత మధ్యహాలులో వరుసగా గూర్చుండి దైవప్రార్థన గావించితిమి. ఆపిదప 7.గం.కు గంట మ్రోగించగానే వెళ్ళిభోజనముజేసితిమి. భోజనపుహాలులోను విద్యార్థులంతా వరుసగా వేసియుంచిన దర్భాసనములపై గూర్చుండి, అందరికి అడ్డణిగేలు (ముక్కాలిపీటలు) వాటిపైసిల్వరు శుభ్రమైన కంచములు. తెల్లని సిల్వరువే త్రాగేనీటితో నింపియుంచిన చెంబులు ఈ మొదలేవంట చేసేవకులు సిద్ధగించి ఉంచుచుండిరి, భోజన పదార్థములనన్నింటిని వడ్డించేవరకుభగవంతుని ప్రార్థనలను, స్తోత్రములను, ఒకరిద్దరుజేప్పగా మిగతవారు చెప్పుచుండిరి.

శ్రావణ మాసములో నైతెనేమి, పర్వదినాల్లోనైతేనేమి, నగరములోని కళాశాలకు పరిసరములో నుండిన వీరశైవ భక్తులు, జంగమ విద్యార్థులను, తమ ఇండ్లకు దోడ్కొళ్ళి పాదార్చనగావించి వారిచేతతీర్థ ప్రసాదములనుస్వీకరించి, మధురవంటకాలతో మాకుతృప్తిగా భోజనము జేయించి ఆకాలములో చెల్లుబడియగుచుండిన డబ్బులు అరణా (రెండు బిటిష ప్రభుత్వముయొక్క రాణిరాజు గుర్తులున్న (ముద్రలుండినవి) కాసులు (పైసలు) అథవాఅణా నాలుగు పైసలు సంభావనగా నొసగి పాదాభివందనముజేసి పంపుచుండిరి, అదేవిధముగ్గానన్ను గూడ కొందరు

భక్తులు దోడ్కొనిపోవుచుండిరి, అదేవిధముగానన్నుగూడ అక్కడిభక్తులు సన్మానించుచుండిరి. అలా భక్తులొసంగిసంభావనాదబ్బులను నేను విచ్చల విడిగా ఖర్చుబెట్టకుండదుంచి. కూడబెట్టుకొని నాకావసరమైన నోటుబుక్కులు, కలము పత్రి చిన్న చిన్న బుక్కులను గొనుక్కొను చుంటిని, ఇంటినుండి (జోగిపేటనుండి) మానాన్నగారుగాని, లేదా మా గురువుగారు సదాశివపేటనుండిగాని ఒక్కనయాపైస (అప్పట్లో దమ్మిడి) గాని పంపకుండిరి. అప్పుడు నిజాంకాలములో రెండుపైసల కొరకారడు చొప్పున పాతిక ముప్పది కారట్లు డబ్బుబంపుమని వ్రాసిచోవారు డబ్బును బంపకపోయినను కనీసము క్షేమసమచారము లనుగూడ వ్రాసేవారుగాదు. ఇందుకు నేనూహించుకొనిన దేమనగా, జోగిపేట మానాన్నగారునన్ను సదాశివపేటమఠమునకుత్తరాధికారిగా బంపాముగనుక, నా పోషణ-విద్యాభ్యాసమును జేయించే బాధ్యత అంతయు, ధనవ్యయ భారమంతయు శ్రీ విరూపాక్షస్వామి (గురువు గారే) భరిస్తారులే, నా కేందు వచ్చినబెడద అనిభావించి, మా తండ్రి గారు డబ్బును బంపకుండిరి, ఇంక మా గురువుగారు మొదలేనన్ను శాలకు బంపునప్పుడు శంషాబాదు శ్రీ సిద్ధలింగ మరిదేవరగారితో స్పష్టముగా చేప్పియుండిరి. యేమనగా దేవరగారు నాకొరకు డబ్బు విషయమునుగురించి ప్రశ్నించగా మాగువురుగారు 'యాదగిరిలోనాకు భక్తులున్నారువారికినా పేరుచెప్పిడబ్బడిగినచోవారిస్తారని' చేప్పితప్పుకునిరి అలాగని వారును నాకుడబ్బును బంపరైరి. వీరుభయుల మధ్యననేను నలిగిపోతు కఠిణమైన నా జీవితమును దుర్భరముగా నీడ్చుచుంటిని. అక్కడ ఆకొనినచో సమయమునకు భోజనమును జేయింతురేగాని డబ్బడిగితే ఇచ్చేవారెవరు? కనుక నిశ్చింతగా జదువుకొందమనిన డబ్బుకొరత విద్యార్థిదశలోనన్ను తీవదీనావస్థకులోబరచినది. మదిలో

నేను బాగుగా జదివి గొప్పపండితుడను గావలేనను ఉటలాట పడేవాడిని. అందుకుసరి యైనఆర్థికవసథులునా కెక్కడ? ఆకాలములో ప్రౌఢవిద్యార్థులు సం॥ ము పొడుగునా జదివి, వేసవిలో ప్రౌఢపరీక్షలు వ్రాయుటకైవారు బొంబే, పూనా, నాగపూర్. పరీక్షా కేంద్రములకు వెళ్ళునప్పుడు వారినిజూచి నేనుగూడ వారివలే ప్రౌఢ పరీక్షలనెప్పుడు జదువుతానో ననే కరు ఉత్సాహము నిరంతరము సాగరములో నితరంగముల మాదిరి. నాహృదయములో పౌర్ణమినాడు ఆటు పోటులవలే కలతజెందుచుండేను. ఎక్కడ గూర్చున్నను, ఎక్కడికివెళ్ళినను చివరికి బయలు ప్రదేశమునకు వెళ్ళుచుండగను నాకదే ఆలోచన ఉండేది. భాద్రపదమాసములో మహగణపతిపూజా, ఆశ్వీజ మాసములోని మాహ సరస్వతి పూజలు అత్యంతవైభవముతో జరుపే వారము. వేదొక్తముగ ఉదయము-సాయంకాలము వేళ్ళలో ధూప-దీప నైవేద్యములతో విద్యార్థుల త్యంత భక్తితో పూజించెవారు.

సరస్వతీపూజా సమయములో విద్యార్థులందరు తాము జదువుకునే ప్రధాన పాఠ్యపుస్తకములన్నింటిని ఒక టేబులుపై స్వచ్ఛమైన వస్త్రమును బరచి, దానిపై వరుసగాను, ఉన్నతముగానుబెట్టి, ఆ పుస్తకములపై సరస్వతి పటమునుంచి దానికి వేదోక్తముగా వరుసగా మూడు దినములు వేదసూక్తములను స్వరయుక్తముగా బఠించుచు షోడశోపచారములతో నర్పించుచుండిరి.

ఇంతవరకు కర్నాటక దేశములో కన్నడ విద్యార్థుల సాంగత్యములోనున్న నాకును కొంతవరకు కన్నడ భాష అలవడినది. తప్పొప్పుల భాషలో తోడి విద్యార్థులతోగల్సి మాట్లాడుచుంటిని. అది

విని కొంచెము పరిహసించుచుండిరి. ఈ విద్యార్థులలో దిన్ని సూగూరు శర్మ, తూవేహాళ, సిద్ధరామయ్య, బసవరాజయ్యాడిగి, శ్రీ సోమశేఖరశర్మ రాయచూరు. దిన్ని బసవరాజ రాయచూరు, శ్రీ గురులింగ శివాచార్యులు శిఖరమఠ, హత్తునూరు రాచోటి వీరంచరు నాకు సహాధ్యాయులుగా ఉండిరి. మొదటికావ్యము ఆద్యపరీక్షకై యధ్యయనము జేయుచుంటిమి. ఇంతలో శ్రీ చిదిరేమఠము వీరభద్రశర్మగారికి వగడదిన్ని బసవరాజు శాస్త్రిగారికి వీరిమధ్య వైషమ్యాలు, అంతఃకలమువలన వారు శ్రీ గురుసిద్ధశాస్త్రి నాయకల్ మున్నగు ప్రౌఢ విద్యార్థులను ప్రోత్సహించి, వీరిని (5-6) విద్యార్థులను తనవెంట నిడుకొని హైద్రాబాదుకు వెళ్ళి, సికింద్రాబాదులో మోండా మార్కెటు క్రాసురోడు కార్నర్‌లో నున్న అక్కడ శ్రీ మటిగే నాగయ్యగారి ధర్మసత్రము, సొంత భవనములో సంస్కృత గురుకులమును ప్రారంభించిరి, దానికితోడుగా ఒకటిరెండు సం॥లు "విభూతి" యను మాసపత్రికను నిర్వహించిరి. ఇంతకు శ్రీ చి॥మ॥ వీరభద్రశర్మగారికి మరియు శ్రీ వం॥ వగడదిన్ని బసవరాజశాస్త్రిగారికి మధ్యన వైషమ్యము లేర్పడుటకు కారణమేమనగా వీరభద్రశర్మగారు పంచాచార్యుల సిద్ధాంతములకు లోబడినవారు. గొప్ప అభిమానులు. శ్రీ బసవరాజశాస్త్రిగారు శ్రీ బసవేశ్వర సిద్ధాంతములకు లోబడినవారు. గనుక ఈ యుభయుల సిద్ధాంతములు భేదించుటవలన పొసగకుండెను. వీరభద్రశర్మగారి తరువాత ప్రిన్సిపాల్ స్థానమును శ్రీ బసవరాజశాస్త్రిగారే అలంకరించిరి. వీరు సంస్కృత వ్యాకరణ శాస్త్రములోను మరియు సాహిత్యములోను ఉద్దండ పండితులు. వీరి తరువాత మొట్టమొదట శంకరణ్ణగారి సమయములో ప్రిన్సిపాల్‌గా వ్యవహరించిన వే॥వం॥ వ్యాకరణ తీర్థ శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారు చాలావరకు ప్రిన్సిపాలుగా నుండిరి. వీరి

హాయాములోనే నేను కావ్య ఆధ్యపరీక్షనుండి ప్రారంభించి "కావ్యతీర్థ" పరీక్షవరకు పట్టువీడకుండ అభ్యసించితిని. నాకా సమయములో ఆర్థిక ఇబ్బందులెన్ని వాటిల్లినను వాటిని నాతోటి విద్యార్థుల సహాయ సహకారములతో అధ్యయనమొనర్చితిని. ఈ మధ్య డబ్బులు బంపనందుకు కినిసి సదాశివపేటకు మరియు జోగిపేటకు వెళ్ళి మా గురువుగారితోను, నాన్నగారితోను, తగువులాడి వచ్చితిని. నాన్నగారు20 రూ॥లుమాత్రమే ఇచ్చిరి. ఆదె మధ్య బజారులో పదుగురిలో నన్ను పరీక్షించి ఇచ్చిరి.

కార్తీక మాసములో యాదగిరి నగర శృంగార వైభవాన్ని జూచి యానందించని వారుండరు. శ్రీ మహాలక్ష్మి మహాసరస్వతీ పూజల సమయములో కొంతమంది గ్రామ ప్రముఖులు (శ్రీమంతులు) పూజలకై మా కాలేజి విద్యార్థుల నాహ్వానించుచుండిరి. పురము యొక్క నలువలంకులకు నగర పురప్రముఖ మార్గముల కిరువైపుల నున్న దుకాణములను వరుసగా కొబ్బరి కొమ్మలతోను, మామిడి తోరణములతోను, అరటి స్తంబాలతోను, బంతిచెట్లతోను, పూలపందల తోను, వరుసగా సలంకరించిన విద్యుద్దీపాలతోను, రంగురంగుల కాగి దాల పరాకీలతోను,మరియు సహజదీపాలవరుసలతోను,సలంకరించబడి, తూర్పునుండి పడమరకు, అట్లే దక్షిణము నుండి ఉత్తర దిశకు దిల కించినచో నేమాత్రమువంకరటింకరలేకుండగ కొలవేసినట్లుగాచక్కగా నగుపడుచుండెను. దుకాణములన్నియు వేర్వేరుగా నగుపడకుండగా ఒకదానితో నొకటి కల్సియుండినట్లు యుండుటవలన ఆ వరసలు చక్కగానుండి కనులకు విందు గొల్పుచుండెను. రొడ్డునకుభయ పార్శ్వభాగముల నుండి అలంకరించబడిన దుకాణాల మధ్య విశాలమైన రొడ్డుగాక, అతీవ దగ్గరగా నుండుటముచేత రొడ్ల మధ్యనుండి వెళ్ళుతూఉంటె వివాహ మంటపములో నడుస్తున్నట్లు దోచెడివి.

ఇక మమ్ము లక్ష్మీసరస్వతుల పూజలకొరకు ఆమంత్రించినవారు తమ దుకాణాల్లో శుభ్రమైన (తెల్లని గుడ్డలు) చాందినీ వస్త్రములతోను, పైన తెల్లనిగోడలకు మహాత్ముల, దేవతల, దేశభక్తుల, మరియు నిగ్గు నిలువుటద్దాలతో వరసగా నలంకరించబడి బంతిపూల, చేమంతిపూల దండలతో నలంకరించి, ఒక ప్రక్క వేదికపై చిన్నగద్దెలు (వేదికలు) వాటిపై లక్ష్మీసరస్వతుల పటాలనుంచి, వాటికిపైన రెండు వైపుల భిత్తిపైన శుభ-లాభములను వాక్యములను వ్రాసి. స్వస్తి చిహ్నములను చిత్రించి, పూజాసామగ్రిని సంగ్రహించి, మరోవైపున క్రొత్తఖాతా పుస్తకములలో మొదటి పుటలో "శ్రీగణేశాయనమః, శ్రీశారదాయైనమః, శ్రీ మహాలక్ష్మీదేవతాయైనమః" మొదలగు శుభవాక్యములను వ్రాసి, కుంకుమ, పసుపు, ఘృతమిశ్రిత పదార్థములతోకల్పి శుభ-లాభములను, స్వస్తి చిహ్నమును లిఖించి, మధ్యభాగమున ఒక క్రొత్త గుడ్డను బరచి, దానిపై బియ్యమును బరచి, దానిపై ఒక కలశము (చెంబును) దానిలో మామిడి లేదా తమలపాకులుంచి, వాటి మధ్యన టెంకాయను, లేదాకొబ్బరి నిండుకుడుకలో చిన్నదేవతావిగ్రహమునుంచి, మావిద్యార్థు లలో ఒకరిని జక్కగా పూజామంత్రములనెరిగినవారితో, యథావిధిగా పూజను జెయించేడివారు. అనుభవముగలవారు మొదలు, గణపతిని, ఆ పిదప గౌరిదేవిని షోడషోపచారములతో మంత్రముల నుచ్చరిస్తు యజ మానిచేత పూజింపజేయుచుండిరి.

తరువాత కలశమున కెదురుగా కొంత తానార్జించిన ధన రాశిని కుప్పగాబోసిన దానిని,కలశమును శుద్ధోదకము, గంధము, పత్రి పుష్పములు, దూపదీప, నైవేద్యముగంటనాదము,టెంకాయ,కర్పూరము లతో నిర్మలమై మనస్సుతో నర్చించి, బంతి - చెమంతిపూలదండల నమర్చి, నీరాజనమొసగి చివరికి మంత్రపుష్పములతో ముగించిన

తదుపరి అత్తరు, పన్నీరులతో మహేశ్వరులను సత్కరించి, మా మహేశ్వరులందరికి ప్రసాదమును బంచి, యథాశక్తి దక్షిణల నొసఁగి పాదాభివందనముజేసి సాగనంపుచుండిరి. నాడు సాయంత్రము 6-7 గం.కు కాలేజి నుండి వెళ్ళినవారము. మరల కళాశాలకు రాత్రి 11-12 గం.కువచ్చేవారము. ఇట్లు దీపావళి పర్వదినములు వైభవముగా సాగుచుండేవి. ఇదే రీతిగా దసరాపండుగ వైభవముగను గూడ సాగుచుండెను.

దీపావళి సందర్భమున మమ్మాహ్వానించినవారు అరుగులపై తెల్లని పరుపులు బరచి గోడకు వరుసగా తెల్లని తెక్కియలను బెట్టిన చోట గూర్చుండుమని చెప్పి అత్తరుపన్నీరుల జల్లులతో సత్కరించి దక్షణ తాంబులఫలములనొసఁగినమస్కరించి మాచేత ఆశిస్సులను బడయుచుండిరి. ఈ సమయమున మాకళాశాలో సరస్వతీపూజా సక్రమముగా జరపడముచేత యేడెనమిదిరోజాలు సెలవునొసఁగుచుండిరి. దసరపర్వదిన సందర్భమున ఒకదినము సెలవు ఉంటుంది. ఆనాడు సాయంత్రము కొంతమంది పుర ప్రముఖుల ఇళ్ళవద్దకు వేళ్ళివారికి ఆశీర్వాదపూర్వకముగా బంగారు (జింబీపత్రి)ని భక్తులకు ఇవ్వడముతో వారు దానికి ప్రతిఫలముగాదక్షిణల నొసఁగిపాదాభివందనముజేసి పంపు చుండిరి, రాత్రిమరల కళాశాలకువచ్చి జంబీపత్రిని బంగాఒకరికొకరు సమర్పించుకుంటు ఉంటమి. ఈ విజయదశమినాడు బాల్యమున నేను సందర్శించిన ఒకదృశ్యము నాకన్నులముందు నేటికిని నాహృదయము న చెక్కుచెదరకుండ ఉండినది. ఇది. సదాశివపేటలో జరిగినది, అదేమనగా గ్రామములోని భక్తులంధరు దసరపర్వదినమున సాయంత్ర ఛ.గం.కు మంగళ వాయిద్యములతో వారమునను సరించి

గ్రామము వెలుపల పచ్చగా పెరిగియున్న జొన్నచేలలోగాని, తోటల్లో గాని జంబి (జమ్మ) వృక్షముకడకు వేళ్ళిదాన్ని అష్టవిధార్చన శోడశోపచారములతో బూజించి దాని పత్రములను త్రుంచుకొని ఆ పత్రములనా నాడు బంగారముగా భావించి చాలాగౌరవముతో శ్రద్ధవరచుకొని యెక్కడైన పాలపిట్టను సందర్శించి మళ్ళివాయిద్యము లతో నగరములోకి ప్రవేశించి ప్రప్రథమమునస్థానిక పెద్దమఠమునకు వచ్చి భక్తులందరు శ్రీ పూజ్యస్వాములవారి ఇష్టలింగమునకు భక్తిమీర కాయ కర్పూరములను సమర్పించి నమస్కరించి వారి యాశీర్వాదము లను బొంది దక్షిణను సమర్పించిన తరువాత ఆ మఠములోనున్న పూజ్యస్వాముల సమాధులకు కర్పూరమును వెలిగించి మంగళ నీరాజనములొనర్చి నమస్కరించి వెళ్ళుచుందురు.

మరల నగరములో ఈశ్వరాలయము. శ్రీ రామ మందిరము. శ్రీ ఆంజనేయ మందిరము మొదలగు దేవతలను సందర్శించి చివరికి తమదేవగృహములోని ఇలవేల్పును సందర్శించే పరిపాటియుండేది. ఇప్పటికిని యీ ఆచారముకొద్ది పాటిగానున్నప్పటికిని, మొట్టమొదట మఠాధిపతిగారిని సందర్శించేప్రధానేడు లోపించినది, ఇదిచాలా విడ్డూరము గానున్నది. వీరశైవ ధర్మశాస్త్రములోని పద్ధతులను వుల్లంఘించుట అంతగా శ్రీ యోదాయకమైనదిగాదనియిక్కడ ఈ సందర్భములో నొక్కివక్కాణించితిని, వంశ పరంపరగా వచ్చిన సాంప్రదాయములను బుద్ధిమంతులెన్నడు బరిత్యజింపరుగదా? పైదృశ్యమును నేను నా కన్నులారజూచి చాలాసంతపించితిని యేలనన, వీరశైవ సిద్ధాంతము జడవస్తువులను బూజించుటకంటెను, చైతన్యరూపమైనగురు జంగమా మూర్తులనే సచేతన్య దేవతలను గానర్చించి, వారివలనదివ్య

జ్ఞానామృతమును బడయుట. వారిని దృప్తిపరచి వారిచేత ఆశీస్సులను బడయుటే ప్రధాన లక్ష్యమైయున్నది. మిగత జడపదార్థములనెన్నటికిని బూజించవలదని వీరశైవాగమములు నొక్కివక్కాణించియున్నవి. ఇక్కడొక మంత్రము గూడసాభిఃప్రాయమునే వ్యక్తపరచియున్నది.

శ్లో॥ శమీశమయతేపాపం-శమీశత్రువినాశినీః
అర్జునస్యధనుర్ధారి-శివస్యప్రియదర్శినీ॥

అనునాశీర్వాదమంత్రములోనిచివరిపాదములోనిశివస్యచరణమును మరోవిధముగా రామస్య అని మార్చిచెప్పుట అత్యంతఘోరపాటుగా నాకు దోచుచున్నది. ఏలన పాండవమధ్యముడైన అర్జునుడు శ్రీకృష్ణుని సలహా మేరకు బలాఢ్యులైన శత్రువులను నీవు జయించాలంటే మొట్టమొదట పాశుపతాస్త్ర సంప్రాప్తికొరకు నీవు శివునిగురించి తపంబు నాచరించుమని యాదేశించాడు. ఆ తరువాత అర్జునుడు ఇంద్రకీల పర్వతము ఇప్పటి విజయవాడవద్దనున్న పర్వతముపై అర్జునుడు ఘోర తపంబొనర్చి శివానుగ్రహమునుకు పాత్రుడై పాశుపతాస్త్రమును బడసెనని మహాభారత కథలోనున్నది.

కావున "చివరి పాదమును శివస్యప్రియదర్శనమే" సార్థకమైవదిగాని, "రామస్య ప్రియదర్శనమని" యుచ్ఛరించుట యసందర్భముగ కల్పితమైయున్నది. ఎందులకనగా రామాయణము కథ మొదట ద్వాపారయుగములో జరిగినది. మహాభారతము కలియుగములోనిది. యెంతటి వ్యత్యాసమున్నదో వాచకులే గ్రహించగలరు. ఇలాగే బ్రాహ్మణులు తమ ఆధిక్యతను ప్రజలలో వ్యాపింపజేయుటకు అనేక విషయములను కపోల కల్పితములనే వ్రాసి ప్రచురించియున్నారు. కనుక కర్నాటక, మహారాష్ట్ర ప్రాంతములోని విద్యావంతులెల్లరు

వాస్తవ విషయమును గుర్తించి, పై శ్లోకమునే దసరా పర్వదినము నందుచ్చరించుచుండిరి. ఇంతలో మళ్ళీ యథారీతి వేసవి సెలవుల తరువాత యాదగిరి కళాశాల ప్రారంభమయ్యెను. విద్యార్థులందరు వచ్చియుండిరి. ఎప్పటిలాగా పాఠాలు బోధించుట జరుగెను.

నేను కళాశాల నియమానుసారముగా ప్రాథమిక పాఠ్యపుస్తక ములో కొన్ని పాఠములను పూర్తిజేసితిని. ఆ కారణముచేత ఈ సం॥ము నన్ను కళాశాలలో జేర్చుకొనిరి. గత సం॥రమే నా ఆతకొక మిత్రుడు నాతో అభ్యాసము జేయుచుండెను. మా ఉభయులలో నధిక మైత్రి యేర్పడియుండెను. ఒకే తరగతికి జెందినవారము. ఇతని గ్రామము నాటి నైజాం కర్నాటక ప్రాంతమందలి రక్కసి. ఇతని పేరు మహాంతయ్య. మాతోబాటు మరో ఆరుగురు విద్యార్థులుండిరి. మొత్తము మా తరగతిలో ఎనమండుగురము విద్యార్థులమైతిమి. ఇక్కడి నుండి మా అభ్యాసము సంతోషదాయకముగా, నిర్విఘ్నముగా జరుగు చుండినది. కొద్ది సమయములోనే మొదటి పరీక్ష (సంస్కృత సాహిత్యాద్య)కు నిర్ణయించబడిన పంచకావ్యములలో మొదటిదైన రఘువంశములోని పాఠములను జదువ నారంభించితిమి. ఈ కావ్య మును ప్రారంభించునపుడు మా తరగతి విద్యార్థులందరు తలా ఎనమిదణాల (అర్థరూపాయి) చొప్పున వేసికొని, శుభారంభమునకై మా పాఠ్యపుస్తకములను (రఘువంశ కావ్యములను) ఒక వేదిక నిర్మించి, దానిపైయుంచి, వాటిపై శ్రీ మహాసరస్వతీ చిత్రపటము నుంచి భయభక్తులతో షోడశోపచారములతోను బూజించి, తత్తీర్థ ప్రసాదములను, ఇతర విద్యార్థులందరికిని బంచితిమి.

ఆ దినము మొదలుకొని నేను ఒక సరస్వతి పటమునకు ప్రతిదినము స్నానముజేసి, నాఇష్టలింగార్చనను పూర్తిజేసికొని, యా పటమును శుద్ధోదకము, విభూతి, కుంకుమ, పత్రిపుష్పము, (ఎఱ్ఱ గన్నేరు)లతోను, అగరుబత్తి, కర్పూరము, ఫలహారములతో మనసార ఆరాధించుచుంటిని. పటమును రంగురంగుల పొడుగాటి పూసలదండతో నలంకరించితిని. శారదను బూజించనిదే భుజించకుంటిని. రానురాను శారదా భక్తి నాలో దృఢపడినది. నేటికిని ఆనాటి భక్తి నాలో చెదరని ముద్రవేసికొనియున్నది. నాటి చిత్రపటముగూడ నేటికిని నావద్ద నున్నది. నా సొంత గ్రంథాలయములో దాన్ని భద్రపరచి యున్నాడను, మొత్తానికి నేను నాటినుంచి సరస్వతి ఉపాసకుడనైన ఫలితముగానే ఆ దేవతానుగ్రహమువలన నేను నాకు మానవ సమాజములో కాస్త గౌరవప్రతిష్ఠలు సమకూరినవనుటలో సందేహమే మాత్రము లేదు. దీనికి తోడుగా శివునియందలి దృఢభక్తి గూడ, నా హృదయమందు గూడుగట్టుకొనియున్నందున, "దేహోదేవాలయః ప్రోక్తో జీవోదేవః సనాతనః" అను సూక్తి నామెడ సార్థకమైనది. ఇందుకు నేను చాలా ప్రసన్నచిత్తుడనై గట్టి ధైర్యముతో, ఆత్మవిశ్వాసముతో ప్రకటించుకొనుచున్నాను. ఇట్లెందులకు నొక్కి వక్కాణించుచున్నాన నగా నావలెనే భావితరమువారు గూడ, అనుసరించి, మానవత్వము గలిగి సమాజములో నాదర్శ జీవితమును సాగించాలని యభిలషించు చున్నాను.

ప్రారంభమున శంషాబాదునుండి నన్నిచటకు (కళాశాలకు) దోడ్కొనివచ్చియున్న శ్రీ సిద్దలింగస్వామి వారి పరిచర్య జేయుటము వలన అవసరమున్నప్పుడు నాకు కొద్దిగా డబ్బులిచ్చెవారు. కాని

యెల్లప్పుడిమ్మనిన ఇస్తారా? కాలేజీ విద్యార్థులెప్పుడేన తమ ఉత్సాహము కొలదియెద్దైన ఫలాహారము జేయవలెనని దలంచి తలా తమ తమ యథాశక్తి నాల్గణాలు లేదా రెండణాలు (విరాళము) చందా వేసుకొను చుండిరి. అట్టి తరి నేనుగూడ చందా (విరాళము) ఇద్దామనుకుంటే నావద్ద ఒక నయాపైసా ఉండేది కాదు. నా వ్యయముకొరకు కాస్త డబ్బును బంపుమని యెన్నిసార్లు మా స్వాములవారికి పత్రములు వ్రాసినను, "నిమ్మకు నీరెత్తినట్లుగా" అథవా "చెవిటివాడి యెదుట శంఖమూదినట్లుగా" ఏలాంటి సమాధానమివ్వకుండ మిన్నకుండిరి. ఆ కాలములో రెండు పైసలకు ఒక కారటు, అట్టివి సుమారు రెండు మూడు రూపాయిల కారట్లు అప్పుడప్పుడు గొనితెచ్చి, నేను వ్రాసేదె గాకుండ. ఉపాధ్యాయులతోను; మరియు శ్రీ సిద్ధలింగస్వామితోను "మీ అబ్బాయికి పాఠ్యపుస్తకాలు, పరీక్షాఫీజు, బట్టలు కొనుటకు డబ్బు వసరమని వ్రాయించినను వాటన్నింటికి పేడచెవిని బెట్టియుండిరి.

నాటినుండి నాపాలిటి మంచిదినములు సమాప్తిజెంది, చేదు దినముల కంకురార్పణమేర్పడినదని భావించితిని. దరిద్రనారాయణుండు దాపురించెననుకుంటిని. మా జననీజనకులకు గూడ డబ్బు బంపుమనిలేఖలు వ్రాస్తే వారుగూడ "మేముఅబ్బాయిని మఠమునకిచ్చాము డబ్బును బంపెపూచి శ్రీ విరూపాక్షస్వామిదే." అందుకు మా బాధ్యత లేదని వారును మిన్నకుండిరి. "కింకర్తవ్యతామూఢుండనై" ఏమియు చేయుటకదిలేక, దిక్కుదోచని పరిస్థితిలోనుంటిని. క్రమక్రమముగా పైన ధరించే దుస్తులు జీర్ణమైనవి. నాయీ దైన్యస్థితిని జూచిభరించలేక పాఠశాల విద్యార్థులెందరో వారు ధరించి వదలిన పాత గుడ్డలను

నాకొసగుచుండిరి. వాటితోనే కాలము వెలిబుచ్చుచుంటిని. ఏమైన తిను బండారములు, పండ్లుమున్నగునవి మా కళాశాలకు వచ్చినప్పుడు గాని, ఇతర బజారుకు వెళ్ళినప్పుడు గాని వాటినికొని తినుటకుగాని నాచేతిలో డబ్బెక్కడిది? చదువడానికి పాఠ్యపుస్తకముల్లేని కారణమున తోటి విద్యార్థుల వద్దనే అడిగి పుచ్చుకొని చదువుకొనుచుంటిని.

కన్నడ భాషలోని కొన్ని పదముల కర్థములు నాకు దెలియక పోయినను సెలవు దినాల్లో (శంకర లైబ్రరి గ్రంథాలయము) నుండి చిన్న చిన్న పుస్తకములను దీసికొని చదువుకొనుచుంటిని. వాటిలోని కొన్ని కథలు మొదలే తెలుగులో దెలిసియుంటవలన చదివి సందర్భానుసారముగా సన్నివేశములను బట్టి అర్థము జేసికొనుచుంటిని. మరికొన్ని తెలియని పదముల కితరులనడిగి తెల్సికొనుచుంటిని.

ఈ విధముగా కొన్ని పుస్తకములనుచదివి. వాటిలోని విషయము తెలిసి తెలియకున్నను, తప్పొప్పులను ఇతరులతో మాట్లాడుతు, కన్నడ భాషను చక్కగా నభ్యసించితిని. మద్రాసు యునివర్శిటి కన్నడ ఎన్-ట్రన్స్ పరీక్షవ్రాసి నెగ్గియున్నాను. కళాశాలలో విద్యార్జనమునకు నేలాంటికొరత లేకుడినది,ఉచిత విద్యాభోజన, ఉచితవసతి,ఇవియన్ని సౌకర్యములున్నప్పటికిన్ని, డబ్బుకొరత వలన చాలా ఇబ్బంది పడు చుంటిని. రేయింబవళ్ళు డబ్బులేక చింతాగ్రస్తుడ నగుచుంటిని. డబ్బు లేమి వలన ఎన్నియో ఇక్కట్లు (విపత్తు)లకు లోనగుచుంటిని. పోని ఒకసారి సదాశివపేటకుగాని,లేదాజోగిపేటకుగానివెళ్ళి, మాగురువు గారిని గాని, అథవా మా తల్లిదండ్రులనుగాని అడిగి డబ్బును దెచ్చు కుందామనుకొన్నను. మొదలు ఆ గ్రామమునకు వెళ్ళడానికైన రైలు-బస్సు చార్జులకు డబ్బవసరమే గదా? అసలు అదే లేదయ్యెను.

సరే వేరేవారివద్ద చేతిబదులు డబ్బు బుచ్చుకొనవలెననుకున్నను. అలా డబ్బుతో సతమతమౌతున్న నన్ను నమ్మి ఇచ్చేవారెవరు? "దారిద్ర్యమునకు నానా చింతలు," అన్నట్లుగా నాలోచించి చివరకు ఒక నిర్ణయమునకు వచ్చితిని. అదేమగా ఎక్కడైతే దుస్తులు, పాఠ్య పుస్తకాలు, భోజనములను ఉచితముగా నొసగి విద్యను బోధించే చోటునకు వెళ్ళాలి. అనే కోరిక నా మదిలో గలిగెను. ఇదే విధమైన విచారముగల ఇద్దరు విద్యార్థులు నా జతకుజేరి యెక్కడికైతె అక్కడికి వచ్చుటకు సిద్ధపడిరి. ఇలా అన్ని విధములైన సౌకర్యములను గల్పించని, మాకు విద్యను బోధింపజేయువారు లభించినసరే. లేదా ఎవరివద్దనైన ఉద్యోగమునకుండి, పగలువారివద్ద పనిజేస్తు, రాత్రివేళ్ళలో అధ్యయనమును జేయాలి. అథవా అది లభించని యెడల చివరికి మిల్టిరిలోనైన జేరి, విద్యనభ్యసించాలని యుత్కంఠ మాలో పెల్లుబుకుచుండెను. మరి మిలిట్రిలో జేరాలంటె ముందుగా కొద్దిగా ఇంగ్లీషు నేర్చి ఉండాలి. కాబట్టి ఒక ఆంగ్ల భాషా బోధకునివద్దకు ప్రతిదినము సాయంత్రము నాఉపాధ్యాయునివద్దకు వెళ్ళి వ్యవహారమున కవసరమయ్యెంతవరకు ఇంగ్లీషు వాక్యములను వారు వ్రాయించగా, వాటిని వ్రాసికొని కంఠస్థము జేయుచుంటిమి. కొద్దిగా వ్రాయను చదువను నేర్చుకుంటిమి. చివరికి యెక్కడ గూడ ఆశ్రయము లభించని యెడల ఎక్కడో ఒకకికారణ్యమునకు వెళ్ళి తపస్సునైన జేయాలి. అనే కోరిక మాలోనుప్పతిల్లినది. ఇట్లే యనేక అలోచనలు మా మెదడులో మెదలుచుండినవి.

సరే ఒకనాడు మేము ముగ్గురము విద్యార్థులము ఒకచోట గూర్చుండి యెక్కడికైన బయలుదేరుటకు ఆలోచించుకొని. దినమును

నిర్ణయించుకొంటిమి. కాని యిక్కడ గూడ మాకు ఒక గడ్డు సమస్య యెదురైనది. అదేమనగా యెక్కడికి వెళ్ళాల్సిన రైలు అథవా బస్సు ప్రయాణమునకు డబ్బవసరమే గదా! ఇట్లా ఆలోచిస్తు ఉండగా మా ముగ్గురి విద్యార్థుల్లో ఒకరివద్ద కేవలము ఆరు రూపాయలు మాత్రమే ఉండినవి. మిగత డబ్బుకై మాలో మరో విద్యార్థి యీ విధముగా సలహా ఇచ్చెను. అది యేమనగా "కొద్దిగా శ్రమకు దట్టుకొని మా గ్రామమువరకు నడుస్తు వెళ్ళితే, అక్కడ మా తల్లిదండ్రులవద్ద మనకవసరమైనకొంత డబ్బును వారినడిగి తీసికొని వెళ్ళవచ్చుననెను. సరే ఇది మంచి ఆలోచన యనుకొంటిమి. ఈ సమయమున నావద్ద ఒక నయాపైస గూడ లేకుండినది. వారిద్దరు మిత్రుల సహాయమే నాకు ప్రాణప్రదము శ్రీరామరక్షగా భావించితిని. ఇట్టి మా ముగ్గురిలో అంతర్గతమైన విషయములు మరేవ్వరికి దెలియకుండెను. ఏదైన కాగి దాలపై మా యభిప్రాయము దెలియపరచు కొనదలచినచో ఒక కాగిదమును చుట్టగా మడచి ఆమడతలపైన మామాటలను లింఖింపజేస్తు ఉంటిమి. దాన్ని విప్పించూచినచో పట్టిగీతలు మాత్రమే అగుపడేవి గాని అందులోని ఆశయము భోధపడకుండెను.

ఒకనాటి రాత్రి ఫలాహారమువగైరాలను ఆ ఇద్దరు మిత్రులు సన్నద్ధముజేసి కొన్నారు, అదే రాత్రివారుభయులునావద్దకు వచ్చి రహస్యముగా మంతనాలాడుతు ఈ యుదయమె వేకువఝామున ప్రయాణమవ్వాలని నిర్ణయించు కుంటిమి. ప్రయాణసామానులను సిద్ధగించాము, నాడు రాత్రి విద్యార్థులందరితో బాటునిద్రబోయితిమి, పనులువేయటకు మొదలు సాయంత్రమున ఇన్నాళ్ళు ఈ కళాశాల,

యొక్క ప్రసాదమును (అన్నమును) జీర్ణించుకొని యుంటిమి, ఈనాడు మా ఆచార్యులవారికి మరియుతోడి విద్యార్థులకు తెలియ పరచకుండ ఇలా వేళ్ళిపోవడము భావ్యమైనది గాదనియోచించి మేము ముగ్గురము విద్యార్థులము మాకు అత్యవసరమైన పనులున్నందులకు మేము మాగ్రామమునకు వేళ్ళుచున్నామని ఒక వినతి పత్రమును వ్రాసి కాలేజి విద్యార్థియొకరికి దానినిచ్చి దీనిని రేపు ప్రిన్సిపాలుగారు రావడముతోనే వారికిమ్మనిచెప్పితిమి. నాకు మాత్రమానాడు రాత్రి నిద్రాదేవినిశ్శేషముగా నాలంగించుకొని యుండేను, కనుక హాయిగా నిద్రబోయితిని, కానినాఉభయమిత్రులు ఎప్పుడు వేగుచుక్క ఆకాశమున పొడసూపుతుందో అనివేచి యుండిరి.

మా మొదటి కళాశాల నగరములోనే యుండేదని ఈ మొదలేదెల్పితిని. ఇది యొక విశాలమైనభవనము రెండంతస్థులతోక్కుడు (బయలు) మిద్దెయుండెను, మేడపై చౌడు మట్టితో గప్పియుంటారు. వర్షాకాలములో దానిపై పరుండరానికి నీలుండదు, కేవలము వేసవి శీతకాలములో మాత్రమే మేడపై హయిగా పరుండుకొను చుంటిమి, పరుండేముందు పడకపై వెల్లికిల పరుండి కాలిపైకాలు వేసికొని, నీలిమయ విశాలమైన ఆకాశములో లేక్కకు మించిన చుక్కల రేడు తన షోడశకళలతో వెలుగుతుండేను. చల్లని పిల్లగాడ్పులు వీస్తు ఉండెను, ఆ ప్రక్కనే కొద్ది దూరములో నున్నతముగానుండి గొప్పగొప్ప రాతిగుండ్లతోను విశాలములైన కోటగోడలతోను,కమానులు దీరియుండి పాడుబడియున్న రాజభవనాలలోనావాసముజేసికొనియున్న గుడ్లగూబలు (పెద్దపిట్టల) మూత్కారముల శబ్దములుజేస్తు ఉంటె ఆ రాత్రియెంతగానో మదికి

హాయిని గలిగిస్తు ఉండేది. ప్రతి దినము ఉదయమున నిద్రలేవడము తోనే ఈ పైకిల్లాలోకి బయలుదేరి సంచారార్థము వెళ్ళేవారము. ఆ జిల్లా నానుకొనే కొన్ని ఇండ్లు, మేడలు, మరియు బీదల గుడిసెలు గూడ ఉండేవి. రెండుమూడు సం॥ము లిక్కడ హాయిగా ఉండి, అనుకోకుండ ఇట్టి స్థానమును, నగరమును విడివెళ్ళుటకు నాకుమాత్రము నాడు రాత్రి కాళ్ళాడలేదు. ఐనను దైవలిఖితము తప్పదుగదా!

సుమారు రాత్రి మూడున్నర గంటలకే నిద్రనుండిలేచి గోడగడియారమువైపు జూడగా అరగంట శబ్దము (ఢమ్మని) విని పించేను, ఇక కాలేజి నివదలి వెళ్ళుటకిదే మంచియదను (సమయము) అని మాకు సూచినట్లయ్యేను, "తథాస్తు" అట్లే కానిమ్మని మేము (ముగ్గురము) నిశ్శబ్దముగా కళాశాలలో నుండేవారి కెవ్వరికంట బడకుండ మా సామానులను దీసికొని నెమ్మదిగా చడిచప్పుడు గాకుండ కళాశాల మహాద్వారమును దెరచి బయలుదేరితిమి. నాటినుండి మా కాలేజి ఋణముదీరెననుకొంటిమి. ఇక్కడున్న న్నిదినములు అన్నపానాదులకు, అధ్యయనమునకునేవిధమైనలోటు లేకుండెను. కాని మా దుర్దైవమెక్కడస్థిరముగానుండనిస్తుంది? కావున తల్పలము ననుభవించుటకై మా కళాశాలకు ఒకనమస్కారమొనర్చి (ఒకదండము బెట్టి) రాత్రికిరాత్రె అక్కడినుండి బయలుదేరవలసి వచ్చెను. అర్ధాక్షనేశ్వరుడే మా వేంటబడి ఆకళాశాలనుండి నిర్గమింపజేశాడని యూహించవలసినది, సరే ఆసమయములో వెళ్ళకతప్పలేదు.

నగరములోని సమస్తమానవులు, మరియు జీవజంతువులు ఆసమయమున గాఢనిద్రలోనున్నందున నలువైపుల యెటుజూచినను

నిర్జనము, ప్రశాంత వాతావరణమే అలుముకొనియున్నది, అమావాస్య దినముకటికచీకటిలో ఒకరిముఖము మరొకరికగుపడుటలేదు. నామిత్రుల వద్దనున్న సామానులకంటె నాట్రంకు పెట్టె చాలా పెద్దదిగా నుండెను, సామానులతో చాలాబరువుగానుండినది, మిగత నా ఇద్దరు మిత్రుల ట్రంకులు రెండు చిన్నవే అందులో సామానులుకూడ కొద్దిగానె యుండెను. అందుచేత వారికంత బరువుగాలేకుండెను, ఐనను యెవరిట్రంకులు వారివారి భుజములపై నిడుకొని వెళ్ళుచుంటిమి.

మా ముగ్గురిలో మాగణిగేరిలింగయ్య అనునాతఁడు వయస్సులో పెద్దవాడు, పద్దెనిమిది వత్సరముల ప్రాయమువాఁడు, శరీరదార్ఢ్యతగల వాఁడు యెరుపురంగుగలవ్యక్తి. వీరికంటేను రెండు సం॥ములు తక్కువ వయస్సు పదహారు వత్సరముల ప్రాయము వాడిని నేను, నా పేరు అప్పుడు "రాచయ్య" అనే పిలిచెవారు, నా రంగుచామన ఛాయతోకూడినది, నేను తెలంగాణా ప్రాంతీయుడను, ఆంధ్ర ప్రాంతములో మెదక్ జిల్లా, అందోలుతాలూక జోగిపేట పెద్ద మఠము నకు వారసుదారుడిని, (ముతవల్లిని మహాంతునుగూడ నేనె) మూడవ విద్యార్థిపేరు బసవయ్య ఈతని వయస్సు పంద్రెండు వత్సరములు, ఇతని గ్రామమెదో నాకుదెలియదు, ఎరుపుఛాయగల వాడు. అనాథుడనియు ఇతడింతవరకు దేశసంచారిగానే చేప్పుకునేవాడు, అయితే ప్రస్తుతము మాగమ్యస్థానలక్ష్యము మాగణగేరి. లింగయ్య గ్రామము, మీగ్రామమెంత దూరమునయున్నదనినేను లింగయ్యనడుగగా కొద్దిదూరములోనే ఉంది. ఆరుక్రోసులుమాత్రమేయనిచెప్పెను. ఆరు క్రోసులనగా పంద్రెడుమైళ్ళని అర్థమును మేముగ్రహించి సరెవెళ్దామని అనుకుంటిమి. బసవయ్య ఈ వరకే దేశద్రిమ్మరిగనుక మమ్మల్ని

అధికముగా ప్రోత్సహించేవాడు, కొద్దిపాటి ఇంగ్లీషుముక్కలు మాట్లాడే వాఁడు నేనింతవరకుఇంతసుదూర ప్రయాణమునుకాలినడకతో జేయలేదు.

బాల్యములో నెనేగ్రామానికి వెళ్ళినను దూరప్రయాణమునకు మా నాన్నగారి వద్ద ఒకతెల్లని యశ్వముండేది. దానిపై ప్రయాణించే వాడిని. కనుక ప్రయాణముయొక్క అలసట నాకుదెలియకుండెను, కాని నాటిప్రయాణము మాలోనుత్సాహప్రేరితమైనది, అందుకు ఎంతదూరమైన నడచివెళ్ళగలమనేదీమా మాలోనుండినది. "నహివంధ్యా విజానాతిగుర్వీం ప్రసవవేదనాం" అన్నట్లు ప్రసవవేదనము శిశువునుగన్న తల్లికేదెలుస్తుందిగాని, గొడ్రాలికెలాతేలుస్తుంది? "అదేవిధముగా సుదూరమార్గాయాసము ఇంతవరకు నడిచినవారికే తెలుస్తుంది, నా బోటివాడికెలా తెలుస్తుంది?

బయలుదేరినమొదట్లో అంతగానాయాసమనిపించలేదు. నగరమును వదలి మూఁడునాల్గుక్రోసులు దాటివచ్చితిమి. అప్పుడుగాని తూర్పు దిక్కులో ఉదయాద్రిపై నుండి మెలమెల్లిగా అరుణోదయ కిరణములు భూమిపై ప్రసరింపఁదొడగెను, దానికితోడుగా నింతవరకు చల్లని పిల్లగాడ్పులస్పర్శవలన నడక మా పాదయాత్ర ప్రయాసమునకు దోహదము గలుగలేదు, పైగా హాయిగా వాహ్యాళికి బయల్దేరినట్లని పించినది, మరీబ్రాహ్మీముహూర్తప్రయాణము. మరింత హాయినొసఁగు చుండును. నా ట్రంకుపెట్టెకాస్తపెద్దది. కావున కొద్దిసేపు పరస్పరముగా మార్చుకుంటు వెళ్ళితిమి, అదివేసవికాలముగనుక సూర్యుడు మింటి కెగ బ్రాకినకొలది క్రమక్రమము ప్రచండభాస్కరుని తీక్షణమైన వేడికిరణముల స్పర్శవలన అగ్నిజ్వాలమధ్యన పయనించుచున్న

యట్లు మా శరీరములుగూడ అవేడిని భరించలేక మేనచెమటలా ప్స్నానమొనర్చినట్లు గారజొచ్చెను, దీరులము, దేశద్రుడలమైన మా పైన అస్వాస్థ్యానికిగూడ ఇరమున కరుణలేకయ్యెనుగదా! "మొత్తది వారిని జూచిన అందరికి మొత్తబుద్ధిపుట్టుతుందట" మా దీనావస్థ అంతకు దిగజారినది, అర్కబింబము మధ్యాకాసమునకు జేరుకొనెను. ప్రచండవేడిమివర్ణనాతీతమయ్యెను, అందును ఈ ఇసుక ప్రదేశమున నడచుటముచేత క్రింద పాదములకు చురకలుదగులుట. పైమస్తకములు పరితాపించుచుండెను, శరీరమంతయు ఉడికిస్వేదజలముతో మేని వస్త్రములన్నియు ద్రవయుక్తములై (తడిసి) యుండినవి, దాహము వలన నాలుకపిడుచ గట్టియున్నది, ఇట్లుచెప్పనలవిగాని ఆయాసమునకు లోనైన మేము ముగ్గురము పరస్పరముగా మాట్లాడుకొనుటకు గూడ శక్తిజాలకనతమస్తకులమై ఒకరివెనుక మరొకరము కిమ్మనకుండ మనసులోనేవేవోఆలోచిస్తు మౌనముగా దారిపొడుగునా కాళ్ళీడిస్తుమెల్లగా నడుస్తు ఉంటిమి, ఒకరిబాధను మరొకరితో చెప్పుకునేస్థితిలోగూడ లేకుంటిమి.

ఆపిన్న ప్రాయమున స్నానముజేయనిదే నీరు త్రాగడముగాని, ఆహారమునుస్వీకరించడముగాని, వీరశైవాచారసాంప్రదాయము మేరకు నిషేధించబడియుండెను, అందులోను నేను కాబోయే మఠాధిపతిని కావున ఎక్కడబడితె అక్కడభుజించడముగాని, మంచి తీర్థమును పుచ్చుకోవడముగాని, జరుగకుండెను, ఇదియొకరి భయము వల్లగాని, మందిచూడడానికిగాని, విరుద్ధముగా నడచుకొనుటకు నాహృదయమంగీకరించకుండెను, ఇది మా తల్లిదండ్రుల ఆచరణ

వలననాకు నురూఢియైనది. అందుచేత క్షుధాతృషలు ఎంతగా బాధించినను భరించుచుంటిని, ఇక్కడనదే విధముగా భరించాను. బాధకులోనైనను మాకుదైవానుగ్రహమువలన "కాకతాళీయమనట్లుగా" దారిపోడుగునా పోతుపోతు మధ్యేమార్గములో ఒకనిర్మలమైన చల్లని నీరుండిన (వర్రి) చెలిమె ఊటనీటి చిన్న దిగుడుబావి వంటిదిమాకగుపడెను, దాన్ని చూడగానే నీరసించిన మాదేహము సంతోషముతో పులికరించినది, ప్రాణపంచకములు లేచిచిందులు ద్రొక్కినవి, ఆచెలిమెచుట్టు ప్రక్కల గోవులగుంపుండినది. వాటికిగోపాలురు త్రాగుటకై తొట్టిలోనీరు బోయుచున్నారు, అచెలిమె మాపాలిటి అమృతసాగరములా పరిణమించినది. సరే మాసామానులనన్నింటిని ఒకచోటబెట్టి స్నానమాచరించితిమి. దానివలన శరీరములోని వేడిమిఉపశమించ బడికొద్దిగా శీతలత్వమువలన మాశరీరములోనవచైతన్యము సంచరించినది. కొద్దిదూరములో కూర్చుంటకు ఆసనములు వేసికొని లింగార్చనము సంక్షిప్తముగా ముగించితిమి. ఐదు దోసిళ్ళపరిమితినీటితో మొదటి దాహమును దీర్చుకుంటిని, ఇంతలో మా మిత్రులలో ఒకరు వట్టి నీరు త్రాగకండి? యెండలో వచ్చాము కనుక యీ మురమ్రాలు, కొలది పలహారమును సేవించుమని ఇచ్చిరి, ఒకచెట్టు నీడలో గూర్చుండి ముగ్గరము వాటినిదిని. కడుపునిండ నీళ్ళుత్రాగి మిగిలినవి గోపాలురకొసఁగితిమి.

అక్కడినుండియుదికినతడి గుడ్డలను తలపైన భుజాలపైన వేసికొని బయలుదేరితిమి, మాట్రంకులను మళ్ళీ భుజములపైనిడుకొనియుంటిమి - మధ్యందినమార్తండుడుతనఖరతర తీక్ష్ణవేడిమి కిరణములచేత మా మస్తకములను మరిమరితపింపఁజేయుచుండెను, కొంతయెడారి

ప్రదేశమది; యెక్కడో ఒకచోట ఈతచెట్టు దప్ప మరోచెట్టు లేకుండెను. అవియును బహుఉన్నతముగా జెరిగియున్నవి. వాటిక్రింద నీడబహుస్వల్పము. ముగ్గురము తలదాచుకొందామన్నను సరిపోనినీడ ప్రక్కనుండి వడగాడ్పులు వీచుచుండినవి. కాళ్ళకు పాదరక్షలులేని కారణమున యెండలో నడచినడచికాళ్ళకు బొబ్బలు (బుగ్గలు) వచ్చినవి, ఇట్లు ప్రయాసము చెందుతువెళ్ళుతు ఉండగా రెండు మూడు క్రోసుల దూరాన కికారణ్యమువలెనున్న ఈత చెట్లఘనా రణ్యము తటస్థించెను, అందు మిట్టమధ్యాహ్నము "జీరు" మనె ఈ లపురుగుల మోతలు, మధ్యమధ్యన అక్కడక్కడదంతెచెట్లపొదల గుంపులు. మధ్య మార్గమున మధ్యవయస్కురాలైన స్త్రీ యొకత్తిమమ్మమా దీనవాలకములను దిలకించి. మాపైజాలిగలిగి "మీదేగ్రామము? ఎక్కడకి బోవుచున్నారు"? అని ప్రశ్నించినది. అదివినిలింగయ్య మాదిమాగణి గేరి, మేమిప్పడు యాదగిరినుండి వచ్చుచున్నా మనిచెప్పెను. అప్పుడా మె మరల "పదిలముసుమా! జాగ్రత్తగా వెళ్ళండి. మీరుచిన్నపిల్లలు" ఈ పరిసరాల్లో దొంగల భయమధికముగాన్ననదని హెచ్చరించినది. మంచిదమ్మా! మావద్ద వారికాకవల్సినదేమియు లేదు. అని సమాధానము చేప్పి ముందునకు బోయితిమి. ఆసమయములో నాప్రాంతమంతటచోరుల భయమధికముగా నుండినది. సాధారణముగాపంటలు పండకదుర్భిక్షము కర్నాటక మహారాష్ట్ర ప్రాంతములో విలయ తాండవముజేస్తు ఉంటుంది, అందుచేత యెక్కడచూచినను ఎవరినోట విన్నను చోరభయమే ఉండేది. అందును విజాపూర్ జిల్లాలో మరి అధికముగా కరువు కాటకములుండేవని వింటిమి" ఒకప్పుడు నిజాంనవాబు విహారమునకై బయలుదేరియెక్కడికో వెళ్ళుతూ మధ్యే మార్గ ములోనున్న విజాపూర్ నగరము మీదుగ్గా వెళ్ళుచుండగా, ఆప్రాంతపు ప్రజలు కరువుకాటకముల బాధను భరించలేక, భార్యా, పిల్లలతో,సహ

మూటిముల్లెగట్టుకొని గుఱ్ఱాలు, ఎద్దులు, గార్దభములపైమోపి పంటలు బాగుగా పండిన ప్రాంతములకు, గుంపులు గుంపులుగా సాలుసాలుగా పరివారసమేతముగా ప్రయాణమై వెళ్ళుచుండిరట.

వారి ఈ దురవస్థను జూచి శ్రీ నిజాం నవాబుగారు తమమంత్రితో నిట్లు ప్రశ్నించి యద్దానికిట్లుతనే సమాధానమును తానెజెప్పెనట. ప్రశ్నించినది "మంత్రీ వీరందరెక్కడికివెళ్తున్నారు?" మంత్రి ఇక్కడ జొన్నపంటలు విస్తృతముగా పండేవి. వరుసగా రెండు సం॥లనుండి వర్షము గురియనందులకు దుర్భిక్ష మేర్పడి, తిండిలేక సంపన్న ప్రాంతములకు వలస వెళ్తున్నారని చెప్పెనట. అట్లా మంత్రిగారి మాటవిని. నవాబు "ఏమి వీరెంత మూర్ఖులు, జొన్నలు పండనిచో, గోధుమలుపయోగించుకొనవచ్చును గదా?" అన్నారట. వర్షాలే కురియనప్పుడు ఏ పంటలు పండవని ఆ నవాబుకుదెలియదుకాబోలు?ఇందులో "మూర్ఖులెవరో, మందమతులెవరో పాఠకులే గ్రహించాలి". తిన దానికి అన్నమెలేదంటే పాయసముండును గదా!" అన్నట్లుంటుంది. ఆయనగారి మాట వరుస, అట్లానే మాకుచోర భయమును వినిపించినది. అందుకు, మేము మన"అందరిని అన్ని సమయాల్లో గాపాడువాడు పరమాత్మదొకడున్నాడులే." అని భావించి యఈశ్వరునిపై భారమువేసి ముందుకుసాగితిమి.

ఈ వరకు నడచిన కీకారణ్యములాంటి ఈతచెట్ల వనమును దాటి ఒకటిరెండు క్రోసులు పయనించితిమి. ఎటు మా దృష్టిని సారించి చూచినను, ఎడారి ప్రదేశమేగాని, ఒకచెట్టు చేమల జాడ గూడ లేకుండెను. ఎండవేడిమి యధికముగా నుంటచేత వడదెబ్బకు

లోనైతిమి. త్రాగడానికి నీరుగూడ దొరకదయ్యెను. (మృగతృష్ణిక) ఎండమావులక్కడక్కడేర్పడి మమ్మల్ని వంచించుచుండెను. క్రమక్రమముగా సూర్యుడికి గూడా మాపై జాలికలిగినది గాబోలు, తనకిణముల వేడిమి? కాస్త తగ్గించుకున్నాడు. ఏటవాలు కిరణములతో డేగ ప్రక్షిపొద్దస్తమానము తనరెక్కలనుజాచి ఆకాశములోను, అక్కడక్కడ సంచరించి సాయంత్రము తనగూటిలోనికి ప్రవేశించుతఱితనరెక్కలనెలా ముడుచుకొనునో, అట్లేసూర్యభగవానుడుగూడ తనకిరణములను సంకుచిత పరచుకొని అస్తాచలమునకు జేరుకున్నాడు.

ఈసమయములో నాకు దాహమధికమగుచున్నది. దాన్ని భరించలేక "లింగయ్యా త్రాగుటకు నీరెక్కడున్నవి? అని అడుగగా నాతడు అదిగో ఇంక కొంతదూరమువెళితె అక్కడబావి ఉందని చెప్పేవాఁడు. ఇంకను మీగ్రామమెంత దూరానున్నదనగా ఒక రెండు క్రోసులున్నదని సమధానమిచ్చేవాఁడు. ఆ కొంతదూరమునడచి యేదినీరెక్కడ? అని అడుగగా, అదోగనిపించుచున్నదే ఆ చెట్టు,అక్కడే బావి ఉందని చెప్పేవాఁడు. ఒకవైపు ఆకలిబాధ, మరోవైపు దాహముబాధ క్షణక్షణము వృద్ధియగుచుండెను. ఏమిచేయను? ఈబాధనె వరితో చేప్పేది? దాన్నితీర్చేవారెవరు? "నిండిన బండకినూదిమోనను మోపినను బరువేగదా!" అను సామెతప్రకారము నాకుదాహము మరింత వేధించుచుండెను. నడువలేకున్నాను. కాళ్ళుతడబడు చున్నవి, అందున నాత్రటింకు భారము, మోత ఒకటి, మరోసారి బాధను భరించలేక గట్టిగాగద్దిస్తూ నీరెక్కడున్నావయ్యా! నాప్రాణము పైపైకిబోవు చున్నది. అనిఅడుగగా నాతఁడు మళ్ళీ "ఇదిగో బావి సమీపమునకు

వచ్చాము. ఆచెట్టుదాటగానే ఉంది, ఆమెత్తు ప్రదేశమును దాటగానే మనకు కనిపిస్తుందనేను. కాని కనుమేర నాచూపుసారించినను యెంతకు అది పొడగట్టుటలేదు. ఏమిజేతునుదైవమా! ఎందుకు వచ్చితిమి! రెండుపూటలు కమ్మగా సమయానికి భోజనముజేసి హాయిగా ఉండలేక ఇట్టికష్టమునకులోనైతినిగా? హాయ్ హాయ్ పరమాత్మా! ఇకనాకునీవేదిక్కు- "త్వంవినామేశరణంనాస్తి" అనివాపోయితిని, నడచినడచి కాళ్ళు నొప్పులుబెడుతున్నాయి, ఏమిజేయను? ఎవరితోనాయాయావేదనను జెప్పుకునేది? ఎవరుతానేతీరుస్తారు? వాండ్లిద్దరు ముందునడుస్తూనే ఉన్నారు. నేను మాత్రము శక్తిలేక అయాసమును భరించలేక కాళ్ళీడిస్తు వెనుకనడుస్తున్నాను, నాకండ్లలో నీరు గ్రమ్మినవి, నా బాల్యమునుండి యెన్నడింతగా నడువలేదు. అప్పుడు ఎక్కడికి యేగ్రామమునకు వెళ్ళినను గుఱ్ఱముపై దర్జాగా గూర్చుండి వెళ్ళెవాడిని, "దిశఃశూన్యందర్శిదస్య" అన్నమృచ్ఛకటికలోని సూక్తి జ్ఞప్తికి రాకమానదు. దిక్కులన్నియు నా పాలిటికి లయమొందిట్లనిపించెను.

మరల నాలోనేనే సంతైయించుకొని "ఎక్కడుంది సాయనా బావి? దప్పిక నన్ను చాలా పీడిస్తుంది?" ఇంకను కొద్దిగా ఆలసించిన నాప్రాణాలు పోయెలాగున్నవి. అది విని లింగయ్య సాయినా అదిగో చూడు, ఆ గోడ అగుపించేదె బావి. అని చూయించెను. ఇంతవరకు ఇసుకకాలిబాటన నడిచాము. ఇప్పుడు కాస్తనడకు (రోడు) మార్గమునను సరించితిమి. ఆబావిని దర్శించిన మాత్రమున్న నన్నాక్రమించియింత వరకు వేధించుచున్న బాధకొద్దిగా తగ్గినాలో క్రొత్తచైతన్యము కొంతధైర్యము నాలోదృఢపడినది, ఈ దారినబోయె రెండెద్దుల బండియైన కాస్తతారసిల్లుటలేదు గదా! ఈ బరువుగానున్న

మా ట్రంకులనైన అందులోబెట్టి మేమునడచేవారము, అనిమనస్సులో వలుసార్లు అనుకుంటిమి. కాని పరీక్షకు ఒకటైన మాదుర్దైవమువలన అగుపడదయ్యెను, సరే ఇలానాలోచిస్తు కొంతదూరమునడుస్తు వెళ్ళగానక్కడే ఒక దిగుడుబావి రొడ్డుకు ప్రక్కనే అగుపడినది. బావిగోడపై మా ట్రంకులనుబెట్టి బావిలోకి గబగబాదిగి, కాళ్ళుచేతులు, ముఖమును గడుక్కొని దోసిలితో తృప్తిగా ఆచల్లని మధురాంబువులను (నీరు) త్రాగి, కొద్దిగా సెదదీర్చుకొనుటకై పైకివచ్చి మా ట్రంకులు బెట్టినచోట గోడలపై విశ్రాంతిగా క్షణకాలము గూర్చుండి. "హాయ్ పరమాత్మా! నడచినడచి వేసారితిమి. మార్గాయాసముచేత నతితీవ్రముగా బడలిక జెందియున్నారము. దేవా! నీవైన మా దీనులను కరుణించుము తండ్రి? అని మనసార ప్రార్థించితిమి."

అని మొరపెట్టుకుంటు ఉండగానే అదే దారిన ఒకటి రెండెడ్డుల బండి మావైపునకే వచ్చుటను జూచితిమి. ఆబండి మమ్మల్ని సమీపించడముతోనే మేము బండి యజమానివద్దకు వెళ్ళి "అయ్యా! దయజేసి మీరు మాయీట్రంకు పెట్టెలను మీబండిలో బెట్టుకొనినచో మీకు చాలా పుణ్యమొస్తుంది. నాయనా!" అని దీనతతో నర్థించడముతో నాతనికి మాపై జాలిగ్గలిగి సరె పెట్టుకొమ్మని యనుమతించెను.

మా ట్రంకులను బండిలోపెట్టి దానివెనుకాతే మేమునడుస్తు ఉంటిమి. ఆ యజమాని కొద్దిదూరము వెళ్ళాక "ఏ గ్రామమండి మీది? ఎక్కడికి వెళ్ళుచున్నారని" అడిగెను. వారి ప్రశ్నలకు దగిన సమాధానములను జెప్పితిమి. బండిలో కొందరు (ఒకరిద్దరు) స్త్రీలుగూడ ఉండిరి. మేమాబావికి జేరుకొనేవరకే సూర్యుడ స్తమించుచుండెను.

మెల్లమెల్లగా అంధఃకారము జగత్తును ఆవరించుకొనుచుండెను. పోను పోను ముందు గోగియనే చిన్న గ్రామములోని చిరుదీపములు మాకు దర్శనమొసంగినవి. ఈలోపు "ఏడడుగులు ఎవరితోను నడచినను, స్నేహమేర్పడుతుంద"నేసామెత ప్రకారము స్నేహమేర్పడిఆబండివారికి మాకుకొన్ని సంభాషణలు జరిగినవి. ఇంతలో నాగ్రామము సమీపించెను.

బండి యజమాని మమల్ని గూర్చి ఈ గ్రామములో మీకెవరైన పరిచితులున్నారా? అని అడిగెను. అందుకు మా మిత్రుడు లింగయ్య "లేరండి మాకెవ్వరునిక్కడ పరిచయము లేరనెను." అది విని బండియజమాని సరె "ఇక్కడ మా పరిచితులు పటేలుగారున్నారు. వారికి నేను నచ్చచెప్తాను." అని మాకు కాస్త ధైర్యమొసగెను. రాత్రి 9 గం.ల సమయానికి గ్రామంలోకి ప్రవేసించితిమి. బండి యెక్కడైతె ఆపినారో అక్కడే పటేలుగారిల్లుంది. బండియెడ్లను (ఎద్దులను) విడచి మమ్మల్ని ముగ్గురిని దోళ్కొళ్ళి బండియాతను ఆ సమయంలో పటేలు గృహముతో లేనందులకు వారి శ్రీమతులతో మా గురించి చెప్పెను, "అమ్మా వీరు ముగ్గురు జంగమామూర్తులు (బాలురు), వీరికి ఈరాత్రి ఎట్లాగో శివార్చన (భోజనము)ను జేయించాలి. అని చెప్పెను. అందుకు వారున్ను సంతోషముతో నంగీకరించిరి.

మేము మార్గాయాసముచేత చాలా అలసియుంటిమి. అంచేత కొంతవడి వారి గృహములోని విశాలమైన అరుగులపైన గూర్చుండి బడలికను దీర్చుకుంటిమి. మరల నాబండి యజమాని మాయందలి జాలిగలవాడు గనుక "అయ్యగారు రేపు మరల మీరు తొందరగా ఉదయముననే నిద్రలేచి బయలు వెడలినట్లయితె మేము మీరు కొద్ది

దూరము కల్సి వెళ్ళవచ్చును," అని చెప్పెను. ఇది మాకు మహా పుణ్యముగాదోచి, మంచిది నాయన తప్పకుండ మేము మీవెంట వచ్చెదమంటిమి. ఇక్కడ దొంగల భయము చాల ఉండడమువలన పటేలుగారి బంధువులు మమ్మల్ని బహుజాగ్రత్తగా వరుండవల్సిందిగా హెచ్చరించిరి. రాత్రి మమ్మల్ని వస్తువరుండనివ్వకుండ మాయందరి శక్తికొలది అక్కడి భక్తులు ముగ్గురు మా సంగతిని వినివచ్చి ఒక్కొక్కరిని ఒక్కొక్కరు తమ గృహములకు గౌరవముతో దోడ్కొళ్ళిరి, జంగములని వినగానే వారికెంతో సంతోషము వారిలో మూడినది. కావుననే ఆప్యాయతతో దీసికెళ్ళిరి. అప్పుడది చలికాలము కావున ముఖం, చేతులు, కాళ్ళప్రక్షాళన కొరకు వేడినీరొసగిరి. నిత్యము పద్ధతి మేరకు శివపూజను జేసికొంటిని. అప్పుడే వండిన శాకపాకములు పల్లెటూరు ప్రజల ఆహారము ప్రకారము కొర్రన్నము, దానికి దగు రీతిగా వేడిపాలు, తాజా నెయ్యిని వడ్డించిరి. అది నాపాలిటికి అమృత ప్రాయముగా పరిణమించినది.

నా బాల్యములో చాలామట్టుకు గ్రామాలలో కొర్రన్నమునే అక్కడి ప్రజలు వాడుకొనుచుండిరి. దానికితోటు పాడిసమృద్ధిగానుంట వలన పాలు, చెక్కపెరుగు, తాజా నెయ్యికి కొరత యుండేదిగాదు. ఆకాలములోమాతండ్రిగారి చేవేళ్ళఅనుగ్రామములోను అధికముగా కొర్ర లను, తైదలను (రాగులను) సమృద్ధిగాబండించుచుండిరి. అదే అక్కడి వారికిప్రధానాహారముగా నుండెను. తైదలతో(రాగులతో)వేసవికాలములో అంబలి, దానికితోడుగా శనగలు, అనుములు, పెసరిగుడాలు వండి అనుభవించుచుండిరి. వేసవికాలములో రాగిఅంబలి, లేదా కుడుములు (చిన్నవిగాచేసి) దానికితోడుగా మినుపపప్పును ఉడికించి, భుజిం

చుచుండిరి. ఇట్టి యాహారము మనకారోగ్యము నొసగుచుండేది. వేసవిలో చలువ నొసగుచుండేది. వరిపంటలప్పట్లో తెలంగాణాల్లో తప్ప మడఖర ప్రాంతాల్లో వరియన్నము మచ్చునకుగూడ లేకుండెను. ఇట్టి దశను నేను బాల్యములో అందరిండ్లలో అనుభవించాను. గనుక నాకిది క్రొత్తయేమి గాకుండెను. మీదుమిక్కిలి కొర్రన్నము,పాలు, పెరుగు,రాగి అంబలి సేవించడమంటె నాకిప్పటికి గూడ సంతోషదాయకమే.మాఅన్న గారైన శ్రీ చంద్రశేఖరస్వామి పాపన్నపేటగారింట్లో రాగిఅంబిలి యెల్లకాలములోను ఒక పెద్దకడవతో గాచియుంచి, వారు త్రాగుటే గాకుండ ఇతరులకుగూడ బోసెవారు. వారు గొప్ప ధనవంతులు. చుట్టు పట్ల గ్రామ ప్రజలకు అప్పులిచ్చుటే గాకుండ, వరిపంటను సమృద్ధిగా పండించుచుండిరి. వారిది గొప్ప ఇల్లు. ఏగదిలోను వరిధాన్యముతో కోకొల్లలుగా (కోటాలుగా)బోసి యుంచేవారు. అయినను రేయింబవళ్ళు వారు, వారి పరివారమందరు తైదంబలిని (రాగిఅంబలిని) త్రాగు చుండిరి. ఈ బాల్యానుభవమంతయు ఒకేసారి నాజ్ఞప్తిలో మెదలినది. అందుకె కొర్రన్నము బీదలపాలిటికి అమృతప్రాయముగా నుండినది.

సరే భోజనానంతరము మావిడిదికివచ్చి మా సామానులన్నింటిని తలదాపున బెట్టుకొని పరుంటిమి. మార్గాయాసమువలన ఆరాత్రి త్వరలో గాఢనిద్రకులో మునిగి "జీవచ్ఛవముల్లాబడియుంటిమి." ఉదయము సూర్యోదయమైందిగూడ మాకు దెలియదయ్యెను. సుమారు ఎనమిది గం॥లవరకు మాకు మెలకువరాలేదు. పాపమాబండియాతడే వచ్చి "స్వామిః లేవండి తెల్లవారింది ప్రొద్దెక్కినది. ఇంకను మీకు నిద్ర తీరనట్లుంది. ఎండవేడిమి అధికమైతే మీరు భరించిలేరు. త్వరగాలేండి ముందుకు ప్రయాణము సాగించాలని హెచ్చరించెను.

అప్పుడు మేము కన్నులు నులుముకుంటులేచి ముఖప్రక్షాళన గావించుకొని, మెల్లమెల్లగా బండినమసరించి నడువసాగితిమి. నడచి నడచి మాకాళ్ళు నొప్పులెట్టి, ముందునకొక్కడుగు వేయాలనిన ప్రాణాంతకముగా నుండెను. ఈ మాదీనావస్థను, బాధను గమనించి యాయెజమాని "స్వామి మీరు నిన్న నడచి నడచి అలసిసొలసి యున్నారు. మీబాధనుజూచి, నేను భరించలేకున్నాను. రండిబండిలో గూర్చొండనిచెప్పి తన బండిలో గూర్చుండబెట్టుకున్నాడు. అక్కడి ప్రాంతమంతయు మొరవనేల (ఎఱ్ఱని మొరవరాతినేల) మన ఆంధ్ర ప్రాంతములో పెద్దపెద్ద రాతిగుండ్లలా ఉండవు. మనవైపు ఇనుప పెద్ద సుత్తితో వడ్డెరవాండ్లు రాతిగోడలకు కావల్సిన భంగిమలో వాటిని పగులగొట్టి మలచుకొందురు, ఎఱ్ఱమొరముబాలను గొడ్డండ్లతో కట్టెలను దొలచినవగిది తమకుకావల్సిన రీతిని చెక్కి మలచుకొందురు. ఇవి బాతిగుండ్లవలె గట్టిగా నుండక మెత్తగా నుండును.

కొంతదూరమేగిన పిదప రెండుమార్గముల కూడలి (రెండు త్రోవలు ఒచ్చోటగల్సినది) వచ్చెను. ఆబండి యజమాని మార్గము వేరు. మేమువెళ్ళే మార్గమువేరే. కావున అక్కడ మేము ఆబండినుండి మళ్ళీ యథారీతిగా మాట్రంకులను మాభుజాలపై బెట్టుకొని, బండి యజమానికి కృతజ్ఞతలుజెప్పి బయలుదేరితిమి. ఆబండియాతను చివరి సారిగా "స్వామీ! మీరు జాగ్రత్తగా వెళ్ళండని చెప్పివెళ్ళిపోయెను. మేము నడుస్తువెళ్ళే సమయములో మా బుర్రలో పరల ననేక విచార ములు తలెత్తనారంభించినవి. ఈ యాలోచనలతో నడుస్తు ఉండగా మిట్టమధ్యాహ్న సమయమైనను మేము గుర్తించలేదు, ఐనను ఆకలి సమయము ఊరొక్కనినిచ్చునా? కడుపులోని ఆకలి కవకవలు సుడి

గుండాల్లా రేకెత్తించినవి. ఒకచోట పారెడు వాకలో స్నానముజేసి, సంక్షిప్తముగా లింగపూజను దీర్చుకొని, గత దినమున దినగా మిగిలిన ఫలాహారముతో మాక్షుధా (ఆకలి) బాధను కొంతవరకు ఉపశమింప జేసికొనగలిగితిమి. మరల అక్కడినుండి బయలుదేరితిమి. మూడు ఝాములయ్యెను. మేము వెళ్ళాల్సిన గ్రామము పొలిమేరకనుచూపు మేరకైన అగుపడదయ్యెను. "నాయనా! లింగయ్యా ఎక్కడుందయ్యా మీగ్రామము? ఇంకెంతదూరము వెళ్ళాలి" అని ప్రశ్నిస్తే.

"ఇదో గ్రామమును సమీపించుచున్నాములే మీరేమాత్రము దిగులు జెందకండి" యని మానోరు మూయించెను. అయ్యో! కర్మమా? కాలేజిలో మీగ్రామమెంత దూరానవున్నదని మేమడిగినప్పుడు నీవు 5-6 క్రోసులుంటుందని చెప్పితివే. ఇంతవరకు రెండు దినములు గడచినను మీగ్రామము పొలిమేరకు గూడ జేరుకొనమైతిమే. బాగుగానే మమ్ము వంచించితివని ఆతనని మందలించితిమి. అతడు మాకంటె వయస్సులో పెద్దవాడు, దృఢకాయుడు. చిన్నప్పటినుండి పల్లెటూరు నివాసి. కనుకాతడెంత దూరమైననడచి వెళ్ళేశక్తి అతనికి గలదు. కాని ఒకేనగరములోనుండి చిన్నప్పటినుండి హాయిగా సమయానికి భుజించి, తిన్నగాదిరిగి మిన్నక ఒకేచోటనున్న మాకాశక్తి చాలదు గదా!

ఈ విచారములతోనే మేముండగా సూర్యుడస్తమించెను. బహూశః నాసూర్యభగవానుడు గూడ మాయీమరవస్థనుజూచి భరింపలేకనో ఏమో తన ముఖమును ముడుచుకొని యుండవచ్చుననుకుంటిమి. క్రమముగా చీకటి దిక్కులనాక్రమించుకొనెను. అది అమావాస్యకటిక చీకటి. ఒకరి ముఖము మరొకరికి సరిగా అగుపడుటలేదు.ఆకాశములో తెల్లపుష్పములు

పికసినట్లున్న నక్షత్రముల కొలది వెల్తురులో కాలిబాటలో లింగయ్య ముందునడుస్తు ఉండేను, ఆతని అడుగులలో మా అడుగులు వేస్తు మేమిద్దరము వెళ్ళుచున్నాము. ఒకవైపు నక్కల "కూకూ" అనే కూతలు వినిపిస్తున్నవి. మరోవైపు గుడ్లగూబల భయానకమైన అరుపులు. ఈలపురుగుల "ఝిర"మనే శబ్దములు తప్ప మరేమియు మానవుల అలికిడిజాడగాని, శబ్దముగాని మచ్చునకు వినబడలేదు. కనబడనులేదు. ఎటు జూచినను ఒక ఊరు పల్లెలులేవు. బయలుప్రదేశము ఎడారివలే దోచినది. ప్రశాంతమైన నిర్జనప్రదేశమది. నిఃశబ్దముగా కొంతదూరము నడచిపోగా గ్రామ సింహముల (ఊరుకుక్కల) "బౌబౌ"మనే దూరపుశబ్దము వినబడినది. అప్పుడుగాని మా హృదయములో ధైర్యము, చేతన్యము మరియు సంతోషములో కుక్కమ్మడిగా నినుమడించినవి. కొద్దిదూరమునుండి దీపములు మిణుకుమిణుకుగా నగుపడుచున్నవి. కాలిబాటనుండి కొద్దిగా నటుఇటు అడుగేసినచో రాళ్ళు, ముళ్ళు త్రొక్కుతు నానాఇడుములకు లోనవుతు లింగయ్య గ్రామమును జేరుకుంటిమి. అప్పుడు మాలో పెద్దవాడైన లింగయ్య మాకు ఒక తాకీదు ఇచ్చెను.

మనము ఇల్లుజేరగానే మాఇంటి ద్వారమును తట్టడముతో మావాండ్లు "ఎవరు మీరని అడిగినచో అద్దానికి మనము "అమ్మామాది చాలాదూరము. అక్కడినుండివచ్చాము. మళ్ళీ ఉదయము చాలాదూరము వెళ్ళాలి. మేము అతిథులము కావున మాకీరాత్రికిక్కడుండుటకు చోటిచ్చిన మీరు మాకు మహోపకారము జేసినవారౌతారని యడుగుమని" చెప్పెను. సరే "తథాస్తు" అంటిమి. పెద్దవాడు చెప్పినది మేము వినాలి గదా! మరి.

గ్రామములోకి ప్రవేశించి మఠమునకు వెళ్ళితిమి. రాత్రి చాలా ఆయినది. కాబట్టి తలుపులు మూసియుండిరి. ''ఎవరమ్మా ఇంట్లో కాస్త తలుపులు తీస్తారా? అని తలుపులు తట్టగానే, లోపలినుండి "ఎవరుమీరు" అని యడిగిరి. మరలనదే వాక్యమును బదులుచెప్పితిమి. ఇంతలో లింగయ్య అనుజుడు (తమ్ముడే) తలుపులు తెరచెను. లింగయ్య కంఠధ్వనిని గుర్తించి అతని తమ్ముడు దీపమును పైకిలేపి ముఖమును జూచి, ''మీరేనా? దొరగారూ!'' లోపలి యరుగుమీదినుండి ఒకేదూకుదూకుతూ ఇంట్లోకి పరుగెత్తుకొనిపోయి, తల్లిదండ్రులతో ''లింగయన్న'' వచ్చాడని సంతోషముతో నవ్వుతూ చెప్పెను. అదివిని తల్లిగూడ ఒక్కుదుటునవచ్చి ఆనందాదిరేకముతో బలకరించి, ''ఏమి ఇంతరాత్రిలో వచ్చారు'' ప్రొద్దుండగానే రాగూడదు? అనెను. అవునమ్మా మేము మెల్లిగానడచి రావడముతో చీకటియైనది. అని బదులు చెప్పెను. కొద్దిగా విశ్రాంతిగా మమ్మల్ని గూర్చుండబెట్టి త్వరలో వంటను సిద్ధగించి మమ్మల్ని భోజనమునకాహ్వానించిరి, మేమాదినము తిండి లేక ప్రొద్దస్తమానము ఏకాదశివ్రతమునాచరించితిమి. క్షుద్బాధమమ్మల్ని మిక్కిలి పీడించుచుండెను, భోజనమునకు బిల్చినదేతడవుగా ఒకొక్కరము లేచి ముఖము - కాళ్ళు చేతులను శుభ్రముగా కడుగుకొని, లింగార్చనను గావించుకొని, ఆసమయమునకు లభించినదే మహాప్రసాదముగా భావించి. జొన్నరొట్టె చట్నీ (కారము)నే అమృతప్రాయముగా నారగించితిమి. అతరువాత కొద్దిగా అన్నమును వడ్డిస్తారేమోనని కుండలవైపు జూచితిని. ఇది ప్రతిరోజు అభ్యాసముగదా! కాని వారు ఇక్కడ అన్నమును జేయరు జొన్నరొట్టెలను మాత్రమే భుజిస్తారని చెప్పిరి. ఆరొట్టెలకైనా పచ్చికూరగాయలనే అధికముగా తింటూంటారు. ఉల్లిపొర,

పచ్చితెల్లిగడ్డ, మెంతెపుకూర, పచ్చిలేత బెండకాయలు, లేతటమాటలు, లేతవంకాయలు, లేతబుడ్డుమకాయలు, వీటన్నింటిని జొన్నరొట్టెకు తోడుగా పచ్చివేదినుచుండిరి.

ఇట్టి ఆహారపద్ధతినిజూచి నాకుభయమేసినది. ''హాయిగా రెండుపూటలు కావల్సినన్ని రొట్టెలు. అన్నము రకరకాల కూర గాయలను భుజించేవాడిని ఇక్కడి పరిస్థితినను భవించాల్సివచ్చెన్నుగదా! అయ్యో! శివ శివా! ఇది మాకర్మ ''చేసుకున్నంతగుడుపుమహాదేవ'' అన్నారుపెద్దలు. అది తప్పుతుందా! మరి. ఎవరు జేసినకర్మ వారను భవించక "తప్పదన్నారు మహానుభావులు." పోగా హాయిగా భోజనముబెట్టె ఇల్లును వదలిస్తంభమునకు గట్టిగొట్టె ఇంటికివచ్చిన ట్లైనదిమాగతి.

భోజనము జేసినపిదప హాయిగాగూర్చునియుండగా లింగయ్యమే మిక్కడికి వచ్చిన ఉద్దిశ్యమును గురించి తన తల్లి మరియు అన్నయ్య గార్లకు విన్నవించెను, మేము ఇక్కడినుండి శివయోగమందిరమునకు వెళ్ళుచున్నాము, అక్కడ వారు మాకు అన్నవస్త్రముల నొసంగి విద్యార్థులకు విద్యను బోధిస్తారట, అంచేత మేమక్కడికి వెళ్ళతాము. కావున మీరు మాకక్కడికి వెళ్ళటకురైలుఖర్చికిడబ్బివ్వమని తల్లికి విన్నవించెను, అప్పుడా తల్లిగారు లింగయ్యతో ప్రస్తుతంనావద్ద ఒకపయిసాకైసాగూడ లేదు. రెండు మూడురోజులిక్కడుండిన ఎక్కడైన ఎవ్వరినడిగైన దెచ్చియిచ్చెదననిరి. వారుమొదలే బీదవారు, ఆ రోజు రాత్రి మాత్రము సుఖనిద్రననుభవించితిమి, ఉదయమే నిద్రలేచి కాలకృత్యములను దీర్చుకొనుటకై మడిగుడ్డలను దీసికొని లింగయ్య

సొంతజామ, మామిడితోట. ఒకవాగు ప్రక్కనే ఉంది, అందులోనే మంచినీటి మోటబావిగూడ ఉంది. ఈబావికి మరోవైపు కూరగయలతోట గూడ ఉంది. ఒకవైపు రేగుపండ్లచెట్లున్నవి, బహిః ప్రదేశమునకు వెళ్ళివచ్చి బావిలోకిదిగి ముఖ ప్రక్షాళనము గావించుకొని బావిలో ఈదులాడి స్నానముగావించితిమి.

మడిగుడ్డలను ధరించి మైలగుడ్డలను ఉదికి శుభ్రపరచుకొని, తీరమునకు వచ్చికొద్దిసేపు జామ పండ్లను త్రెంచుకొని మనసార తింటిమి. రెండు మూడు పండ్లనుదినేసరికి కడుపునిండినది. ఇంటికి వెళ్ళితిమి. గుడ్డలారవేసి లింగార్చన గావించితిమి. ఇంతలో వంట సిద్ధమైనది. వేడివేడి జొన్నరొట్టెలనొసగి. వాటికి అనుపానముగా (తోడుగా) చట్నిపచ్చడి లేతవంకాయ పిందెలు, పచ్చిఉల్లిగడ్డలు, మూలంగి గడ్డలుకోసి వాటికికొంత ఉప్పునుగల్పి తినుమని చెప్పిరి. మరియు ఇతకు సబ్బసి కూర (శాఖము) బెట్టిరి. ఇట్టి పచ్చి శాఖములను నా జన్మదారభ్యతినలేదు. కాబట్టి వాటితో భుజించుటెట్లు? అనే సమస్య నాలో గలిగెను. అయినను విధి తప్పదు. ఆపచ్చిశాఖముతో రొట్టెను మాత్రమే తినగల్గితిని. ఆమీదట అన్నమేమైన కొస్తవడ్డిస్తారే మోనని వంటపొయ్యి వైపునాదృష్టిని సారించితిని. అక్కడ కూర కుండదప్ప మరో కుండ అగుపడలేదు. అంతటితో మానేస్తులిద్దరు చేతులుగడుగుకొనిలేచి వెళ్ళిరి ఇంకనేను వారిననుకరించి వెళ్ళకతప్పు తుందా? మరి, ఒకటి మాత్రమిక్కడ నిర్మొహమాటగా చెప్పాల్సి వచ్చినది. ఆ భోజనముతో నాకు తృప్తిగలుగకుండెను. సగమాకలితో బాధజెందుచుంటిని.

మన తెలంగాణా ప్రాంతములో అన్నములేకుండ ఉండెవారము గాదు. ఒకపరి రొట్టెలేకుండినను తృప్తిగా నుండేది. కావున ఆదినము నుండి నాపాలిటికి యాభోజనము చెరశాలలో నుండెవారి భోజనము మాదిరిగా నుండినది. ఏమేకానిండు అక్కడి యాహారపరిస్థితి యట్టిది. భోజనానంతరము మేనదుస్తులను ధరించుకొని పండ్లతోటకు వెళ్ళితిమి. అక్కడ మాకు నచ్చినవి పెద్దపెద్దవి తాజాగానుండి కన్నులకింపైన జామపండ్లను త్రుంచుకొని, మరియు రేగుపండ్లను గూడ త్రెంచుకొని మనసార దినితృప్తిజెందితిమి. మరల ఇంటికివచ్చి ఆదినము మధ్యాహ్నము అకస్మాత్తుగా నొక అలోచన గలిగెను. ఆకాశము నీలిమేఘాల్లో మెరసెమెరపుతీగలా (విద్యుల్లతమాదిరి) మామెదడులో సంచలనమును గలిగించేను. ఏమనగా ఎట్లాగు లింగయ్య బంధువులు మేము వేళ్ళడానికి రైలుచార్జులిస్తున్నారు. మేమువెళ్ళామని అనుకున్న చోట వారే అన్నవస్త్రములనుచితముగా నిస్తారుగా. అందుచేత ఈపాత గుడ్డలతోనిండిన ట్రంకు బరువుగానున్నది. ఆ భారమును తగ్గించుకొను టకుగాను ఆ దుస్తులను దినాలు మేనధరించే దుస్తులు ఒకటిరెండు ఉంచుకొని మిగతవాటిని పరచుకునే, కప్పుకునే వాటితో సహా దాన కర్ణునివలె మహౌదార్యగుణముతో బీదవారిని, భిక్షుకులను పిలిచి ముగ్గురము దానమొసంగితిమి. దానివలన మాట్రంకు బరువు చాలా మట్టుకు తగ్గెను. కాని యిది ముఖ్యంపహాస్యమునకు గురియౌతుందనే విచారము మా మనస్సులో మెదలుచుండెను. ఈ మా ఔదార్యగుణము ఎలా పరిణమించినదనగా "ఆకాశములో నల్లని మేఘాలు క్రమ్మి ఇంట్లో కడవల్లోనున్న నీటిని పారవైచినట్లు ఏకధార వర్షము కురుస్తుంది. అప్పుడు మరల తాజాగా నీరు కడవల్లో నింపవచ్చు." అని

యూహించిన మూష్టునిపగిది మాస్థితిఅలా మారినది. అక్కడికి వెళ్ళ కుండానే ఎట్లా సమస్త మిస్తారని ఊహించుకొనుటకు మహామూర్ఖతనమే అని ముమ్మెండు గ్రహించితిమి.

మరునాడుదయము లింగయ్యకు గ్రామానికి వెళ్ళడానికి ఆతనితల్లి దండ్రులయనుమతిలభించినది, కొంత డబ్బునుగూడ రైలుచార్జికి సంగ్రహించి ఇచ్చారు, మేము సంసిద్ధమై బయలుదేరి, ఆ మాగణిగేరికి సమీపములోనున్న "గోలిగేరి" అనుగ్రామమునకు పుణ్యక్షేత్రమునకు జేరుకుంటిమి, అక్కడినుండే ఇంక బస్సుపై పయనించాలి. ఆదినమున గ్రామములో సంత ఉండబట్టి పరిసర గ్రామప్రజలవినియోగదార్ల సందడి అంగడులన్నియు కిటకిటలాడు చుండినవి, అంచేత నాడు మోటారు బండి రాలేదు. ఆ కారణమున ఆదినమురాత్రి అక్కడే గడపవల్సి వచ్చెను, ఎక్కడేమియుదోచక అక్కడేవెలసియున్న దేవాలయములోని శివలింగమును దర్శించు నిమిత్తముగా వెళ్ళితిమి. ఈ శివలింగము చాలాకాలమునుండి ఇతిహస ప్రసిద్ధమైయుండినది- ఈ గ్రామములో గొల్లాళనామము చేత స్వయంభూలింగమైప్రసిద్ధి గాంచుటకొక వాస్తవమైన కథయొకటి బసవపురాణములో వివరించ బడినది.

ప్రాచీన కాలమున నొక గొల్లెల కాపరి తన గొర్లను ఒక చో మేపుచుండెను. అదే ప్రదేశము నుండి కాలిబాటలో కొందరు కావడి మోస్తు శ్రీ శైలమల్లన్నా చాంగు భళా! మమ్మేలుకోమల్లన్నా! చేదుకోమల్లన్నా! మల్లన్న ఉఘెఉఘే, అనిగట్టిగా అరస్తు నినాదాలు

జేస్తు పరుసగా గుంపులు గుంపులుగా ప్రయాణమై వెళ్ళుచుండిరి. వారినిజూచి యీగొల్లవాడికి "పూర్వ జన్మలో తాజేసిన పుణ్యఫలితమో యన్నట్లుగా" వారిని సమీపించి, అందరు వెళ్ళిపోయిన పిదప వెనుకనుండివచ్చి ఒక యాత్రార్థిని సమీపించి మీరందరెక్కడికి వెళ్ళుచున్నారు? అక్కడేముంది? అక్కడినుండి మీరేమిదెస్తారని ప్రశ్నించాడు. అతడు జంగమయ్య ఇట్లు బదులు చెప్పెను.

"మేమందరము శ్రీశైలమను పుణ్యక్షేత్రమునకు వెళ్ళుచున్నాము. అక్కడ శ్రీమల్లికార్జున దేవుడుంటాడు. వారి దర్శనార్థము వెళ్ళుచున్నాము. తిరిగివచ్చేముందు వారి జ్ఞాపకార్థము" చిన్నని శివలింగమును గొనితెస్తామని సమాధానమిచ్చెను. అందుకు మరల నాగొల్లవాడు "ఆ లింగములను గొనితెచ్చి మీరేమి చేస్తారు." దానివలన మీకేమి లాభమని ప్రశ్నించగా. అదివిని జంగమయ్య ఆలింగాన్ని దెచ్చి ఇంట్లోబెట్టి యత్యంతభక్తితో పూజిస్తాము. దాని ఫలితముగా మా శివలింగమూర్తియైన శ్రీశైల మల్లికార్జునుడు మాకష్టములను దొలగింపజేసి, మా కోరికలనన్నింటిని అనుగ్రహిస్తాడనేను.

అదివిని ఆగొల్లవాడికి అంతులేని యానందము మనస్సులోమూడి "అయ్యా! అలాగైతే నాకోచిన్న శివలింగమును దయజేసితెచ్చి ఇవ్వండి. అందుకు కావల్సినయంత డబ్బును మీకిప్పుడే దెచ్చిఇచ్చెద." అయ్యగారు. "అబ్బో దాని ఖరీదుకు బోలెడు డబ్బుగావాలి? అంతడబ్బును నీవెక్కడినుండి దెస్తావు?" అని చెప్పగానే ఉండు నీవిక్కడే ఉండుము-నేనీక్షణమే పరుగెత్తుకొనిపోయి నీకు కావల్సినయంత డబ్బును దెచ్చి యిచ్చెదను. దానితో నాకోచిన్న శివలింగమును గొనిదెచ్చియిమ్మని

ప్రార్థించి. తాను చెప్పినట్లుగానే పరుగెత్తుకొనిపోయి తన తండ్రికి తెలియకుండదాచి కూడబెట్టిన డబ్బును వెంటనే దెచ్చియిచ్చెను. ఆ అయ్యగారందుకు మిక్కిలి సంతసించి డబ్బును దీసికొనివెళ్ళెను.

శ్రీశైలములో రెండుమూడు దినములు గడపి మరల ఇంటికి పయనమైనాడు జంగమయ్య. ఇక్కడ శివలింగమునుగాని తెమ్మని బోలెడంత డబ్బిచ్చిన గొల్లవాడు అయ్యగారెప్పుడు వస్తారో. ఆ లింగమెట్లుంటుందో చూడాలనే గుతూహలముతో ఆయన రాబోయే మార్గాన్ని నిరీక్షిస్తుండెను. ఇంతలో శ్రీశైలక్షేత్రమునకు వెళ్ళినగుంపు మరల రావడమును పొడగాంచి యాగొర్లకాపరి లోలోన నెంతగానో మురిసిపోవుచున్నాడు. అల్లంత దూరమునుండి యీగొల్లకాపరిని జూడగానే భయముచేతనాతని ప్రాణాలు స్థానాంతరములైనవి. ఎందుచేత ననగా గొల్లవాడిచ్చిన డబ్బంతయు తనయిష్టమొచ్చిన రీతిగా వ్యయ పరచుకొని యీతనికి శివలింగాన్ని దేవడమే మరచివచ్చాడు. అందు కాలనికిదిగులేర్పడినది. దారిలో బడియున్న గొట్టెపెంటిని చేతబుచ్చు కొని దానొక గుడ్డలోగట్టిగా జుట్టి ఆ గొల్లవాడికిచ్చి, ఇదిగో నీవుగోరిన శివలింగమును దెచ్చాను. దీనినియెవరికిని దెలియకుండ నిర్జన ప్రదే శములో నాకగోతి(గుంట)దోడి అందులో దీనినుంచి ప్రతిదినముపాలతో నభిషేకించాలి సుమా! జాగ్రత్త అని చెప్పి, అతడు తనమార్గమున వెళ్ళి పోయెను. ఇక్కడాగొర్లకాపరి ఆచిన్న శివలింగమును తానెన్నడు జూడ లేడు. కాబట్టి నిజముగానదే శివలింగముగా భావించి, నిర్జన ప్రదేశ ములో నాకమట్టి దిబ్బలోపాతిపెట్టి, దానికి ప్రతిదినము తాను గొర్లకు బితికిన పాలనుదెచ్చి ఆచోట బోయుచుండెను. అది మట్టిదిబ్బగనుక దినాలు ఎన్నిపాలు బోసినను అటునింకిపోవుచుండెను. అదిజూచి

గొల్లవాడు "అయ్యో నాతండ్రి యెన్నాళ్ళనుండి అకలిగొనియున్నాడో గదా! త్రాగుము తృప్తిగా త్రాగుమని మరిన్ని పిండితెచ్చిన పాలనన్నింటిని బోయుచుండెను.

అతని తండ్రి ఒకనాడీతని చర్యను పసిగట్టి, భరించరాని కోపముతోవచ్చి మూర్ఖుడా! దినాలు పాలుదెచ్చి యిట్లునేలపాలుచేయుచున్నావా!అని గద్దించికొట్టబోగా,గొల్లవాడు నాయనా!నేను పాలనువృథా నేలపాలు జేయుటలేదు, ఇక్కడ నాతండ్రి శ్రీశైలమల్లికార్జున శివలింగముంది. దానినభిషేకించి దృప్తిపరచుచున్నానని చెప్పగా, నదివిని తండ్రి మరింతావేశమునకులోనై ''ఏడిరా! నీమల్లన్నదేవుడని కాలితో దన్నెను." అంతటనాగొల్లవాడు పట్టరాని కోపముతో తనచేతనున్న గొడ్డలితో తండ్రి తలను ఛేదించెను.

అప్పుడాగొల్లవాడి ముగ్ధభక్తికి బ్రసన్నుడైన యాపరమాత్ముడు ఆతని తండ్రికి ప్రాణదానమొనర్చి,ఆయుభయులకంతిమ సమయములో కైలాస పదమునొసగెను. అనే గాథ పురాణ ప్రసిద్ధమైనది. ఆ కారణమున గొల్లాళేశ్వరాలయమని జనుల వాడుకలో నున్నది. వేలాది ప్రజలక్కడికివచ్చి దర్శించి కాయకర్పూరములనర్పించి, తీర్థప్రసాదములను బడయుచుందురు. ఇది చాలా ప్రాచీనమైన దేవాలయము. చూడముచ్చటగాను విశాలమైది. ఉన్నత గోపురముతో విలాజిల్లుచున్నది. అట్టి శివలింగమునుదర్శించి మేము కృతార్థులమైతిమి. ఈదేవుడి మహిమ అతిశయమైనది. అందుకే (గొల్లకేరి)గోలిగేరి అను నామము ఈ గ్రామమునకు సార్థకమైనది. ప్రతియేట రథోత్సవము జరుగుతుంది. రథమును దిలకించితిమి. ఆరథము చాలా ఉన్నతమైయందముగా

నుండినది. దృఢముగా నుండినది. కొద్దిసేపు రథము నధిరోహించి యానందించితిమి మరికొంతసమయమువరకు బజారువీధుల్లోనలువైపుల అటునిటు దిరిగి జూచితిమి, ఆ రాత్రి ఒక భక్తుడాహ్వానించగా వాతని ఇంట్లోనె భోజనము జేసితిమి, తరువాత నాగృహము భోజనశాలనుండి ముంగిటప్రాంగణములోకి వచ్చి ఆసనములు వేసికొని కొంతవడి గూర్చుండిలోకాభిరామాయణముగా మాలోమేము సంభాషించుకొని కొంతకాలక్షేపముగా వించితిమి: ఆ పిదప లింగయ్య నాకు కొంచము త్రాగడాని మంచినీరును వంటింట్లోకి వెళ్ళితీసికొని రమ్మన్నాడు. నేను వంటింట్లోకివెళ్ళి అమ్మవారితో వచ్చిరాని కన్నడ భాషలో "తాళి యల్లినీరు కొడిరి" అని అడిగితిని. దాని కామేనాయభిః ప్రాయమును గ్రహించి ఒకగ్లాసు (స్టీలుది)లో మంచినీరు ఇచ్చినది. కాని బయటనున్న నా ఇద్దరు మిత్రులు నామాటను విననివ్వెరబోయి మరలనన్ను జూచి అవహేళనము జేస్తునవ్విరి? మళ్ళినన్నుదేశించి లింగయ్య "ఇంట్లోకెళ్ళి యేమని అడిగావు రాచయ్యా!" అని విచారించెను. నేను మొదటివాక్యము నేమరల ఉచ్చరించితిని.

అయ్యో! కర్మఅట్లంటారా! తప్పు తప్పు అట్లడగుట మహతప్పుసుమా! మళ్ళియెవ్వరితోనైన ఇట్లామాట్లాడకుము. అనెను. ఏలననగా "తాళి" యనగా దానికర్థము స్త్రీలుమెడలో ధరించిన "మంగళ సూత్రమున కర్థమగుననెను" సరే కన్నడభాష నాకు సరిగా రాదుగనుక నేనుఅట్లంటిని.ఇకముందెన్నడునుఅట్లడుగనని చేప్పకుంటిని, పాపము ఆయమ్మతనమనుసుననేమనుకొనేనో. అని పరివరి విధముల విచారించితిని, ఆ రాత్రి దేవాలయమునకువెళ్ళి అక్కడే పరుండి నిద్ర బోయితిమి. మరల పెందలకడ నిద్రలేచి అదేగృహమునకువెళ్ళి ముఖ ప్రక్షాళనమునుజేసికుంటిమి. ఆయమ్మనన్నుజూచినప్పుడేమనుకుంటుంటో

తనే భయమునాలో స్ఫురించుచుండేను. బస్సుస్టాండుకు వెళ్ళితిమి. అలా
వెళ్ళినదేతడవుగా బస్సురానే వచ్చినది. అందులోగూర్చుండి విజాపూరు
మీదుగా శాబాదుగ్రామమునకు సరిపడు డబ్బిచ్చి మా మిత్రులు టికెటు
దీసికొనిరి, విజాపూరు నగరమునకు సరిగా మధ్యాహ్నము రెండుగంట
లకు జేరుకుంటిము, అంతకుముందెప్పుడు బస్సులో ప్రయాణించినవాడిని
గాను కావున ఆబస్సునూనే వాసనను భరించలేక వాంతిరానారంభించెను.
తలత్రిప్పుచుండినది, బస్సు విజాపూరులో కొంతసేపాగినది. లింగయ్యా
నావైపుజూచి, ఏమి ఏమౌతుందని విచారించెను. ఈలోపున లింగయ్యా
క్రిందికిదిగి, అటుకులు, సెవు, ఫలారము జేయుటకై దెచ్చెను.
ముగ్గురము దానినారగించితిమి. అప్పుడుగాని నాకు కొంతమట్టుకు
ఉపశమనము గలిగినది, మళ్ళిఅదే బస్సులోనే ప్రయాణమై సాయం
కాలము 6-30. (ఆరున్నర) గంటలకు శాబాదుస్టేషన్‌కు జేరుకుంటిమి,
అక్కడికి రైలెప్పుడు వస్తుందో అని తెల్సికొనుటకై మిత్రులువెళ్ళి
స్టేషన్‌మాస్టర్‌గారిని విచారించిరి, అదివచ్చేలోపున మేముఫలాహారము
జేసికొని బండిలో ప్రయాణించుటకు సిద్ధంగా నుండాలి.

ఈయాలోచనలో నుండగా నదేసమయములో ఒక కూలిమనిషి
వచ్చి, మమ్ముగురించి మీరేదో విశ్రాంతికొరకు ఆలోచించుచున్న
ట్లుంది. ఇదో నావెంటరండి. మీకు విశ్రాంతి గృహమును జూయిస్తాను.
అని తోళ్కొళ్ళి విశ్రాంతి గృహముయొక్క తాళమును దీసి గదిని
జూపి, మరల మీరు వెళ్ళెఅప్పుడు నన్ను బిలవండి అని అతడు తన
పేరును గూడ మాకు జెప్పివెళ్ళెను. మేము మా సామానులన్నింటిని
అందులోబెట్టి మేము మా కాళ్ళు,చేతులు, ముఖమును గడుగుక్కోవడానికై
ఆగదికి ప్రక్కనేయున్న చేదుడుబావికి వెళ్ళితిమి. ఆబావికికమర్చిన

(గిరక)ను జూడగానే మాకు భయము గలిగినది. బావిలోని నీరు నేవిధముగ పైకి చేదుకొనవలయునో మాకు కొద్దిసేపు తెలియలేదు. ఇంతలోనొక మనిషివచ్చి బావిలో నీళ్ళు చేదుకోవడాన్ని గమనించితిమి. ఐనను పిన్నవారమైన మా ఇద్దరికి (బసవయ్యకు నాకు) నీరు తోడుటకు సాహసములేకుండినది. ఎట్లాగో మాలో పెద్దవాడైన లింగయ్య సాహసించి బావిలోనుండి నీరు చేదిచ్చెను.

అక్కడి బావి గిరక తెలంగాణాలోని గిరక మాదిరిగాక ఆ గిరక దారమువీసిచుట్టె చరఖావలె పెద్దదిగా నుండి దానికి ఇరువైపుల నాలుగేసి కఱ్ఱలు పొడుగ్గాను, స్వస్తికాకారమువలెనుండి చివర పిడకిళ్ళు (గుండ్రంగా) గలవై యుండును. కొన్నిచోట్ల నిలాంటివే ఇనుప చట్రముగూడ ఇదే మాదిరిగానున్నవి. మధ్యన చెత్రాడుయొక్క కొస నొకదానిని గట్టిగా ముడివైచియుంచి బావినుండి నీరు దోడె ఇనుప బిందెను పైకిదీయునప్పుడు ఆ పిడికిళ్ళనుబట్టి త్రిప్పినకొలది ఆ గిరకకు మధ్యభాగములో చెత్రాడు తనంతటదే జుట్టుకుంటుంది. ఇట్లు నీరుతోనిండిన బిందెను పైకి తోడునప్పుడుగాని, అథవా బిందెను బావిలో వదలునప్పుడుగాని, బహుజాగ్రత్తతో నుండాలి. నెమ్మదిగా తోడాలి. నెమ్మదిగా బిందెను బావిలోకి వదలాలి. లేనియెడలనేమాత్రము అజాగ్రత్తతో నుండి చేయిజారినను, పరాకుగా నుండినచో, నొసలికి బలమైన దెబ్బతగలడము లేదా మన వస్త్రము ఆ గిరకకు దగలుకొనినను మహ ప్రమాదమునకు గురి కావల్సిందే. కనుకనే తప్పకుండ జాగ్రత్త వహించాలి.

సరే లింగయ్య భయముతో నీరును బావినుండి చేదిపెట్టడము తోనే మేముభయులము కాళ్ళుచేతులు, ముఖము ప్రక్షాళనము జేసి

కాని "స్వగృహేపూర్ణ ఆచారః పరగేహేతదర్ధకం - పరగ్రామే తదర్ధంచ - పథిసూత్రవదాచరేత్" అను ఆచార వ్యవహారము ననుసరించి "ఇంట్లో నున్నప్పుడు పూర్తియాచారమును పాటించాలి. ఏలన తన ఇంట్లో దనకు గావల్సిన సౌకర్యములుండును. ప్రక్క నున్న ఇంటికి వెళ్ళినప్పుడు పూర్ణాచారముతో సగమును తగ్గించు కోవాలి. అట్లె పరగ్రామానికి వెళ్ళినప్పుడు తన ప్రక్కఇంట్లో నాచరించినట్టి సగమాచారములోను మరి సగమాచరించవలెను. ఇక మార్గములో వెళ్ళున్నాము, పూజా సమయమైంది. అప్పుడు సూత్ర ప్రాయముగా మనస్సులోనే పూజా కార్యక్రమమును భావించుకోవాలి. ఏలనన స్నానమునకు నీరుందదు. తగిన సౌకర్యములేమి ఉండవు. కనుక మనస్సుతో బూజించాలి. ఇదే శ్రేష్ఠమైన పూజయనబడుతుంది. ధినదినాభ్యాసమువలన ఆక్షణములో మనస్సు స్థిరముగా ఉంటుంది. మేముగూడ "పథిసూత్రము" ననుసరించి సంక్షిప్తముగా లింగార్చన గావించుకొన్నాము.

మాగణిగేరి గ్రామమునుండి మేము ప్రయాణమై ఇక్కడికివచ్చే ముందు మత్ప్రేమ పీఠని యనుబంధమున్నట్లు లింగయ్య మాతుశ్రీ మధ్యమార్గములో ఆకొన్నప్పుడు క్షుధను దీర్చుకోవడానికి ఆమె వేయించి పిసికించిన సజ్జపిండిని కొంత మూటగట్టియిచ్చి, యెక్కడైన దీనికనుపానముగా(తోడుగా)బెల్లం గొనితెచ్చుకొని యిందు గలుపుకొని తినుమని చెప్పారట. అందువలన లింగయ్య బజారు (కొట్టుకు) వెళ్ళి బెల్లమును గొనితెచ్చెను. దాన్ని ఆ సజ్జపిండిలో నీళ్ళతో గలిపి ముగ్గురము ఒకే కంచమున భుజించితిమి. "ఆకొన్నకూడే అమృత మన్నట్లుగా" నది సత్తుపిండివలె భలే రుచిగా నుండినది. "క్షుధాతు

గాణాంనరుచిర్న్నపక్వ" మన్నారు. పెద్దలు అది యీసందర్భములో మాకెంతగానో సార్థక్యమైనది. ఆకలి రుచినిగాని పక్వ మైనదాః లేదాః అనే దానిని నేరుంగదు. నాజన్మతః ఇట్టి పిండిని దినినె యెఱుఁగను.

శివరాత్రి ఒక్కప్రొద్దునాడు మాత్రము వరిపేలాలు విసిరి సత్తు పిండిని లేదా శనగపిండి అథవా పెసరిపిండితో ఉండలుజేసి తినుట మాకు చిన్ననాటి యనుభవముండేది. కాని ఈ సజ్జలతో జేయుట నేనెఱుగను. అందుకాయా ప్రాంతముల యభిరుచినిబట్టి ఆహారవస్తువుల ననుసరించి మానవులు తమకనుకూలమైన, అందుబాటులోనున్న వంట సామగ్రితో నానారకాల వంటకములను సిద్ధగించి, అనుభవిస్తుంటారు.

శ్రీనాథ కవిసార్వభౌముఁడు పల్నాటిసీమకు వెళ్ళినప్పుడు "జొన్నన్నము జొన్నకూడు" భుజించక తప్పలేదని తన కావ్యములో వ్రాసికొనియున్నాడు. భోజనానంతరము మాకు గదిని జూపించియిచ్చిన కూలిమనిషిని బిలిచి మా సామానులను దీసికొని, ఇఁక నీవు గదికి తాళము వేసికొనుమని చెప్పితిమి. ఆ సామానుతోబాటు స్టేషన్‌కు వచ్చితిమి. ఇక్కడ మా మిత్రుడు లింగయ్య ఒక చిన్నసలహా ఇచ్చెను. రైల్లో టికిటు మాస్టరు నీకెంత వయస్సని ప్రశ్నించిన పద కొండు సం॥ములని చెప్పుమనెను. అందుకు నేను సరేయని తల ఊపితిని. ఇలా అతఁడు ఎందుకు చెప్పుమన్నాడనగా టికిటుకు సగము చార్జిఉంటుంది. గనుక అట్లు చెప్పుమనెను. రాత్రిసరిగ్గా ఎనిమిది గం.కు రైలుకు వెళ్ళేవారికి టికిటు మాస్టరు బెల్లుగొట్టగానే సాలుగానిలుచున్న వారికి టికిట్లివ్వనారంభించెను. తొమ్మిది గం॥కు రైలుబండి స్టేషన్‌కు

వచ్చెను. మిత్రుడు లింగయ్య బెళగాంవు నగరము స్టేషన్‌కు టికిట్లు దీసికున్నాడు. మేము ముగ్గురము ఒకేడబ్బాతో, ఒకేచోట గూర్చుంటిమి. అచట వేరే మరొ ఒకరిద్దరు క్రొత్తమిత్రులు గల్సిరి. పరస్పర సంభాషణలతో మాతో స్నేహమధికమైనది. వారు గొనితెచ్చిన అరటిపలములను మాకు తినుమని ఆగ్రహపరిచి యిచ్చిరి. వాటిని దినకదప్పదయ్యెను. రాత్రి సుమారు నాలుగు గం॥కు బెళగాంవ్ స్టేషన్‌కు జేరుకుంటిమి. ఆరాత్రి స్టేషన్‌లోనే ఒకచోట నిద్రించితిమి. తెల్లవారుఝామున త్వరగా నిద్రలేచి, కాలకృత్యములను దీర్చుకొని, ఆ స్టేషన్ లోనేయున్న కొళాయివద్ద (నల్లకింద) స్నానము జేసితిమి. తడిమేని వస్త్రములను బిండుకొని మడిగుడ్డలను ధరించి సంక్షిప్తముగా నల్లధారాకు దిగువన లింగాభిషేకముచు జేసుకొనియుంటిమి. చలికాలమది. అందును అది మలినాడు ప్రాంతము, విపరీతమైన చలియుండెను. చలి ప్రభావమును దట్టుకొనలేక వణకుచుంటిమి.

చల్లని ద్రవయుక్తమైన దోవతులను (దుప్పటులు) భుజాంపైన వేసికొని గడగడవణకుచుంటిమి. తెల్లవారగానె స్టేషన్‌పైకి కొంత దూరము నడచివెళ్ళగా నచట ఒకరిద్దరు మంటలు బెట్టుకొని వెచ్చగా కాపుకొనుచుండిరి. భరింపరాని చలితో బాధపడుచున్న మేముకూడ కొంతసేపు ఆమంటను కాపుకొవాలి అను బుద్ధి బుట్టినది. అట్లని కొంత గడువు కాపుకుంటిమి. అక్కడుండిన వారిని ఇక్కడ "లైఫ్ఇన్‌ష్యూరెన్స్ కంపనీ" యెక్కడుందని ప్రశ్నించగా, వారు, "అదిగో సీమెంటురోడ్డు (సడకు) దాటి కొలదిదూరము వెళ్ళి ఎవరినైన విచారించండి. వారు మీకు దెలియపరచగలరు." అనిరి. అట్లేవిధముగా వెళ్ళి రోడ్డుపైనున్న ఒక వ్యక్తిని "లైఫ్ఇన్‌ష్యూరెన్స్ కంపనీ" ఎక్కడుందని విచారించగా

వారు "ఎందుకని" మమ్మల్నె దిరిగి ప్రశ్నించిరి. మాకక్కడికి వెళ్ళాల్సి ఉందని చెప్పితిమి. మిలిట్రీలో మీరు చేరాలని అడుగుతున్నారా! అని అడిగెను. "ఔనండి" అని వారికి సమాధానమిచ్చితిమి. అదివిని వారు అందులో చేరగోరేవారు పదునెనిమిది సం॥ముల వయస్సుండితీరాలి. ఇంగ్లీషు నాలగవ తరగతివరకు జదివియుండాలి. అట్టివారికి మాత్రమే అందులోకి జేర్చుకుంటారని చెప్పిరి.

ఈరెండు యోగ్యతలు లేనివారము మేము ఒకరిమొఖము మరొకరు జూచుకుంటిమి. మాయింగితార్థము నెరింగివారు వెళ్ళిపోయిరి. మాముగ్గురిలో బసవయ్యకు పంద్రెండు సం॥ముల వయసు, నాకు పదునాలుగు సం॥ముల వయసు, లింగయ్యకు పదహారుసం॥ముల వయస్సుంది. మాలోనెవరికి పద్దెనిమిది సం॥ముల వయస్సు లేదు. కనుక నిరాశతో హతాశులమై దిగాలుపడితిమి. అందును ఆంగ్లభాషను నాలుగవ తరగతివరకెవ్వరము అభ్యసింపలేదు. ఇంతవరకు మున్ముందు మతాధిపతులమై ప్రజలకు ధర్మబోధ గావించుటకై సంస్కృతమునే అభ్యసించాలనే లక్ష్యముగలవారమై దానికై ప్రయత్నించుచుంటిమి. గాని పాశ్చాత్య విద్య మాకెందుకులే అని మడి గట్టుకొని గూర్చుంటిమి. అందునాకళాశాల గురుకులమువంటివి.

సరే "గడచినదానికి వగచి లాభములేదన్నట్లుగా" ఇప్పుడేమి జేయాలి? యెక్కడికి వెళ్ళాలి? ఎక్కడికైన వెళ్ళాలనినను చేతిలోనున్న డబ్బు రైలు చార్జికే సమాప్తియైనది. మిల్ట్రి కంపనీకి వెళ్ళడముగూడ మాయవివేకమే వెల్లడవుతుంది. అక్కడికి వెళ్ళడమనుచితముగా తోచినది. అంచేత చేయునదిలేక ఆలోచనలో నిమగ్నులమై అదే (రోడ్డు)

మార్గముపోవుచుండగా వెళ్ళుతు ఉండగా మాయెదురుగా ఒక యువకవయస్కుడైన విద్యార్థి సైకిలుపైన వచ్చేవాడినిజూచి, ఇక్కడ కాలేజి యెక్కడుందని ప్రశ్నించితిమి. అందుకాతడు మీరిదే మార్గముగుండా నేరుగా వెళ్ళండి. ముందుకొద్దిదూరములోనే "లింగరాజు" కాలేజి అని ఉంది. అక్కడికివెళ్ళి అడిగిన యెవరైనచెబుతారనిచెప్పి అతడువెళ్ళెను. మేమదేవిధముగా నేరుగా వెళ్ళిచూడగా నక్కడ "సర్‌సిరసింగిదేశాయి" స్థాపించిన "లింగరాజు" కాలేజి మాకగుపించెను. ఉదయము తొమ్మిది గం॥ల సమయమది. ఆ కాలేజి విద్యార్థులందరు విచ్చేయుచున్నారు. మేము కాలేజి మహాద్వారమువద్ద (గుమ్మమువద్ద) నిలుచుండినది జూచి, నావిద్యార్థులలో కొందరు మావైపుజూచి "మీదేగ్రామము, ఇక్కడికి యెందులకుగాను వచ్చారని" ప్రశ్నించిరి.

మేమిక్కడికే విద్యాధ్యయమునకై వచ్చియున్నారమని చెప్పితిమి. అదివిని విద్యార్థులలో నొకరు మీరుండడము, మీభోజనమెక్కడ? అని విచారించిరి. అందుకు మేము మానివాసమునకై యింకను యెక్కడ ప్రయత్నించలేదు. ఎక్కడైన వీరశైవ బోర్డింగు ఉండిన యెడల దయచేసి మీరు చూపండని అర్థించితిమి. ఏలనన మేము కడునిరుపేద విద్యార్థులమండి. మాకిక్కడెవరును పరిచయము లేరు. అనగానే పాపము వారికి మాపై జాలిగలిగి, వారిలో మరో విద్యార్థి మాముందున కొచ్చి "ఇక్కడికి కొద్దిదూరములో శ్రీనాగనూరు స్వాములవారి బోర్డింగు ఉంది. మీరు నావెంటరండి, నేను మీకు జూయించెదను. మళ్ళినేనీ కాలేజికి రావాలి." అని మమ్ములను వెంటనిడుకొని దోవ్కాని వెళ్ళుతు "యద్యపివారు తమ బోర్డింగులో మిమ్ములన్ని జేర్చుకొనని యెడల మళ్ళీ పండ్రెండు గం॥లకు నేను నా నివాసమునకు వస్తాను.

అక్కడికి మీరురండి. అనిఅతని చిరునామా(అడ్రసు)ను వ్రాసియిచ్చెను. తాను సైకిలును మెల్లగా నడిపిస్తు కొంతదూరము మమ్మల్ని దోక్కొని బోర్డింగును జూయించి తిరిగివెళ్ళిపోయెను.

బోర్డింగులోకి మేము వెళ్ళడముతో అందున్న కొందరు విద్యార్థులు మమ్మ సమీపించి "ఏ గ్రామమండిమీది?" యని విచారించిరి. అందుకు మేము మాది హైదరాబాదు నగరమని చెప్పితిమి. ఇంతలో ఆ బోర్డింగు సంచాలకులు సెక్రటరీఐన ఒకస్వామిగారు గూడవచ్చి విచారించిరి. మాది చాలాదూరము. (హైదరాబాదు) విద్యాభ్యాసము కొరకు ఇక్కడికి వచ్చాము. మేము కడునిరుపేద విద్యార్థులము. అనగానే అందులకు వారు ఇక్కడ కేవలము ఆంగ్లములో నాలుగవ తరగతి చదివిన విద్యార్థులకు మాత్రమే ప్రవేశముందనియు, ఇతరులకిక్కడ ప్రవేశముండదని ఖచ్చితముగా చెప్పెను.

ఆమాట వినగానే మా హృదయము కంపించినది. ముందేక్కడికి వెళ్ళాలి? ఏమి జేయాలి? అని ఆలోచనలు జేయనారంభించితిమి. ఈమధ్య లింగయ్య మమల్ని "మీరేమి మాట్లాడకండి, మిన్నకుండండని కన్నులతో సైగజేసెను. తదుపరి మాకిట్లు చెప్పుమనెను. తానే ముందుకువెళ్ళి శ్రీస్వామివారితో ఇట్లు చెప్పెను. మేము ముగ్గురము ఒకేతల్లితండ్రుల బిడ్డలము, ఒకే అన్నదమ్ములము, మా తల్లిదండ్రులు గతించారు. మేము ఇక్కడికి రైలు చార్జికి సరిపోయే అంత డబ్బును చందా జేసికొని ఇంతవరకు వచ్చాము. ఇప్పుడు మరల మా గ్రామమునకు వెళ్ళడానికి డబ్బులేదు. కనుక మీరీపరిస్థితిలో మాకాశ్రయ మొసంగిన మహోపకారము జేసినవారవుతారు. మేము మీరు జేసిన

మీమేలును మా జీవితములో మరువలేము. అని అర్థించితిమి. దాన్ని విని. ఆస్వామి "నేనేమిజేయను?" మాకంటె పెద్దవారు ఈ బోర్డింగును నిర్వహించె మహాస్వాములవారు సంచారమునకై వెళ్ళారు. సరే వారి క్కడికివచ్చే పర్యంతమిక్కడే ఉండండి. ఆ తరువాత వారికి నచ్చజెప్పి మీ కేదైన దగినట్లుగా వ్యవస్థ జేయగమనిరి. అంతవరకు మీరిక్కడే ఉండండి. భోజనముగూడ ఇక్కడే జేయండని సెలవిచ్చిరి. శ్రీవారు వంటజేయువారికి మరియు బోర్డింగులోని ముఖ్యమైన విద్యార్థులకీ సంగతిజెప్పి వారి స్వస్థానమునకు వెళ్ళిరి.

ఇట్లు నాలుగైదుదినములు స్థానిక విద్యార్థులతోబాటు అక్కడే నివసించి వెనుక పాఠములను పునరావృత్తము జేసికొనుచుంటిమి. ఇంతలో శ్రీ స్వాములవారు తమ మఠములో సేవజేయించు కొనుటకై లింగయ్యను మరియు బసవయ్యను దోళ్కొళ్ళిరి. మిగిలింది నేనొక్కడిని మాత్రమే బోర్డింగులోనుంటిని,బోర్డింగులోని విద్యార్థులంతా ఆంగ్లమునభ్యసించు వారేయుండిరి. నేను మాత్రము సంస్కృతమున భ్యసించే విద్యార్థిని, నాకక్కడ సంస్కృతమును బోధించెవారును నాతోబాటు చదివేవిద్యార్థుల్లేని కతమున నాకు కాలక్షేపము జేయుట ఇబ్బందిగాదోచినది. వారము దినాలుగడచినట్లు ఆ బోర్డింగు సంస్థాపకులైన శ్రీ నాగనూరు బృహన్మఠాధ్యక్షులు విచ్చేసిరి. నేను వారి నెన్నుడును సందర్శించలేదు గనుక వారువచ్చిన సంగతిగూడ నాకుదెలియకుంటవలన ప్రతిదినము పద్ధతి ప్రకారము సాయంత్రము చేతికందిలిని ముట్టించుకొని వచ్చుటకు మేనచొక్కను ఉంచుకొనె వంటింట్లోకివెళ్ళి పొయివద్ద లాటిను ముట్టించుకొనుచుంటిని, సరిగ్గా నదేసమయములోనకస్మాత్తుగా ఆపొయివద్దనున్న కిడికినుండి వారు

నన్నుజూచి "ఎవ్వడు వాడు వంటింట్లోకి చొక్కాతోవచ్చాడు?" ఆకోపయుక్త (ఆబెదిరింపు) గంభీరపుమాటను వినగానే, నాకిడికి వైపునాముఖమెత్తి జూచితిని, స్వాములవారిదర్శనమయ్యెను. నాకు శరీరమంతా చల్లచెమటలతో నిండిపోయెను, భయకంపనములు పెనుగొనగా వంటింటినుండి బయటకువచ్చితిని. "నామనస్సులో" "ప్రథమగ్రాసెమక్షికాః పాతః" అనుసూక్తిమేరకు ప్రథమ దర్శనము లోనే వారియనుగ్రహమునకు పాత్రులయ్యేబదులుగా ఆగ్రహమునకు గురియైతినిగదా! యనియనుకుంటిని. శ్రీవారియావేశముఫలితముగా ముందునాకిక్కడ ఆశ్రయములభించునో లేదో అను విచారములునన్ను ఆవేదనమునకు లోనుజేసినవి, ఇంతలోభోజనము గంటమ్రోగినది. ఆసమాధానమునుండే విద్యార్థులతోబాటు వెళ్ళలేకవెళ్ళితిని.

ఆక్కడి పక్వాన్నములన్నియు చాలారుచికరముగాను శుచిగాను ఉండును, అన్నిశాఖపాకలకంటెను. "ఉళిబేళి" పప్పుచారు మరింత రుచిగానుంటుంది. ఇది అన్నమునకు రొట్టేలకుగూడతోడ్పడుతుంది. ఇందారోగ్యమునకు. రుచికి. పాచకశక్తినీ భివృద్ధిపరుచుటకై సైంధవలవణమునుపయోగింతురు, రొట్టెలను చలువరాతిపై కొట్టిచేయడముచేత, చాలాసన్నముగా నుండును. భోజనమునకై వీనిని వడ్డించునప్పుడు ముక్కలుముక్కలుగా జేసివడ్డింతురు. అన్నమునకు గూడ నదేలవణమునుపయోగింతురు, భోజనానంతరము శ్రీ స్వాముల వారు నన్నొంటరిగా స్వస్థానమునకు రప్పించుకొని నాస్థితిగతులనన్ని టిని అడిగిరి, అందుకు ఈ మొదలె లింగయ్య చెప్పిన విధముగా బోర్డింగుశెక్రటరీ స్వాములవారి యెదుట యేయేవిషయములను జెప్పియుంటిమొ అవేవిషయములను వారితోను జెప్పితిని. "హూ

గోలిగేరి గ్రామము. ఒకనిరుపేద మహేశ్వర కుటుంబమున జన్మించి తిమి. మా తల్లిదండ్రులుభయులు బాల్యముననందే మరణించియున్నారు.

మేము ముగ్గురము ఒకే సోదరులము. మా శైశవము నుండి ఆగ్రామముయొక్క పటేలుగారు తమకు సంతానములేని కారణమున ఈ వరకు వారే తల్లిదండ్రులుగా పోషించియున్నారు. కొంతవరకు విద్యాభ్యాసమును జేయించిరి. ప్రస్తుతములో ఎక్కడికైనావెళ్ళి ఉన్నత విద్యాభ్యాసము జేయవలెనను కోరికతో నిక్కడికివచ్చి యున్నాము. అనినివేదించుకుంటిని. స్వాములవారుగూడ ఇక్కడుండే విద్యార్థులందరు ఆంగ్లము నభ్యసించేవారే ఉన్నారు. నీకవసరమైన విద్యాభ్యాసమిక్కడ జరుగుట దుర్లభమనిరి. అయినను రేపు ఉదయము వరకు ఏదేని విచారించి నీకు చెబుతానని సెలవొసంగిరి. "తథాస్తు" అని నమస్కరించి నావసతికి వచ్చితిని.

ఇదే బోర్డింగులో ఆంగ్లము నభ్యసించే ఒక విద్యార్థిచేతితో అందమైన చిత్రములను (డ్రాయింగు) వ్రాయుచుండెను. వారీవరకు వ్రాసియుంచిన ఛాయాచిత్రములన్నింటిని చూడగానే నేనుగూడ నాచిత్ర కళనభ్యసించాలనే కోరికగలిగినది. వారిసాంగత్యమునుండి వారిప్రేమకు బాత్రుడనైతిని. నానుండి డ్రాయింగును వ్రాయ ప్రారంభించితిని, మొట్టమొదట వంకాయ-బెండకాయ-జామ-మామిడి సీతాఫల పండ్లను, పెన్సిలు, కుర్చి, మేకాబిల్లి, లాంతరు, వగైరాలు వ్రాసితిని. ఈ డ్రాయింగుకు నిదర్శనముగా నేను స్వయంగా వ్రాసిన (గీసిన) కొన్నిటిని యీనాజీవిత చరిత్రలో ప్రకటించాను.

ఆస్వాములవారు మీవిషయములో ఈరాత్రికి ఆలోచించి రేపు ఉదయము చెబుతామని నాకు సెలవువొసఁగియుండిరిగదా! అదే విధముగా ఈదినము ఉదయమే ఆ బోర్డింగుకు సంబంధించిన మొదట మేమురాగానె గలసిన శేక్రట్రి స్వాములవారు వచ్చియుండిరి. వారు వీరుభయులు మావిషయమును గురించి చర్చించినన్ను తమ వద్దకు రప్పించుకొనిరి. నేనువెళ్ళి అ ఉభయ స్వాములకును నమస్కరించితిని. శ్రీ నాగనూరు మహాస్వాములవారు నన్నుద్దేశించి యిట్లాదేశించిరి, ''రాచయ్యా నీవు ఈస్వాములవారివద్ద సేవలో నుండినట్లాతెనీయభిలాష ప్రకారము సంస్కృతము, జ్యోతిష్యము రమలమును వీరునీకు బోధిస్తారు. వీరుకాశీలో వాటినభ్యసించి వచ్చారు. పైమూడు విషయములలోనీవేదినేర్చుకొనదలచావోదాన్ని వీరు తప్పకుండ నీకు బోధించేదరు. దాని వలన నీకోరిన నెరవేరు తుంది. కనుక వీరిసేవలో నీవు ఉండినచో వారివద్ద ఇప్పుడున్న లింగయ్యను నావద్ద సేవలో ఉంచుకుంటానని సెలవిచ్చిరి. అందుకు నేను మంచిదిస్వామి అట్లైగా నిమ్మని సమాధానము చెప్పితిని.

సరే నీ సామాను దీసికొని నావెంట రమ్మని శ్రీ సెక్రటరీ స్వాములవారాజ్ఞాపింపగా నేనట్లై యొనర్చితిని. శ్రీవారు నివసించే గృహమునకు "గౌంబిమఠమని" పేరు వీరిపేరు శ్రీ శిద్ధరామస్వామి యని అక్కడి బస్తీప్రజలుచెప్పుచుండిరి. ఈ మఠమునకు వెనుక నొక విశాలమైన మామిడితోట ఉంది. అందులో పనస, అనానస్, ములుగ, మొదలగు పెద్ద పెద్ద వృక్షములున్నవి. మఠమునకు వెనుక భాగముననున్న చిన్న ద్వారముఎదుటమంచినీళ్ళచేదుడుబావి యొకటుంది. దానిగిలకగూడ ఇంతకు పూర్వములో వివరించినట్లుఒక చరఖావలె

స్టేషన్‌వద్ద మొదట మేముజూచిన బావి గిరకవలె నున్నది. ఆ తోటలో ఒకమూలన పాకిదొడ్డికియితరత్ర నానారకముల పూలచెట్లు మరియు జమ్మివృక్షము, బిల్వవృక్షములు గలవు. ఈరెండును ఒకేచోట గల్సి యున్నవి. వాటికిసమీపములోనే ఒకఎత్తుగాను విశాలముగాను, ఒకవేదిక (అరుగు)ఉంది, దానిపైనొక దేవతా విగ్రహముండుటవలన పెక్కుమంది స్త్రీలు మున్నగు వారక్కడికి వచ్చి ఆ వృక్షములకు, వేదికకు ప్రదక్షిణలు చేసి, పూజ యొసర్చి వెళ్ళుచుండిరి. మరికొందరు స్త్రీలు తమ ఇళ్ళలో వాపిలేనందుకు మంచినీటి బావినుండి నీరు దీసికెళ్ళుచుండిరి. మరికొంతమంది స్వాములవారిని సందర్శించి తమకుండిన గ్రహములబాధలను, అనారోగ్యములను గురించి శ్రీ వారికినివేదించు కొనుచుండిరి. అందుకు వారు రమలములోని ప్రశ్నలను వేసివారికిఁదగినట్లు గాయంత్రమును గట్టిగాని, మంత్రమును వేసిగాని, అథవారోగనివారణకు దగినచికిత్స జేసిగాని పంపుచుండిరి. గృహశాంతినిగూడ జేయించుచుండిరి, ఇదివారి ప్రతినిత్యము ప్రధానవృత్తిగా నుండెను.

పాచికలువేసి సమయమునుజూచి రమలశాస్త్ర సహాయమువలన పృచ్ఛకులకు సమాధానములను జెప్పుచుండిరి. హస్తసాముద్రికను గూడ వీరు జూచుచుండిరి. తాము జ్యోతిష్యము రమల శాస్త్రములో ప్రవీణులమని ఒకపెద్ద బోర్డును బయట మహాద్వారమునకు పైన వ్రాసియుంచిరి, వీరుకాశిలో నభ్యసించి ఆయాయాపరీక్షల్లో నెగ్గినట్టి ప్రమాణపత్రములను (సర్టిఫికెట్లు) తాము నిత్యముగూర్చుండేచోట గోడకు దగిలించియుండిరి. మహాఉత్సవసన్ని వేశాల్లో ప్రత్యేకముగా గూర్చుండుటకై ఒక అందమైన, విలువైన సింహాసనముండినది. కొద్దిమాత్రము ఆంగ్లభాషా పరిచయముగూడ వీరికుండెను. బెళగాంవ్ష

నగరవాసులందరు చాలా మట్టుకు మహారాష్ట్రభాషనే మాట్లాడుచుండిరి. కొందరు మాత్రమె కన్నడభాషను మాట్లాడువారుండిరి. మరికొందరు కన్నడ మరాఠియుభయభాషల్లోను మాట్లాడు చుండిరి. స్వాముల వారికి రెండుభాషలు వచ్చును. ఆగంతుకులతో రెండుభాషల్లోను మాట్లాడుచుండిరి. నేనక్కడనున్న సమయలో 1939 రెండవ ప్రపంచయుద్ధ సమయము ఈ బెళగాంవ్ నగరముధారవాడ జిల్లా కర్నాటక ప్రాంతమునకు జేందియుండెను, తరువాత భాషావారి ప్రాంతీయ విభజన జరిగినప్పుడిది మహారాష్ట్ర ప్రాంతములో జేరినిది. ఈ సమయములోనె బళ్ళారిమొదలు ఆంధ్రప్రాంతమునకు జెంది యుండగా అతరువాత ఇప్పుడు కర్నాటక ప్రాంతమునకుజేరినది.

అట్లేమొదలు బిదరుపట్టణము మెదక్, జిల్లా తెలంగాణాకు జేరియుండేను, ఇప్పుడు కర్నాటకమునకు జేరియుండినది. ఈ మఠాధిపతి మమల్ని వట్టిగా కొద్దిసెపైన విశ్రాంతినొసంగెవారు గాకుండిరి. ఉదయమునుండి మధ్యాహ్నమువరకు బ్రహ్మచారి మఠముగనుక ఇందు "స్త్రీలుండడానికవకాశములేని కారణమున మేమె ఇంట్లో ముంగిట్లోకసు ఊడ్వడము మొదలుకొని పాత్రలు శుభ్రపరచడము". స్వామువారి మైలగుడ్డలనుతకడము, నీరుచేది ఉంచడము స్నానమునకు నీరువెడిజేయడం, పూజకు పత్రి పుష్పములను సంగ్రహించి పెట్టడమె గాకుండ మధ్యాహ్నము మాధుకరము (రొట్టెలభిక్షము) నకై లింగవంతులిండ్లకు వెళ్ళివచ్చేవాడిని. భోజనానంతరము స్వాములవారు ప్రతినిత్యము ఒక అరగంటబోధించే సంస్కృతము. జ్యోతిష్యము యొక్కపాఠములను కంఠస్థము జేయుచుంటిని. మళ్ళి మధ్యాహ్నము రెండు గంటలనుండి వెనుక మామిడితోటలోని చేట్లనుండి రాలిన

ఆకులలములను కసుగూడ్చి శుభ్రపరచాలి. సాయంత్రమా చెట్లకు నీరు బోయాలి. ఇట్టిపనులన్నింటిని మాతోనుచితముగా పనిజేయించు కునెడివాఁడు. ఎన్నాళ్ళనుండో నేపుగాబెరిగియున్నగడ్డి పనికిరాని పొదరులను చేక్కినరకడముతో మాయరచేతుల్లో బొబ్బలు వచ్చు చుండెను. వాటిని జూచెవారెవరు? మాయాశ్రమను జూచి కనికరించే వారెవరు? నా అనెవారే మాకక్కడలేక పోతెను. ఇతరులు జెప్పిన పనిని కాదనకుండ "కుక్కిన పేనులా" చచ్చిచెడి చేయవల్సిందే.

ఒకనాడు తోటలోనిదేవిధముగా పార-గడ్డపారలు చేతబూని పనిజేస్తు ఉండగా "కుంకుం" అనే చలన చిత్రము అమృతమైనది, ప్రసిద్ధనటులిందు నటించారు, మంచిగాను, రసవంతముగానున్నది ప్రేక్షకులనాకట్టుకునే చిత్రమని చాటిచెప్పుచుండగా నదివినన మేము ఇంతకష్టపడి పనిజేస్తున్నాము. కావున నేడు స్వాములవారినడిగి వారివద్ద సినిమాకు గావల్సిన డబ్బుదీసికొని వెళ్ళిచూడవచ్చును, అని ముగ్గురమాలోచించితిమి. మెమాలోచించినమేరకు స్వామిని సినిమా జూచుటకై డబ్బులడుగగా వారు "ఏమి మీరుసినిమాచూస్తారా? శులేవారే పేదవారు చూడగూడదు. వలదని చెప్పిరి, మీగ్రామములో మీరు అన్నమునుభుజించు చుంటిరా"? అని మమ్ము ప్రశ్నించిరి, అదివిని మేము "లే"దండి ప్రతిదినము విడచి యెనమిదిరోజులకొక తడవ గూడ అన్నమును భుజించే అదృష్టము మాకులేకుండెను, ఎప్పుడో ఒకసారి పర్వదినముండిన నాడు మాత్రము దేవుడికినివేదించిన ప్రసాదమును మాకువడ్డించుచుండిరి.

కాని మాకెక్కడిందడి అన్నముభుజించే భాగ్యము అని "అని సమాధానమొసఁగితిమి. వారు మళ్ళి" అల్లాంటి మీరిప్పుడు సినిమాను

చూస్తామంటున్నారు? ఇది మహాతప్పుగాదా! చూడవలదని మాకు నీతిగఱపిరి, నిరుత్తరులమైనిరాశతో ఒకరిమొఖము మరొకరము జూస్తు మరల యధారీతిగా మాజేయుపనిలో మేము నిమగ్నులమైతిమి. అప్పుడప్పుడు మాకును వారికిని అవకాశము జిక్కినప్పుడు మధ్యాహ్నములో జ్యోతిష్యమును జెప్పుచుండిరని యీవరకే వివరించితిని. కానియట్టిపాఠములను నిత్య కర్మలనధికముగా జేయుటవలన కంఠస్థముజేయడము మావల్లగాకుండెను, స్వాములవారు "'మీరు పాఠములను గట్టిజేశారా?" అని వారడగడము మేము చేసితిమని చెప్పడము వారుముందటి పాఠములను జెప్పుతూనే ఉండిరి. మళ్ళీ అడగకుండిరి. ఇట్టి విద్యాబోధనవలన మాకు ఫలితము దక్కినది కాదు, బసవయ్య ఇంగ్లీషున భ్యసించుచుండెను. వాడికిగూడ ప్రయోజనమంతగాలేకుండెను, ఇల్లాగెకొన్ని మాసములు గడిచిపోయెను. ఈ ఇడుముల (కష్టముల)ను భరించలేక బసవయ్య అనువాతఁడు ఒకనాడు మా కెవ్వరికిని జెప్పకుండానె వెళ్ళిపోయాడు. ఆస్వామివారు ఒకమనిషి సైకిలిప్పించి వెదికించెను, గాని యతఁడు దొరక (అగుపించ)నులేదు. మళ్ళీరాలేదు. మరో లింగయ్యను నాగనూరు పెద్ద స్వాములవారు తమ సేవజేయించుకొనుటకు రప్పించుకొనెను.

ఇఁకపోతె నొక్కఁడినె ఈ చిన్నస్వామివద్ద నుండి ఇంటిపని భారమునంతయును నేనే జేయాల్సివచ్చినది. నా మనస్సునకు చాలా బాధగలినది, వచ్చెఅప్పుడు ముగ్గురముగల్సి యెంతోప్రేమతో నిక్కఁడికి వచ్చితిమి. ఇప్పుడు వారిద్దరు వెళ్ళిపోగా నేనొంటరిగా మిగిలిపోయితినే. నేనుగూడ మరల అపక్రమముగా చదవడానికై యాదగిరికి రావాలంచెను, నావద్ద ఒక్కనయా పైసగూడ లేదే? ఏమి

జేయను. అని మనసున మథనపడుతు ఉంటిని, చేయునదిలేక అక్కడే కొన్ని మాసములు ఉండాల్సి వచ్చెను. కొట్టునకు వెళ్ళవల్సినసామగ్రిని కొనితెవడం, నాపాలిటబడెను.

ఒకనాడు ఆదేనగరములో "రాణిబాగు" అనేచోట వస్తు ప్రదర్శనశాలను నాటి బ్రిటిషు సామ్రాజ్యవాదులకు ప్రతినిధిగానుండిన వైస్ గవర్నర్‌గావచ్చి ప్రారంభించారని వింటిని. దాన్ని జూడాలనే కుతూహలము నాలోగలిగినది. ఇంతవరకు ప్రదర్శనశాలను నేను జూడలేదు. అదేట్లుండునో నాకు దేలియదుగూడ. అందుచేత స్వామిని విచారించితిని. వారు దాని టికిటునుగొనే అంత డబ్బును మాత్రమే ఇచ్చివెళ్ళి చూచిరమ్మనిరి. రెండణాలిచ్చి టికిటునుగొని లోనికివెళ్ళితిని. అందులో చాలా చిత్రవిచిత్రములైన వస్తుసామగ్రియుండెను. నేనింత వరకు చూచియెరుగని వస్తువులుండెను. రకరకాల జంతువులు. పండ్లు, సేద్యపద్ధతి, విద్యుత్ యంత్రసామగ్రి, వస్త్రాలయములు, ఆట వస్తువులు. మల్లయుద్ధములు, నాటక-సంగీత-ప్రదర్శనలు, మంచిగా పోతరించిన (బల్సిన) ఎద్దులు, గుఱ్ఱాలుండినవి. విదేశి, స్వదేశి వస్తువులతో నిండియుండెను. అదిజూచి చాలా ఆనందించితిని. మరోసారి గూడ స్వామివారు వేరేగ్రామమునకు వెళ్ళియున్నప్పుడు ఒంటరిగానుండి ప్రొద్దుపోక కాలక్షేపమునకై వెళ్ళిచూచివచ్చితిని.

ప్రతిదినము గృహకృత్యములను దీర్చుకొని కంతిభిక్ష (రొట్టెల భిక్ష)కై వీరశైవ భక్తులిండ్లకు వెళ్ళుచుంటిని. మఠానికి దిరిగివచ్చి స్వామి, నేను భుజించగా మిగిలినవాటిని ఒక అరుగుపైన దర్భాసనము బరచి యెండబెట్టి, మళ్ళీ వాటినే దినుచుంటిమి. ఆభాకరీ

(రొట్టె)లు (ఇది మరాఠీపేరు) సన్నగా, రుచిగా, అనగా మన ప్రాంత ముననుండు అప్పడాలవలె నుండుటచేత నివిచేడిపోకుండ ఉంది యెండ బెట్టిన యెడల దినుటకు యోగ్యముగా నుండేవి. వీటికిదోడు నానారుచి కరములైన శాఖపాకముల నీడుచుండిరి.

ఈ సందర్భములో ఒక విచిత్రమైన సంఘటనము జరిగినది. ప్రతిదినము నేను యథారీతిగా మధ్యాహ్నము మాధుకరమునకై (కంతి భిక్షకై) గ్రామము, నగరము (వీది, బస్తి)లోకి వెళ్ళితిని. అక్కడ ఒక గృహస్థుని ఇంట్లోకివెళ్ళి "శివకంతిభిక్షా" అని శబ్దమును చేయ గానే ఆయింటి యజమాని క్రోధావేశముతోవచ్చి, రేపటినుండి మా యింటికి రావలదని గట్టిగా మందలించెను. అందుకు నేను ఎందుకు నాయనా! మీరంతగా ఆవేశముతో జెప్పుతున్నారు, అందుకు నేనొర్చిన తప్పేమిటని విచారించితిని. అదివిని మరియావేశముతో వెళ్ళు అదేమి అడుగనక్కరలేదని హెచ్చరించెను.

అందువారియావేశమునకు గారణమేమని మఠమునకు దిరిగివచ్చి యాలోచించగా చివరికి దేలినదేమగా వారియింటికి నేను వెళ్ళిన సమయములో ఒక అతిథి వారియింట్లో ఉండెను. అతడాకొనియేదో మఠమునకు వెళ్ళియుండెను. అక్కడాతనికామఠములోని వారు భోజనమును జేయించలేదు. ఆవ్యక్తి ఆభక్తునింటినివెళ్ళి, యీసంగతి విన్నవించియుంటాడు. సరే మా ఇంట్లో భోజనము జేయుడని, తన ఇంట్లో నాతనిని గూర్చొబెట్టియున్నాడు. వారికి మఠములో భోజనము జేయించలేదు. ఈ మాధుకరము దీసికెళ్ళినవారు తాము భుజించడమే గాకుండ మఠానికి ఆకొని వచ్చిన అతిథులకు గూడ వడ్డించి తృప్తి

పరచాలి. ఇది యామాధుకరము (భిక్షము) యొక్క ఆశయముంది. కాని ఆ ఆకొనిన వ్యక్తి నేనుండిన మఠమునకు రాలేదు. వేరొక మఠమునకు వెళ్ళియుంటాడు. వారు వీరిని నిరాశగాబంపించియుంటారు. ఇది యాగృహస్థుని యాగ్రహమునకు మూలకారణముగా గ్రహించితిని. ఐనను నా మనస్సు చాలా బాధకులోనై మధనపడుచుండెను. దానికి నేను బాధ్యుడను గాకపోయినను నేనిలావ్యక్తి ఆగ్రహమునకు గురియైతిని గదా! యని బహుచింతాగ్రస్తుడనైయుంటిని. ఈనా దురవస్థ వాలకమును పసిగట్టిన స్వామి "ఏమి రాచయ్యా! నేడు చాల విచార గ్రస్తుడవైయునాడవని" ప్రశ్నించిరి.

అందుకు మొదలు నేను ఏమియులేదని దాటవైచితిని. గాని స్వామి మరిమరి గ్రుచ్చి గ్రుచ్చి యడుగగా, భక్తునింట్లో నాకు జరిగిన యవమానమును వారికి వివరించితిని. అది వినివారు అతనింట్లో గేదే, ఆవు, మున్నగు జంతువులున్నవా? అని ప్రశ్నించిరి. యెందులకని మరల ప్రశ్నించితిని. వాటి కేదైన కీడొనర్చినచో వాడికి బుద్ధివస్తుదని నాతో జెప్పెను.

అందుకు నామనస్సంగీకరించలేదు. వాడు మూర్ఖుడైనాడని మనము మూర్ఖత్వమునకు తలపడిన ఇక వాడికి మనకిగల భేదమేమిటి? అప్పుడుభయులము సమానులమే గదా! మానవుడికి వివేకముండాలి. అది లేనివాడు పశువనబడును. అందున వాడు జేసిన పొరపాటుకు నోరులేని పశవునకు కీడొనర్చిన ప్రయోజనమేమిటి? అని వలదంటిని. అందుకు వారంగీకరించి ఊరకుండిరి. ఏలనన వారికిరముల విద్య వచ్చును గనుగ నేదైన కీడుదల పెట్టుచుండిరి. కాని నేను నివా-

రించితిని. నాటినుండి నన్ను కోపగించిన భక్తుని గృహమునకు వెళ్ళడము మానుకుంటిని,

ప్రతిదినము మండుటెండలో దిగువసీమెంటు రోడ్డుపై వట్టి కాళ్ళతో నడవడముచేత కాళ్ళకు చురుకంటుకోవడము మధ్యాందిన మార్తండుని మండుచున్న కిరణములచేత మస్తకము మలమల మాడి వేడెక్కుచుండెను, ఇట్టి ఘోరమైన నాదురవస్థను గాంచిన ఒక అనన్య శివభక్తురాలైన బెంబళిగి సంగమ్మ అనే తల్లిగారు నాపైన కరుణించి "స్వామి మీరుదయజేసి బుధ-సోమ వారములందు మా గృహమునకు వచ్చి భోజనముజేసి వెళ్ళవల్సిందిగా" విన్నవించెను, అందుకు "తథాస్తు" అని యంగీకరించి యామెకోరిక మేరకు భిక్షాటన జేయుటను ముగించుకొని చివరికి వారింటికి వెళ్ళిభోజనముజేసి మఠమునకుదిరిగి వచ్చెవాడిని, వీరు అగర్భ శ్రీమంతులని ఆనగరమున పేరుబొందినవారై యుండిరి, ఆచార విచారములు మహేశ్వరులయందు ఖండమైన భక్తి విశ్వాసములుగలవారు, ప్రతిసం॥మునకొక తూరి (సారి) గణారాధన గావించుచుండిరి.

ఆయమ్మ విధవరాలు ప్రతిదినము రేయింబవళ్ళు రెండుపూటలు స్నానము ఇష్టలింగార్చనలేనిదె భుజించకుండెను, కనుక నేను వారింటికి వెళ్ళడము కొద్దిగ ఆలస్యమైనను నాకొరకు ప్రత్యేకించి కూర్చుండుటకు ఒక పెద్దకట్టపీఠ వెనుకకుఒరిగికూర్చుండుటకు మరోపీఠను గోడకు ఒరగించిపెట్టి ముందొక ఇత్తడి అడ్డిణిగె (ముక్కాలిపీట) దానిపై తెల్లని స్వచ్ఛమైన సిల్వర్ కంచము ఆప్రక్కనే మంచినీటితోనింపి పైన స్టీలుగ్లాసుమూసియుంచేవారు. నా కుడిప్రక్కన ఆయమ్మగారి ఆసనము, ఎడమ ప్రక్కన ఆమెకుమారుల

ఆసనములను సిద్ధపరచుకొని నారాకకై నిరీక్షిస్తుగూర్చిండెడివారు. నేను వెళ్ళగానె పాద ప్రక్షాళనమునకై చెంబుతో నీరొసంగియుండేది. నేను భిక్షాటనవలన సంగ్రహించి దెచ్చినరొట్టెలజోలెను ఒక ప్రక్కన గోడకు ఒదిగించియుంచి భోజనమునకుకూర్చుండెవాడిని, భోజనము తరువాత కొద్దిసేపుగూర్చుండుమనిచెప్పి వక్కలాకులిచ్చి పంపించు చుండెను.

ఇట్టి వారింట్లో ఒక చిత్రముజరిగినది. మండువేసవి సమయమది. మిట్టమధ్యాహ్నము భరించరాని వేడివలన దాహము పీడించుచుండెను. భిక్షాచర్య పూర్తిఅవగానే శ్రీమతి బెంబళిగె భక్తురాలింటికి వచ్చితిని, వారునేను, వెళ్ళడముతోనే యధారీతిగా కాళ్ళకు నీళ్ళిచ్చి కూర్చుండ బెట్టి నాకంచములో వండిన వంటకములను వడ్డించిరి, నేను ఒకరెండు బుక్కలుదినగానే దాహమధికమగుటవలన తొందరపాటుతో ప్రక్కనే యుండిననీటిగ్లాసునునోకానించియెడమచేతత్రాగితిని,ఇదిజూచినయామెనా ప్రక్కనేగూర్చుండి యుండెను. కోపముతో మండి పడుతు "ఏమిది యనాచారము? మీరు జంగములేనా? ఒకవేళ్ళ నీకు పైనుండి నీరు త్రాగె అభ్యాసములేని చోనోటి కానించి త్రాగవలెననిన కుడివెంగిలి చేత నీరు త్రాగవలేను. గాని ఎడమచేతితో త్రాగుట యసభ్యకరము ఆచెయ్యిగూడ వెంగిలియయ్యేను, దాన్ని ముందుగడుగుమని మరో ఒక పాత్రను దెప్పించి తాను నీరు బోయగా కడుగుకుంటిని, ఇంక ముందెప్పుడుగూడ అట్లా ఆరీతిగా చేయగూడదని హెచ్చరించినది.

నేనాయమ్మఆవేశపూరిత మైన మాటలువిని నిశ్చేదుడనై నిరుత్తరుడనైతిని, నేను మనదేశములోని పద్ధతి ననుసరించి

అభ్యాసముతీరుగాయేమరు పాటుతోనట్లు తొందరపాటువలనజేసితిని. దాని ఫలితమియ్యది. ఒక్కొక్క ప్రాంతముయొక్క ఆచార విచారములు వేర్వేరు గానుండును. నాగరికతలుగూడ వేర్వేరుగానుండునని దేశ పర్యటనపలన దేలియవచ్చినది. నేనుగూడ అక్కడి ఆచార విచారములను, నాగరికతను మొట్టమొదలు వారినిజూడగానే నేన దేవిధముగాననుకరించుచుంటిని. ఏదియెమైనప్పటికిన్ని అక్కడి ఆచారవిచారములు నాకుచాలా నచ్చినవి. అక్కడి (కర్నాటక మహా రాష్ట్ర ప్రాంతములలోని) మనవీరశైవులఘనత, అభిమానము, ఆచార విచారములు సాహిత్య-సంస్కృతులు నాగరికతలనుచూడగానే వారి ప్రత్యేకమైన విశిష్టత ప్రతిబింబించుచుండును, వీరి యాచార విచారములనే అక్కడ ఇతరమతీయులాదర్శముగా నిడు కొని యాచరింతురు. ఇదివారిలోనుండే విశేషము, కావున నచట వీరశైవధర్మము అందరికి అత్యంత గౌరవమునకు పాత్రమైనది, దైవభక్తికి పెట్టినది పేరు. సమస్తమానవుల పరస్పర ప్రేమానురాగములు, సౌహార్ద్రత ప్రతివారు మెచ్చుకునేవిగానున్నవి. విద్యయందును, ధైర్యసాహసములందును దైవభక్తి విశ్వాసము లందును స్త్రీ పురుషులు సమాన యోగ్యతగలవారుగానుండిరి. ఒకందుకు బరిశీలించిన పురుషులకంటెను స్త్రీలె ముందడుగు వేసి యుండిరనదగును కుడియెడమలఅంతరముమాదిరి.

కాని మన అలనాటి నిజాంప్రాంతములోని కొందరిలాగ ఇతరులను వంచించుట, కృపణత్వము, నిర్దాక్షిణ్యతలతోగూడి యున్నవారక్కడ నాదృష్టిలో తక్కువే యని చెప్పవచ్చును, స్వాములవారు ప్రతిదినము తమవద్దకువచ్చె జనులకు ప్రశ్నలువేసి రాబట్టె ప్రశ్నోత్తరములను, యంత్రమంత్రములనూ చేయుపద్ధతిని నేను

వారి సహవాసములోనుండుటవలన నేనుగూడ కొద్దికొద్దిగా జ్యోతిష్యము నేర్చుకుంటిని స్వాముల వారింట్లో లెనప్పుడు ఆగంతకులను నేను పృచ్ఛించి (అడిగి లేదా ప్రశ్నలువేసి) వారిహృద్గతాశయములను, సందిగ్ధ విషయములను దెలసికొనుచుంటిని. ఇక్కడకొంత వరకు లౌకిక పరిజ్ఞానమే మిగులఅవసరముగాని, అధికపాండిత్యప్రకర్షము అక్కరలేదు, బుద్ధికుశలత, నేర్పుముఖ్యమని నేను గ్రహించగలిగితిని. ఇంతవరకక్కడుండి కొంతవరకు (అనగా వ్యవహారమున కవసరమ య్యెంతవరకు) జ్యోతిష్యము, రాసి, కూటములు, గణ, యోని కూటముల నభ్యసించియుంటిని, మరాఠిభాషాకూడ అక్కడిజనులనిత్య సంసర్గమువలన అలవడినది. ఇట్లుండగా మా మఠమునకు చుట్టు ప్రక్కల (ఇరుగు-పొరుగు)వారి పరిచయము అధికమయ్యెను, నేను వారితో మరాఠిభాషలో తప్పో - ఒప్పో మాట్లాడుచుంటిని, మనిషియే ప్రాంతములో ఎక్కువగానివసిస్తాడో ఆక్కడి ప్రాంతీయభాషా నిత్యము జనుల సహవాస ప్రభాముచేత సునాయాసముగా నలవడుతుంది. దానికై ప్రత్యేకమైన శ్రద్ధ-శ్రమలక్కరలేవు. అందుకనే కర్నాటకములో నుండి కన్నడభాషను నేర్చుకొనుటేగాకుండ కొన్ని పరీక్షలు మద్రాసుయునివర్సిటికి సంబంధించిన కన్నడ బి. విద్వాన్ ప్రవేశ పరీక్షను వ్రాసి అందునెగ్గియున్నాను.

అట్లె కన్నడ సాహిత్యపరిషత్తు బేంగళూరుకు సంబంధించిన "జాణ" పరీక్షలోను నెగ్గియున్నాను. అలానే అప్రయత్నముగా బెళగాంవ్‌ములోనుండగా మరాఠిభాషాకూడ కాస్త మాట్లాడనేర్చాను, అట్లె అంగ్లదేశ నివాసియైనప్పుడాభాషనుగూడ సులభముగా మాట్లాడ వచ్చును. వ్రాయనువచ్చును, కనుక పరిసరప్రభావమే ఇందుకు

హేతువు ఇక్కడున్నప్పుడు బాలకృష్ణుడనే పిల్లవాడితో నాకుచాలా పరిచయముమేర్పడినది. మీదు మిక్కిలి మైత్రిగూడ యేర్పడినది. ఇతడు ఇంగ్లీషుస్కూల్లో విద్యనభ్యసించుచుండెను, ఈతను (డ్రాయింగు) చిత్రములను వ్రాయుటలోను, వాటికిఁదగినరంగులు (పేంటింగు) వేయుటలోను మిక్కిలనేర్పుగలవాఁడు, అందుచేత నేను ఆతని సావాసములోనుండి కొంత డ్రాయింగును వ్రాయదము నేర్చుకుంటిని.

ఇంతలో శ్రీ స్వాములవారి సోదరి తనగ్రామమునుండి అక్కడికి వచ్చియుండెను. ఈ మెకు ముగ్గురు కూతుళ్ళుండిరి. వారు పిన్నవయస్కులు, ఈమె ఏకాక్షిఒంటికన్నుగలది (గ్రుడ్డిది), వచ్చి రావడముతో నామెనన్ను "మీదే గ్రామమని విచారించినది, అందుకు నేను మిగత వారికివరకు జెప్పినట్లుగానే" మాదిగోలిగేరి. యని చేప్పడముతో నామే అక్కడ మా గ్రామములోని వారికి బంధువులున్నారు. మీకు వారుతేలుసా? యని ప్రశ్నించినది. దానికి నేనేమని సమాధానము చేప్పాలి? అని కొద్దిసేపు (ఒకక్షణము) ఊరకుండి, ఆలోచించి నిరుత్తరుండనై యీ మెతో దాచకుండ వాస్తవవిషయమును జెప్పకతప్పదనిపించేను, ఉన్నదున్నట్లుచెప్పాలి. అనుకొని "అమ్మా! నేను మొదటమీకు పొరపాటున అట్లాజెప్పాను, మన్నించగలరు. వాస్తవవిషయమును మీకిప్పుడు చేప్పవల్సివచ్చినది, కావున వినండని" మాదినిజమైననివాసము హైదరాబాదు ప్రాంతము, (నైజామురాష్ట్రము) అందు సదాశివపేటమాసొంత గ్రామము అనిచెప్పి, అవుతెమేమిక్కడికి వచ్చినమొదట్లో మీసోదరులైన స్వాములవారితో గ్రామముయొక్క పేరును మార్చి "గోలిగేరి"యనిచెప్పాము, అలా ఎందుకుచేప్పామంటె,

మేముక్రొత్తగానిక్కడికివచ్చిన సమయములో స్వాములవారు మాకాశ్రయమివ్వనందులకు మేమలా చెప్పవల్సివచ్చినది.

ఆకారణమున మీరుగూడ మాయందు దయదలచి మీబిడ్డలనుగా మమ్ము భావించి యితరులతో నెమియుచెప్పకుండ కొంత సమయము వరకు మీ మనస్సులోనే ఉంచండి, యని యర్థించితిని; అట్లైనప్పుడో కానిమ్మని ఆమె మాకుహామిఇచ్చెను. "విపత్తులందరిని వెంటాడుతూనె ఉంటవి, కనుక ఈ విషయమునిక నెవ్వరితోను జెప్పను. అనెను!" ఆమెకు నాయందధిక ప్రేమయుండెను, కావున ఆమెరావడముతో నాకు ఇంటి పనిజేయుట కొంత పనిభారము తగ్గినది.

ఈ మఠమునకు చుట్టుప్రక్కల నున్న ఇండ్లవారందరు మంచి నీటిని మాతోటలోనున్న బావినుండే దీసికెళ్ళేవారు. మఠమునకు చేరువలోనె ఒక పండిత్‌జీ గృహముండేది. ఇతడికియిద్దరు కుమార్తెలు ఒక్క కుమారుడు మాత్రముండిరి, పండిత్‌జీగారప్పుడప్పుడు వచ్చి స్వాములవారితో మాట్లాడుచుండిరి, వీరితోబాటు, స్వర్ణకారుడు అనంత రాములను నాతఁడు స్వాములవారికి మిక్కిలిస్నేహితుడు. ఈవరకే పేర్కొనియున్న బాలకృష్ణుని తండ్రిగూడ, అక్కడికివచ్చిమాట్లాడు చుండెను. ఒకొక్కప్పుడు ఫ్రీబోర్డింగు విద్యార్థులుగూడ ఇక్కడికి వచ్చి స్వాములవారితో సంస్కృత పాఠములను జెప్పించుకొనుచుండిరి.

ఈ పండితజీ బిడ్డలు మంచినీటికొరకువచ్చి తోటలోమంచిగా వికసించిన పుష్పములను నేను జూడనప్పుడు గోసుకొని పోవడము. మామిడిచెట్లక్రింద దాగుడుమూతలు, మరెవేవో ఆటలాడుతు బాగా

అల్లరిజేసెవారు, స్వాములవారు శివపూజలోనున్న సందర్భమునుగూడ వీరులక్ష్యపెట్టకుండ ఆడేవారు. వారు అదివిని ఆపిల్లల్ని బయటికివెళ్ళ గొట్టి (దీసి) తలుపులుబెట్టుమని అజ్ఞాపించేవారు. నేనెంతగా గద్దించి బయటకు బంపించినను. మళ్ళీ మళ్ళీవచ్చి గోలజేస్తు పీడించేవారు. ఇదే విధముగా మరో అమ్మాయి నాకుమరాఠిభాషా రాదనితెల్సి గూడ నేను ఆమేకు అగుపడినతోడనె "మాయామాయా" అని అరచేది. అందుకు నేనెమియు బదులుచెప్పకుండ తలను వంచుకొనినాపనినినేను జూచుకొనెడివాడిని, పునః వారివైపు తలెత్తిగూడ జూడకుంటిని. ఇది పరదేశము, ఇక్కడ మనవారేవ్వరునులేరు, ఇంతదవ్వుననుండి నందులకు. మంచివాడననిపించుకొని వెళ్ళాలి. అనేవాక్యమెల్లప్పుడు నాహృదయమున స్పందించుచుండెను, అందుగురించి నేనెవ్వరితో నధిక ప్రసంగము జేయక మితముగానెంతవసరమో అంతగానే మాట్లాడు చుంటిని.

నేను స్థానికములోనివసించుట వలన స్థానిక వీరశైవ భక్తులు తమగృహాల్లో జరిగె శుభాశుభ కార్యములకు నన్నే దొళ్కొళ్ళుచుండిరి. తమదేవగృహములోని వేదిక (జగిలి)పై గూర్చుండబెట్టి పాద ప్రక్షాళనమొనర్చి, (ధూళిపాదోదకము) పిదప క్రియాపదోదకమొనర్చి తత్తీర్థ ప్రసాదములను భక్తితో సేవించుచుండిరి, భక్తులిచ్చెహక్కు బావతు. దక్షిణదెచ్చి శ్రీ స్వాములవారికిచ్చెవాడిని. వారుగూడ నన్ను తమ ఆత్మీయుడిగా జూచుకొనుచుండిరి. తాము గ్రామాంతరమునకు వెళ్ళినప్పుడు ఇంటిభారమంతయు నాపైయుంచి వెళ్ళెవారు.

ఒకనాడు శ్రీ స్వాములవారు విహారార్థమునకై ఆనగరమునకు సమీపములోనున్న రామేశ్వరాలయమునకు సాహిత్య సామగ్రి ఉప

కళణము (వంటజేయుపాత్రలతో)లతో మిత్రులతోబాటు (అవుసలి స్వర్ణకారుడు దుర్గయ్యతో)ఆమందిరమునకువెళ్ళితిమి. అది వేసవికాలము. అక్కడి ప్రదేశముచాలా చల్లగాను,పవిత్రమైనదిగాను, చేట్లుచెమలతోను, జలపాతముతోను,గూడియుంటవలన అదృశ్యములు మిక్కిలిఅందముగా నగుపడుచుండెను, అక్కడి కరుగుదెంచిన భక్తుల హృదయములనాకట్టు కొనుచుండెను. జలపాతప్రవాహముఁలో స్నానమునుజేసి, మడిగుడ్డలను ధనదాల్చి, సంక్షిప్తముగాలింగార్చన యొనర్చి, వంటకములను సిద్ధపరచితిమి. బిరియాని, పరమాన్నము, వాటికిఁదగిన వ్యంజనములను సిద్ధగించితిమి. తరువాత మధ్యాహ్న సమయాములో మిత్రులతో సహఆనందముగా భుజించి కొంతకాలముగున్నమామిడిచెట్లయొక్క చల్లనిఛాయలో విశ్రాంతినిగైకొని. ఏదో కొంత సేపు వినోదపు సంభాషణలు, ఆటపాటలచేత కాలక్షేపముగావించి. సాయంత్రము అయిదుగం.కు ఆపవిత్రస్థానమునుండి బయలుదేరి రాత్రి సుమారు పదిగం.కు ఇల్లు జేరుకుంటిమి. ప్రతిదినము మల్లె నేను జేయునిత్య కర్మలను దీర్చుకొని, శేషసమయములో మఠముయొక్క వేనుక భాగములో బావి అరుగుపైన (వేదికపై) గూర్చుండి. స్వాములవారింత వరకు బోధించిన జ్యోతిష్యము సంస్కృత పాఠములను వల్లించు చుంటిని. అదివిసుగు రావడముతో కొద్దిసమయం డ్రాయింగు (చిత్ర పటముల)ను వ్రాస్తుఉండేవాడిని, ఈవిధముగా కొన్ని మాసములుగడచి పోగా, ఒకదినముయథారీతిగా సాయంకాలమున శ్రీ స్వాములవారు వాహ్యాళికొరకువెళ్ళియుండగా ఇంట్లో ఒకడినేగూర్చుని ఉంటిని, నేను కొంతసమయమును వెలిబుచ్చుటకై బహిర్ద్వారమునందుగూర్చుండిరాత్రి వెన్నెలవలెప్రకాశించుచున్నమఠమునకెదుటిరొడ్డునకు ఇరువైపులవెలుగు చుండిన వీథి విద్యుద్దీపాల వేలుతురులో దిరుగు చుండెడు జనులను

చూస్తు మౌనముగానుండెడి వాడిని, ప్రతిదినము సాయంత్రమదే మార్గముగుండా నవయువతులైన కాలేజి విద్యార్థినులు ముఖమునకు పౌడరువేసికొని, నుదుట తిలకముదిద్దుకొని, రెండు జడలతోగూడికొని, కాళ్ళకుచేప్పులు, చంకలో పాఠ్యపుస్తకములబ్యాగు నిడుకొని సరదాగా ముచ్చటిస్తుసంగీత కళాశాలనుండి సైకిళ్ళపైనదిరిగివచ్చె విద్యార్థినులను జూచి నాలోనేనీవిధముగా మనస్సులో వాపోవుచుంటిని, "నేను పురుషుడనైయుండియు, విద్యనభ్యసించునెపమున ఇచటికివచ్చితిని, కానియిక్కడికి వచ్చిన బిదవనేనుచేయుచున్న పనేమిటి? నాలక్ష్యమునకు నీరువదలి ఒక అబలవలే (స్త్రీవలె) నిత్యము గృహకృత్యములనే యొనర్చుట నాకు సిగ్గుచేటుగాదోచినది. "ఛేఛే" నాజన్మకుధిఃక్కారము అనే విచారము నాహృదయములో వ్యసనమను బీజావాపనము జరిగినది, ఆదినము రాత్రి ఈ విచారముతో నాకు నిద్రరాలేదు, ఏమిజేయాలి?

ఈనాసంకల్పము తప్పకుండ నెరవేరుటెట్లు? ఈ మఠమునిప్పుడు వదలివెళ్ళిన మళ్ళి నాకాశ్రయమునిచ్చువారెవరు? పరదేశమియ్యది? ఈ స్థానమును వదలనిచో నా లక్ష్యమును సాధించుటెట్లు? ఈ రీతిగా నానావిచారములు నాతలలో సముద్రములోని తరంగాలమాదిరి ఉవ్వెత్తుగానెగుర నారంభించెను. ఏమియేకానిండుగాక, ఈ స్వాములవారికి నావాస్తవ విషయములను వివరించి, యీ యజ్ఞాతవాసమునుండి దప్పుకోవాలి. ఈ స్థానమును వీడినాయుద్దిశ్యమునకనుకూలమైన మరో స్థానము నాశ్రయించాలి.

ఏ విధముగానైన ఇంతదూరము వచ్చినందుకునాయుద్దిశ్యమును నెరవేర్చుకొనాలి. అనే నిర్ణయమునకు వచ్చితిని. "వీరశైవ స్త్రీ

బోర్డింగు'లో విద్యార్థులకు పాకమును (వంటచేయు) బాళప్ప అను భక్తుడు అప్పుడప్పుడీమఠమునకు వచ్చివెళ్ళేవాడు. ఆతనికి నావాస్తవ విషయమును దెలియపరచాను. "నాయనా! ఇకముందిక్కడ నేనుండుటకు నాకుసరిపడకున్నది. నేనింకెక్కడికైనా వేరెచోటునకువెళ్ళి నాకనుకూలమున్న స్థానములో నెలకొని, నా విద్యాభ్యాసమునకై పాటుబడాలని ఉంది. ఈ నిజమైన నా ఉద్దేశమును వీరశైవ బోర్డింగు సంస్థాపకులైన శ్రీ నాగనూరు బ్రహన్మఠాధ్యక్షులైన స్వాములవారికి నివేదించవల్సిందిగా చెప్పాను. సరే అట్లే అని సమ్మతించెను.

ఒకదినము నాగనూరు మహాస్వాములవారు ఒక బోర్డింగు విద్యార్థిచేత తమ సన్నిధికి నన్నురప్పించుకొని నావాస్తవ విషయముల నన్నింటిని గురించి విచారించిరి. "రాచయ్యా మీది నిజమైన గ్రామమేది? మీకు తల్లిదండ్రులున్నారా? లేరా?" అను వివరములను నీవు నాయెదుట నిర్భయముగా జెప్పమని యాదేశించిరి. అందుకు నేను అంగీకరించి, "మాది నైజాంస్టేటు, సదాశివపేట గ్రామము. మాకు నిజముగా తల్లి దండ్రులున్నారు. మేము విద్యనభ్యసించాలనే కుతూహలముతో నిక్కడికివచ్చియున్నాము." అట్టి మా ఉద్దేశ్యమును మీరే పూరయించగలరని నాకు పరిపూర్ణ విశ్వాసముంది.

అందుకు స్వాములవారు చిరునవ్వుతో "రాచయ్యా! ఈమొదలే మీవాస్తవ విషయమును చెప్పకుండా దాచియుంచిన కారణము?" అని ప్రశ్నించగా. అప్పుడు నేను "పూజ్యులైన స్వామిగారు!" మీరిక్కడ ఉండుటకు స్థానములేదు. మీరెక్కడికైన వెళ్ళాల్సినదిగా నాదేశించడము చేత అప్పుడు మావద్దతిరిగి వెళ్ళడానికి డబ్బు లేకుండినది. అందుచేత

మేమప్పుడల్లా చెప్పవల్సివచ్చెను. సరే మీరిక్కడ ఇప్పుడుండుట-కిష్టపడకుండుటకు కారణమేమని అడిగిరి.

అందుకు నేను స్వామి? ఇక్కడ ఉదయము నుండి సాయంత్రం వరకు గృహకృత్యముల నొనర్చుటలోనే కాలక్షేపము జరుగుచున్నది. విద్యనభ్యసించుటకెంత మాత్రమవకాశము లేదు. అంచేత వేరెచోటకేగి నావిద్యాభ్యాసమును క్రమముగా జరుపు కొనదలచాను. స్వామి అంతదూరము నుండి యింతదూరమువచ్చి వట్టిగ వెళ్ళుట మంచిది గాదుగదా! అని నివేదించుకుంటిని. అంత శ్రీ స్వాముల వారు కొద్దిసేపు ఆలోచించి నేనునిన్ను మరోచోటికి బంబించెదను, అక్కడ ఆస్వామివద్ద కొద్దిగానే పనియుంటుంది. ఉంటవామరి అక్కడ? అనిరి, మంచిది స్వామితప్పకుండా నేను అక్కడుంటాను, అని చెబుతు, కాని నాకక్కడికి వెళ్ళుటకుగూడ నాచేతిలో డబ్బు ఏమాత్రములేదు. స్వామియని మనవిజేసికొంటిని, సరే అక్కడికి వెళ్ళడానికి డబ్బునేనిచ్చెదను, ఆదిజిల్లానగరము ఇక్కడికి సమీపము లోనే ఉందనియు, అక్కడికి కేవలము అర్ధరూపాయి మాత్రమే బస్సుచార్జి ఉందనియు, మరియు నీ వక్కడివెళ్ళెస్థానముయొక్క చిరునామానుగూడ వ్రాసి ఇచ్చెదనని యాదేశించి అట్లొనర్చిరి, నీవక్కడికియెన్నడు-ఎప్పుడువెళ్తావని అడుగగా, నేను. రేపు ఉదయమే వెళ్తానని చెప్పితిని. శ్రీ వారు "ఉదయము ఎనమిది గంటకే ఇక్కడినుండి బస్సు ఉంది. అందుకు అంతకుముందే రావల్సిందిగా చెప్పిరి". సరే అని నమస్కరించవెళ్ళాను.

అరాత్రి గొంబిమఠము శ్రీ సిద్ధరామస్వామి వారిసోదరితో అమ్మా!నేను స్వగ్రామమునకు వెళ్ళుచున్నాను. అని స్పష్టముగా

చెప్పితిని. అదివిని ఆయమ్మగారు ఎందులకు? నీవెక్కడికివేళ్తావు? ఇక్కడి నీకేమి కొరతవాటిల్లినది, నీకుకావల్సినది సంస్కృతము, నభ్యసించుటకు మాసోదరుడు శ్రీస్వాములవారు బోధించుటకు సిద్ధముగానున్నారుగదా? నీపై వారికి చాలావిశ్వాసముంది, అందుకని యీమఠమునేనీకప్పగించి యున్నారు. నిన్నుమేము ఆత్మీయుడిగా భావించాము. మాబంధు వర్గములో నీవొకడివి, అనుకున్నాము, కావున నీవిట్టి పరిస్థితిలో ఇక్కడినుండి వేళ్ళిపోవుట అంత సమంజసమైనదిగాదనెను, అదివిని నేనిక్కడికివచ్చి ఒక సం॥ముగడిచినది, అందుకు నాలో మాతల్లి దండ్రులను, బంధువులను దర్శించాలనే కోరికగలిగినది. అద్దానికి మీరుకాదనకుండ అంగీకరించాలి, ఆయమ్మసరే ఇఁక నీఇష్టము. నేను చెప్పదగినది నీతోజెప్పాను అనెను.

అప్పటికి రాత్రి పదిగంటలసమయము. శ్రీ స్వాములవారు వారిసోదరి మరియు వారి మిత్రులైన అనంతరాము అనునాతఁడు నేను ఒక వసార (పడసాల)లోగూర్చుండిన సమయములో స్వాముల వారిసోదరిగారు తనసోదరునితో "రాచయ్య తనగ్రామమునకు రేపువెళ్ళుతానంటున్నాడని తెల్పెను" స్వాములవారు ఒకేసారి ఆశ్చర్య ముతో ఎందుకు వెళ్ళుచున్నాడు. అతనికిక్కడేమి కొరతయేర్పడనది? ఇంతవరకు నేనాతనిని మనఆత్మీయుడిగా విశ్వసించాను. అనిరి. అందుకామే అతనిది హైద్రాబాదు ప్రాంతములో సదాశివపేట గ్రామమని, అక్కడ ఆతని తల్లిదండ్రులున్నారనియు, వారిని చూడాలని అతనికి వారిపై మనస్సులాగుతుందనియు, అందుకోసము అతడు వెళ్ళదలచాడని స్పష్టముగా చెప్పెను, ఈమాటను వినగానే నాలోగూడ కొద్దిగాదిగులేర్పడినది. స్వాములవారు కొద్దిగా ఆవేశముతో

"నేనుగూడ వీరేదో ఒకమార్పుతో ఇక్కడున్నారని గుర్తించి (ఊహించుకొని) నేనువీరునాతో మొదలుచెప్పినట్లుగా వీరిగ్రామమునకు ఒకలేఖ (పత్రము)ను వ్రాసియున్నాను, కాని దానికింతరకెలాంటి సమాధానము రాలేదు. కనుక నేనెప్పుడో వీరిసంగతిని పసిగట్టానని" చెప్పిరి, ఐనను సరే ఇప్పటికైనను మేము నిన్ను ఆత్మబంధువుడిగా భావించాము. నీకేమియు ఇబ్బందిరాకుండ చూచేబాధ్యత మాది, ఒకరెండుసం॥ములు నీవు మావద్దనేయుండినట్లైతె నేను అభ్యసించిన సంస్కృతము-జ్యోతిష్యములను నీకుబోధించినిన్ను నాయంతటి వాడిగాచేస్తాను. అందుకు నీవిక్కడే ఉండుమని ఆగ్రహించిరి, ఐనను నేనిక ఇక్కడ ఉండనని స్పష్టముగా చెప్పాను. అది విని అనంతరాములు "నీవిక్కడ మంచిమాటలతో నంగీకరించి ఉండిననె మంచిది, లేనియెడల నేను పోలీసు సూపరింటెంటుకు మీరింతవరకు అబద్ధములాడిమో సగించిన విషయమునుచెప్పి మీముగ్గురిని అరెస్టుజేయించెదనని" గద్దించి భయపెట్టెను. అదివిని నేనేమాత్రము భయపడక నేను మీవద్దకు చేసిన నేర మేముందని నీవలా నన్ను భయపెట్టుచున్నానని నేనుగూడ గట్టిగా వాదించితిని. నీయీగద్దింపుమాటలునా కేమియుజేయవుపొమ్మంటిని. అంత జీతో స్వాములవారుమధ్యన జోక్యమును గలిగించుకొని. యెందుకాతని ఆగ్రహపరచుచున్నావు, ఇక్కడ ఉంటే ఆతనికేమంచిది. ఇకపై పోతెఆతనిఇష్టము, ఇక్కడ నావద్ద ఉంటే మంచిగుణోపేతుడుగనుక సంస్కృతము జ్యోతిష్యము-రమలవిద్యలనభ్యసింపజేసి నేను న్నమఠమున కుత్తరాధికారిగా జేయాలనియు, లేదా వివాహముజేసియైన నావద్దనే ఉంచుకునాల అనే అభిలాషనాకుండెను, ఇట్లాతనికి మేలు జేయాలనేకోరికతోనె నేను ఉండుమన్నాను అనిరి.

ఆరాత్రి భోజనానంతరము అందరునిద్రలో మునిగిరి, నాకు మాత్రము నిద్రరావడములేదు. ఎప్పుడు తెల్లవారుతుందో, ఎప్పుడు

శ్రీ నాగ నూరు స్వాములవారి దర్శిస్తానో, ఎప్పుడీ నగరమునుండి వెళ్ళిపోతానో అనే ఆలోచనలు నామదితో ననేకరకాలుగా మేదల నారంభించినవి, ఇట్లు విచారిస్తు నేనెప్పుడు నిద్రలోకి జారుకున్నానో నాకేతెలియలేదు. అంతటితో తెల్లవారి నిద్రలేచి ప్రాతఃకాలకృత్యములను దీర్చుకొని, ముఖ ప్రక్షాళనమును జేసికొని. సామానులను నాట్రంకులో భద్రపరచుకొని. దుస్తులను మేనదాల్చి ఇక అటనుండి బయలుదేరుటకు సిద్ధపడితివి. స్వాములవారికి నమస్కరించి యికవెళ్తానని జెప్పగా వారింకను ఉండమని ఆగ్రహ పరచిరి, ఐనను నేనందులకంగీకరించక నేనువెళ్ళుటకే నిశ్చయించు కున్నాను, అని ఖచ్చితముగా చేప్పి "స్వామి! మరి ఇన్నాళ్ళు మీసేవ యొనర్చినందులకే మైన ప్రతిఫలమివ్వరా? అని అడుగగా వారు కొంతసేపునివ్వెరబోయి, నిశ్చేష్టులై తమ ట్రంకులో నుండి కేవలము పంద్రెండణాలు మాత్రమే దీసినాచేతికిచ్చిరి. ఇది చాలా; నాప్రయాణము నకీ డబ్బుసరిపోతుందా? అని ప్రశ్నించగా. వారు నాకడ ఇంతకంటెను ఎక్కువగా లేదనిరి. సరేమంచిది ఇదేనాకు పదివేలుగా భావించి అక్కడినుండి నాట్రంకుతోసహబయలు దేరితిని.

నేను బయలుదేరునప్పుడు వారు నీవు నేరుగా మీగ్రామమునకే వెళ్ళుము వేరెక్కడకు వెళ్ళకుమని చెప్పిరి, 'సరే''లె' అని వీరశైవ బోర్డింగు సంస్థాపకులై శ్రీ నాగనూరు స్వాములవారి వద్దకు వచ్చి వారికి నమస్కరించితిని, వారునన్నుజూచి "వచ్చావా? మరి వెళ్తావా? అనిరి." "అందుకు సిద్ధమై వచ్చియున్నాను స్వామి" అంటిని: ఆస్వాముల వారుగూడ బస్సుచార్జికొరకు అర్ధరూపాయి ఇచ్చిరి. మరియు నేను వెళ్ళాల్సిన స్థానముయొక్క చిరునామ (అడ్రసు)నుగూడ ఇచ్చిరి.

సరే ఇఁకవెళ్తాననిచెప్పి శ్రీ స్వాములవారికి నమస్కరించి అటనుండి నేరుగా బస్సునిల్దాణమునకు (బస్సుస్టేజికి) వచ్చిధారవాడకు వెళ్ళె బస్సులోగూర్చుంటిని.

సుమారు ఉదయము పది గం॥కు ధారవాడనగరమునకు జేరుకుంని? అక్కడ బస్సు స్టాండులో బస్సుదిగి ఒక వ్యక్తిని ఇక్కడహావేరిపేట యెక్కడుంది? ఎట్లా వెళ్ళాలి? అని అడిగితిని. ఆతడు ఒకరోడు (మార్గము) నుజూయించి, అది నేరుగా వెళ్ళుతుందనియు, ఎక్కడికి వెళ్ళాలని అనుకుంటున్నారో అది అక్కడికి వెళ్ళాక మరొకరిని అడగండని చెప్పెను. అక్కడికి వెళ్ళి హావేరిపేట బస్తిని చేరుకుంటిని. ఈహావేరిపేట బస్తికి మరియు ధారవాడపెద్ద పట్టణమునకు మధ్య యెనమిది ఫర్లాంగులదూరముంది. రోడ్డునకిరువైపుల ప్రజలుకూరగాయలను బండించుకునే విశాలమైన క్షేత్రములుండినవి. క్యాబీజ, నవల్‌కోలు, గొబిపువ్వు, పెద్దవంకాయలు, మున్నగునవి రైతులు బండించిన దృశ్యములు సస్యశామలములుగా అగుపడినవి. తరువాత హావేరిపేట బస్తిలోకి వెళ్ళగానే, మఠమెక్కడుందని ఒక వ్యక్తిని విచారించితిని. ఆవ్యక్తి మఠముయొక్క మార్గమును జూయించెను. ఆ మఠమునకువెళ్ళి దానికార్యాలయముందు నిల్చుండగానే అందుండి క్లర్కు (గుమాస్త)గారు నన్ను సమీపించి, "మీదేగ్రామమని" విచారించెను. నేను మాది హైదరాబాదు ప్రాంతము, సదాశివపేట గ్రామమని చెప్పితిని. "మీరెక్కడికి వచ్చారు" అని ప్రశ్నించగా, ఇక్కడికే వచ్చాను. అనడముతోనే "సరే మంచిది. రండి భోజన సమయమైనది. కాన మీరు ముందు స్నానముజేసి, శివార్చనాదులను దీర్చుకొమ్మని" చెబుతు, నాట్రంకును తన ఆఫీసులో ఒకప్రక్కన బెట్టించెను.

ఆ అపీసు ద్వారముపై "శ్రీమురుఘా రాజేంద్ర వీరశైవ ఫ్రీ బోర్డింగు" అని టెంకాయంతటి అక్షరాలతో కన్నడములో మరియు ఇంగ్లీషులో సైను బోర్డుపై వ్రాసియుంచారు. దానిని జూచినంతనే నా సంతోషమునకు మెరలేదయ్యెను. ఏలనన ఇక్కడ కేవలము విద్యార్థులే ఉంటారని దెలిసి ఆనందించితిని. ఆ గుమాస్తగారు మొదట స్నానపు గదికి దోళ్కొళ్ళి మీరిక్కడ స్నానముజేసి, లింగార్చనను దీర్చుకొని భోజనశాలకు రమ్మని చెప్పి, ఆయాస్థానములను జూయించెను. అదే ప్రకారముగా నేను స్నానముశివపూజలను ముగించుకొని భోజనశాలకు వెళ్ళడముతో వారు వంటవాడికిచెప్పి వీరికి భోజనముజేయించు మని చెప్పి, మీరు భోజనముజేసిన పిదప మళ్ళి ఆఫీసుకు రమ్మనిచెప్పి, తాను ఆఫీసుకు వెళ్ళెను.నేను భోజనముజేసి మరల ఆఫీసుకు వెళ్ళడముతోనే శ్రీ గుమాస్తగారుమళ్ళి నన్నిలా ప్రశ్నించిరి. "మిమ్మల్ని యెవరు బంపించారు?" అనిఅడిగిరి.

అదివిని నేను "బెళగాంవ్‌లో వీరశైవ బోర్డింగు సంస్థాపకులైన శ్రీనాగనూరు స్వాములవారని చెప్పాను. సరే అలా అయితే వారెదైన పత్రమిచ్చారా? అనిఅడిగిరి, వెంటనే శ్రీవారు బెళగావ్‌లో వ్రాసియిచ్చిన లేఖనమును గుమాస్తగారికందజేసితిని. అదిజదివి నివారిందులో వ్రాసిన మఠమిదికాదు. ఈ బస్తీలోవేరేమరోచోటఉంది. అని చెప్పడముతో నా హృదయము సంతోషముచేత నిండినదిపోయి,యిప్పుడది వినగానే "గాలి పోయిన బంతిలాగ" నిరాశజెంది నిస్పృహలకు దావలమైనది. అది యెక్కడుందని మరీ విచారించగా వారు "శ్రీసిద్ధలింగస్వాములవారుండే మూరుసావిర మఠమెక్కడుందని ఎవరిని విచారించినను చెబుతారు. ఇదే రోడుగుండా వెళితే కోద్దిదూరములో చోరాస్తావస్తుంది. అక్కడఎడమ

వైపు కొద్దిగా వెళితే అక్కడే వారిమఠముంది. ఎవరినడిగినను చెబు-
తారని" నుడివెను. సరేయనిచెప్పివారికి కృతజ్ఞతలనుదెల్పినాసామానుతో
బాటు అటనుండి వారీవరకు జెప్పినట్లుగా చౌరస్తా వరకు వచ్చి
యెడమవైపుదిరిగి ఒకరిని విచారంచగానే అతను ఇదే మఠమని
జూపెట్టెను. ఆమఠమునకు జేరుకుంటిని, ఇది చాలాఉన్నతమైన
రెండు కట్టుస్తంబాలపైన గట్టిన మేడయున్నది. విశాలమైనది, ఇందు
శ్రీ గురుపాదస్వామి బి.ఎ. గా రొక్కరే మఠాధికారిగానున్నారు.
వారునేను ప్రాంగణములోకి వెళ్ళిచూడగానే ఒక కుర్చీలోగూర్చుని
యుండిరి. నమస్కారమొనర్చితిని వారునన్నుగురించి "ఎవరు?
ఏగ్రామము? ఇక్కడికెందుకు వచ్చావు? నిన్నిక్కడికి బంపించిన
వారేవరు? నా పరిచయము మా మఠము విషయము నీకెట్లుదెల్సినదని"
మున్నగు వివరములనడిగిరి, అందుకు నేను శ్రీ నాగనూరుస్వాముల-
వ్రాసియిచ్చినలేఖ నందజేసితిని, అదిజూచి కొద్దిగానిరుత్సాహ పడిరి,
పత్రమును జదివి, వారు నాతోనిలామాట్లాడిరి "అబ్బాయీ! విద్యార్జనకై
ఇంత దూరము వచ్చియున్నాడవు, కనుక నీకు విశ్రాంతి, నిశ్చింతత,
భోజన వసతులు సరిపడునట్లుగా ఉండాలి" అట్లుంచేనెనీవిద్యాభ్యాసము
నిర్విఘ్నముగా సాగినీలక్ష్యము నీ వనుకొన్నట్లు సిద్ధిస్తుంది,
ఇక్కడి నేనొక్కడినే ఉంటాను. నాకువంట జేయువారులేరు. నేనే
మధ్యాహ్నము ఒక పూటభుజించి రాత్రికి పస్తుపడియుంటాను అనిరి.
ఈయనగారికి తోడుగా ఒక కాయకవు అయ్యగారు మరోముగ్గురు
ఆంగ్లమునభ్యసించే విద్యార్థులు ఉండిరి.

విద్యార్థులు ఎవరికివారే వండుకుంటారు. మఠమునకు ముందు-
భాగమున విశాలమైన స్థలముంది. వెనుక భాగముననొక కొబ్బరికోటలో
ఇతర మామిడి. పనసపండ్ల చెట్లు ఎట్టుమందార, నందివర్ధనము. మొదలు-

గువూలచెట్లు మల్లెపందిరిఉంది. సాయంత్రము 4-5.గం మధ్యన అయ్యగారె ఆతోటలో కలుపుమొక్కలను దీస్తుంటారు. వంటశాల గదులుకొన్ని విశాలముగానున్నవి, మళ్ళీ శ్రీవారునాతో మా వద్దయెల్లప్పుడు సేవకావృత్తిలో ఉండుటకై ఒకపని మనిషి అవసరమని, అట్టివాఁడు మీ దృష్టిలో ఉండిననావద్దకుదోలించుమనినేను శ్రీ నాగనూరుస్వాములవారికి జెప్పియుంటిని, అందుకని నిన్నునావద్దకు దోలించియున్నారు, నాసేవలోనున్న మనిషికి విద్యార్జనకవకాశమెంత మాత్రముండదు. మఠములోకసు ఊడ్చి శుద్ధపరచుట, పాకమును శుచిగా సిద్ధగించుట, మైల వస్త్రములినుదికి శుద్ధిజేయుట, పాత్రలను శుద్ధిజేయుట, ఇవే మొదలగు పనులను నెరవేర్చవల్సివస్తుంది? మధ్యాహ్నము కంతి భిక్షనెత్తుట, బావినుండి నీరుదోడి చెట్లుకుబోయుట, ఇఁక అట్టివాడికి జదువుకొనుట కవకాశమెక్కడుంటుంది? కాస్తా నీవె ఆలోచించు. ఇవన్నియు జేయుట నీకు సరిపడుతుందా? నీకు నేను జేప్పనులేను. నీవు జెయనూలేవు. అభ్యాసమునకు మనస్సు ప్రశాంతముగా ఉండాలి. అప్పుడుగాని విద్యాభ్యాసము నిర్విఘ్నముగా సాగుతుంది? అందు చేత నీకెక్కడైతె అనుకూల పరిస్థితులుంటాయో అక్కడే నీవు నివసించియుండుట మంచిదని చెప్పిరి.

## ధారవాడలోని మూరుసావిర మఠము

అదివిని. స్వామిగారు నేనీ నగరమునకు కొత్తవ్యక్తిని. అపరిచితుడను, దయజేసి తామె మీకు చితమనిదోచినచోట ఉంచరాదా? అంటిని. అదివిని వారు ఉంచబోను. కాని నీకొకమంచి ఉపాయమును జూయించగలను, అట్లు నీవు జేయుము అనేను. అదేమనిన ఇక్కడే మరోమఠముంది. అక్కడ విద్యార్థుల ఫ్రీ బోర్డింగుగూడ

ఉంది. మరియు సంస్కృత విద్యార్థులు, ఇంగ్లీషు విద్యార్థులు గూడ నివసించియున్నారు. వారికి అక్కడ ఉచిత భోజనము ఉచిత వస. గూడ కల్పించబడినది. కావున నీవక్కడికి వెళ్ళి ఆ బోర్డింగు నిర్వాహకులైన శ్రీ మురుఘా మఠము మృత్యుంజయ మహాస్వాములను గల్సి నీ వివరాలను విశదీకరించి ప్రార్థించిన యెడల వారు తప్పకుండ తమ బోర్డింగులో నిన్ను జేర్చుకుంటారు. నీవు ప్రత్యేకించి ఆ స్వాముల వారినే దర్శించి అర్థించుమని చెప్పిరి. "నేను ఇక్కడికి రాక పూర్వమే అక్కడికి వెళ్ళి యుంటిని, కాని యీ పత్రమును గుమాస్తాగారు జదివి, నన్నిక్కడికి బంపించారు." ఆ దినము రాత్రి అక్కడే ఉండిపోయితిని. రాత్రి యెవరినో ఒక భక్తుని బిలిపించి నన్ను వారి వెంట భోజనమునకై బంపించిరి. ఈ స్వాములు మాత్రము మధ్యాహ్నము 2, 3 గం॥లకు శివపూజ భోజనము జేసిన వారు మళ్ళి రాత్రి భోజనము జేయకుండిరి, వీరు తమకు సేవ జేయు సేవకులెవరు లేనందున వారే స్వయం సేవకుడిలా ఉదయము పది గం॥లకు స్నానమొనర్చి బొగ్గులపొయ్యి మీద కుక్కర్‌లో అన్నమును జేసికొని భుజింకుచుండిరి. ఉదయము పదునొకండు గం॥లకు లింగార్చనలో దొడగినవారు మధ్యాహ్నము మూడు గం॥లకు సమాప్తి జేయుచుండిరి. అప్పుడుగాని తన చేతి పక్వాన్నమును లింగార్పితము జేసి భుజించేవారు. నేను మాత్రము కాయకపు అయ్యగారు దెచ్చిన కంతి భిక్ష(మాదుకరము)పదార్థములను రెండు పూటలు భుజిస్తు మూడు దినములు గడిపితిని, స్వాములవారు నాతో "చూచితివా నా పరిస్థితి ఇలా ఉంది. ఇక మీదట నీకు నేనేమి సహాయము జేయగలను?"నేను గూడ ఇట్లు వృథాకాలక్షేపము జేయుట, దగదని యోచించితిని. వేరే యెక్కడైన స్థిరమైన స్థాన మేర్పరచుకొని నా విద్యార్జనను కొనసాగించవలెనను కుంటిని, అంచేత మరల నేను

మొదట వెళ్ళిన మురుఘా మఠమునకు సాయంత్రము ఆరు గం॥లకు వెళ్ళితిని. ఆ సమయములో అక్కడ శివకీర్తన కార్యక్రమము జరుగు చుండెను. అది సరిగ్గా రాత్రి యెనమిది గం॥లకు సమాప్తి యైనది. ఆ తరువాత నేను బోర్డింగు సంస్థాపకులు మరియు నిర్వాహకులైన మృత్యుంజయ మహాస్వాములవారు అక్కడె ప్రత్యేకమైన ఉన్నతమైన ఆసనమునందా సీనులైనవారిని సమీపించి సాష్టాంగ ప్రణామంబు గావించితిని, వారు చిరునవ్వుతో నావైపు దృష్టిని సారించి "మీదే గ్రామ మండి? మీ పేరేమిటి? ఎక్కడికి వచ్చారు?" అని ప్రశ్నించిరి, నేనత్యంత వినయిముట్టిపడునట్లుగా చేతులు జోడించి "స్వామి! మాది హైదరాజాదు నగర ప్రాంతము (నైజాము స్టేటు)లో సదాశివ పేట గ్రామము అక్కడ మాది పెద్ద మఠము (హిరే మఠమని కన్నడ భాషలోని పదము) "రాచోటి మరిదేవరు అని నా పేరు. విద్యార్జనా నిమిత్తము నేను మీ యాశ్రయమునభిలషించి మీ సన్నిధికి జేర వచ్చి నాడను. నేను నిరుపేద విద్యార్థిని, నాకు సహాయమొనర్చు వారెవరును లేరు. అని నివేదించుకోవడముతో నా స్వాములవారు తమ నివాస మందిరము (గృహము)నకు దోళ్కొనిళ్ళి "మంచిది నీవు మావద్ద ఉండి ప్రతి నిత్యము సమాధి పూజ జేయాలి. మరియు నా లింగార్చన సమయములో నిత్యము స్నానమొనర్చి నాలింగార్చనకు గద్దిగె (పెద్దలు గూర్చునె ఆసనము) వేయాలి పూజాసామగ్రినిఆయత్తపరచాలి. ఇంత మాత్రము నీవు మావద్దనేయుండి పనిజేసిన యెడల మేము నీకు అవసరమైన పుస్తకములను, దుస్తులను, భోజనము, ఉండుటకు వసతి మున్నగునవి యేర్పాట్లు గావించెదమనిరి. సంస్కృతా భ్యాసమునుగూడ జేయించెదమనిరి. అది వినియిది మీరునాకొనర్చిన మహోపకారమని చెప్పి

అందుకంగీకరించితిని. ఇంతేపని గదా? ఇందేమి అంత కష్టదాయక మైనదేదియును లేదు. అనగానే శ్రీవారు నీ సామానులను ఇక్కడికి దెచ్చుకొనుమని నన్నాజ్ఞాపించిరి. వారన్నదే తడవుగా నేను వెంటనే మూరుసావిర మఠమునకు వెళ్ళి అక్కడి స్వాములకు ఈ సంగతిని విని పించి సంతోషముతో నా సామానులను దీసికొని వచ్చితిని. వారు నేను ఉండడానికి స్థానమును మిగత విద్యార్థులతో బాటు జూయించక ప్రత్యేకముగా తాముండు గృహమునకు పైన మేడగదిలో నుంచిరి. అదేమేరకు వారి యాజ్ఞానుసారముగా నక్కడేయుండి వారాదేశించిన ప్రకారముగా నానిత్య కర్మలను తప్పకుండ యొనర్చుచుంటిని.

అక్కడ గూడ మఠములోనే ఉండడమువలన ఆ హావేరిపేట భక్తులందరు తమ గృహాల్లో నేవైన శుభాశుభ కార్యములు జరిగే సందర్భములోనన్నే శ్రీ స్వాములవారు బంపుచుండిరి. అక్కడికి మఠాధిపతిగా వెళ్ళి వారి కార్యములను నిర్వహించుచుంటిని, భక్తులొసగిన హక్కు (బాపతులు) దక్షిణ రూపమున ఇచ్చిన డబ్బును స్థానిక స్వాములవారికే అప్పగించుచుంటిని. అక్కడ గూడ చేతిలో ఒక నయాపైస ఉండకుండెను.

## ధారావాడతో హావేరిపేట భక్తురాలి మంపేలపు

ఒకనాటి సందర్భ మిట్లు జరిగినది. హావేరిపేటలోని భక్తులొకరు పాదపూజ భోజనములను జేయించుటకై తమ గృహమునకు దోళ్కొళ్ళిరి. అక్కడి స్త్రీలు గూడ వీరశైవ ధర్మతత్త్వాచారములోను, విద్యా సంస్కారములోను, చాలా నిపుణులుగా నుండిరి. కాబట్టి వారి గృహము

లోకి వెళ్ళగానె ఒక శ్రీమతిగారు చెంబుతో నీరు దెచ్చి నాపాదప్రక్షాళన మొనర్చెను, ఆ పిదప నన్ను దేవగృహములోకి దోళ్కొళ్ళి అక్కడ వేదికపై పరచిన ఆసనములో గూర్చుండబెట్టిరి, వెంటనే ఆ ఇంటి యజమానురాలు వచ్చి ధూళిపాదోదకమొనర్చెను. తరువాత నాకు ఆ పాదమస్తకమువరకునా ఇష్టలింగముతో బాటుఅష్టవిధార్చనపూజయొనర్చెను, పిదప క్రియా పాదోదకమును సిద్ధగించిరి. ప్రప్రథమమున నేను క్రియాపాదోదకమును ఇష్టలింగమునక అభిషేకించి (అర్పించి) స్వీకరించాలి. ఆ పద్ధతి ప్రకారముగా నేను మొదట ఇష్టలింగమునకు ఆ మీదట నానొసట(నుదుట)భస్మమును ధరించుకొనిదిగువనున్నఒకకంచములో క్రియాగిన్నెలోని తీర్థమును నా ఇష్టలింగముపై మూడుసార్లు "భవభూజకు ఠారాయ - రోగపంకస్యభానవే అజ్ఞానంగిరివజ్రాయ - పాదతీర్థాయతేనమః" తా॥ సంసారమను వృక్షమునకు గొడ్డలివంటిది. భవరోగమనే పంకిలమును (మట్టిబురద)ను శుష్కింపజేయుటలో సూర్యుని వంటిది. అజ్ఞానమనెడు పర్వతమును కూలద్రోయుటకు వజ్రాయుధమువంటిది. అయిన ఈ పాదతీర్థమునకు ననమస్కారమను మంత్రమును బఠించి, ఇది (1) గురుపాదోదదకము ఇది (2) లింగ పాదోదకము (3) ఇది జంగమ పాదోదకముగా భావించి అట్టి తీర్థమును సేవించితిని. అదిజూచిన ఆ యమ్మకు పట్టరాని యావేశమువచ్చి నావైపు కోపముతో జూచి "ఆసలు నీవు జంగమయ్యవేనా? కాదా? అని గట్టిగా నన్ను మందలిస్తు తన భర్తను బిలిచి వారితో" ఈ యయ్యగారినెందుకు దొడ్కొనివచ్చావు? ప్రతిసారి మన ఇంటికి దోడ్కొనివచ్చె శ్రీ తిళువళ్ళి అయ్యగారు లేకుండిరా? ఈ అయ్యగారు తెలంగాణా అయ్యగారులా ఉన్నారు. సంస్కార హీనులు" అని మందలిస్తు ఉంటే

నా హృదయములో తోపు గుండు ప్రేల్చినంతటి భయము గల్గినది. అసలు ఇక్కడ నేను జేసిన పొరపాటేమనగా దిగువనున్న క్రియా పాదోదకము యొక్క క్రియాగిన్నెతో యుండిన కంచమును నాతోడపై నిడుకొని తత్తీర్థమును స్వీకరించాల్సి ఉండెను, మరచి నేనట్లు జేయ నందులకామె మహాకోపోద్రిక్తురాలైనది. నా మనస్సులో చాలా బాధ జెందినను నా యొనర్చిన పొరపాటుకు నేనె బుద్ధిజెప్పుకుంటిని, మరో సారిట్లు జరగకుండ ఈమె నాకు చక్కని శిక్షనొసఁగినది. అని నాలో నేననుకుంటిని, అందును అక్కడి స్త్రీ పురుషులెల్లరు వీరశైవాచారములో పారంగతులు. అచటిభక్తులుమాహేశ్వరులయందధికమైన భక్తిగలవారు వేయేల జంగములే వారికి ప్రాణమువంటివారు. ప్రతిదినము ఉదయమ్ము, స్నానమొనర్చి మడితో శుచిర్భూతమైన దుస్తులను మేనదాల్చి ముందు మఠమునకు వచ్చి శ్రీస్వాములవారినిదర్శించి పాదాభివందనమ్ము నాచరింతురు. ప్రతి సోమవారము మడితో బిల్వ పత్రి పుష్పములు గంధాక్షతలు ఒక తట్టలో నిడుకొని మఠమునకు వచ్చి స్వాముల వారుండే స్థానమునంతయును సమ్మార్జన మొనర్చి ముగ్గులు వైచి యలంకరింపఁజేయుచుండిరి. నాడు భక్తులందరు నేను ముందు నీవు ముందన్నట్లుగా"అహమహమిక"తో స్వాములవారి సన్నిధిలో తమ తమ ఇష్టలింగములకు శ్రీవారు శ్రీరుద్ర, సూక్తములనుచ్చరించుచుండగ్గా అభిషేకములను గావించుకొని వారి పాదతీర్థ ప్రసాదములను స్వీకరించి నమస్కరించి వారి యాశిస్సులను బడసి తమ తమ గృహములకు వెళ్ళుచుండిరి. ప్రతి పౌర్ణిమ - అమావాస్య పర్వదినములందును ఇదే విధముగా అచరించుటేగాకుండ, వారి ఇండ్లలో ప్రత్యేకముగా సిద్ధగించు కొన్ని మధురములు రుచికరములైన వంటకములను గూడ దెచ్చి (నైవేద్య రూపమున) అనన్య భక్తితో సమర్పించుకొనుచుండిరి.

—: ధారవాడమురుఘామఠము స్వరూపము :—

శ్రీమన్నిరంజన ప్రణవస్వరూపులైన పూజ్యశ్రీమృత్యుంజయ మహాస్వాములవారు మఠమును మనము దర్శించుటకై కొత్తగా వెళ్ళి నప్పుడు, కంపౌండు గోడ (ప్రాకారపు గోడ) యొక్క మహాద్వారము (గుమ్మములపై)చిన్ని మండపాల్లో నిర్మించినరెండువైపుల రెండు నంది విగ్రహములున్నవి, మధ్యన ఫాటక్(గేటు)కు శివలింగమున్నది. దాన్ని దాటేసి లోనికి ప్రవేశించగానె ఎట్ట యెదుటనే శ్రీవారు నివసించే గృహము (మఠము ఉంది. ఏదుటి గృహములో కర్తృ గద్దుగే (వేదిక) సమాధి యన్నది, దాని కుడివైపున కట్టుతో అందముగా నిర్మించిన ఉన్నతముగా నున్నతేరు (రథము)ంది, సమాధి గృహమున కెదురి వసార (పడసాల) ఉంది. ఈయరుగుపైనొక మూలన శ్రీమృత్యుంజయ మహాస్వాములవారు పులిచర్మము ఆసనముగాగ, గోడతెకియ (మెత్త కు)కు ఒరిగి పద్మాసనముతో నాసీనులైయుండ వారి యెదుట శ్రోతలు, ప్రేక్షకులు గూర్చుని యుండ, శ్రీవారి ప్రక్కనే వారి యుత్తరాధి కారులైన శ్రీమహంతప్పగారు లేదా మఠమునకు నూతముగా విచ్చేసిన కలా విదులు తమ తమ పాండిత్య పూరితమైన ప్రవచనములను ప్రతి నిత్యము ఉదయము ఎనిమిది గం॥ల నుండి తొమ్మిది గం॥ల వరకు శివానుభవ ప్రసంగములు జరుపుచుండిరి. ఇందులో ఉదయము కేవలము సంస్కృత విద్యార్థులే పాల్గొనుచుండిరి. సాయంత్రము సంస్కృతము మరియు నాంగ్లము నభ్యసించే విద్యార్థులందరు పాల్గొను చుండిరి. ఈ వరాంతా గోడలపై వీరశైవ ధర్మోన్నతికై నిరంతరము పాటుబడుతు తమ జీవితమునే అంకిత మొనర్చియున్న మహాస్వాముల యొక్క (శ్రీ మురుఘేంద్రస్వామి అథణి, బిళూరుస్వామి శ్రీ కుమార

స్వామి శివయోగమందిరము, శ్రీబాలలీలమహంతస్వాములవారిమరియు శ్రీ మురాఘూరాజేంద్రమహాస్వామివారి చిన్మూలాద్రి మఠము చిత్రదుర్గ మొదలగు వారి గొప్ప చిత్రపటములతో నలంకరించ బడియున్నవి. దీనికి యెడమ ప్రక్కనే మురుఘూరాజేంద్ర బోర్డింగు యొక్క కార్యాలయము ఆఫీసు ఉంది. ఈ రెండింటి మధ్య భాగములో శ్రీస్వాముల వారి విశ్రాంతి గృహముంది, ఈ ద్వారమునకు పై భాగమున "మురుఘా రాజేంద్ర ఫ్రీ బోర్డింగు," అని వ్రాయించిన పెద్ద బోర్డు ఉంది. శ్రీవారు విశ్రాంతిని గైకొనె గృహములో, ఒకవైపు వంటిల్లు మరోవైపు పూజాగృహములున్నవి. వంటింటి వెలుపలికి వెళ్ళుటకు మరియు వెనుక భాగములో నుండిన విద్యార్థుల భోజనశాలకు వెళ్ళుటకు మరొకటి ఇట్లు రెండు ద్వారములుండినవి. ఇందుండే మేడ (మిద్దె)పైకి వెళ్ళుటకు కట్టుతో నిర్మించిన మెట్లుండినవి. దీని యెడమ ప్రక్కన సాహిత్యముగది. ఈ రెంటి మధ్యన ఒక ద్వారము, దానినుండి లోనికి ప్రవేశించగా విద్యార్థులు లింగార్చన జేయుగది యొకటుంది. దానిని దాటి లోనికికాస్త వెళ్ళితె విద్యార్థుల భోజనశాల ఉంది. ఇది చాలా విశాలముగా నున్నది. ఈ భోజనాలయమునుండి యెడమవైపున విద్యార్థులకు పాకము జేయు (వంటశాల) గది. మనము మొదటి కంపౌండు గుమ్మమును దాటి కాస్త లోనికి వెళ్ళడముతో దర్శన మొసఁగునది యెడమ భాగమున "బసవాది ప్రమథుల ఆశ్రమ"ముంటి, ఇది రెండస్థుల మేడ, ఇందె కొన్నాళ్ళు నేను నివసించితిని. ఈ ఆశ్రమమును దాటి ఇంకను కొద్ది దూరము వెళ్ళిన అక్కడ రెండంతస్థుల విశాలమైనది" శివానుభవ కాలేజి అని ఉంది. ఇందు కేవలము సంస్కృత విద్యార్థులకు మాత్రమే పండితులు బోధన గఱుపుదురు, మరియు సాయంత్రము ప్రతి దినము ఇందు పండితులచేత ప్రవచనాది కార్యక్రమములు

జరుపుచుండిరి. ఏకొత్త కళావంతులు ఇక్కడికి విచ్చేసినను వారి కళా ప్రదర్శనమిక్కడే జరుగుచుండును, అప్పుడప్పుడు శివ కథా కాల క్షేపము, పురాణ ప్రవచనము, పెద్దవారి ఉపన్యాసములు గూడ ఇక్కడే జరుగుచుండును. శ్రోతలు గూడ ఇక్కడికి అధిక సంఖ్యలో రావ టము చేత హాలునిండి క్రిక్కిరిసిపోయేది. ఈ హాలునకు యెడమ వైపున విశాలమైన మైదానము ఉంది, అరువది మూఁడు మంది పురాత నుల పేరిట అరువది మూఁడు బిళ్వ వృక్షముల మొక్కలు నాటబడి నవి. పూల మొక్కలు, అరువది మూఁడు కొబ్బరి మొక్కలు నాట బడినవి, ప్రతి మొక్కలకు సంస్కృత విద్యార్థులమైన మేము ప్రతి నిత్యము వేళ్ళలో శ్రీమృత్యుంజయ స్వాములవారు వెంటనుండగా నీరు బోసి వాటికి క్రిములు ఆశ్రయించకుండ పరిశోధించుచుంటిమి. ఇందుకు ప్రతిఫలముగా శ్రీస్వాములవారు వీరశైవ మూలధర్మతత్త్వములను సూక్ష్మాతి సూక్ష్మముగావివరించునట్టి "శతకత్రయ" మను గ్రంథమును బహూకరించిరి, అది నాకడ నేటికిని భద్రముగా నుంచుకొనుటేగాకుండ అందలి పద్యములను ప్రతినిత్యము లింగార్చనానంతరము నేటికిని పారాయణము జేస్తువున్నాను. దీనితోబాటు, వీరశైవ ధర్మ సిద్ధాంత గ్రంథమైన సిద్ధాంతశిఖామణి, వేదసారశివ సహస్రనామావళి. శివ గీత మరియు శ్రీ బసవ వచనామృతమును పారయణముగా నిడుకొని యున్నాను. ఒక పూట భోజనమును మానేసియైనను వీనిని పారాయణ మును జేస్తుఉంటాను. శివానుభవ కళాశాల భవనము వెనుక భాగమున రైతులు వర్షాకాలములో కూరగాయలను బండింతురు. దీనికి యెదుట చేదుడుబావి ఉంది. దీని యెడమ వైపున విద్యార్థులందరు స్నానమాడు టకు బట్టలు శుభ్రపరచుకొనుటకు కొళ్ళాయిలు వరుసగానున్నవి.

వాటికి దిగువ చలువరాలను బరచియున్నారు. ఈ కొళాయిల ఎదుట అతిథులు స్నానముజేయు గది, అందు ఒక పెద్ద రాగి అండా దానిలో నీరునింపి ఎల్లప్పుడు వేడిగా జేయబడును. ఇది జాత్రా ఉత్సవ సమయములో అతిథులకు చాలా ఉపయోగ కరముగానుండునది.

శరణు బసవాది ప్రమథాశ్రమమునకు ఎదుట అరువది ముగ్గురు పురాతనుల పేరిట నిర్మించిన విద్యార్థుల వసతులకై గదులరూపమున నలుదిక్కులలో వెలసియున్నవి, ఒకొక్క-గదిలో ఇద్దరేసి విద్యార్థులుం దురు, ఆగదులకు వెలుపల ఒకటి. వరాండావైపున ఒకటి, ఇట్లు రెండు కిడికీలు అమర్చ బడి, రెండు తనబ్బీలు విద్యార్థులు తమ పుస్తకములను మరియు ముఖ్యమైన వస్తువులుంచుకొనుటకై బీరువాలవలెనిర్మించ బడినవి. ఇట్టి గదులన్నింటికి మధ్య భాగములో శ్రీమదథణి శివయోగీశ్వ రులవారి విగ్రహము ప్రతిష్ఠింపఁబడయున్నది. దాని చుట్టు ఇనుప జాలి ఒక ద్వారముతో నమర్చబడినయ్యుది. ఈ విగ్రహమునకు ఎట్ట యెదుట కొద్దిదూరాన, ఉన్నతమైన వెదికపైనొక నంది విగ్రహ ముంది. ఈ రెండు విగ్రహములకు మధ్యన ఒక పొడుగాటి వసార కొద్దివెడల్పుగానుపైన బేంగళూరు పెంకుల కప్పుతోనున్నది. అందు ప్రతి స్తంభమునకు వీరశైవధర్మోద్ధారమునకు బాటు బడినమహాత్ముల మరియు వీరశైవధర్మోత్కృష్టతను దెల్పుదేవతల చిత్రపటములన మర్చబడియున్నవి, ఈ శివయోగి మందిరమునకు చుట్టుప్రక్కల నలు వైపుల నాలుగు భాగములుగా క్రోటిను చెట్లకటింగుల వరుసలతో విభజింపఁబడినవి, సుగంధ విశిష్టములైన రకరకాల పుష్పవృక్షము లున్నవి. ఈ పుష్ప వాటికలయందు ఒకభాగము దక్షిణదిక్కునసున్న స్థలములో సుగంధ విశిష్టములైన రంగు రంగుల గులాబి వృక్షములతో

నిండియున్నది, మరోవంక భాగములో మల్లె వృక్షముల (చెట్ల)తోనిండి సాయంత్రమువేళ్ళలో సువాసనలతో నా ప్రదేశమంత ఘుమ ఘుమలాడు చుండును. మరోవైపు గదుల ఎదుట వరుసగా ఎత్తుగా బెరిగియున్న సంపెంగ సర్జవృక్షాలు. అశోకవృక్షాలు, బకుల, నాగసంపెంగ వృక్షములున్నవి. మల్లెపొదులకుప్రక్క భాగమందు చేమంతి చెట్ల పొదు లున్నవి, మరో వైపు ఉసిరిక, దానిమ్మ, కదళి, మొదలగు ఫలవృక్షము లున్నవి.

అక్కడక్కడ నీరు ఎల్లప్పుడు వృక్షములకు బోయుటకై హౌజులున్నవి. కొళాయీలు. నీరును పైకి విరజిమ్మె కొళాయీలుండి ఈ పుష్పవాటిక శోభను ఇనుమడింపజేయును. సన్నజాజిపూల మండ పాలు నలువైపుల కమానులవలె (ధనురాకారము) మండపములను తీగతో జుట్టబడిన పూలపందిళ్ళుగలవు. సాయంసమయములోనా ప్రశాంతమైన వాతావరణమంతట అలుముకొనియుండును.

ఆ కంపౌండు ఆవరణమంతయు సుగంధ మిళితమైన చల్లని పిల్లగాడ్పులు మెలమెల్లగా వీస్తుంటవి, మరియు అటనట రంగు రంగుల విద్యుద్దీపపు పంక్తు (వరుప)లతో నలంకరించబడియున్నది, ఇందులోకి ప్రవేశించె మహద్వారముపైన గ్రంథాలయము గదియొకటి చాలా విశాలముగానున్నది. అందులోను గొప్ప సత్పురుషుల, పండిత ప్రకాండుల విజ్ఞానవేత్తల భావ చిత్రములున్నవి.

—: శ్రీ మృత్యుంజయ మహాస్వాములవారి సేవాభాద్యము:—

ఈ మఠములో శ్రీమృత్యుంజయ మహాస్వాములవారి సేవలో నున్నప్పుడు ప్రతినిత్యము ఉదయమున ఎనమిది గం.కు, స్నానమొనర్చి పూజాగృహములో సమ్మార్జనము, పూజాపాత్రసామగ్రినితోమి శుభ్ర

పరచుట శ్రీవారి నిత్యస్నానముకొరకు రెండు మూడుగొప్ప గొప్ప రాగి (తామ్ర) అండాలలో బావినుండి నీరు దోడినింపుట, జరుగు చుండెను. పూజాసమయములో ప్రతినిత్యము మఠమునకు ఎందరు అతిథులు విచ్చేయుచుండిరో వారందరికిని స్వామిగారితోబాటె కూర్చుండటకాసనములువేసి పత్రి పుష్పములు, గంధాక్షతలు శోధించి పూజ కాయత్త పరచుచుంటిని. కాని నేను స్నానము జేయగానే నాలింగార్చనను తీర్చుకొని కొద్దిగానేదైన అల్పాహారమును దీసుకొనవలయు ననే కట్టడిని స్వాములవారు బెట్టియుండిరి, వారు మొదట స్నానమునకు రావడముతోనే నన్ను "దేవరే!" నీవేదైన అల్పాహారము దీసికున్నావా? లేదా? యని ప్రశ్నించేవారు. దీసికొన్నాను స్వామి అంటే వారికెంతో సంతోషము, లేని యెడల కోపగించెవారు, ఈఫలాహారములో శ్రీ స్వాములవారియొద్ద గోవామామిడిపండ్లు లేదా పెసరుంతలు, శర్కర, ద్రాక్షపండ్లు,మిస్రి,ఈవస్తువులు (తినుబండారములు) ఉండేవి. ఇవన్నియు నాయధీనములోనే యుండేవి. వీనినెన్నైనదినుటకు నాకేలాంటి అభ్యంతరము లేకుండినది. అంతేగాకుండ ప్రతినిత్యము పాయసమో, చపాతీలో, పూరీ రవా కేసరో మొదలగువాటిలోనెదోయొకటి దీపి పదార్థమో జేయుచుండిరి, భోజనానంతరము వేడి పాలలో ద్రాక్ష పండ్లు (కిసీమిస్) ఖండసారి శర్కర. బాదముపప్పువేసి బాగాకాచిన క్షీరమును ప్రతిదినము సాయంత్రము ఉదయము (మధ్యాహ్నము) త్రాగుచుండితి. వారు వాడుకొనగా మిగిలినవాటిని మేము కాజేస్తు ఉంటిమి. శ్రావణ మాసములో పురాణప్రవచనము సాయంత్రము జరుగుచుండెను, శ్రీ బసవేశ్వరపురాణ (శ్రవణము) మును వినడానికి వచ్చిన అతిథులందరికిచటనే భోజనము జరుగుచుండేది. అంతటితో నాగక శ్రావణములో ప్రతిసోమవారము నందును గణారాధన

ఇక్కడ దీనినే జంగమార్చన అని చెప్పుకుంటారు, దీనినిగూడ అక్కడ తప్పకుండ జరుపుకొను చుండిరి.

—: శ్రీ స్వాముల వారితో వాహ్యాళి (గాలిసవారి) కేగుట :—

ప్రతి దినము సాయంత్రము అయిదుగంటలకు శ్రీమృత్యుంజయ మహాస్వాములవారు గాలిసవారికై (వాహ్యాళి నిమిత్తము) మాతోబాటు బయలుదేరి నగరము వెలుపలి చేలలో అక్కడక్కడ కూరగాయలను విద్యార్థులకొరకు దానరూపమున స్వీకరించి మధ్య మధ్యన మాతో సరసల్లాపములనాడుతు సాయంకాలము ఆరున్నర గం॥వరకు మరల స్వస్థానమునకు జేరుకొనుచుండిరి. నగరమునకు ఒక మైలు దూరమున మహాస్వాములవారు ప్రత్యేకముగా నిర్మించుకొన్న ఒక ఆశ్రమ ముండినది. అది మరేవాడ అనుగ్రామ వైపునకు వెళ్ళె పక్కా రోడ్డు ప్రక్కనే యుంది. అట్టి వీరి యాశ్రమము వద్ద ప్రతియేట శ్రావణమాసములో చివరి సోమవారము విద్యార్థులతో బాటు అక్కడికి వనభోజనమునకై వెళ్ళుచుండిరి, అదె బోర్డింగులో ఆంగ్లము నభ్యసించే వారిలో మురిగెప్ప జడి, బెల్లద బాగెవాడి గ్రామ నివాసియైన వీరికి నాకును చాలా మైత్రి యేర్పడియుండెను. వీరాంగ్లము బి.ఏ. పట్టమునకై యత్నించుచుండిరి. వీరి యాచరణ, సభ్యత, దయా దాక్షిణ్యాది గుణములు, పూజ్యుల యందలి వీరికున్న నిండుభక్తి విశ్వాసములు నన్ను ముగ్ధుని గావించినవి. వీరు నాకు సన్నిహిత మిత్రులైనబాదిగా నాకు ఆంగ్లమును బోధించుచుండిరి. నేను వారికి సంస్కృతమును బోధించుచుంటిని ఇక్కడ."

శ్లో॥ గురుశుశ్రూషయావిద్యా—పుష్కలేనధనేనవా।
అథవా విద్యయావిద్యా—చతుర్థీనోపపద్యతే॥

అను సూక్తి మా ఇద్దరిపట్ల సార్థక్యమైనదిగా భావించితిని.

తా॥ ఒకటవది గురుసేవ యొనర్చి విద్య నార్జించుట ఉత్తమ మైనది. రెండవది. పుష్కలమైన ధనమును గురువుగారికి సమర్పించి అతని చేత విద్య నార్జించుట మధ్యమము. ఇది రాజుల రారాజుల అథవా ధనికుల బిడ్డలకే సాధ్యపడుతుంది, నిస్వనుల (దరిద్రుల)కు సాధ్యపడేదిగాదు. ఇకపోతే చివరిదైన మార్గము సుకరమైనది. తనకు వచ్చిన విద్యను ఇతరులకు బోధించి ఇతరుల వద్దనున్న విద్యనుదాను నేర్చుకొనుట ఉత్తమోత్తమమైనది. విద్యార్జనకు మరో నాల్గవ మార్గము (ఉపాయమే) లేదని స్పష్టముగా నొక్కి వక్కాణించారు.

అల్లా శ్రీమురిగెప్పజడిగారికి నాకును పరస్పరాదాన ప్రదాన విద్యను నేర్చుటవలన అన్యోన్య స్నేహము పెంపొందినది. వారు మొట్టమొట నీతిగుఱిపి చలన చిత్రములను జూడకుండ నేర్పిన గుణ పాఠ మియ్యది. నాటినుండి నేటివరకు చలన చిత్రములను జూచుట మానుకున్నాను. అంతేగాకుండ వీరు నన్ను క్రమేపి పూజ్య బావముతో గౌరవించుచుండిరి. వీరియందలి గురు - లింగ - జంగమంబుల భక్తి శ్రద్ధలు వర్ణనాతీతములైనవి, వీరు లింగార్చనకుద్యుక్తులైన సమయ ములో పత్రి పుష్పములు గంధాక్షతాలు ధూప-దీప-నైవేద్యములు భస్మ రుద్రాక్షలు, ఇవన్నియు సిద్ధముగా నుంచుకొనుచుండిరి. ఇతఁడు కాలేజీకి వెళ్ళేముందు గూడ నుదుట త్రిపుండ్ర భస్మరేఖలతోను ఎదపై ఎడమ వైపున శ్రీ బసవేశ్వలరువారి భావచిత్రముగల చిన్న పతకము నుంచుకొని వెళ్ళేవారు. విద్యార్థి దశలోనే ఇలా మంచి ప్రవర్తనను అలవర్చుకున్నారు. శ్రీ మురుగేప్పగారు చాల బీద కుటుంబమున జన్మిం చిన వారు. తెల్లని శరీరము, ముఖముపై బ్రహ్మచర్యపు కాంతి, మంద

హాసములు ఎల్లప్పుడుట్టి పడుచుంచెడివి, తెల్లని వస్త్రముల పైన కోటు తెల్లని ధోవతిని ధరించెవారు. ఈ సమయములో నా వాస్తవస్థితిని శ్రీ మృంత్యుంజయ మహాస్వాముల వారితో మొదలే నివేదించుకోవడము చేత నన్నువారు "రాచోటి మరిదేవరు" అని పిలిచేవారు. నన్ను సదాశివ పేట మరియు జోగిపేట పెద్ద మఠము (హిరేమఠ) లకు మా తల్లిదండ్రులు నాపిన్న ప్రాయముననే ఇచ్చారని అందుచేత వారు నేనింతవరకు ధరించియున్న తెల్లని వస్త్రములనుమాన్పించి. తామె నాకు వల్సిన చొక్కా. పైవస్త్రము, ఒక తెల్లని లుంగి వస్త్రములను దెప్పించి వాటిని కావిరంగులో అద్దించి నాకు ధరించుమని యాదేశించియుండిరి. కనుక వారి యనుగ్రహమువలన ఇక్కడ నాకు తిండి, గుడ్డలకు అభ్యాసములకే మాత్రము కొరతలేకుండినది. కాని ఆర్థిక ఇబ్బంది మాత్రమట్లే యుండినది.

## ఇక్కడ నా ఆరోగ్యము చెడినది

ఇక్కడ నా అరోగ్యము చెడినందున ఎడమ పాదము మొదలుకొని మొకాలివరకు వాచి (ఉబ్బి) గట్టిగా తాయిమాదిరి గడ్డగట్టియుండినది. రేయింబవళ్ళు పోట్లుమంటలు విపరీతమైన నొప్పితో బాధ జెందియుంటిని. నిద్రాహారములను వదలుకొనియుంటిని. ఇటీవలె నా నివాస స్థానమును మార్చియుంటిని మొదట శ్రీ స్వాములవారుండె నివాసము మేడపైనుండి ఇప్పుడు ప్రత్యేకముగా విద్యార్థులుండే గది లోకి మార్చితిని, నా ఆరోగ్యము విషయములో శ్రీమత్యుంజయ మహాస్వాములవారు ప్రత్యేకమైన శ్రద్ధవహించియుండిరి. ప్రతి దినము ఉదయము సాయంకాలమునానివాసమునకు వచ్చి పరామర్శించు

చుండిరి. విపరీతమైన బాధతోలేచి నడవలేకుంటిని. మల-మూత్రములు విసర్జనగూడ ఉండిన చోటనే శ్రీవారు వ్యవస్థ జేయడముచేత అక్కడే జరుపుచుంటిని. పాపముతోటి సంస్కృత విద్యార్థులలో ఒకరు శివకుమారను విద్యార్థి వాటికి యేవగించుకొనకుండ దీసికెళ్ళి, వాటిని మురికి గుంటలోబడవైచి, మళ్ళి అట్లు విసర్జించిన పాత్రలను శుభ్రపరచుకొని తెచ్చి నావద్ద ఉంచెవాడు. నాకు ప్రతినిత్యముస్నానముజేయించుట. మైల దుస్తులను దొడగించుట, నాతోటి విద్యార్థులే మంచిగా వ్యవస్థ జేయుచుండిరి. అన్నమును భుజించనందుకు స్వాములవారు ప్రతిదినము నాకవసరమైనన్ని మోసంబి పండ్లు, సేబులు, సంత్రాలు వీటితోబాటు ఖండశర్కర (మిశ్రి)ని గూడ దెప్పించి నాకు దినుమని విద్యార్థులతో బంపించుచుండిరి. ఒకరెండుసార్లు ఆ బోర్డింగుయొక్క వైర్మన్‌గారు నావద్దకు విచ్చేసి నాకు చికిత్స జేయించుటకై గుఱ్ఱపుబండి (టాంగా)లో నన్ను గూర్చుండబెట్టుకొని సర్కారి దవాఖానాకు దీసికెళ్ళుచుండిరి. ఆ ఔషధ చికిత్సవలన నా ఆరోగ్యము ఏమాత్రము బాగుపడదయ్యెను. దినములు గడచినట్లు పోట్లు-మంటలు మరింత పెచ్చుపెరుగుచుండెను. ఎవరేమందునువయోగించుమనిచెప్పిననువాటన్నింటినిఉపయోగించిచూచితిగాని, వాటి వలన ప్రయోజనమేమాత్రము లేకపోయెను. అకస్మాత్తుగా శ్రీ మురుఘామఠము పక్షాన ప్రతియేట జరుపబడే శివయోగీశ్వరులవారి జాత్ర రథోత్సవాన్ని పురస్కరించుకొని చిత్రదుర్గ నుండి జగద్గురు శ్రీ జయదేవమురుఘా రాజేంద్ర మహాస్వాములవారు ఇక్కడికి వెంచేసియుండిరి. వీరప్పుడప్పుడు సేవకజనపరివారముతోను గజ-తురగ ఒంటెకారులతో వస్తుఉంటారు. అదే విధముగా నీసారి రథోత్సవ సందర్భములో ఇక్కడికి వేంచేసిరి. ఈ సమయములో నాకు చాలా

సుపరిచితుడైన ఒక కీర్తనకారుఁడు నా బాధను జూచి భరించలేక, శ్రీ జగద్గురువులవారితో విన్నవించెను. వారు నన్ను, వారి సన్నిధిలోకి యెత్తుకొని రమ్మని యాదేశించిరి. వారి యాదేశముమేరకు ఆ కీర్తన కారుడు నన్ను ఎత్తుకొనిపోయి, శ్రీ స్వాములవారి పాదసన్నిధిలో గూర్చుండబెట్టెను. శ్రీవారుతమ కృపాదృష్టితో నన్నుజూచి, ఒకచెంబు నిండ తాజా మంచితీర్థమును దెప్పించి,దానిని మంత్రించి, ఒకచెంచడు (ఉద్ధరణిలో) వారె తమ పవిత్రమైన హస్తకమలముతో నాచేతికందించి ఇది ఇప్పటికి స్వీకరించి, ఈ దినము సాయంత్రము వరకు అన్నమును భుజించకుండ ఉండి, కేవలము తీర్థమును మాత్రమే సేవించుమని యాజ్ఞాపించిరి. శ్రీవారానతిచ్చినట్లుగానె సాయంత్రము వరకు మంత్రించిన తీర్థమునే సేవించితిని. ఆ మంత్రించిన తీర్థము సమాప్తికాగానే అంతమందుకొద్ది తీర్థము మిగిలియుండగా దానిని శరీరమంతట బులుముకొని, అదేచెతో నాకు బాధగాయున్నచోట బులుమితిని, (రాచితిని). ఆచోట కొద్దిగామొదటదురదబెట్టగలిగెను.ఆ దురదరానురానధికముకాగా గోకుటకారంభించితిని. అధికమైన దురదనుపశమింపఁజేయుటకు బాగా గోకనారంభింతిని. అట్లా గోకడముచేత ఎడమకాలి పిక్కకు చిన్న ఘాయమేర్పడి అందులోనుండి చెడిననల్లని రక్తముగారనారంభించినది. ఁగువనెన్ని పాత్రలుంచినను అవి నిండడముతో నాసేవలోనున్న విద్యార్థి చేవగించుకొనకుండవచ్చి, ఆ పాత్రలను ఖాళీచేసి, శుభ్రపరచియుంచేవాడు, అతడిప్పుడెక్కడున్నాడో గాని, ఆతని సేవను నా జీవితాంతము జ్ఞప్తియందుచుంకొని,నామనస్సులోనే ఆతనికి కృతజ్ఞతలు దెల్పుకుంటున్నాను. అల్లాంటి యపరిచిత ప్రదేశంలో నా ముక్కు మొఖమెరుగనివారు గూడ నాయీ భయంకరమైన విపత్తులో దోడ్పడియున్నారు. ఎంతైన అది పుణ్యభూమి. ఆర్తులపట్ల సానుభూతి,

సహృదయత, పరోపకారము జేయుటయందాసక్తి, భక్తి విశ్వాసముల కాలవాలమైన శ్రీ బసవేశ్వరుడుదయించిన పుణ్యభూమి. కర్నాటక ప్రదేశమది. కనుకనే మానవత్వము వారిలో జన్మతః వచ్చియున్నది.

ఇలా చెడినరక్తము నాలుగైదు పాత్రలుగారి పోవడముతో పోట్లు మంటల బాధ ఉపశమించగా రాత్రియందు ప్రశాంతముగా నిద్రించాను. రెండు దినములు ఇలాగె రక్తము స్రవించినది. ఆమీదట కొద్దిగా లేచి నిలబడగలిగితే గాని, ఇంకను నడువడానికి శక్తి చాలకుండెను. శ్రీ స్వాములవారొక చేతికట్టనిచ్చి కొద్దికొద్దిగా నడ్చుటకభ్యసించుమనిరి. ఐనను కట్ట చేయూతతో కుంటికాలువాడిలా నడుస్తు ఉంటిని. అదిచూచి శ్రీ స్వాములవారు "దేవరు" మీరిలా ఎన్నినాళ్ళు కుంటుతూ నడుస్తారు. అలా అయితే నీకాలు కుంటివానిలా నేర్పడుతుంది, కావున కాలును చక్కగాబెట్టి దానిపై కొద్దికొద్దిగా బరువును మోపినడవండి" అని గట్టిగా ధైర్యము చెప్పేవారు. అదే విధముగా దినదినము నడుచుటకు ప్రయత్నించితిని, ఆచెడు రక్తము స్రవించినచోట రెండు ఘాయపు రంధ్రాలేర్పడి యుండినవి. వీనిని మాన్పుటకై మొదట రెండు దినములు అందులో నేమాత్రము చెడురక్తము మిగుల కుండుటకై మొదట నబ్బుతో శుభ్రముగా గడిగి, ఆచోట గోధుమ పిండినుడికించి, దానిపై యొకింత నెయ్యిని రుద్ది, పట్టిగట్టి నాలుగైదు దినములు చికిత్స జేసితిని. ఆ తరువాత నా ఘాయమునకు తమ్మలపాకుపై కాస్తంత నెయ్యిని రుద్ది, నిప్పుపై కొద్దిగా వేడిజేసి ప్రతిదినము పట్టిని గట్టుచుంటిని, ఏ తత్ఫలితముగా పదైదు రోజులలో నారెండు ఘాయములు మానినవి. మళ్ళీ యధారీతిగా నడువనారంభించితిని, ఇంతలో నాకు పెద్ద మిత్రుడైన శ్రీ మాగణిగేరిలింగయ్య హుబళ్ళిలోని మూరుసావిర

మఠము మహాస్వాములవారివద్ద సేవలోనున్నాడని తెల్సినది, అంచేత అక్కడికి ఒక తడవ వెళ్ళి ఆతనిని జూచి మాట్లాడి చాలా ఆనందించితిని, మళ్ళి ధారవాడ మురుఘా మఠమునకు వచ్చినానిత్యకర్మలో నిమగ్నుడనైతిని, నేను శ్రీమురిగేప్పజడి శ్రీస్వాములవారి ఆశ్రమములోనుండగా

## ప్రత్యేకముగాలింగానుష్ఠానములనాచరించుట

శ్రీమురిగెప్ప జడి విద్యార్థి బి. ఏ, గారికి నాకును ప్రగాఢమైన మైత్రి యేర్పడిన విషయమును ఈ మొదలె వివరించాను. వేసవి సెలవు దినములలో నేను వారును బోర్డింగులోనే ఉంటిమి. మిగత విద్యార్థులందరు తమ తమ గ్రామములకు వెళ్ళియుండిరి. వీరు తన బి. ఏ. పరీక్షా ఫలితమునకై వేచియుండి ఖానావళి (హూటలు)లో భోజనము జేయుచుండిరి. అంతవరకు ప్రతిదినము ఉదయము నిద్ర లేవడముతోనే మృత్యుంజయ స్వాములవారు తమ కొరకు నిర్మించుకున్నట్టి ఆశ్రమమునకు వెళ్ళుచుంటిమి. ఈ ఆశ్రమము పట్టణమునకు ఒక మైలుండినది. ఇది శ్రీస్వాములవారు తమ లింగానుష్టానము జరుపుకొనుటకై మరియు ప్రత్యేకించి వేసవిలో నివసించుటకు నిర్మించుకొనియుండిరి, ఇది ధారవాడనుండి మరేవాడకు వెళ్ళే రోడ్డునకు ప్రక్కనేయుండినది. ఈ ఆశ్రమమునకు ముందు వెనుక పూల మొక్కలుండినవి, వెనుకభాగమున బిళ్వవృక్షము మరియు మంచినీటి చేదుడు బావి, దీని యెదుట చక్కగా బారులు దీర్చియున్న చేను, దీనికి చుట్టు ప్రక్కలందు కంపౌండులా ముండ్ల ఇనుపతీగ చుట్టబడియున్నది. దీని సమీపములోనే మరో దిగుడు బావిగూడ యుండినది, అద్దానికి సంబంధించిన ఒక ఇల్లు - మామిడితోట ప్రక్కనే యుండినది.

ప్రతిదినము సూర్యోదయముగాక పూర్వమే శ్రీమురిగెప్ప శ్రీ నేను ఉభయులము గలిసి ఇక్కడికి వచ్చి "సంసర్గదోషాః గుణాః భవంతి" అను సూక్తి మేరకు ఆతని సంసర్గమువలన నేనుగూడ లింగానుష్ఠానము నాసక్తితో జేయుచుంటిని, ఇక్కడ శివపూజాగృహము ప్రత్యేకింపఁబడి చిన్నదిగా నుండెను. ఆకారణముచేత ఆ గది తలుపులు వేసికొని పూజ ప్రారంభమునకు మొదట సుగంధ విశిష్టమైన మైహాక్షిని గాల్చి గది నిండ వ్యాపింపఁజేసి లింగార్చన ముగియడముతోనే ధ్యానమునకై చిత్తమును కేంద్రీకృతమొనర్చి చిత్తైకాగ్రతతో శివ ధ్యానము జేయుచుంటిమి, ఉదయము ఏడు గం॥ల నుండి తొమ్మిది గం॥ల వరకు నా మిత్రుడు జడి అనుష్ఠానమును పూర్తిజేయగా, అంతట్లోనేను సచేల స్నానమొనర్చి పత్రిపుష్పాదులను సంగ్రహించుకొని, వారు పూజాగృహమునుండి వెలికి రాగానే నేనా గదిలోకి ప్రవేశించి పూర్వోక్త విధి నాచరించి లింగాష్ఠానమునకు ద్యుక్తుడనై పది గం॥ల నుండు పండ్రెండు గం॥ల వరకు లింగార్చనాదులను పూర్తిగావించి, అంతలో ఉదికి శుభ్రపరచిన గుడ్డలను మేనదాల్చి బోర్డింగునకు మరల వచ్చుచుంటిమి. ఆ మిత్రుడు చాలా భక్తి పరుఁడు, ఎల్లప్పుడు శివధ్యానము శివచింతనలోనే కాలక్షేపమజేయుచుండెను. చలన చిత్రములనుదిలకించుట పూర్తిగా నిషేధించి యుండెను. దాన్ని జూచుటవలన చూపుమందగించుట, నిద్రలేమి అనారోగ్యమునకు లోనగుట, సాంక్రమికరోగములకు సన్నిహితులగులు. వీటిన్నింటి కాశ్రయమొసఁగిన వారమగుదుము. కావున వాటిని జూడగూడదని హెచ్చరించు చుండిరి. ఇట్టి హెచ్చరికనాపిదప నాకెంతగానో ప్రయోజకాదియైనది. డబ్బు, సమయము, వృధాగాకుండెను.

# శ్రీ మృత్యుంజయ మహాస్వాములవారి ప్రకోపము

ఇట్టితరి నా మిత్రుడు శ్రీ ముడిగెప్పజడి గారు ఒకపరి స్వగ్రామమునకు వెళ్ళే సందర్భము వాటిల్లినది. బస్సుకు వెళ్ళే సమయము కొద్దిగా ఉన్నందున వారు త్వరగాలింగార్చనను ముగించుకొని, తెల్లని ధోవతి, తెల్లని చొక్కా, దానిపై తెల్లకోటును, దొడగుకొని, ఎదపై ఎడమవైపున శ్రీ శివయోగీశ్వరుని చిత్రము ఒక వైపు శ్రీ బసవేశ్వరుని చిత్రము మరోవైపునున్న మిడిల్ (పదక)మును ధరించి నుదుట భస్మత్రిపుండ్ర రేఖలనుదాల్చి, ముఖమున చిరునవ్వు చిందులు వేయగా సయమము సమీపించినందుకు ఒక సెలవు చీటి ముక్కను నాచేతికిచ్చి, ఈచీటిని తపాలా డబ్బలో వేయుము. శ్రీస్వాములవారక్కడే గూర్చుని ఉన్నారు. ఇప్పుడు వారి దర్శనమునకై వెళ్ళితినా? వారి ప్రసంగముతో నేను వెళ్ళేబస్సు వెళ్ళిపోతుంది. కావున దయజేసి మీరు మరచిపోకుండ ఆ డబ్బాలో వేయమనిచెప్పి తాను వెళ్ళిపోయెను. సరే మంచిదని చెప్పి నేను దానిని బుచ్చుకొని, అదే సమయమున నేను నివసించి యుండిన గదిలోని, దుమ్ము, ధూళిని దూసునుదొలగించు చుంటిని, ఈ పనిలో శ్రీ జడిగారిచ్చిన చీటి. ముక్కుడైన పడిపోతుందేమోననెడు భయముచేత మొదట ఆ చీటిని డబ్బాలోవేయుటకు వెళ్ళితిని, శ్రీ జడిగారు అలా సెలవు చిట్టిని వ్రాసి ఇవ్వని యెడల మళ్ళి వారు తమ గ్రామమునుండి దిరిగివచ్చిన పిదప వారికి విద్యార్థి బోర్డింగులో ప్రవేశమునకవకాశముండదు. కావున వారు చిట్టి వ్రాసి నాకిచ్చియుండిరి. నేను గూడ యేమరు పాటుతో మరిచియుండిన అథవా వారు ఇచ్చిన చిట్టి యెక్కడైన పడిపోయినచో వారికి బాధగలుగుతుందని దలపోసిముందా చీటిని

డబ్బలో వేయడానికి వెళ్ళితిని, అప్పుడా డబ్బాకు చేరువలోనెయున్న అరుగుపై గూర్చుండి యుండిన శ్రీ వారు నావైపుజూచి డబ్బలో వేయబోయిన చిట్టినిగూడ జూచి అదియెవరిదనినన్ను ప్రశ్నించిరి. నేను మురిగెప్పజడిగారిచ్చివెళ్ళినారని, అంటిని. అదివిని వారు నీవెందుకాతని చిట్టిని దీసికొంటివి? ఆతనికిని నీకునుగల సంబంధమేమి"? అని యావేశముతో నన్ను గట్టిగా మందలించిరి. ఏది ఆ చిట్టి ముక్క నిక్కడిమ్మని కోపముతో నడిగిరి, నేను వారావేశముతో నున్న ముఖ ముద్రను పరుష వాక్యములను జూచి, విని, జడిసి వణుకుతు దూరము నుండే ఆ చిట్టి ముక్కను వారి యెదుట ఉంచితిని? ఆ దినము అదృష్టవ శాత్తుగా దెబ్బలుదినేసందర్భముదప్పిపోయినది. "యతీనాంకోపచాండాలః పశూనాంగార్ధభః పక్షిణాంకాక చాండాలః" అను ఉక్తి ననుసరించి సన్యాసులకు కోపము చాండాలమువంటిదని చెప్పబడినది. వారికున్న సుగుణములతో నీక్రోధమనె దుర్గుణమొకటి వారికి కళంకమునాపాదింపఁ జేసినది. వారికి కోపము వచ్చిన సమయములో పెద్దాచిన్న తారతమ్యము లను సహితము పాటించకుండ తన చేతి కఱ్ఱతోనో లేదా కాలి పాదుక తోనో బాదేవారు. ఆ సమయంలో నెవరిని లక్ష్యపెట్టకుండిరి.

స్వాములవారు విద్యాలు నివసించే ప్రాంగణమునందలి శ్రీ శివ యోగి గారి మూర్తికి ప్రదక్షిణ యొనర్చు రూపములో ఉదయం 6—7 గం॥ల మధ్యలోను సాయంత్రము 5—6 గం॥లకు మధ్యలో విద్యార్థు లుండే గదులకు ముందున్న కొట్టిపాటి వసారాలో వేగముగా ప్రదక్షిణ యొనర్చె పరిపాటి వారికుండెను. అదేమేరకు ఒకనాడు సాయంత్రము 5—కి 6 గం॥ల ప్రాంతములో యథా రీతి ప్రదక్షిణ జేయుచుండిరి. వారెల్లప్పుడు తలపై చెవులవరకున్న కుళ్ళాయి (టోపి, కాన్టోపి)

కావిటీ, నుదుట తెల్లని త్రిపుండ్ర భస్మము, మెడలో కావి వస్త్రముతో జుట్టియుంచిన యెదపై లింగము, నిలువుగా దొడిగియున్న కావి కవని (జుబ్బ) కాళ్ళకు పట్టీలమర్చిన కఱ్ఱపాదుకలు, వారు వేగముగా నడుస్తు ఉండే ఆకావికవని ఫఠ ఫఠ అని శబ్దము, అల్లంత దూరములో వచ్చు చుండగానే వినబడుచుండెను, వీరి భయమునకు జడిసియే విద్యార్థి గూడ తమ గదులముందు గూర్చుండి మాట్లాడుటగాని, తిరుగాడుటగాని, జేయ కుండిరి. అట్టి సాహసమెవరిలోను లేకుండెను. కనుక గది తలుపులు మూసికొని లోనే ఉండి చదువుకొనుచుండిరి, ఆకస్మాత్తుగా వారు అలా గదులముందు సాయంత్రము ప్రదక్షిణయొనర్చు సందర్భమున వారి దృష్టి ఒక విద్యార్థి తలుపు సందులోనుండి జూచిరి. ఆగదిలోని విద్యార్థి సాయం సమయము వెలుపలి కిడికిలో దర్పణముంచి రీజరు(మిషస్)తో తన గడ్డమును గీక్కొనుచుండెను. దానిని పసిగట్టి మహాఉగ్రావేశముతో మొదలు గది తలుపును దట్టి యెవరిందులో తలుపు దీయండి, అని దీయించి అతడా సమయంలో క్షౌరము (గడ్డము కొరగుకొనుటను) జేసికొనుటను దర్శించి పట్టరాని యావేశముతో నాతని చెంపపై వీపుపై బాగాబాది, ఆతని టేబల్ గడియారమును దీసి నేలకువిసరి. పుస్తకము లను చిందర వందరముగా విసరేసి, ఈ స్థలము శివశరణులు బసవాది ప్రభుధులు మరియు శివయోగి నివసించిన పుణ్యస్థలమియ్యది, దీనిని నీవు క్షౌరశాలగా మార్చావా? ఎంత ధైర్యము నీకు. నీవిక్కడ ఒక క్షణముగూడ ఉండరాదు. వెళ్ళిపొమ్మని" గట్టిగామందలిస్తు ఉండేను విద్యార్థులందరు తమ గదుల్లోనే ఉండి ఒకొక్కప్పుడు కాస్త తలుపులు దెరిచి తొంగిచూస్తు ఉండిరి. పాపమా విద్యార్థి సగము గీసుకొన్న గడ్డ ముతో గడగడ వణకుతు తప్పైంది క్షమించుమని శ్రీ వారిపాదములపై

బడి ప్రాధేయపడుచుండెను. ఇంకను ముందెన్నడు ఇట్లుజెయ్యనని వేడు కొనెను. కోపము వచ్చిన సమయములో శ్రీ స్వాములవారు సాక్షాత్తుగా ఉగ్రస్వరూపములో నున్న వీరభద్రుడిలా మారిపోవుచుండిరి. అప్పుడు వారిని సాంత్వనమొనర్చుట మెరికిని సాధ్యపడేదిగాదు. మరి వారు శాంతి వహించినప్పుడు మాత్రము వారియంతటి దయార్ద్ర హృద యులు ఈ లోకములోనే లేరన్నట్లుగా ప్రవర్తించుచుండిరి. పిల్లల్లో పసిపిల్లవాడిలా, పెద్దల్లో పెద్దవారుగా మెదలుచుండిరి. ఈ సౌహార్ద్రతా గుణము నేను వారివెంట సాయంత్రము వేళ్ళలో వాహ్యాళికి వెళ్ళినప్పుడు నా అనుభవమునకు వచ్చియుండినది. వారు నన్ను సంబోధించి "రాచోటి మరిదేవరు" ఎవరేగాని మొదట మా చెంతకు వచ్చేప్పుడు "మ్యావ్" మంటు వచ్చి ఆ తరువాత "గుర్ గుర్ గుర్" మంటు గురువులుగా మారిపోతారు? దీనికి కారణమేమైయుండును?" అని నన్ను ప్రశ్నించే వారు. అనాథులుగా తనకడకు వచ్చినవారికి ఆశ్రయమివ్వడము, అదు కోవడము. అతిథులకు కొద్ది డబ్బుతో టెంకాయతో, నాశీర్వదించడము, ఆప్యాయతతో భోజనము జేయించి వారితో ఆప్యాయతతో మాట్లాడము వారి సహజ స్వభామైయుండినది. ఏలనన నేను వారి సన్నిహిత సేవలో నుంటిని గనుక రెండుమూడు సంవత్సరముల అనుభవము నాకుకద్దు. అప్పుడు నన్ను చెంతకు చేరదీసికొని పాద సంహానము గావించు కొనుచుండిరి. అందుకే పెద్దలు తమ యనుభముకొలది ఇట్లువాకొని యున్నారు.

"వజ్రాదపి కఠోరాణి—మృదూనికు సుమాదపి" అని మహా పురుషుల యొక్క హృదయము కోపము వచ్చిన సమయములో పర్వత ములను ఛేదించే ఇంద్రుని వజ్రాయుధముకంటెనుబహుకఠినముగా మారు

తుందట. దయతో నిండిన వారి హృదయము మల్లె పుష్పము కంటెను మెత్తగా మారుతుందట. అల్లాగే వీరి హృదయముగూడ ఉండెను.

## ధారవాడ బోర్డింగు విద్యార్థుల క్రమశిక్షణ

ధారవాడమురుఘా మఠము బోర్డింగులో జేరిన సంస్కృత విద్యార్థులు మఱియు ఆంగ్లము నభ్యసించే విద్యార్థులు కలిసి తెల్లవారక మునుపె సుమారు 4—30 ఐదు గం॥లకు ప్రార్థన గంటను ప్రయోగించ డముతో విద్యార్థులందరు సంక్షిప్తంగా ముఖప్రక్షాళనము గావించుకొని, నుదుట భస్మమును ధరించుకొని, వచ్చి శివయోగి మూర్తికి సాష్టాంగ నమస్కారము జేసి శివయోగ మందిరమునకు విచ్చేసినవారెదుట రెండు వరుసలుగానిల్చి ముకుళిత హస్తములతో ఈ విధముగా శ్రీ శివయోగుల వారి స్తోత్రమును గావించుచుండిరి.

ఏళో మహాజ్ఞాని శివయోగి మునీశ్వర
తాళ మృదంగ బ్రహ్మనాద ఘోషావకేళో ॥ఏళో॥ పల్లవి

ఆ ప్రశాంతమైన వాతావరణములో నెమ్మదిగా విద్యార్థులు కల్సి పాడుతు ఉంటే నిజంగా ఆ శివయోగులవారు నిద్రలేచి కూర్చుని ఆలకిస్తున్నారా? అనిపిస్తుండేది, ఒక అరగంట సేపు ఇట్లు ప్రార్థించి విద్యార్థులు తమ తమ గదుల్లోకి వెళ్ళి తమ పాఠ్య పుస్తకములలోని విషయములను బఠించుచుండిరి. ఒక్కొక్కసారి శ్రీ జగద్గురుజయ దేవ మురుఘేంద్ర మహాస్వాములవారు చిత్రదుర్గమునుండి ఇక్కడి జాత్రా రథోత్సవ సమయములో విచ్చేసినపుడు రాత్రి లింగార్చన ముగించుకొని బసవాది ప్రమథాశ్రమము మేడపై పరుండియుండగా విద్యార్థులు తెల్లవారు ఝామున శివయోగుల వారి యెదుట జేసే మేలు

కొల్పు ప్రార్థనను శ్రీ జగద్గురువులవారు రాత్రి పరుండియున్న జనవాడి ప్రమధాశ్రమము యొక్క ద్వారము ఎదుట విద్యార్థులంతా రెండు వరుసలుగా బారులు దీరి నిల్చుండి ప్రార్థన జేయుచుండిరి. తరువాత విద్యార్థులు కాలకృత్యములను దీర్చుకొని ముఖ ప్రక్షాళనము స్నానము లింగార్చనాదులను ముగించుకొని మళ్ళి తమ గదుల్లోకి వెళ్ళి పాకము సిద్ధమయ్యేవరకు తమకు కళాశాల, ఉన్నత పాఠశాలలో బోధించిన విషయములను అధ్యయనము జేయుచుండిరి. నేనుగూడ వారితో బాటే సంస్కృత పాఠములను అధ్యయనమును జేయుచుంటిని. సుమారు తొమ్మిది గంటలకు భోజనపు గంటను మ్రోగించడముతోనే విద్యార్థులందరు తమ తమ కంచములను నీరుత్రాగే చెంబులతో భోజన శాలలో తమ తమ స్థానములలో ఉపస్థితులగుచుండిరి. అక్కడగూడ శివనామ సంకీర్తనా పరమైన సంకీర్తనములను రెండింటిని ఒకరిద్దరు మొదట జేపుతు ఉంటే మిగత విద్యార్థులు వారి ననుకరించి ఏకకంఠ ముతో పాడుచుచుండిరి. ఆ పిదప అరువది మూడుమంది పురాతనులలో ప్రతిదిన మొకరి కథను విద్యార్థులలో పంతులవారిగా ఒకొక్కరు చిన్న పుస్తకములో సంక్షిప్తముగా నుండిన ప్రమథుని కథను జదివి వినిపించే వారు. నేడు ఎవరి ప్రసాధమనగా ఆనాడు పంక్తిలో కథను జదివి వినిపించిన ప్రమథుని ప్రసాదమని చెప్తారు. ఈ పేరును విద్యార్థు లందరు తమ తమ జ్ఞప్తియందుంచుకోవాలి. కారణమేమనగా అక్కడే భోజనశాలకు దగ్గరనున్న గదిలో శ్రీ మృత్యుంజయ స్వాములవారుం టారు. వారు అకస్మాత్తుగా భోజనశాలలోకి విచ్చేసి "ఈనాడు ఎవరి ప్రసాదమని" వారు ప్రశ్నించినప్పుడు ఆ విద్యార్థి తడుముకొనకుండ తటాలున తాను విన్న ప్రమథుని పేరును జెప్పితీరాల్సిందే. లేని యెడల స్వాములవారికి కోపము వచ్చేది. ఈ భోజనాశాలలో ఒక వైపు, గోడ పై

విద్యార్థులు పాటించవల్సిన నియమావళి బోర్డు ఒకటి. మరియు అరువది మూఁడు మంది పురాతనుల పేర్లతోనున్న బోర్డు మరొకటి. వ్రాసి యుంచబడినవి, నేను మాత్రము ఈ విద్యార్థులతో బాటు భోజనశాలలో భోజనమునకు వెళ్ళకుంటిని. ఏలనను నేను స్వాములవారి సేవలో నుంటిని. కావున ఉదయము సుమారు ఎనిమిది గంటలకు వారి సేవ కొరకు వెళ్ళి శ్రీ స్వాములవారి స్నానమునకు బావినుండి నీరు దోడి అండాలు నింపి, వేడిజేసి, పిదప పూజాగృహములో స్వాములవారికి ఆసనమువేసి పూలు—వత్రి - అక్షతలు, గంధము ధూప—దీపము—పూజా సామగ్రి నంతటిని ఆయత్తపరచి యుంచెడివాడిని. ఒక్కొక్కసారి అతిథులెందరు వచ్చినను అందరికిని స్వాములవారితో బాటు వారందరి కిని పూజా సామగ్రిని సంగ్రహించి ఉంచాల్సిందే.

ఇట్లు శ్రీ వారి పూజా భోజనములు సమాప్తి అయ్యేవరకు మధ్యాహ్నము పండ్రెండు ఒంటిగంట సమయమగుచుండెడిది. అప్పుడు గాని నేను భోజనముజేసి "శివానుభవకాలేజికి వెళ్ళి సంస్కృత పాఠములను అక్కడి ఆచార్యుల వారితో జెప్పించుకొని, అక్కడే సాయంత్రము ఐదుగంటల వరకుండి, బోధించిన పాఠముల నభ్యసించు చుంటిని, ఆసమయములో కావ్యతీర్థ పరీక్షకు మొదటిసోపానమైన ఆద్య పరీక్షకై యత్నించు చుంటిని, పంచకావ్యములలో మొదటి కావ్యమైన రఘువంశమును శ్రీ తాళికోటిచన్నవీరశాస్త్రిగారు వారు లేని సమయములో శ్రీ మాన్‌కొంగోడు వీరభద్రశాస్త్రిగారు పాఠములను బోధించు చుండిరి.

ఈ కొంగోడు వీరభద్రశాస్త్రిగారు గొప్ప పండితులు వ్యాకరణము- సంస్కృతసాహిత్యములను కాశిలో ఉండి అధ్యయ

నము జేసినారు. వీరిసహాధ్యాయులుగా జగద్గురు శ్రీ జయదేవమురుఘా రాజేంద్ర మహాస్వాములు చిత్రదుర్గగారు. జగద్గురు శ్రీ వాగీశ పండి తారాధ్య శివాచార్యులు శ్రీశైల సూర్యసింహాసనముగారు, శ్రీ సంగ మేశ్వరశాస్త్రిగారు నారాయణపేట మఠము. శ్రీ కోడన్‌గల్లు కెంపిన సమయాధ్యక్షులని, తెలంగాణాలో ప్రఖ్యాతిగాంచిన విరూపాక్షానంద మహాశ్వాములవారు, వీరు న్యాయశాస్త్రము, వేదాంతము సాంఖ్యామీమాం సాది శాస్త్రములలో పారంగతులై యుండిరి. మరియు వేదాంతాచార్య పరీక్షతో నెగ్గిన శ్రీ గురుసిద్ధస్వామి కల్లిన మఠము, బైలు హోంగలు. వీరందరు ఒకే కాలములో కాశిలో సంస్కృతాధ్యయనముజేసి పట్ట భద్రులైనవారు. వీరిలో మరో ముగ్గురు సుప్రసిద్ధ పండితులుండిరి. వారిలో మన ఆంధ్రప్రదేశమునకు (తెలంగాణా) నల్లగొండ జిల్లా వే॥ పండిత చిదిరే మఠము వీరభద్ర శర్మగారు, వీరుమొదలు యాదగిరిలోని శంకర సంస్కృత కాలేజికి ప్రిన్సిపాలుగా నుండి. అటనుండి సికింద్రాబాదుకు వచ్చి శ్రీ మటిగె నాగయ్యగారి ధర్మశాలలో స్వయముగా గురుకులమును స్థాపించిరి. వీరు తరువాత కాశిజంగను వాడి మఠము శ్రీ జగద్గురు జ్ఞానసింహాసనము నధిష్ఠించిరి.వీరికి తోడుగా శ్రీ కాశీనాథశాస్త్రిగారు నాగనూరు బృహన్మఠాధ్యక్షులు వీరుభయులు జగద్గురు పంచాచార్యులపేరు ప్రతిష్ఠలకై నిరంతరము కృషిసల్పిరి. వీరశైవ సంస్కృతి సాహిత్యములకు సంబంధించిన యనేక గ్రంథములను తాళపత్ర గ్రంథములను పరిశోధించియనేక గ్రంథములను కన్నడ - తెలుగు-సంస్కృతములలో వ్రాసి ముద్రించి పకటించిరి. ఇంతేగాకుండ శ్రీ కాశీనాథసాస్త్రి బృహన్మఠగారు "పంచా చార్యప్రభ", అను పత్రికను శ్రీ వీరభద్ర శర్మగారు "విభూతి" యను మాసపత్రికను తెలుగులో నిర్వహించిరి. ఇదిత్వరలోనే ఆగిపోయి

నది.కాని పంచాచార్య ప్రభపత్రిక కన్నడమున నేటికిని వెలువడుచున్నది. వీరితోబాటు శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారు వ్యాకరణతీర్థ వీరి శిష్యులము. మేము: ఈ తరములోని వారమేవీరు యాదగిరి శంకర సంస్కృత కాలేజికిప్రిన్సిపాలుగా నుండిరి. శ్రీ పగడదిన్ని బసవరాజశాస్త్రి గారంతి మసమయంలోహుబళ్ళి మూరూసావిరమఠము సంస్కృత పాఠశాలో ఉపాధ్యాయులుగా నుండిరి. శ్రీ జగదీశశాస్త్రిశోలాపురులోని సంస్కృత పాఠశాలోపాధ్యాయులుగా నుండిరి. మైసూరురాజాగారి యాస్థానములో ఉమ్మచిగిగురుశాంతశాస్త్రి సంస్కృతములోనుద్దండ పండితులు. గౌరిశంకరశాస్త్రిగాడు. వీరుకాశీలో సంస్కృతమునభ్యసించున్న సమయములోనె ఒక గొప్పపండుతుల సభలో లింగధారణ చంద్రిక అనుగ్రంథముపై సుదీర్ఘముగానుపన్యసించి అక్కడి పండితుల నందరిని ఆశ్చర్యచకితులగావించిరి. ఇల్లాంటి ఉద్దండపండితులుండ బట్టిఆకాలములో వీరశైవధర్మము ఉన్నత పతాకస్థాయినందు కొని యుండెను. కర్నాటకములో పండిత విరూపాక్షఒడెయార్ అనువారు గూడ వాసిగాంచిన వారుగానుండిరి.

పరశివ్యాజ్యము (కేసు)లో వీరశైవులే నిజమైన లింగిబ్రాహ్మణులని నిజాముకాలములో హైకోర్టువారు పరిష్కారముగావించిరి.

హైదరాబాదు నగరమునకు జెందిన శ్రీబాపురావకీలుగారు జ్యోతిర్లింగములను దర్శించుటకై వెళ్ళినపుడు పరశివైద్యనాథ జ్యోతిర్లింగము నభిషేకించబోయిరి. అచటనున్న బ్రాహ్మణపూజారులు మీరుశూద్రులు మీకీలింగమునుస్పృసించి పూజించె అధికారము మీకులేదనియు నిషేధించిరి. (నివారించిరి) అదివిని బాపురావు అడ్వోకేటుగారికి యెక్కడ లేని అభిమానము. ఆవేశమువచ్చి మేమెనిజమైన లింగిబ్రాహ్మణుల

మీరే శూద్రులని వాదించిరి, దీని పరిష్కారమునకై వారు హైద్రా బాదుకు దిరిగివచ్చి హైకోర్టులో కేసుబెట్టి కర్నాటకాంధ్ర మహారాష్ట్ర ప్రాంతములనుండి ప్రఖ్యాతిగాంచినపైననేనీదివరకు పేర్కొనిన పండితులను నగరమునకు రప్పించి వారికవసరమైన భోజన, వసతు లను గల్పించి, వారికి గావల్సిన వీరశైవ ధర్మమునకు సంబంధించిన ప్రాచీన గ్రంథములనుగూడ దెప్పించిఇచ్చి, పండితులకు సర్వవిధముల సహకరించిరి. కోర్టులోవాదించుటకై ప్రధానముగా శ్రీవిరూపాక్షపండిత ఒడేయారుగారిని నియమించిరి. వీరు సంస్కృతములోను మరియు న్యాయశాస్త్రములోను ఉద్దండపండితులుగాబట్టి వాదమునకుదగినన్ని యాధారగ్రంథ ప్రమాణములను సంగ్రహించి వాదించడముతో సరియైన సమాధానములనొసఁగడముతో, ఎదుటి బ్రాహ్మణపండితు లందరిముఖాలుకాంతి హీనములైనవి. శ్రీవారిసిద్ధాంతపరమైన వాదన పటిమ ప్రభావముచేతనాడు వీరశైవులకు హైకోర్టులో విజయము లభించినదని పరిష్కారప్రతమును శ్రీ పం॥కాశీనాథస్వామినాగనూరు బృహన్మఠాధ్యక్షులు గ్రంథరూపమున కన్నడభాషలో సాధారము లతో బ్రకటించియున్నారు. దానిని నేటి వీరశైవులందరు జదువల్సిన గ్రంథమది.

ధారవాడమురుఘా మఠమునకు సంబంధించి ప్రతియేట చైత్ర మాసములో రథోత్సవము గొప్పగాజరుగుచుండేది. ఈ సమయములో అనేక ప్రాంతములనుండి కవులు-గాయకులు-పండితులు-కీర్తనకారులు, జానపద గేయకారులు-సంగీత విద్వాంసులు- మహావిద్యావేత్తలు- నవీనకలాకౌశలము గలవారు. అక్కడికి విచ్చేసి తమతమ పాండిత్య ప్రతిభను. కలానైపుణ్యమును. ప్రదర్శింపఁజేయుచుండిరి. మరెన్నో

వినోద పుక్రీడలను-మల్లయుద్ధములను. గూడ ప్రదర్శించు చుండిరి. ఈజాత్రామహోత్సవసమయములో మైసూరు, దావణగేరి. బెంగళూరు మొదలగు గొప్పగొప్పనగరములనుండి ప్రసిద్ధిగాంచిన విద్వన్మణులు అక్కడికి విచ్చేయుచుండిరి. ఆయెనమిరోజులు అగంతుక అతిథులసేవ యొనర్చుటడనే అక్కడి సేవకులకు వీరిపరిచర్యతోనే, సయము గడచిపోవుచుండెను. కొంచమైన విశ్రాంతి వారికి లభించకుండెను.

ఈ ధారవాడ నగరమునకు "సమీపములోనే హుబ్బళ్ళి నగర ముంది. ఇది గూడ పెద్ద పట్టణము, ధారవాడ జిల్లా కంటెను ఇది గొప్పది. "ఛోటాముంబయి" అనే పేరుగూడ ప్రజల వాడుకలోనున్నది. ధారవాడను తాలూకాగాను.హుబ్బళ్ళి పట్టణమును జిల్లాగాను, మార్చినచో సార్థక్యముగానుండేది. ఈ పట్టణము అతి విశాలములైన సిమెంటు రోడ్లతోను, విద్యుద్దీపాలతోను, జలయంత్రములతోను, ఉపవనముల తోను, గొప్పగొప్ప మేడలతోను, సినిమా థేటర్లతోను, చాలా అందము గాను. చూడముచ్చటగా నుండినది. ధారవాడను మించిన అధిక జన సంఖ్యఇట ఉందని వింటిని. ఆ కాలములోనే ధారవాడనుండి నేరుగా హుబ్బళ్ళికి వెళ్ళడానికి ఒక విశాలమైన సిమెంటు రోడ్డు ఉండినది.

నేను నా మిత్రుడైన లింగయ్యను మరోసారి కల్సి మాట్లాడు టకు వెళ్ళితిని. అతడు హుబ్బళ్ళిలో సుప్రసిద్ధమైన "మూరుసావిర మఠాధిపతులైన శ్రీ మన్నిరంజన ప్రణవస్వరూపులైన శ్రీ గురుసిద్ధ మహాస్వాములవారి సేవలో నియుక్తుడైయుండెను. ఈ మఠము చాలా గొప్పది. లక్షలా స్తితో గూడినది. ఒకటి ఏనుఁగు ఒక కారు శ్రీస్వాముల వారు పర్యటించడానికి ఉండెను. అంతేగాకుండ ఈ మఠమునకు

మూఁడువేల శాఖామఠములుంటచేత దీనికి "మూరుసావిర మఠము" (మూఁడువేల మఠములు గలది) అను నామమేర్పడియున్నది. ఇక్కడ గూడ శ్రీ స్వాములవారు ఆంగ్ల మరియు సంస్కృత విద్యార్థుల అన్ని సౌకర్యముల కొరకు బోర్డింగు మరియు లాడ్జింగు (భోజన వసతులను) ఏర్పరచియున్నారు. విద్యార్థులు సుమారు వందమంది వరకుండిరి. ప్రతిదినము సాయంకాలమున శ్రీస్వాములవారి సమక్షములో శివకథా (కీర్తన) పురాణ శ్రవణము జరుగుచుండెను. (శ్రావణమాసములోని కార్యములు) శ్రావణ మాసములో ప్రతి సోమవారములో నేదైన ఒకటి తీపివంటకములు జేయుచుండిరి. మా మిత్రుడు నాతోగల్సి నన్ను అత్యంత గౌరవముతో అప్యాతతో బలుకరించి దగిన ఉపచార మొన ర్చెను. నేనక్కడికి వెళ్ళినది శ్రావణ సోమవారము గనుక బూంది - బేసను లడ్డూలు జేసి యుండిరి. సాయంత్రము పురాణ శ్రవణమునకు స్థానిక పురప్రముఖులు స్త్రీలు పురుషులు వేలాది సంఖ్యలో తండోప తండాలుగా వచ్చి ఈకార్యక్రమములో పాల్గొనిరి. మఠమత్యున్నతమైనది. రెండంతస్తుల మేడ. మఠమునకు ముందు భాగమున రెండే రెండు బలమైన అత్యంత ఉన్నతములైన కట్టు స్తంబాలపై పైకప్పునమర్చి యున్నారు. ఆ స్తంభాలౌన్నత్యమును జూచిన వారు ఆశ్చర్య చికితు లౌతారు ఆపైన స్తంబాలకు, సరములకు, అక్కడక్కడ పెద్ద తేనె టీగలు బెట్టిన అతి విశాలమైన తేనె తుట్టలు వ్రేలాడు చుండును. ఇక్కడ గూడ శ్రీ గంగాధర మహాస్వాములవారి సమాధి ఉంది. దానిపై ప్రజలందరికి దైవభక్తి యుంటవలన అక్కడికి గుంపు గుంపు లుగా వచ్చి ప్రదక్షణ లొనర్చి కాయకర్పూరముల నర్పించి తత్తీర్థ ప్రసాదములను స్వీకరించి వెళ్ళుచుందురు. ప్రతియేట ఇక్కడగూడ రథోత్సవము జరుగును. ఈ రథము ధారవాడ దానికంటెను చాలా

అందముగాను ధృఢముగానున్నది. దీనిని కట్టె చెక్కలతోనే నిర్మించారు. శ్రీ స్వాములవారు గూర్చుండే సింహాసనము చాలా అందముగానున్నది. మక్మల్ గద్దె లమర్చబడినవి, సింహాసనమునకు రెండు వైపుల వింజామరములను విసరే వారిద్దరు సేవకులుందురు. వెండి బత్తళికలను చేతబూచి చెప్రాసీలు పట్టా ఎడమ భుజముపైనుండి కుడి భుజమునకు దిగువన "మూరుసావిర మఠము హుబ్బళ్ళి" అని పెద్ద అక్షరములతో గుట్టించిన ఒక పట్టానువేసికొని నిల్చున్న ఒక సేవకుడు గూడ స్వామి సింహాసనము ప్రక్కనే నిల్చొనియున్నారు. స్వాముల వారికి అక్కడికి వచ్చిన భక్తులందరు మొదట సాష్టాంగ నమస్కార మొనర్చి అక్కడే గూర్చుంటారు. సీర్కావిజిలుగు (సన్నని) వస్త్రములను ధరించియున్న మహాస్వాములు కొందరు శ్రీవారిసింహాసనమునకు కుడిప్రక్కన ఉపవిష్ఠులై యున్నారు. వారికి యెడమ ప్రక్కన ఆస్థాన పండితులుపస్థితులై యున్నారు. సింహాసనమునకు వెనుకభాగమున స్వేత ఛత్రమును చేతధరించియున సేవకుడు. మరియు ఇద్దరు భట్రాజుల మాదిరి శ్రీ మహారాజాధిరాజ వందితపాద పద్మవిరాజ మానశ్రీ మన్నిరంజన ప్రభవస్వరూప మూరుసావిరమఠాధిష్ఠిత కుమార సమయాధ్యక్ష శ్రీశ్రీశ్రీ గురుసిద్ధ మహాస్వామీనాం బహుపరాక్" అను నినాదములు మధ్యమధ్య వినబడుచుండెను. ప్రాంగణమునందు స్త్రీ పురుషులు, ఆ బాలవృద్ధులు, పురాణ శ్రవణమునకై కూర్చొనియున్నారు.

ఒకనాడు మధ్యాహ్నము స్థానిక భక్తుడొకడు మాకు విందుకాహ్వానించియుండెను. శ్రావణ మాసములో అక్కడి భక్తులు జంగమామూర్తిని అత్యంత భక్తితో బూజింతురు. మహేశ్వరులు అనగా వారు సాక్షాత్తుగా భూలోక రుద్రులుగానే భావింతురు. శ్రావణమాసములో వారు

ప్రతిదినము జంగమామూర్తి యొక్క పాదార్చన యొనర్చి వారిచేత పాదోకప్రసాదములను స్త్రీ పురుషులు మరియు నా బాలవృద్ధులు భక్తితో స్వీకరింతురు, జంగమామూర్తి యొక్క పాదపూజను గావించు తరి చూడ ముచ్చటగా రకరకాల సుగంధ పుష్పములు బిళ్వపత్రములతో నలంకరించెదరు. సాక్షాత్తుగా శివుని విరాటాకారముగా యొనర్చి రంగు రంగుల విద్యుద్దీపములతోడను, వస్త్రాలంకారములతోడను, రుద్రాక్ష మాలలతోడెను అలంకరించి టెంకాయ కర్పూర దూపదీప నైవేద్యము లను భక్తిమీరగ సమర్పించి పూజింతురు. దీనినుండి అక్కడి భక్తులకు జంగములయందు ఎంతటి భక్తియుండునది మనము ఊహించుకొనన దగును. ఇట్టియద్భుతమైన మేమెన్నడునుజూడమైతిమి. గనుక మాకు చాల కనులవిందొనర్చెను, ఒకరెండు దినములక్కడఉండి మరల నేను ధారవాడ నివాసమునకు వచ్చితిని.

నేను ధారవాడకు వచ్చిన ఇరువది రోజులకు మాగణి గేరిలింగయ్యగారు (నా పూర్వపు మిత్రుడు హుబ్బళ్ళి నగరము మూరు సావిర మఠములో నుండినాతడు) తన గ్రామమునకు వెళ్ళె ఉద్దిశ్య ముతో అలాగే ధారవాడలో నున్న నన్ను చూచిపోవడానికై వచ్చెను. సరె నేనుగూడ అతనితోబాటే వెళ్ళడానికి సిద్ధుడనై మరునాడు ఉదయ మునందే తాలూకా సవదత్తి వెళ్ళు బస్సుకు ప్రయాణమైతిని, కాని మా గ్రామమునకు వెళ్ళడానికి డబ్బులేక యుండెను. మిత్రుడు లింగయ్యా వద్ద గూడ అతనికి సరిపోవునంత డబ్బే ఉండెను. అది గుర్తించి నేను సవదత్తిలోనే ఉండిపోయితిని. కారణమేమనగా ఇక్కడి మఠాధిపతులైన శ్రీ గురుసిద్ధమహాస్వాములవారు ధారావాడకు విచ్చేసిన ఒక సందర్భములో వారితో "నేను మా గ్రామమునకు వెళ్ళదలంచు

కున్నాను" అని చెప్పడంతోనే వారు నాతోనిట్లు చెప్పిరి. "నీవు మీ గ్రామమునకు వెళ్ళే సమయములో నన్నొకతడవ గల్సి వెళ్ళమని చెప్పియుండిరి." నాపై వీరికి చాలా ప్రేమయుండేది, చనువుగా వీరు నాతో మాట్లాడేవారు కారణమేమనగా మా విరూపాక్ష స్వాములవారు వీరును కాశిలో నున్నప్పుడు సహాధ్యాయులు, కనుక ఆ అభిమానము వారిలో నుండియుండెను, అందుచేత నా మార్గ వ్యయమునకు వారేదైన కొద్ది డబ్బు సహాయ్యము చేస్తారనే విశ్వాసముతో వారి మఠమునకు వెళ్ళితిని. కాని వారెల్లప్పుడు శిష్యసంచారములో ఉంటారు.మహావైరాగ్య ప్రవృత్తి గలవారు, మఠమునకు నేను వెళ్ళగానే ఆ స్వాములవారు లేరని ఆ మఠములోని శ్రీవారి బంధువులు చల్లనివార్తను మెల్లగా నాకువినిపించిరి.. కాననా ప్రయాణమంతటితో నాగిపోయెను, నా మిత్రుడు వెళ్ళిపోయెను. నేను అయోమయస్థితిలోకి జారితిని, సరే నేనిప్పుడెక్కడ నివసించేది? నా భోజనమెక్కడ? అని నాలోనేను అక్కడే ఉండి విచారగ్రస్తుడనై యుండగా నాదీనస్థితిని పసిగట్టిన మఠమువారు ఆ మఠమున కెదురుగా నున్న గుట్టను నాకు జూపి అక్కడ ఒక భక్తుడు జంగమారాధన జేయుచున్నాడు మీరక్కడికి వెళ్ళండని చెప్పడముతో నేను లజ్జతో తల వంచుకొని చేయునదిలేక, ఐనను నాలోని అభిమాన ప్రేరితుడనై వారితోనేనిట్లునుడివితిని. "ఎందుకండి ఖానావళికి (హోటలుకు — పూటకూటింటికి) వెళ్ళుతానులేండి" అదెక్కడుందో చెప్పమంటిని, ఆ సమయములో నాచేతిలో ఒక నయాపైసా లేకున్నను డబ్బున్న వాడిలా గంభీరముతో పలికితిని, వెంటనే వారికి నాయందు జాలిగలిగి మరల నాతో నిట్లుచెప్పిరి. "మీరు జంగమూర్తులు కనుక నేడుమావద్దనే ఉండి శివపూజభోజనమునుజేయండని వారుచెప్పిరి. అప్పుడు నాసాముల నన్నింటిని మఠములో బెట్టి స్నానము ఇష్టలింగార్చన భోజనముజేసితి,

పైగా వారు నా దీనతను గమనించి మీరు స్వాములవారు వచ్చేవర కిక్కడే ఉండండి, వారు నేడో రేపో మాపో వచ్చేవారున్నారన బల్కిరి. "పాలంబయసిదరోగిగే పాలిందౌషధవుదొరెదతెరదిం" అన్న కన్నడ సామెత ప్రకారము రోగినేడు పాలతోనన్నము భుజించాలని కోరిక గలగడము, వైద్యుడుగూడ నేటితో పాలన్నమునే భుజించుమని యాదేశించినట్లు నాకును ఆనగరములోనెవరును పరిచయము లేనందుకు మరియు గ్రామమునకు వెళ్ళుటకు గూడ డబ్బుగూడ లేనందున, అదే సమయములో వారు నన్నక్కడే ఉండుమనడము "దిక్కులేని వారికి దేవుడేదిక్కు" అన్నట్లుగా దైవప్రేరణ జరిగినది. ఈ విధముగా రెండు పూటలు హాయిగా భోజనము జేస్తు శ్రీస్వాములవారి తల్లిదండ్రులకు, అన్నదమ్ముల కనుకూలుడనై ప్రవర్తించుకుంటు స్వాములవారి రాకను నిరీక్షించుకుంటు ఉంటిని, ఆ మఠములోని వారుగూడ మొదమొదలు నాలోని ఇంగితజ్ఞానమెఱుంగక దూరస్థునిగా జూచిరేగాని, రెండు మూడు రోజులు గతించిన తరువాత నాయొక్క ఆచార విచారములను గుర్తించి (ప్రవర్తనను గమనించి) తమలో నన్నొకడిగా భావించి విశ్వసించ దొడంగిరి. క్రమేపి నాపైవారికి యధిక ప్రేమగుదిరినది. స్వాములవారి తీర్థరూపులు (తండ్రిగారు) చాలావృద్ధాప్యముగలవారు—తల్లిగారు గూడ కాస్త ఇంచుమించు అదే వయసులోనున్నది. ఐనను చాకచక్యముతో గృహకృత్యములన్నింటిని నిర్విఘ్నముగా నెరవేర్చుకొనుచుండెను. కుమారులు పెద్దవారైనను విద్యావేత్తలైనను ఆ యమ్మ చెప్పి మాటను గాదనుకుండిరి. ఆయమ్మకును నాపైనెక్కువమక్కువగలిగియుండెను స్వాములవారి తండ్రిగారంతటి వృద్ధాప్యములోనున్నను రెయింబవళ్ళు గ్రంథావలోకనము జేయుచు, ఏకాంతవాసముగలవారై తనకడకు వచ్చిన శిష్యబృందమునకు వేదాంత విషయములను బోధించుచుండిరి.

ఈ కార్యక్రమము ఉదయము సాయంత్రము రెండు పూటలు జరుగుచుండెనును. మఠము శిలామయమై ప్రాచీన కట్టడముతో విశాలముగా నున్నతముగా నుండినది. ఈ వృద్ధస్వాములవారికి ఆరుగురు కుమారులు మనస్వాములవారె పీరికి జేష్ఠపుత్రులు, కుమారులందరు ఏదో ఒక విద్యలో ప్రావీణ్యతను గడించియుండిరి, కడగొట్టు బిడ్డడైన పంచాక్షరి యను బాలుడు ఇంకను విద్యా అధ్యయనము జేయుచుండెను. అతని మేధాశక్తి యత్యంత శ్లాఘనీయమైనది. ఆ సంవత్సరము ఆంగ్లవిషయము దీసికొని బి.ఎ పరీక్షలో ధారవాడ జిల్లాకేంద్రము నకేగాక ముంబై పరీక్షాకేంద్రములోనే ప్రథమశ్రేణియందు నేగ్గి పట్టభద్రుడయ్యేను. వీరందరికంటే పెద్దవారైన శ్రీగురుసిద్ద స్వాముల వారు కాశీక్షేత్రములో ఉండి సంస్కృతములో వేదాంతాచార్యపరీక్ష యందు ఉత్తీర్ణులైనారు, వీరికితమ తండ్రివలే వేదాంతశాస్త్ర చర్చయందే చాల ఆసక్తి ఉండెను. వీరికి ఆచుట్టు ప్రక్కగ్రామాల్లో శిష్యుల సంఖ్యఅధికముగా నుండెను, సంగీతకలాభిరుచిగూడ వీరికి మెండుగా నుండెను.

శ్రీస్వాములవారు రెండు మూడుదినములుగడచినట్లు స్వస్థానమునకు విచ్చేసిరి. రావడముతోనేను వారికి పాదాభివందనమాచరించితిని. వారునన్నుజూచి సంతసించి కుశలప్రశ్నలువేసిరి. వారితో నాఉద్దేశము ను (స్వగ్రామమునకు వెళ్ళేవిచారమును) విన్నవించితిని, వారు వెంటనే "ప్రస్తుతమునావద్ద రెండేరెండురూపాయిలున్నవి, అవసరముండిన తీసికొనుమనిరి. ఎంతవరకు ఈడబ్బు బస్సుదార్జికి సరిపోతుందో అంతవరకు వెళ్ళుము" అని తమజోలెనుండి ఆరెండు రూపాయలనుదీయబోగాదానికి నేనుఅడ్డుతగిలి ఈఎరుగనీ ప్రదేశములో

ఎవరిని అర్థించాలి, నా ప్రయాణమునకు సరిపోయే అంతధనము ఇచ్చే వారెవరు? మీరిచ్చే ఈరెండురూపాయిలతో నేను నాగ్రామము నేట్లు చేరుకొనగలను? సుమారు ఇరువదియైదురూపాయిలు చార్జికిఅవసరము, అనినేను నావిచారమును వ్యక్తపరచగానే వారు. "అవుతే నీవిక్కడే కొంతకాలముండి సంస్కృతములో ఆద్యపరీక్షకధ్యయనమొనర్చి పరీక్షనువ్రాయుము, దానివల్ల నీవు మీప్రాంతమునుండి ఇంతదూరము వచ్చినందులకు ఒకఉద్దేశము కొంతవరకు నెరవేరుతుంటి" అని తమవిచారమును వ్యక్తపరచిరి. మరియు అంతవరకు నీప్రయాణము నకు అవసరమయ్యే అంత ధనమును సమకూర్చుకొనవగును, అది విని నేను చేయునదిలేక నిరుత్తరుడనై అక్కడేకొన్నాళ్ళుండి పోవల్సివచ్చినది. వారిసన్నిధిలోనే ఉండి సంస్కృతముతో కావ్యాద్యపరీక్షవ్రాయుటకధ్యయనము జేయుచుంటిని. శ్రీవారు శిష్య వర్గము సంచారమునకై వెళ్ళునప్పుడు నేనుగూడ వారితోబాటు వేళ్ళు చుంటిని. కొన్నిచోట్ల నేను అవకాశమును బురస్కరించుకొని నేనేవంట జేయవల్సియుండేను, ఐనను ఈస్వాములవారు చాలా మట్టుకు సుఖోపభోగ పరాయణులు, ఏశాఖపాకములను సిద్ధగించి నను నెయ్యితోనే జేయాల్సియెండెను, గోధుమపరాటలు (చపాతీలు- గోధుమరొట్టెలు) ఎక్కువగా భుజించేవారు. మధ్యన పెసరిపిండి లడ్డూలు (ఉండలు) బూందేబేసను, భక్ష్యములు. పాలు-పెరుగు- చక్కెరవీరికి ప్రతినిత్యభోజన పదార్ధములే ప్రధానములుగా నుండెను, వీరితోబాటు శిష్యవర్గము సంచాలమునకై వెళుటవలన ఆయాయాగ్రామములోని జనులుగూడనాకు చాలాపరిచితులైరి. ఈ స్వాములవారు వెళ్ళినస్థలములందు వీరు. తమ శిష్యకోటికియుపదేశము జేయుచుండిరి, అంచేతనా యాయాగ్రామప్రజలందరు వీరిపైయధిక

వ్యాప్తిగలిగియుండిరి. అచటి ప్రదేశములు చాలావిశాలముగా నుండును వృక్షమధికముగాలేక పోవడముచేత ఎడారి ప్రదేశము మాదిరి గోచరించుచుండెను, అక్కడకొన్ని మట్టిదిబ్బలతోను, నదులు వాకల (వాగుల) తోనుగూడియుండెను.

కొన్నాళ్ళు ఇట్లు శిష్యసంచారముగావించి మరలతమ మఠమునకు విచ్చేయుచుండిరి, ఎల్లప్పుడు "కల్యాణ" మనుమాసపత్రిక నొకదాన్ని గూడ దెప్పించు చుండిరి. స్వాములవారు మేడపైనున్న ఒకగదిలో ఒక పుస్తక భాండాగారముండినది. ఇట్లుకొన్నిదినములు గడిచిపోగానన్ను నవదత్తి తాలూకాకు చెరువలో నుండిన బైలు హొంగలను గ్రామములో నొక వీరశైవ బోర్డింగు ఉండుటచేత అధ్యయనము కొరకక్కడనే ఉంచిరి. పరీక్షలు సమీపించుటవలన నన్నక్కడే యుంచిరి. ఈ బైలు హొంగలు గూడ తాలూకా గ్రామమే. ఇక్కడనేను సంస్కృతములో "ఆద్య" పరీక్షకై అధ్యయనము జేయుచుండగా నాకనారోగ్య మేర్పడినది. జ్వరముదినదినమధికమగుచుండెను, పిత్తాధిక్యతవల్ల చెప్పశక్యముగాని తలశూల మధ్య మధ్య మూత్ర విసర్జన బాధ, ఎవరునునన్ను పరామర్శించువారులేకుండిరి. మిట్టమధ్యాహ్న సమయమది. అత్యంత ప్రయాసముతో పైకిలేచి నిల్చితిని. ఎదిరింటినివీడి బయట వసారాలోకి వచ్చితిని, చెక్కరువచ్చి కన్నులకు చీకట్లు గమ్మినవి. ముందేదియు అగుపడుటలేదు. అటునిటు తూలుతు తడబడుచున్న కాళ్ళతో మెల్లిగా ముందుకు అడుగులువేస్తు వెళ్ళి ఒక స్తంభమును ఢీకొని నేలగూలితిని, ఇంతలోనెవరో ఒకరువచ్చి అక్కడే పరుండియుండక చేతగాకున్నను ఎందుకులేచి వచ్చావని పలుకరించిరి. మూత్రవిసర్జనకొచ్చానని చెప్పతముతోనే ఆతడునన్ను గట్టిగా బట్టుకెళ్ళి మూత్రవిసర్జన జేయించి మళ్ళీ

నా పడకకు దోడ్కొనివచ్చి పరుండబెట్టెను, ఇట్లు ఈ జబ్బుతో వారమురోజులు బాధజెందితిని, ఈ సమయములో శ్రీస్వాములవారి మాతుః శ్రీగారు మాత్రము నన్ను బహు ఆప్యాయతతో జూచుచుండిరి, ఆయమ్మ ఇతరులతో నా విషయములో ఈవిధముగా చెప్పుచుండేది. "పాపము ఎక్కడి పిల్లవాడో తిండియే మాత్రము దినకుండ జబ్బుతో బాధపడుచున్నాడు" అని చెప్పి ఆయమ్మ నాచెంతకువచ్చి నాయనా! నీవేమాత్రము అన్నము తినడములేదు. దీనివలన మరింత నీరస మేర్పడుతుంది. కావున నీకేది తినడానికి ఇష్టమౌతుందో చెప్పు, దానిని దెచ్చిపెడ్తాను, అదైనకాస్త దినుమనేది. అప్పుడు నేను నా నోరు చేదుండుటచేత తీపి దినాలని కోరికతో పుట్నాలు, పల్లీపలుకులు గల్సి బెల్లము పాకుతోజేసిన లడ్డూలు గావలయునని చెబితిని, సరెతెచ్చి పెడతాను, కనీసము వాటినైన తినుమనిచెప్పి, అక్కడేదైన వస్తువులను గొన్నాలనిన ఇంట్లోపండించిన పత్తిని దీసికెళ్ళి కొట్టువాడికిచ్చి వాతేదికోరితె దాన్ని వారిచ్చిన వస్తువులను ఇచ్చి పుచ్చుకొనె పద్ధతియుండేది. అదేవిధముగా ఆయమ్మగూడ బెల్లపు లడ్డూలను (వీటినికొందరు కొన్నిప్రాంతాల్లో మోరుండలంటారు) దెచ్చి నా ప్రక్కనబెట్టి వీటిలో నీకిష్టమైనన్నిదిని, మిగిలినవాటిని నీతలగడ కింద బెట్టుకో. మళ్ళి ఇష్టమైనప్పుడు వాటినిదిను నాయనా" అనిచెప్పి ఒక చెంబుతో మంతీర్థమును దెచ్చి నాప్రక్కన బెట్టి బుజ్జగించి వెళ్ళినది. దినాలు వీటిని దినుటవలన అపథ్యమునకు గారణమై మరల జ్వరము అధికమయ్యెను. అందుచే అదిచలిజ్వరము ఒక దినము విడచి మరు దినము జ్వరమువచ్చుచుండెను. ఒకవైపు జ్వరము తగ్గుటకు వైద్యుని కడ ఔషధమును సేవిస్తు మరోవైపు అపథ్యముజేసిన ఆ జ్వరము తగ్గుటెట్లు? ఎట్లాగో ఇలాగున లడ్డూలను దినడము మానేసి ఇష్ట

మున్నంత కొద్దికొద్దిగా అన్నమునే భుజించి ఔషధమును సేవించడము చేత ఇరువదిరోజులకు కాస్త జ్వరము తగ్గినది.

ఇంతలో స్వాములవారు విచ్చేసిరి. మళ్ళి యథారీతి నన్ను తమ వెంటనిడుకొని గ్రామపర్యటన మారంభించిరి, ఈ పర్యటనవలన స్వాములవారి శిష్యజనముతోను నాకును అధికమైన పరిచయము, స్నేహము, చనువు ఏర్పడినది. వారందరు నాపట్లాదరము గలిగి యుండిరి. ఏలనన నేను సంస్కృతము నభ్యసించుచుంటిని. గనుక దినాలు గడచినకొలది పరీక్షాకాలము సమీపించెను, హుబ్బళ్ళి నగరము లోని మూరుసా విరమఠములో పరీక్షాకేంద్రముండెను, అభ్యర్థి పత్ర మును పూరించి కేంద్రమునకు బంపితిని. నాటినుండి పాఠ్యపుస్తములను చేతబూని ఆసక్తితో నధ్యయనమును సాగించితిని, సమయము ప్రకా రము నా పరీక్షాప్రవేశపు అనుమతి పత్రమును కేంద్రమువారు బంపించిరి. ఈ పరీక్షా నేపమున మరల హుబ్బళ్ళి పట్టణము సందర్శించే సౌభాగ్య సందర్భము తటస్థించినది. పరిసర ప్రాంతాలలో పరీక్షార్థులెల్లరు అక్క డికి వచ్చియుండిరి, అక్కడికి వచ్చిన విద్యార్థులందరికిని శ్రీగురుసిద్ధ మహాస్వాములవారె భోజనవసతుల సౌకర్యములనుగల్పించిరి, అందును శివయోగ మందిరమునుండి విచ్చేసిన బ్రహ్మచారివటువుల యొక్క ఆచారవిచారములను వేషభాషలను చూడగానే నాకేంతో ఆనందమని పించింది. శివయోగమందిరములో కాబోవు మఠాధికారులనువీరశైవధర్మ ప్రకారముగా ఆచార-విచారముల కనుగుణముగా తీర్చిదిద్దుటలోనది అతీవ ప్రాచీనకాలమునుండి ప్రసిద్ధిగాంచినది. వీరశైవాచార - విచార ములకది పట్టుగొమ్మవంటిది. అక్కడుండి సంస్కృత విద్యనభ్యసించే వటువులందరు అక్కడి నియమములకు బద్ధులైయుండవల్సిందే కావి వస్త్రములనే ధరించాలి. నుదుట భస్మము, కంఠమున రుద్రాక్షమాలలు

పెదపై నిష్టములింగమునుతప్పనిసరిగాధరించాలి,అక్కడుండెవారుచాల్లా మట్టుకు కాబోయె మఠాధిపతులే కాబట్టి చాలాకట్టుదిట్టములైన ఆచార విచారములయందు ప్రమత్తత గలిగియుండాల్సిందే. కేవలమాచారము నందేగాకుండ ఆహార స్వీకారమునందును ఒక పరిమితియుండేది. వంట కములలో ఉప్పు కారములను వాడని మరీసాత్వికాహారము వారికి నియతము. ఏదోవిధముగా శ్రమించి రెండుమూడు దినములుండి పరీక్షా పత్రములను వ్రాసి మరల నా నివాసమునకు వచ్చితిని, నా అధ్యయ నము అంతంతగానేయుండెను. దీనికి కారణము అచట నాకు సహాధ్యాయు లెవ్వరును లేకుండుట.

## కావ్యాద్య పరీక్షయొక్క వివరణము

కావాద్య పరీక్ష అయిదు సం॥ముల కోర్సు (పాఠ్యప్రణాళికకలది) నేరుగా ఒకేసారి యీ పరీక్షను వ్రాయడానికి వీలులేదు. మొట్టమొదట త్రికాండ అమరకోశము ఇది శ్లోకరూపమునమున్న శబ్దకోశముసంస్కృత నిఘంటువు (డిక్సనెరివంటిది) తరువాత శబ్దమంజరి, ధాతురూపావళి సమాసచక్రము, వీటన్నింటిని తుచ తప్పకుండ కంఠస్థము జేయవలి సిందే. వీటన్నిటిని మొదట ముఖోద్గతము జేస్తేనేగాని, శబ్ద స్వరూపము శబ్దార్థములు చక్కగా బోధపడవు. వీటన్నిటిని కంఠస్థముజేయుట మొదట కష్టముగా దోచినను ఆ తరువాత మనము అధ్యయనము జేయ బోవు కావ్యములలో శబ్దార్థములను సులభముగా అర్థముజేసికొనుటకు మిక్కిలి తోడ్పడుచుండును. ప్రౌఢపరీక్షల అధ్యయనమును గావించు టకుగూడ యెంతయోసహకారము లభించును, ఇదిముగుయుటకే మూఁడు సం॥ము లవసరము. ఆద్యపరీక్ష యొక్క పాఠ్యప్రణాళిక మేరకు నేను

అధ్యయనమొనిర్చిన సమయంలో పంచకావ్యములలో మొదటిదైన "రఘువంశ" కావ్యములో ప్రథమ సర్గనుండి వరుసగా పంచమ సర్గ వరకు, మళ్ళీ యేకాదశి సర్గనుండి త్రయోదశి సర్గవరకు జదువాలి. రెండవదియైన కుమారసంభములో ప్రథమ సర్గనుండి పంచమసర్గ వరకు జదువాలి. ప్రతిమా నాటకము. ఛందోమంజరి, వ్యాసరచన యుండేది, ఇలా కావ్య ఆద్యపరీక్ష నధ్యయనమునకు అయిదు సం॥ములు క్షుణ్ణంగా జదువవల్సిందే. కనుకనే దీనిని ప్రభుత్వ పరీక్షలలో ఇంటర్మీడియట్ పరీక్షతో సమానమని యంగీకరించియున్నారు. అట్లె సాహిత్య (కావ్య) మధ్యమ పరీక్షను భారతదేశ మొత్తము విశ్వవిద్యాలయాల వారు తమ పాఠ్యప్రణాళికలో బి.ఏ, డిగ్రీ పరీక్షతోను. కావ్యతీర్థ పరీక్షను ఎమ్.ఏ, పరీక్షతో సమానమని గుర్తించియున్నారు. నాకు ఆంధ్రప్రదేశ ప్రభుత్వ విద్యాశాఖాధికారులు గ్రేడు 1 వేతనాభివృద్ధిజేసి ఇచ్చినది. ఈకావ్యతీర్థను గుర్తించే ఇచ్చారు. ఎమ్. ఒ. ఎల్. పరీక్షలో నెగ్గినందుకుగాదు.

## మరో(2.వ)సారినాదేహారోగ్యము బాగుండక పోవుట

హుబ్బళ్ళినగరము కేంద్రములో సంస్కృతాద్య పరీక్షను వ్రాసి మరల యధారీతి సవదత్తి మఠమునకు వచ్చితిని, వచ్చిన రెండుమూడురోజుల్లో నాకు అనారోగ్యముతో చలిజ్వరము ప్రారంభించెను, పాపమాఇంటి వారునన్ను దొశ్కొళ్ళి ఒకవైద్యునకు జూపించిరి. ఔషధోపచారములు జరుగుచుండెను. పద్దెదుదినములు గడిచినప్పటికిన్ని నా ఆరోగ్యముకుదుటబడలేదు. మరిమరి అధికము కాజొచ్చెను. ఒకదినము వైద్యునింటికి వెళ్ళివచ్చే అప్పుడు ఉదయము పదిగం.ల సమయమది. నా నివాసమునకు వచ్చునప్పుడు ఇష్టములేక

ఇంతవరకు అన్నమును భుజించకుండినందుకు దేహమునీరసముగా నుండేను, కాళ్ళతో సత్తువలేక అవినడచునప్పుడు తడబడు చుండినవి ఒక్కడుగు ముందుకు వేయడమంటె ఒకయుగము ప్రాయమైనది. పైత్యమధికమగుటవలన దల్రదిప్పుట, తలశూల. కన్నులకు జీకట్లుగ్రమ్మినవి. త్రాగుబోతువాడిలా మార్గములో నడచువేళ ఈ వైపునుండి ఆ వైపునకు, ఆ వైపునుండి ఈ వైపునకు. తూలుతు నడుస్తూఉంటిని, దేహము ఊయెలమాదిరి, ఊగుతు ఉండినది. మధ్య మధ్య అక్కడక్కడ కొద్దిసేపు గూర్చుంటు ఏట్లాగానో ప్రాణమరచేత బట్టుకొని మఠమునకువచ్చి నాపడక నాశ్రయించితిని. ఇంటివారు వచ్చి నా శరీరమునంతటిని దడవిచూచి "పాపము అబ్బాయికి యీవాళ గూడ జ్వరము అధికముగానే యుండినదిగదా?" "నాయనా! రాచయ్యా నీకు జ్వరమెట్లుంది? బాబు" అని అడిగిరి. వారి దయార్ద్రహృదయమునుండి వెలువడిన కరుణారసప్రపూరితమైన వాక్యము నేను, నేటికిని విస్మరింపం జాలకున్నాను. చదువరులు కాస్త తమ చల్లని హృదయముతో ఆలోచించగలరు. వారేదేశమువారు, నేనేదేశమువాడిని, వారిది కర్నాటక ప్రాంతము, నాది తెలంగాణ ప్రాంతము అయినప్పటికిని "ఋణాను బంధరూపేణ పశుపత్ని సుతాలయాః" అను సూక్తిమేరకు ఆఋణాను బంధముచేత నేగాబోలు వారియన్నము, వారిసేవలు నాకీవిధముగా లభించినవి.

శ్రీస్వాములవారితల్లిగారికి నాయందు మిగులయను రాగముండేది, ఈయమ్మగారు తనకుండిన ఆరుమందికుమారులమల్లెనన్ను తన యేడవకుమారుడిలా ఆదరించు చుండెను. నన్నాక్రమించిన శీత జ్వరము నెలరోజులు గడచినను యేమాత్రము తగ్గుముఖం పట్టలేదు, ఇలాతగ్గక పోవడానికి ఒకకారణముంది. జ్వరపీడితుడనై చాలా

తినములైనవి, కాబట్టి క్షుధా బాధకాస్త తగ్గి. అన్నమును భుజించుట యందయిష్టతగలినది. ఏవైన పండ్లుఫలహారములనుదినాలను కోరికయుండేది, ఆవృద్ధ మాతకునేను చాలప్రీతి పాత్రుడను కాబట్టి ఆయమ్మ నాచేంతకువచ్చి "నాయనా! రాచయ్యా! కొద్దిగాఅన్నమును తింటావా? తేనా? ఇలా అన్నమును దినకుండ యెన్నాళ్ళు వస్తుం డెదవు? అని ప్రశ్నించదముతో అందుకునేను" అన్నముఁదినుటకే మాత్రమునాకిష్టములేదమ్మా! అంటిని, అదివిని ఆయమ్మ అట్లైతె ఘ శేదైన ఫలహారము చేస్తావా? తేనా? మరల ప్రశ్నించేను. అలా అనడముతోనే నాలోని పంచప్రాణములొక్కుమ్మడిగా ఉప్పొంగి వచ్చినవి. ఉత్సాహముతోనేనిట్లు చేప్పితిని. అవును "నాకు బెల్లపు పాకముతో గట్టిన వుట్నాలు ఫల్లి పలుకులలడ్డులు (మోరుండ్లు) తినాలని ఉందనిచేబితిని," సరెతెచ్చిపెడుతాను కాస్తఅవైన కడుపు నిండాదినుమనిచేప్పి ఇంట్లోనుండి కొంతపత్తిని దీసికెళ్ళికొట్టు వాడికిచ్చి దాని యెత్తుతూచే ఉండలను దేచ్చిఇస్తుఉండేది. నాకవసర మనుకున్నప్పుడల్లా వాటినేగొని తెచ్చిపెడుతుండేది.

ఇటువంటియపథ్యము వలన చలిజ్వరమునాలో దీర్ఘకాలము స్థిరపడుటకు అవకాశమేర్పడినది. ఇంతలో స్వాములవారు పర్యటన నుండి దిరిగివచ్చిరి, ఔషధమునిప్పించిరి. క్రమేపికొద్దిగా తగ్గుముఖము పట్టినది. ఈ సందర్భమున అమ్మగారిబెల్లపు లడ్డూలకుబదులు స్వాముల వారు మంచిమంచి ఫలములు. మోసంబీలు. ద్రాక్షపండ్లు, సేబులు సంత్రాలు, మధ్యన ఖండశర్కర (మిశ్రి-)నాకుదినడానికి దేప్పించి ఇచ్చేవారు. వీటినిభక్షించడముచేతనె కాస్త జ్వరముతగ్గుముఖముపట్టేను.

ఒకతూరి శ్రీస్వాములవారి శిష్యవర్గములోని కొందరు మఠమునకు వచ్చియుండిరి. వారు పడకలో బరుండియున్న నావైపు జూచి, నావిషయమునుగురించి శ్రీస్వాములవారిని విచారించి తెలిసికొనిరి. నేను వారిలో ఒకరిని నాదగ్గరకు రప్పించుకొని నామనోరథమును వారికి దెలియపరచితిని, "హోశెప్పా నేను స్వగ్రామమునకు వెళ్ళదలచాను" అని చెప్పడముతోనే ఆతడు "మంచిది స్వామి! ఒక మాసము మాకుగడువొసంగినచో, అంతవరకు తెల్లజొన్నపంటలు చేతికి రాగలవు. ఆ సమయములో మీరు మా గ్రామము వేంచేసిన యెడల మేము మా యథాశక్తి స్వాములవారి శిష్యవర్గమునుండి విరాళములను సంగ్రహించి మీకు తప్పకుండ ఆర్థిక సహాయము చేయగలమనిరి.

## స్వగ్రామ(దేశ)మునకు దిరిగివచ్చుట

రెండు మాసములు గడచిన పిదప నా ఆరోగ్యము కుదుటబడినది. ఒక మాసము గడిచినపిదప పంటలమార్పిడి జరుగుతవి ఆ సమయములో మీరు రమ్మని చెప్పిన శ్రీ హోశప్ప గ్రామమునకు వెళ్ళితిని. వారు నాకాదరాతిథ్యము నొసఁగి గ్రామములో శ్రీ స్వాములవారి శిష్యవర్గమునుండి విరాళములను సంగ్రహించి రూ॥లు (25-00) ఇరువదియైదు రూ॥లు నాచేతికందజేసిరి. అంతటితో సంతసించి మరల సవదత్తి గ్రామమునకు వచ్చి శ్రీస్వాములవారికి వందన మాచరించిరి వారి ఆశిస్సులను సెలవునుబడసి. వారి బంధువర్గమునకు నేను నా గ్రామమునకు వెళ్ళుచున్న సంగతిని తెలియపరచి. వారితోను అనుమతిని దీసికొని చక్కగా బస్సుస్టాంటుకు వచ్చి నేరుగా ధారవాడకు వెళ్ళే బస్సులో గూర్చుండి అక్కడ హుబ్బళ్ళినగరములోరైల్వే స్టేషన్‌కు వెళ్ళే బస్సులో గూర్చుండి హుబ్బిళ్ళి రైల్వేస్టేషన్‌కు వచ్చి సికింద్రాబాదుకు

టికెటు దీసికొని రైలు డబ్బాలో గూర్చుంటిని. అక్కడగూడ క్రమేపి ఒకరిద్దరితో ప్రసంగవశాత్తు మైత్రి యేర్పడినది. కొంత దూరము ప్రయాణమైన తరువాత మార్గమధ్యన భద్రాచలము స్టేషను తటస్థించి నది. ఆ స్టేషన్‌లో కొంతసేపు బండి ఆగుతుంది కనుక ప్రయాణికులు కొందరు భోజనము జేసిరి. మరికొందరు అల్పాహారమును దీసికొనిరి. నేనుగూడ వారితోబాటు అల్పాహారమును దీసికొంటిని. ఈ స్టేషన్‌రైలు గదలే సమయానికి అరబ్బుల గుంపొకటి వచ్చి నేను గూర్చుండిన డబ్బాలో గూర్చుండిరి, వీరితో మాడబ్బ నిండిపోయెను. ఈవరకు నా ప్రక్కనే గూర్చుండియుండిన ఇద్దరు మిత్రులు అరబ్బులను జూచి జడిసి ముందేమి అపాయము జరుగనున్నదో అని యూహించుకొని. వారా స్థానమునందలి తలుపుప్రక్కనే బోయి గూర్చుండిరి. నాకుగూడ వారు వెళ్ళిపోవడముతో భయమేర్పడినది. అరబ్బులు నావైపు బాగా చూస్తు వాళ్ళలో వారేవేవో మాట్లాడుకొనుచుండిరి, వారలా చూడడమె గాకుండ మా సామానులను గూడ మాటిమాటికి తడవి (ముట్టి) చూస్తుఉండిరి.

నైజాంసరిహద్దు (సీమ)లోకి గారానే ఈ ప్రాంతపు నివాసులైన కొందరికి పానయోగ్యమైన మత్తు పదార్థమునకు దావలమైన ఈతచెట్ల వనములు అక్కడక్కడ గన్పించెను. నా మిత్రులది గమనించి నాతో "చూచావా? మీదేశము సమీపించుచున్నదని ఈ ఈతచెట్లు దెల్పుచున్న వనిరి. అవెగాకుండ రైలుమార్గమునకు రెండువైపుల టేకు, మద్ది మున్నగు ఇతర వృక్షములు గూడ ఎత్తుగా బెరిగి క్రిక్కిరిసి (దట్టముగా ఘనారణ్యములా గోచరించుచుండినవి. అకురాలు కాలమింత వరకు గడిచిపోయినది. కావున ఇప్పుడు పచ్చని లేచిగుళ్ళతో చెట్లుచల్లని పిల్లగాడ్పులకు ఆనందముతో తలలూపుచుండినట్లు దోచుచుండెతో.

అక్కడక్కడ ఈ యరణ్యమున ఆకులు రాలిపోయి కేవలము ఎఱ్ఱని పూలగుత్తులతో నిండారబూచిన పలాశవృక్షములు (మోదుగు) వృక్షము లగుపడుచుండినవి. వీటి స్వరూపాన్ని గురించి ఒక సంస్కృత కవిఇట్లు వర్ణించియున్నాడు. అది యిక్కడ నామదిలోస్ఫురింపఁజేసినది. మోదుగ పుష్పములు సహజముగా పులిగోళ్ళవలె వంకరగా నుండి మధ్య కొద్దిగా దొప్పమాదిరి చీల్చబడియుండును. ఈ పుష్పము చాలా ఎఱ్ఱగాను చూపరుల నాకర్షించునదిగానుండు. అందుకే కవి ఈ పుష్పము జూచి వాపోయినాడు "ఆ మోదుగ పుష్పము అలా ఎఱ్ఱగా నుండుట కుగారణ మేమనగా "నూతన యువతీయువకులకు అనురాగబంధము లతో నిండియుండిన వారి హృదయములను ఈ వృక్షము తన పుష్ప ములను గోళ్ళతో చీల్చిన కతమున నేటికిని యవి రక్తరంజితములయ్యే విరాజిలుచున్నవని" కవి వర్ణించియున్నాడు ఇదెంతయో సార్థకమైనది గానె యున్నది.

ఇట్టి వృక్షములేగాకుండ మధ్యమధ్యన కృష్ణా-గోదావరి- గొప్ప గొప్ప జీవనదులగూడదిలకిస్తు దాటితిమి. ఇటువంటి జలసమృద్ధిచేత ఈపచ్చనివృక్షసమూహము నెనింతవరకుండిన 'ధారవాడ హుబ్బళ్ళి మొదలగు ప్రదేశములలోని వాలుటిద్వాళ్యము, చాలఅందమైనవి అరుదుగానుండును. చాలా మట్టుకునిర్జలము ఏడారిమైదానములుగా భాసిల్లుచుండ అక్కడి ప్రజలంత (వ్యవసాయదారులు) వర్షపునీటి యాధారముపైన వంటలను బండితురు. వర్షాభావమేర్పడి ప్రాంత మంతయు కరువుకాటకములతో తల్లడిల్లి ఇతర ప్రాంతములకు వలసబోవుచుందురు. అందును విజాపురు జిల్లామరి అధ్వాన్నమైనది. కావున మన ఆంధ్ర తెలంగాణప్రాంతములలో సీరావరికి నిలయమైనం దున పుష్కలమైన వరిపైరులు. కూరగాయలు. అటనట మోట

-బావులు అనేకములుండుటచేత సమృద్ధిగా ఆహారధాన్యములను రైతులు బండించుచున్నారు, కనుకనె ఇచటి ప్రజలు కరువు కాటములే వియులేక సుఖ సంపదలతో తులతూగుతున్నారు. ఇట్లు సమస్త సౌభాగ్యములకు నిలయమైన మనమాతృభూమి అప్పుడే ఆప్రాంత మునుమరిపించినవి.

సికిందరాబాదు స్టేషన్‌లోదిగి శంషాబాదుకు అటనుండి సదాశివ పేటకు జోగిపేట పాపన్నపేటలకు వెళ్ళివచ్చుట జరుగు ననుకుంటిని.

ఈవిధముగారైల్లో ప్రయాణమైవచ్చి సికిందరాబాదు స్టేషన్‌లో దిగి. మాతోబాటే అరబ్బులబృందముగూడ దిగినది. వారెక్కడి వాళ్ళక్కడవెళ్ళిపోయేవరకు మేముకొంతసేపక్కడేయుండి, అమీదట మామిత్రులు ఒక టాంగాను మాట్లాడుకొని తమతమగమ్యా స్థానములకు వెళ్ళిరి. నేనుగూడ ఒకటాంగాను మాట్లాడుకొని. మదీనా బిల్డింగువద్ద (నయాపుల్) దిగితిని, ఆసమయంలో నాకు హైదరాబాదు నందెవరు పరిచయములేని కతమున ఈ నగరమునకు దగ్గరలోనుండిన ఉందానగర్ (శంషాబాదు)కు వెళ్ళదలంచి ఒకటాంగా వాడిని విచారించగ అతడు ఆ సమయంలో నాలుగణాల చార్జిఉండగా రాత్రి యవడముచేత నాలుగురూపాయిలు అడిగెను. చివరికియెంతోప్రయత్నిం చగా రెండు రూపాయిలకు నన్ను దీసికేళ్ళుటకు సిద్ధపడెను. శంషా బాదునకు రాత్రి సుమారు పది (10 గం॥లకు నాకు పరిచయముండిన శ్రీ వైరాగ్య చన్నబసవ స్వాములవారి మఠమునకు జేరుకుంటిని, నేను మొట్టమొదట యాదగిరి కాలేజికి వెళ్ళినది. ఈ మఠాధిపతియైన శ్రీ సిద్ధ లింగస్వామితో బాటే వెళ్ళియుంటిని, వారే ఈసమయమునందు ఈ మఠములో ఉండిరి. కనుక వారి పరిచయమువలన నెనక్కడికి వెళ్ళితిని,

మఠము యొక్క మహాద్వారము తలుపులను దట్టి పెద్దఎలుంగు (కంఠముతో) తో గట్టిగా కేకవేసి పిలిచితిని, అంతకు రెండు దినముల క్రితమె ఆ స్వాములవారివద్దనుండిన ఒకసేవకుడు దొంగతనముజేసివెళ్ళి యుండెనట. అభయముతో స్వాములవారు తలుపులు గట్టిగా బంధించి లోపలుండి ఇక రాత్రివేళ్ళలో ఎవరు వచ్చిన తలుపులు తీయగూడదని నిశ్చయించుకుండిరట. అదేభయముతో అదేవిషయమును గురించి వారు మాట్లాడుకొనుచుంతగానా కంఠధ్వని విని "ఎవరు మీరని ప్రశ్నించి గానే" నేనండి? నేను రాచయ్యను.అని బదులుచెప్పగానే వారు మరీదిగులు జెంది- రెండు కర్రలను చేతబూని తనతోబాటు ఒక శ్వానము (కుక్క) ఇద్దరు మనుషులు ఒక కందిలి చేతబూని వెంటరాగా లోపలి తలుపు వద్దకువచ్చి "మీరెవరని గట్టిగా నడిగిరి, మళ్ళినేను "నేనండి రాచయ్యను"అంటిని, అది విని వారు "ఇంతవరకు మా మఠములో దొంగతనముజేసిన రాచయ్యవా? అని గట్టిగా ప్రశ్నించిరి, అందుకు నేను "కాదంటిని. నేను సదాశివ పేట రాచయ్యనండి, అని చెబితిని, స్వాములవారు ఓహో ఆ రాచయ్యగారు వెళ్ళిపోయి ఎన్నో సం॥ము లైనవి? మీరెవరో నిజముగా జెప్పండనిరి" నాకాసమయముకో నా మాతృభాష తెలుగైనప్పటికిన్ని కర్నాటక ప్రాంతములో తెలుగును మాట్లాడువారు లేనందున తెలుగును మరచి కన్నడములోనే మాట్లాడు చుంటిని, కావున తెలుగులో సరిగ్గా మాట్లాడలేనందు ఇక ఇక్కడగూడ కన్నడములోనే మాట్లాడడము చేత అప్పుడుగాని నెమ్మదిగా మహా ద్వారము తెరచి నన్ను తనచేతి కందిలిని పైకి లేపి నా ముఖమును బాగుగా జూచి, గుర్తించి, చాలాకాలమునకు నన్ను దర్శించినందుకు వారందరు ఆశ్చర్యముతో చాలా సంతసించిరి. కాస్త తెలుగు భాషలో

చక్కగా మాట్లాడెవరకు అక్కడేయుండి. తరువాత మా గురువులు వారుండె సదాశివపేట పెద్ద మఠమునకు జేరుకుంటిని.

అట శ్రీ విరూపాక్ష స్వాములవారికి పాదాభి వందనముగావించితిని, కాని మనస్సులో మాత్రము వారిపైనున్న కోపాగ్ని చెలరేగుచుండెను. కారణమేమనగా వీరు మొట్టమొదట యాదగిరి ఎస్. ఎస్. కాలేజికి విద్యా అధ్యయనముకొరకు బంపిరేకాని తరువాత నాయోగ క్షేమములను గురించి విచారించరైరి. సదాశివపేట శ్రీ గందిగె సిద్ధరామప్పగారు శ్రీ శెట్టిరేవప్పగారు, శ్రీ కోనుగుర్తి తోటప్ప మున్నగు శక్తులెప్పుడైన మఠముకు వచ్చి శ్రీ స్వాములవారిని సందర్శించినప్పుడు "మీ శిష్యుడు రాచయ్యస్వామిగారిప్పుడెక్కడున్నారు? వారేమి చదువుచున్నారు, వారిని గురించి యేమైన యోగక్షేమములను బరామర్శించుచున్నారా? అని విచారించగా వారికీవిధముగా సమాధానమును జెప్పెవారట "అతడు నేను ఉంచినచోట ఉండక ఎక్కడికో సంస్కృతాధ్యయనమునకై మరోచోటికి వెళ్ళియున్నాడు, వాడు విద్యాధ్యయనమును పూర్తిజేసికొనే రాగలడు" అని చెప్పెవారట, నేను గూడ రెండు మూఁడు దినములు నా కోపమును నాలోనే దిగమ్రింగి, తదుపరి ఒక దినము వారితో "ఏమండి మళ్ళినేను విద్యార్జనకొరకు వెళ్ళాలి. మరి నా ఖర్చు నిమిత్తము కొంతడబ్బు నివ్వండి" అని అర్థించగా వారు నిర్మొహమాటగా నేనివ్వనని," ఖచ్చితముగా జెప్పిరి, అది వినగానే నాలోనె క్రోధజ్వాలఇనుమడించినది. తోకద్రొక్కినత్రాచుపాములాభరించ లేని యావేశముతో గురువనే భావననుగూడ విస్మరించితివి, "పందా! ఊరబందా! డబ్బులేనిదే నీవింతవరకు విద్యాధ్యయనము జేశావా- అలాంటప్పుడు నన్నాఎరుగని దేశమునకు బంపితివి" అని నా నోటికి

వచ్చిన విధముగా ప్రేలితిని, వారు నా కోపమునకు దట్టుకోలేక గుర్తు మతమను గదిలోకి వెళ్ళి తలుపువేసికొని గడియబెట్టుకొని యుండిరి.

ఇంక నేను ఇక్కడుండ దగదని యెంచి నిరాశ నిస్పృహలు నాలో మెండుగాగ భావి నావిద్యార్జనకై యత్నించవలెనను ఉద్దేశ్య ముతో మా తీర్థస్వరూపులైన తండ్రిగారు నివసించె జోగిపేట గ్రామ ముకు వెళ్ళితిని. వారిని డబ్బునుగురించి విచారించగావారుగూడనాకిప్పట్లో ఇచ్చుటకు సాధ్యపడదని చెప్పిరి, నాన్నగారివద్ద డబున్నపటికిన్ని వీరు నన్నుసదాశివపేట పెద్దమఠమునకిచ్చారుగనుక నేనేందుకివ్వాలి: అనునభి: ప్రాయముతో తప్పుకొనిరి, తరువాత మామాతు: శ్రీ పెద్దమ్మగారైన నాగమ్మగారుండిన సొపన్నపేటకు వెళ్ళితిని. వీరు మహాధనవంతులు కాబట్టి డబ్బు విషయమై వారినెమైన విచారించిన ఇచ్చేదరేమోనని దలంచి వారిని జనువుతోనడుగగా, వారు మీపెద్ద అన్నయ్యనడుగుమని సెలవిచ్చిరి. అదే విధముగా మా సోదరులైన శ్రీ మ.ని.ప్ర. చంద్ర శేఖరస్వాముల వారినభ్యర్థించగా, వారుఉత్సుకతతోనిట్లనిరి. నీవెంతవరకు సంస్కృతము నభ్యసింపదలచావో అంతమట్టుకు నేను నీకుగావల్సినంత డబ్బును సహాయము జేయుదునని హామిఇచ్చి, అప్పటికి నాకు మళ్ళీ కాలేజికి వెళ్ళుటకువలిసినయంతడబ్బును ముప్పది (30-00)రూ॥లు నాచేతికందజేసిరి. నాలో ఇంతవరకు కొరవడిన నిస్సహాయని స్పృహలు తొలగిపోయెను. పునఃఇనుమడించిన ఉత్సాహముతో యాదగిరికాలేజికి అధ్యయనముజేయుటకై వెళ్ళితిని.

## ఈసమయములో మ్మదాసుయునిపర్శిటి కన్నడ.

## బి. విధ్యాన్ పరీక్షనొసంగుట

వ్యాకరణతీర్థ పం॥ శ్రీచంద్రశేఖరశాస్త్రిగారు ఈలోపున కాలేజిప్రిన్సిపాలుగా పదవినలంకరిచియుండిరి. మరల వారిద్వారానాకు.

ప్రవేశమునకు అనుమతిలభించేను. ఈసం॥ము మద్రాసు యునివర్శిటికి సంబంధించిన బి, విద్వాన్ కన్నడ ప్రవేశ పరీక్షనొసంగుటకు మరియు హింది మధ్యమపరీక్షలను వ్రాయుటకై గృషిజేసితిని, అందుకు దగినట్లుగా శ్రమించి పరీక్షలను వ్రాసి వాటిలో ఉత్తీర్ణుడనైతిని. ఇట్లెరెండవ సం॥ముగూడ పాపన్నపేట మామాతుః శ్రీగారివద్దకు వెళ్ళగా వారువెంటనే ఇరువది (20.00) రూ॥లనొసంగిరి. కాని అయమ్మగారిచ్చిన ఇరువదిరూ॥లు యాదగిరికి వెళ్ళుటకురైలు చార్జి పొగా అక్కడసం॥పొడుగునా ఉన్నందులకు చిల్లరఖర్చులకే సరి పోయినవి, నేనభ్యసించే సాహిత్యమధ్యమా పరీక్షయొక్క గ్రంథము లను గొనుటకు ఆ డబ్బుసరిపోలేదు. ఈవిషయమైననేకపర్యాయములు పాపన్నపేట మా అన్నయ్యాగారికి. మరియు మా పెద్దమాతుః శ్రీగారికి యెన్నిపత్రములను వ్రాసినను సమాధానములేదయ్యేను. వారినుండిగూడ డబ్బురావడములేదయ్యేను, చివరికినెనే నామిత్రుల వద్దరైలు చార్జిపూర్తి డబ్బును చేబదులుగా బుచ్చుకొని పాపన్నపేటకువెళ్ళి ప్రత్యక్షముగా అన్నయ్యాగారిని విచారించగా వారునాతో ఇట్లుచేప్పిరి. "కోడన్‌గల్లు విరూపాక్షస్వాములవారు నీకుడబ్బును బంపవలదని చెప్పంపినారు, అందులకని నేను బంపలేదని చల్లనివార్తవిని పించిరి. అదివిని నేను వారితోనిట్లు ప్రశ్నించితిని" మీరు మొదట నాతోనీ వెంతవరకు జదివి నను అంతవరకు నేనుడబ్బుసహాయ్యము జేనెదనని ఇప్పుడిలా మధ్యన సహాయముచేయసని చెప్పుటమీకుచితమైనదేనా? నాకు పడిరాని వారు జేప్పినదే మీకువేదమా? అని మందలించితిని' అప్పుడు మాత్రము 50.00 (ఎబది)రూ॥ములిచ్చినన్ను కాలేజికి బంపిరి. ఆసంవత్సరము పట్టుదలతో సాహిత్య (కావ్య) మధ్యమా, వ్యాకరణాద్య, హింది ఉత్తమాపరీక్షలకు ప్రయత్నించి వ్రాసివాటిలోను త్తీర్ణుడనైతిని

ఈవిధముగా నాయాయాపరీక్షలలో నెగ్గి మళ్ళీ వేసవి సెలవుల్లో స్వగ్రామమునకు వచ్చితిని, ఈ సెలవుదినములను జోగిపేటలోనే గడిపి నందులకు ఈసారి మాతీర్ధరూపులైన.

## మా తండ్రిగారు విద్యలో నన్ను బరీక్షింపఁజేయుట

మా తండ్రిగారిని నేను ఈసారి కాలేజికి వెళ్ళుటకు రూ. 30 (ముప్పది) రూ॥లు ఇమ్మని అర్థించితిని. వారు కృపణత్వస్వభావముతో నావద్ద ఇవ్వదేమియులేదనియు, నేను సంపాదించినది నాకే సరిపోవుటలేదని స్పష్టముగా చెప్పిరి. నేను వారితో "నాకు చదివించడానికి "నన్నాధారముగాజేసికొని," అనగా నన్ను జోగిపేట మరియు సదాశివపేట పెద్దమఠములకిచ్చినం దునమీరీమఠములోఉండి, ఈ మఠముయొక్క స్థిరచరాస్తిని అనుభవించుచున్నారు. గనుక మీరు మీగ్రామమైన చేవెళ్ళకు వెళ్ళుమని గట్టిగా మందలించితిని. నామఠముయొక్క ఆస్తిపైన నేను విద్యనభ్యసించెదనంటిని. సుమారు ఏడెనిమిది సంవత్సరములనుండి నామఠముయొక్క ఆస్తిని మీరే అనుభవించుటచేత నాకు ఆ ఆదాయము లభించక నేనిప్పుడీవిధముగ డబ్బులేక బాధపడుపడుచున్నాను. కనుక మీరు ఇక్కడినుండి వెళ్ళిపోండని" చెప్పడముతో వారు వెంటనే "నీవేమి చదివినావోఏమో "ఎల్లయ్య చదివిందే వేదమన్నట్లు" నీవభ్యసించే విద్య ఇక్కడెవ్వరికిని దెలియదు. ఆ సంస్కృతమునుండి గలుగు ప్రయోజనమేమిటో నాకుబోధపడుటలేదు." వారలా అనడంతో. నేను ఇలా సమాధానము ఇచ్చితిని. "నేను జదివినదానిని ఇక్కడుండిన సంస్కృతజ్ఞులచేత బరీక్షించుకొనుము. మీకు నాపై విశ్వాసము లేనియెడల" అటులజేయుడని చెప్పితిని. వారందుకు "అలా అయితే పదబజారునకు అక్కడ ఒకచోట గూర్చుండి సంస్కృత

పండితుల నొకరిని రప్పించి అక్కడ జేరిన పదిమంది సభ్యుల సమక్ష ములో నిన్ను పరీక్షిస్తాము. అక్కడ విన్నవారు అదివిని సంతసించి నట్లాతె నీవు అడిగిన ముప్పదిరూయిలకు బదులునేను రూ॥లు 50-00 (ఏబది రూప్యములు) ఇచ్చెదననిరి. అంతటితో నేను "సరేపదండి" అని వారిని వెంటనిడుకొని వెళ్ళితిని. అక్కడ శ్రీ నెలిగెరామప్పగారి కొట్టు (దుకాణము)లో గూర్చుండబెట్టి నా విషయమును అక్కడున్న వారికి వినిపించిరి, వారుగూడ "అవునౌను" అని సైదోడుగా పక్కతాళము చెక్కభజనజేసిరి. కొందరు ఆ గ్రామము (జోగిపేట)లో సుప్రసిద్ధులైన సంస్కృతజ్ఞులైన బ్రాహ్మణులైన శ్రీ రాజయ్యగారను జోషిగారిని అక్కడికి రప్పించిరి. వారు పంచాగమును చేతబూని వచ్చినా చెంతనే గూర్చుంటిరి. వారికిని నావిషయమై వెల్లడించిరి,వారి పరిచయము నాకు ఈ మొదలే బాగుగా యుండెను. వారి మనుమడైన శ్రీ విశ్వనాథముకు నాకు చాలా స్నేహితముంటవలన నేనప్పుడప్పుడు వారి గహ్యమునకు వెళ్ళుచుంటిని, శ్రీ రాజయ్యగారికి మరియు మా నాయనగారికిని మిక్కిలి స్నేహితముండేది. వారిరువురు ఎక్కడైన తారసిల్లినచో పరస్పరముగా గౌరవముతో సంభాషించుకునే వారు. అందుచేతనేను వారి గృహము నకు వెళ్ళినప్పుడు నాతోవారు కాస్త కూస్తో సంస్కృతములోనే మాట్లా డించెవారు. వాటికి సమాధానమును చెప్పడము చేత వారు సంతసించు చుండిరి. అంతేగాకుండ సంస్కృతము నభ్యసించుచున్నానని దెల్పి అభిమానముతో నన్ను గౌరవించెవారు. కావున వారీ సందర్భములో రఘువంశములోను.కుమారసంభవము కావ్యములోని రెండు శ్లోకములను వాటి కర్థతాత్పర్యములను వినిపింపుమని కోరిరి, అదేవిధముగా నేను రెండు శ్లోకములను, మరియు వాటి కర్థతాత్పర్యములను వినిపించడమే గాకుండ అభిజ్ఞాన శాకుంతలముఅనునాటకములోని"అనాఘ్రాతం పుష్ప

మధునవమనాస్వాదితరసం" అను శ్లోకమును మరియు "యాస్యత్య ద్యశకుంతలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా కంఠ స్తంభి బాష్పవృత్తి కషశ్చింతాజడం దర్శనమ్" అని జదివి అర్థతాత్పర్యము లతో వినిపించగానే వారు చాలా సంతసించిరి. ఈవిధముగాను అక్కడ చిన్నగా కూడిన సభలో నా మౌఖిక పరీక్ష జరిగినది. శ్రీ రాజయ్యాజోషి గారు వేసిన ప్రశ్నలకు నేను చిన్నగా సంస్కృతభాషలోనే సమాధాన ములను జెప్పితిని. అందుకా పండితులవారు మిక్కిలి సంతసించిరి. తరువాత తీర్థస్వరూపులైన మా తండ్రిగారితోను మిగతావారి నుద్దేశించి "ఏమి పర్వాలేదు. వీరు సంస్కృతములో చక్కగా పరిశ్రమించి విద్యార్జన గావించియున్నారు. ఇప్పటి పిల్లలు చదువుకొనుమని యెంతగా జెప్పినను జదుపరు. అట్టిదిఇతడుచదువుతానంటుంటేజదివించకపోవడము నాకు ఆశ్చర్యమేస్తుంది అనిరి. నాకంటెను ఒక కావ్యమును అధిక ముగా నధ్యయనము జేసియున్నారు. వీరి కవసరమున్నంత డబ్బును ఇక్కడే నా ఎదుట ఇప్పుడే ఇచ్చి వారిని అధ్యయనమునకు బంపండని" సలహా నొసంగిరి, ఆ పిదప మా నాన్నగారితో మఠమునకు తిరిగివచ్చితిమి.

## డబ్బుకొరకు మాతండ్రిగారిని మందలించుట

ఏరువాక పర్వదినము తరువాత మా కాలేజీ మరల ప్రారంభ మగుచుండెను. అక్కడికి వెళ్ళుటకై నాకవసరమైన, సామానులను సర్దు కొని ప్రయాణమునకు సంసిద్ధుడనైతిని, ఖర్చుల నిమిత్తము డబ్బు నిమ్మని నేను నాన్నగారిని విచారించితిని. వారు తమ కట్టుమందసము (పెట్టె)నుండి మెల్లిగా ముప్పది (30-00) రూ॥లు మాత్రమే దీసి నాకివ్వజూపిరి, అది జూడగానే నా క్రోధాగ్నిజ్వాల నా మస్తకము నాక్ర

మించినది. (అడుపుతప్పిన) పట్టరాని యావేశములో "నీవు దుష్టుడివి, నాటోటి బాలుడు అసత్యమును బలికిన చెల్లుతుందిగాని వయోవృద్ధుడ వయ్యు నీవాడిన మాటను నిలబెట్టుకొనవైతివి" అని గట్టిగా మందలించి తిని, అది విని తమ మనస్సులో గలిగిన బాధతో మరల పెట్టెతాళ మును దీసి నోట్లకట్టనుండి మరో పది (10-00) రూ॥ల నిచ్చి మిగత రూపాయిలను నీవింతకుముందు చెప్పిన మేరకు నీవు కాలేజికి వెళ్ళాక మనియార్డర్ ద్వారా పంపుతానని"చెప్పిరి. అప్పుడుగాని నాకోప ముపశ మించినది. ఆవేశమునకులోనై మాతండ్రిగారిని గట్టిగా మందలించితినే గాని మరల నేను పశ్చాత్తాపముతో నా మనసులో నీవిధముగా జింతిం చితిని. మనసు చిన్నబుచ్చుకున్న మా నాయనగారి ముఖమును జూచి పైకిమాత్రము తగ్గకుండ మరల వారితో నిట్లంటిని "తప్పకుండ మనియార్డర్ జేయాలి. అది పరదేశము, ఎవరినడిగితే డబ్బెవరిస్తారు?" అక్కడ డబ్బులేనిచో బాధపడేది నేను, కనుక మరవకుండని చెబితిని. అందుకు వారు సరేననిరి.

ఈసారిమళ్ళీ యాదగిరి ఎస్. ఎస్. కాలేజికి (శంకరసంస్కృత కాలేజి) వెళ్ళితిని, ఈసం॥ములో సాహిత్యమధ్యమ పరీక్షలో నెగ్గిసందు సందులకు రెండుస ం॥ములపాఠ్యప్రణాళిక మేరకుకావ్యాతీర్థ పరీక్షకుపట్టు దలతోను ఉపాధిపరీక్షనాసఁగుటకై గట్టిగా, శ్రద్ధతోను, అధ్యయన ముజేయవల్సియుండినది, ఐనను ఒకసంవత్సరము ఏపరీక్షను వ్రాయకుండ వృధాకాలక్షేపముజేయాల్సి వస్తుందిగదా? అని ఆలోచించి ఈసారిచిన్నపరీక్షలైనసంస్కృతములో "పురాణాద్య".హింది "విశారదా". కన్నడ "జాణ" పరీక్షలు వ్రాయుటకై అతిపట్టుదలతో జదివి పరీక్షలను వ్రాసితిని. ఇదిజూచి మా ప్రిన్సిపాల్ గారు ఒక్కొక్కప్పుడు ఏదోఒక పరీక్షకై గట్టిగా జదువకుండ రెండు మూఁడు పరీక్షలకై

యత్నించుట తప్పుగదా! అని మందలించుచుండిరి. అవుతేనావుద్దేశము ఒకపరీక్షలోదప్పిపోయినను మరోపరీక్షలోనేగ్గుతానుగదా!అనుసంతోషము నన్ను ఊరిడించుచుండెను, ఎట్లైతేనేమి ఆసం॥ములో వ్రాసినమూ౧డు పరీక్షలలోనుదైవాను గ్రహమువలననేగ్గితిని. వీటితోబాటు ఒకక్షణము వృధాబోనివ్వకుండ కొంత ఆంగ్లమును, కొంత ఉర్దును మరికొంత డ్రాయింగు (చిత్రాలు) వ్రాయడము వీటినిగూడ అభ్యసించుచుంటిని. కాని ఇవన్నియు గౌణవిషయములుగాయత్నిస్తు సంస్కృతాధ్యయన మునకే ప్రాముఖ్యతనొస౧గుచుంటిని; సంస్కృతములో ఆసమయమున అయోధ్యనుండి వెలువడుచుండిన "సంస్కృతమ్" మనువారపత్రికను బాగుగా శ్రద్ధతో జదువుటేగాకుండ నెలకొకసారి మాకాలేజులో నేర్పరచుచుండిన సంస్కృతభాష వక్తృత్వపోటిలోను పాల్గొనియు పన్యసించుచుంటిని. మరియు కళాశాలవిద్యార్థులు వెలువరించు చుండిన"శంకరసాహిత్య"అనుమాసపత్రికకుముఖచిత్రములను"మడివాళ మాచయ్య. బసవేశ్వర. జగద్గురు శ్రీరేణుకాచార్యులు మొదలగు వాటిని వ్రాసిఇచ్చేవాడిని, మరియు కొన్నివ్యాసములనువ్రాసి ప్రకటించు చుంటిని.

## డబ్బుకొరతయిబ్బందివలన అనేకములైన ఆలోచనలు

ముందు సం॥ము విద్యాధ్యయనమునకై డబ్బుకొరత వలన నాచిత్తమునా నారకాలుగా విచారింప౧దొడ౧గెను, ఒకవరి ఏదొఒకగొప్ప ఆస్తియుండిన మఠమునకుత్తరాధికారిగావెళ్ళి దానియాస్తితో విద్యనభ్య సింతునా! యనియు, లేదాకులమతములను భేదమును బాటింపక ధని కులైనవారి గృహమునకు ఇల్లరికముగావేళ్ళనా? యనియు,. అథవా పెద్దైననొక ఉద్యోగమును సంపాదించి దానిరాబడితో ముందు

విశ్వసిస్యసింతునా? అనియు ఇట్లు 'శతకోటిదరిద్రములకు అనంత కోటియుపాయములు" అనుసామెతననుసరించి అనేక రకములైన ఆలోచనలు నాతలలో మెదలుచుండెను. ఇట్టియాలోచనలను తుఫానులు చెలరేగినప్పుడు ఒకొక్కసారి రాత్రంతయు నిద్రలేక తెల్లవారుచుండెను, ఆలోచనానిమగ్నుడనైన సమయములో ఒక నాటకదృశ్యమును ప్రత్యక్షముగా దర్శించినట్లగు చుండెను.

ఒకపరి మఠాధిపత్యమును వహించి పదిమంది సేవకులతో పరిచర్య జేయించుకుంటు రెండుమూఁడు గొప్ప అశ్వరాజములను విలచి వాటిని దగినట్లుగా వెండియాభరణములతో నలకరింపఁజేసివాటినధిరోహింతునా? అనియు శివపూజా సామగ్రినధికముగా సంగ్రహించి. ఇష్టలింగానుష్ఠానముతో అడ్డపల్లకి, అందోళికాదుల నధిరోహించి దర్జాగా ఉత్సవాల్లో ఊరేగవచ్చును గదా! యనియు, మఠములోనే ఒక వీరశైవ సంస్కృత-వైదిక పాఠశాలను నెలకొల్పి అందలి విద్యార్థులకు భోజనవసతులను గల్పించి, పెద్దయశ్వరాజమునధిరోహించిగ్రామములంటు బర్యటించి. యచటివీరశైవభక్తులను సమావేశపఱచి వారికి వీరశైవధర్మసూక్ష్మములను ప్రబోధించి. వారిని సదాసన్మార్గప్రవర్తనులుగా జేయుదునా? ఇతరమతీయులకునువీరశైవధర్మరహస్యములను బోధించి. వారినిగూడ సంస్కారయుతులుగా మార్చుదునా. వీరశైవులలో సమైక్యతను నెలకొల్పుటకు యత్నింతునా? అనుననేక ఆలోచనలు నాస్మృతి పథములో మెదలుచుండెను. ఇట్టి ఆలోచనల మధ్య నిద్రాదేవి నన్నెప్పుడాలింగనమొనర్చుచుండెనో నేనెరుంగకుంటిని.

మఱొసారి తెల్లకంబలమును, జింకచర్మమును, కంధకౌపీనకమండలమును ధరించి, నిబిడారణ్యమునకేగి ఒక కొండగుహలో నుండి

తపోనుష్ఠానములనాచరించవలెననియు, దానితో నొక అత్యంతీయమైన దివ్యశక్తిని సంపాదించి యీ మానవజన్మమును సార్థక్యపరచుకొన వలయునను కోరిక గలుగుచుండెను.

మరోసారి పైదానికి విరుద్ధముగా నొక సుశిక్షిత సౌందర్యవతి యైన యువతిని వివాహమాడి మహాధనికులతో సంబంధమును గుదుర్చు కొని వారిచ్చె ఆర్థిక సహాయమువలన మద్రాసుకు వెళ్ళి అక్కడ సంగీతము, వైద్యవిద్యను. అభ్యసించితద్దనార్జనద్వారాసర్వవిధములైనసుఖోప భోగములను అనుభవించవలయుననియు, ఉన్నతమైన మేడను గట్టించు కొని కోట్లాలుగా ధనమార్జించవలెననియు, మున్ముందు మంచి సంతానము గల్గి వారు పెద్దవారు కావడముతో వాండ్లకు వివాహాది కార్యములను నెరవేర్చిన పిదప నేను సన్యాసాశ్రమమును స్వీకరించవలెననియు, అథవా మున్ముందు నేను ఆయుర్వేద డా॥రునైనచో నేనుండిన గ్రామ ప్రజల బాధలను దొలగింపఁజేయుటకై రేయింబవళ్ళు రోగగ్రస్తుల ఇండ్లకు వెళ్ళి దగిన చికిత్స లొనర్చి యనితోకీర్తిని బడయవలెనను కోరిక నాకు మెండుగా నుండియుండెను.

సంగీతము నభ్యసించి ప్రజలకు శ్రవణపేయమగునట్లుగా పురాణప్రవచనము గావించి శ్రోతలను సంతోషపరచవలెనను మరో కోరికయుండేది. ఈ రెండు విద్యలను మరియు తదితర తెలుగు - కన్నడము - హిందీ - సంస్కృతముల నభ్యసించి. బీద విద్యార్థులకు వాటిని యుచితముగా బోధించవలెననే కోరిక మిక్కుటముగానుండెను. అవుతే వీటన్నింటి నభ్యసించుటకు "ధనమూల మిదంజగత్" అను సూక్తి ప్రకారము ఆర్థిక సహాయమొనర్చు వారెవరు? ఇవన్నియు గొంతెమ్మ కోరికలైనవి.

# వివాహ సంబంధ ప్రయత్నం

యాదగిరి శంకర సంస్కృత కాలేజిలో నేను విద్యాధ్యయనము జేయుచున్న సమయంలోనే నంద్యాలనుండి ఒక మహేశ్వరుఁడు వచ్చియుండెను. ఆఁతడు ప్రతి సం॥ము శివరాత్రి పర్వదినమహోత్సవ సందర్భమున మహానంది పుణ్యక్షేత్రములో అన్న సత్రమును నెలకొల్పుచుండెవాఁడు, అద్దానివ్యయము కొరకాతఁడు అక్కడక్కడ సంచారము జేస్తు భక్తులవద్ద విరాళములుగా డబ్బును ప్రోగు జేయుచుండెను. అతనికొక్కే ఒక కూతురుందనియు, ఆవిడమహాచాకచక్యము గలది, చదువరి. కొద్దిగ గణితము మరియు ఆయుర్వేదముల నభ్యసించినది,సుగుణములు గలది.కనుక ఆమెకు దగిన వరుని అన్వేషించుచున్నాను. ఆ వరుఁడిష్టపడినచో మా ఇంట్లోనే ఇల్లరికము బెట్టుకుంటానని, అతనికి ఒక సేరు బంగారము ఇచ్చి నాయావదాస్తిని వారి పేరిట రిజిష్టరు జేయిస్తానని మా యుపాధ్యానితో చెప్పెను. అందుకంగీకరించేవారుండిన విచారించి నాకు పత్రమును వ్రాయమని చెప్పెను. అంతటితో మా ఉపాధ్యాయుడు గూడ కొందరు విద్యార్థులను విచారించిరి. విద్యార్థులందరు అంతో ఇంతో డబ్బుగలవారె, అందును దూరపు సంబంధమునకు జడిసి యెవరు నంగీకరించరైరి. దరిద్రనారాయణుఁడనైన నా నోట్లో నీరూరదొడగెను. "అబ్బ ఒక్క తులం రెండు తులాల బంగారు గాదు. ఒకేసారి సేరు బంగారమె పోగా తన ఆస్తినంతను అల్లుడిగారి పేర రిజిష్టరు జేస్తారట. యెంత మంచి సంబంధము. తనకుదానే వెదకుతువచ్చిన ఉత్తమమైన సంబంధమియ్యది" "వెదుకబోయిన తీకాలజుట్టుకున్నట్లు" అనిఆలోచిస్తు ఉండగానే ఉపాధ్యాయులు (వీరుమాకుకన్నడమును బోధించె కన్నడ పండితులు శ్రీ వీరేశ్వరశాస్త్రియని వీరిసరేయని యంగీకరించితిని. పేరు) నన్ను విచారించిరి. అందుకు ఇంతలో నంద్యాలనుండి వచ్చిన వారు పత్రమును వ్రాయుమని చెప్పివెళ్ళిరి.

ఆ తరువాత మా పండితులవారు ఒక లేఖను నన్నుగురించి వ్రాసిరి. అది వారికి ముట్టడముతోనే వారు పండితులవారికి 4—5 (నాలుగైదు) రోజుల్లో మహాశివరాత్రి ఉత్సవానికి ఆ అబ్బాయిని వెంట నిడుకొని తామింతవరకు తప్పకుండ విచ్చేయగలరని వారినుండి తిరిగి సమాధానము వచ్చెను. పండితులవారా లేఖను నాకు జూయించిరి. మహానంది పుణ్యక్షేత్రమునకు వెళ్ళివచ్చుటకుగాను సుమారు ముప్పది. నలువది. (40) రూ॥లను సంగ్రహించుకొని సిద్ధముగానుండదని యాదేశించిరి. మొదలే నావద్దనే మాత్రము డబ్బులేక ఇబ్బంది పడుతుండెను మరల ఈ డబ్బును నేనెక్కడినుండి దెగలను? (పూర్వాపరముల) వెనుక ముందు విచారించుచుంటిని. ఇట్టి పరిస్థితిని గమనించి ననాతోడివిద్యార్థులు నాపైమిక్కిలి ప్రేమయుంట చేత ఒకరి కంటెను మరొకరు పోటీపడుతు నేనుచేబదులు ఇస్తానని చేబుతునన్ను ప్రోత్సహించిరి. సరే ఇఁక మహాశివరాత్రియెప్పుడొస్తుందాయని నిరీక్షించు చుంటిని, శివరాత్రి ఇంకను రెండు మూఁడుదినములుండగానే నేను మాకన్నడ పండితుల వారితోబాటు ప్రయాణమునకు సిద్ధపడితిని.

## నామిత్రులు ముందుగానే పెండ్లికొడుకుగా (ముస్తాబు) తయ్యారు జేయుట

ఆదినము రాత్రిరైలుబండికి ప్రయాణమయ్యే సమయములో నామిత్రులుమిగుల ఉత్సాహసంభ్రమాలతో సాగనంపుటకు గుమిగూడిరి. అత్యానందముపొంగుచుండ "నాడుకణ్వాశ్రమమునుండి పతిగృహమునకు సాగనంపే సమయములో శకుంతలను ప్రియంవద అనసూయ సఖులు అత్యంత ప్రేమతో నలంకరింపఁజేసినయట్లు" ఇక్కడ నామిత్రులుగూడ ఒకరు పట్టంచుదోవతి (జరియంచుగలది)

గట్టించిరి, మరొకరు అందమైన శరటును దొడగించితి. ఒకరుమంచి విలువగల కోటునుదొడుగు కొమ్మని ఇచ్చిరి, మరొకరు తలకు సుగంధపు తెలమునురుద్ది వెంట్రుకలను చక్కగాదువ్వి ముఖమునకు పౌడరువేసిరి. మరొకరు విలువైన శిరస్త్రాణము (టోపి)నుధరింపఁజేసిరి, ఒకరుకప్పుకొనుటకు దుశ్శాలువనొసఁగిరి. మరొకరుపరచుకొనుటకు ఛత్రంజి(జంపుకాణము)నిచ్చిరి, మరొకరు సామానులను భద్రపరచుకొనుటకు ట్రంకుపెట్టెను. మరొకరుచేతి బస్తను. దెచ్చియిచ్చిరి, ఈవిధముగానన్నలంకరింపఁజేసి, సంతోషముతో సఫలమనోరథుండవై. భార్యాసమేతుండవై. దిరిగిరమ్మని నాకంటెను వయస్సులో పెద్దవారాశీర్వదించిరి. సమవయస్కులు ప్రేమతో కౌగలించుకొనిరి ఇట్లుమిత్రులు అత్యంతవేడ్కతో సాగనంపిరి.

నేను అత్యానందముతో మిత్రులకు వీడ్కోలుతెల్పి పండితులవారితో బాటుటాంగాలో ప్రయాణమైరెల్వేస్టేషన్‌కు వచ్చేసరికి రాత్రి పది గంటలైంది రైలుబయలుదేరుటకు సంసిద్ధముగా నుండెను. టికిటును తీసికొనుటకుగూడ అవకాశములేకుండెను. అప్పుడు మాపండితులవారు గార్డియన్‌కుజెప్పిఎదోకొద్దిగాలంచమివ్వగానాతడుతనడబ్బలోనేగూర్చుండబెట్టుకొనేను. ఆడబ్బలోను ఇంతకుముందే మా బోటివారుకొందరుండిరి. తరువాత రాబోవుస్టేషన్‌లో మాపండితులవారురైలుదిగిటికట్లనుగొని తెచ్చిరి. తెల్లవాఁడయెనమిది గంటకు కర్నూలుస్టేషన్‌కు జేరుకుంటిమి. అక్కడ బండిని మార్చవల్సియుండెను, ఆసమయములోనే శ్రీశైల యాత్రికులు క్రిక్కిరిసి యుండిరి. రైలు డబ్బాలో స్థానము లభించుటే అతిదుర్లభముగా నుండెను. నేను మాత్రము ఎట్లాగో కష్టపడి రైలు డబ్బాలో కెక్కితిని ఆ పిదప పండితులవారు కొంత వడి

తికమకపడుతు స్వయముగా రైలుదబ్బాలోకి ఎక్కడాకపోవడముచేత ఒకకూలివాడికి బేడ (రెండణాలు) వాడికివ్వడముతో నాతడుపడింత్తులు వారిని అమాంతము ఒకమూటలాగలేవనెత్తికిడికినుండి దబ్బాలోకి ఒడవైచెను, వారు ఆదబ్బాలోనున్నస్త్రీలపైబడుటవలన వారుతెల్లుగు భాషలో బూతులుకూయనారంభించిరి. నెనెలాగో వారికినచ్చజేప్పి సమాధానవరచితిని, మధ్యాహ్నము రెండుగం. లకు నంద్యాలకు జేరుకుంటిమి. అక్కడ రైలుస్టేషన్దిగియున్న యాత్రికులకు బలాత్కరించి ప్రభుత్వోద్యోగులు ప్లేగుటీకాలు వేయుచుండిరి, మేముభయులము తప్పించుకొనుటకు యత్నించితిమిగాని, అది విఫలమయ్యెను. చివరికి మేముటీకాలుదీయించు కుంటిమి. అటనుండి టాంగాలో గూర్చుండి కాబోయే మామగారి గృహమును జేరుకుంటిమి. అక్కడ ఆయింటి వారు ఇంట్లోనే సామానులుంచకుండ మహానంది క్షేత్రమునకు దరలించియుండిరి. ఏదోకొద్దిగా అక్కడ ఉన్న వాటితోనే స్నానమాచరించి, అల్పాహారముతోసంతృప్తి జెంది తిమి, పండితులు శ్రీ వీరేశ్వరసాస్త్రిగారు అమ్మాయినిరప్పించి పరిచయము చేయించిరి.

ఆ మీదట మధ్యాహ్నము బండిలో గూర్చుండి మహానంది పుణ్య క్షేత్రమును దర్శించడానికి ప్రయాణమై సాయంత్రము ఆరు గం॥లకు అక్కడికి జేరుకుంటిమి. అక్కడ అది జాత్రాసమయము కావున వరుసగా నున్నవిపణి (షాపులు) వీధులతోడను, హోటళ్ళు, అంగడులతో నొప్పారుచుండినవి. దేవాలయము ఎదుట ఒక గొప్పదైన చౌకముగాను విశాలముగానున్న గుండము, అందు పశ్చిమ దిశలోనున్న నంది శిలా విగ్రహము ముఖమునుండి ప్రవాహములా నీరు ప్రవహించి ఈ గుండ

ములో బడుచుండును, దాని మధ్యలో ఒక ఎత్తుగానున్న అరుగుపై శివలింగము - నంది విగ్రహములుండినవి, యాత్రికులు ఈ చిన్న మందిరములో లింగమును - నంది విగ్రహములను బూజించి తరువాత నడే గుండము నీటిలో ఎదబంటిఉన్న వాటిలో ప్రదక్షణలు జేస్తుఉంటారు, దేవాలయము మహద్వారమునకెదుట ఇరువైపుల మరిరెండు చిన్నవి నీటిగుండములున్నవి. అందులోని నీరు మనిషి నిలువులోతుండినను వాటి దిగువ నొక గుండుసూది బడినను స్పష్టముగా పైకి అగుపడు చుండును. అందు ఒక గుండములోదిగి నేను స్నానము జేసితిని, నీరు వెచ్చగా నుండినవి. ఈ రెండు గుండాలనీరు ప్రవహింపఁజేసి పంట పొలాలకు పారబెట్టుట కనువుగా కాలువలు (సొరంగాలమాదిరి)అమర్చి యున్నారు. దేవాలయమునకు చుట్టుప్రక్కల ఎత్తైన పర్వతములు, దట్టముగానుండి, చాలా ఉన్నతముగా బెరిగియున్న వెదురు వృక్షముల తోను, ఇప్పచెట్లు, టేకు వృక్షములు మరియు నితర వృక్షములతోను, దట్టముగా నలుముకొనియున్న కారడవితోను విరాజిల్లుచుండినది. అక్కడి ప్రశాంత వాతావరణము మమ్ము ముగ్ధులుగా జేసినది, అన్నసత్రములో మా వసతినేర్పరచుకుంటిమి. దేవాలయములోకి వెళ్ళి దేవుడిని దర్శించి వచ్చితిమి, దేవాలయమునకు చుట్టుప్రక్కల చిన్నచిన్నగదులురాతికట్టడలతో చౌకముగా నిర్మాణించబడినవి. ఇవి యాత్రికులకు నివాసయోగ్యములైనవి. వీరశైవ అన్న సత్రములకు ఎదుటనే బ్రాహ్మణ సత్రములుగూడ యుండినవి.

సాయంత్రము ఆరు గం॥లకు యాత్రికుల సంఖ్య యధికమై క్రిక్కిరిసియుండెను. ఎటుజూచినను జనముయొక్క కలకలశబ్దమే వినబడుచుండెను. ఏ చెట్టుక్రింద జూచినను జనసమూహమె అగుపడు

చుండెను. రాత్రి బిజిలీలు వెలుగుచుండినవి. నేను మా పండితులవారితో బాటు మా ధర్మసత్రముపైన (తొక్కుడు బయలుమిద్దె) పడుకోవడానికి మొదలే ఆసనములను పరచుకొనియుంటిమి, భోజనము జేయటముతోనే అక్కడికి వెళ్ళి పరుండుకుంటిమి. మధ్యరాత్రిసమయమునుండి నాకచటి వాతావరణము సరిపడక శీతజ్వరము ప్రారంభించెను. ఎన్ని గప్పినను తగ్గకుండ చలియధికమగుచుండెను. మొదలె అది శీతల ప్రదేశము బంగళానుండి క్రిందికి దిగివచ్చుటకు దగినమెట్లు లేకుండెను. వెచ్చగా నెచ్చోటనైన పరుండవలెనని నను ఏమాత్రము స్థానములేకుండెను స్త్రీలతో నిండియుండెను. ఎలాగు చలికి దట్టుకొనలేక కిందికి దిగి సాహిత్య సామగ్రి యుంచిన గదిలో తలదాచుకొనుటకు అనుమతించక పోయినను బలవంతముగా వెళ్ళి బియ్యపు బస్తాలమధ్యన పరుండి యుంటిని. కొద్ది సమయములోనె మా తాత్కాలిక అత్తగారు ఏదో సామగ్రిని దీసికొని వెళ్ళుటకై వచ్చి నన్ను సరగ్గాచూడక నానుదుట తన కుడిపాదమును బెట్టి వెంటనే దెలిసికొని "అయ్యో! శివ! శివా! మీరిక్కడ పరుండియున్నారా? అని ముమ్మారులు నా పాదములకు నమస్కరించి వెళ్ళిరి. నేనక్కడినుండి లేచి మిద్దెపైకి వెళ్ళినా మొదటి స్థానముతోనే పరుంటిని, తెల్లవారు జామున నాకు మూత్రము వచ్చినది. పైనుండి క్రిందికి దిగడానికిని నాకేమాత్రము శక్తిలేకుండినది. మా పండితుల వారి ఆజ్ఞానుసారముగా ఒకవ్యక్తి పుణ్యాత్ముడు సమయానికి నావద్దకు వచ్చి క్రిందికి దింపెను. సరే నేను మూత్రవిసర్జన జేయునప్పుడు ఒకేసారి వేడిగాను రక్తమిశితమైన మూత్రము వచ్చెను. దానిని జూచి భయపడితిని, తిరిగి మా పండితులవారిని సమీపించి వారితో నిట్లు జెప్పితిని." పండితరే! నేనిక్కడ ఒక క్షణముండనండి. నాకనా రోగ్యము క్షణక్షణము మితిమీరుచున్నది. నేను వెనుదిరిగి వెళ్ళుతాను.

తర్వాత మీ ఇష్టము. మీరు కావలిస్తే ఇక్కడే ఉండవండని వారితో జెబితిని. శాస్త్రిగారికి ఇంతదూరము వచ్చినందులకు ఈరోజు ఒక్క దినముండి నాటి సాయంత్రము జరిగే రథోత్సవమును దిలకించాలనే కోరిక వారికి మెండుగానుండెను. కాని యేమియు ఎరుగని అబ్బాయిని అనారోగ్యముతోనుండి నన్ను ఒకడినే బంపించిన మార్గములో నేమి ప్రమాదము జరుగునోయనిదలంచి ఎట్టకేలకునా వెంటనేవచ్చుటకు అంగీకరించి తాను మొదట స్నానముజేసి నన్నుగూడ పిదపస్నానముజేయించి గుండములో ప్రదక్షణ జేయించి దేవుడికి, టెంకాయ కర్పూరము అగరు ధూపములను భక్తితో సమర్పించి వచ్చిరి. జనసందోహము అధికముగా నున్నందులకు నేను గర్భగుడిలోనికి వెళ్ళక బయటనుండే దేవుడికి దండము బెడితిని. అక్కడినుండి ప్రయాణమై నేరుగా రాయచూరు నగరమునకు రావడముతోనే నా ఆరోగ్యము కాస్త కుదుటపడినది. అక్కడికి రావడముచేత కోల్పోయిన శక్తినిగూడ దేహము కొంతవరకు సంతరించుకొన్నది. ఆ నంద్యాలలో నా అనారోగ్యముచెడినందున అక్కడి కన్య విషయమును బట్టించుకొననైతిని. ఆ అమ్మాయికి సంబంధించిన వారందరు జాత్రాగడ బడిలో నుండిరి. రాయచూరులో హత్తునూరి గౌడగారి ఫ్రీ బోర్డింగులో స్నానము - లింగార్చన - భోజనాదులను ముగించుకొని ఒక దినమక్కడే గడిపితిమి. శ్రీ దిన్నినూగూరు శర్మగారు, ఈ బోర్డింగును నిర్వహించుచుండిరి. వీరు విద్యాకోవిదులు, అక్కడ నా మిత్రులకొరకు ఫలహారములను గొని దీసికొంటిని. మరునాడుదయమక్కడినుండి బయలుదేరి యాదగిరి కాలేగకి జేరుకుంటిమి. మిత్రులకు నంద్యాలలో జరిగిన విషయమును వివరింపగా వారు నిరుత్సాహపడిరి. వేసవి సెలవుల్లో మళ్ళి మా గ్రామమునకు వచ్చితిని, ఈ సంII ము తీర్థపరీక్ష వ్రాయుటకై గట్టిగా పరిశ్రమ జేయవల్సియుండును.

రెండు మాసములు స్వగ్రామములోనే గడిపితిని. ఇప్పుడు మళ్ళీ యాదగిరి కాలేజీకి వెళ్ళాలనిన చేతిలో డబ్బులేదు. మా గురువుల వారు నాకు డబ్బులు ఇవ్వవలదని పాపన్నపేట శ్రీ చంద్రశేఖర స్వాముల వారికి చెప్పడముతో వారునాకు డబ్బివ్వడము మానుకునిరి. ఆర్థిక విషయమై చాలా చింతించితిని. వ్యసనమునకు లోనైతిని. మళ్ళీ మొదటి లాగానే అనేక విధముల యోచింప దొడగితిని; ఒక్కొక్క రాత్రి ఈ ఆలోచనలతో నిద్రరాకుండెను. ఏలాగు అప్పట్లో నాకు పరమ విశ్వాస పాత్రులైన శ్రీ శంకరశాస్త్రి అలంపల్లిగారివద్దకు వెళ్ళి వారికేదో చేదోడుగానుండి జదువుటకై నిర్ణయించుకుంటిని. కాలేజిలో జదివిన పాఠ్యపుస్తకములలోని విషయములనే పునరావృత్తము జేసికొనుచుంటిని.

ఇంతలో మరో విచారము నాలో ఉదయించెను. "ఒకప్పుడు బసవతీర్థ" క్షేత్రమునకు సంబంధించిన మఠాధిపతియైన శ్రీ మ. నిప్రభు స్వాములవారు నాతో గల్సినప్పుడు "నీవు మా మఠమునకు వచ్చెదవా? దానికి నిన్ను అధిపతిగా జేయదలచానని నుడివియుండిరి. అది నాకు జ్ఞప్తికి వచ్చెను. కాని అక్కడి వెళ్ళుటకైనా డబ్బు అవసరమేగదా? ఈ సమయమున నావద్ద నాలుగు రూ॥లు మాత్రమే యుండెను. ఈ సంగతిని అప్పట్లో నా ఆప్తమిత్రులైన శాస్త్రిగారితో జెప్పితిని. సరే మంచిదని తమ ఆమోదమును వెలిబుచ్చిరి. రైలుద్వారా హుమ్నాబాదుకు వెళ్ళి అటనుండి బస్సులో బసవతీర్థ క్షేత్రమునకు జేరుకుంటిని. ఇది ప్రత్యక్షముగా చాల పవిత్రమైనది. ఇక్కడి వాతావరణము మిక్కిలి ప్రశాంతమైనది. నిర్జన ప్రదేశము. పరిసరములందు మామిడి వృక్షము లున్నవి, మొరపనేల యెఱ్ఱగానుండినది. అక్కడచల్లని. శుభ్రమైన, రుచికరములైన, నీటిసెలయేరులున్నవి. చిన్నచిన్న బావులున్నవి. వాటి ప్రవాహముతో చక్కని చెరకు పంటలున్నవి. ఆమధ్యన విశాలము

గానున్నతముగాను మొరపరాలతో నిర్మించిననిర్మాణముతో విరాజిల్లుచుండిన మఠములోకి అడుగిడితిని. అక్కడవిచారించగా నాసమయములో స్వాములవారులేకుండిరి. ఎక్కడికోసంచారార్థము వెళ్ళియుండిరి. అదివినగానె హతాశగలవాడనైతిని. సరె అక్కడే మధ్యాహ్నముస్నానము లింగార్చన.కంతిబిక్ష పధార్థములను (ప్రసాదమును) అరగించి అటనుండి వెనుదిరిగి హుమనాబాదుకువచ్చితిని. అక్కడ నావరితుచితులవద్ద కొంతడబ్బు (ప్రయాణమునకు)ను దీసికొని మరల నానివాసమైన సదాశివపేటకు జేరుకుంటిని.

ఇక్కడనాకు ఆప్తమిత్రుల్లో ఒకరైన శ్రీశెట్టి రెవప్పగారుండిరి. వారికి నాయందలియున్న భక్తిచేతనావిద్యాధ్యయనమునకుగలిగిన ఆర్థిక ఇబ్బందినిగుర్తించి శ్రీహుమనాబాదు తేజప్పగారికి నన్ను పరిచయము జేయించి వారిద్వారా "నిజాంప్రాంతీయవీరశైవ పరిషత్తు"లో మెదక్ జిల్లా వీరశైవ ధర్మ ప్రచారకునిగా నియమింపజేసిరి, తేజప్పగారు ప్రభుత్వములో లింగాయతుల పక్షాన ప్రతినిధిగా నుండిరి. అసెంబ్లి మెంబరుగా నుండిరి. మరియు మేదకుజిల్లా కార్యకర్తగా గూడ ఉండిరి. కనుక వారిసిఫారసు అవసరమయ్యెను, పరిషత్తు కార్యాలయము హైదరాబాదు సిద్ధియంబర్‌బజారు మస్‌జీదువద్దఉండె భేణెవారి బంగ్లాలో పైయంతస్థులో నుండెను, అప్పుడు శ్రీమండిగే బసప్ప బి. ఎ. ఎల్. ఎల్.బి. అడ్వోకేటుగారు పరిషత్తుకు ప్రధాన కార్యదర్శిగా ఉండిరి. వారినివాసమక్కడేయుండేది, వీరుకుటుంబయుక్తముగా నుండిరి. శ్రీప్రభురావువకీలు ఈపరిషత్తుకు సంచాలకులుగానుండిరి. నాతోబాటు మరికొందరు ధర్మప్రచారకులుగా ప్రతి జిల్లాకొక్కరి చొప్పున నియమించి యుండిరి, అందులో కొందరునాకు

మిక్కిలి పరిచితులైరి, మాకందరికి పరిషత్తునుండి ఒక ప్రమాణ పత్రమునొసఁగియుండిరి. అందు "ఈపండితులు మా వీరశైవ పరిషత్తు పక్షమున ధర్మప్రచారమునకై మీ గ్రామములకు వచ్చేసినప్పుడు వీర శైవులందరిని సమావేశపరచి వీరియమూల్య సందేశములనువినిస్థానిక వీరశైవులందరిని పరిషత్తుకు సభ్యులుగా జేర్చవలసిందిగా యుండెను, పరిషత్తునుండి ప్రతినెల 30-00 (ముప్పదిరూ॥ల) మాసికగౌరవ వేతనము నిచ్చుచుండిరి. అది మేము సభ్యలనుగాజేర్చిన వారి డబ్బునుండిమాకు వేతనమునొసఁగు చుండిరి. అది ఒకొక్కతడవ రెండుమూడు మాసములు గడచిన తరువాత ఇచ్చెవారు. అదియేమై నప్పటికి నేను అభిమానముతో మెదక్‌జిల్లాలో ప్రతిగ్రామమునకు వెళ్ళి అక్కడరాత్రిస్థానిక భక్తులనందరిని సమావేశపరచి వీరశైవధర్మమును గురించి ఉపన్యసించి, ఆతరువాతకొందరిని సభ్యులనుగా జేర్చు చుంటిని, ఈడబ్బునుకూడ బెట్టుకొని కాలేజికివెళ్ళి అధ్యయనము జేయుచుంటిని, ఒక్కొక్కప్పుడు సదాశివపేటలో శ్రీశివుదానము బక్క య్యగారను వారు శ్రావణమాసములోనన్ను తమవద్దకు రప్పించుకొని సదాశివపేట నగరమునకు దక్షిణదిసలోనున్నగవని (కమాను) ఆవ తల సమీపముననున్న చేవెళ్ళవారి మఠములో సాయంత్రము 5.గం.నుండి రాత్రి 8.గం.వరకు పురాణ ప్రవచనము జెప్పించు చుండిరి. శ్రావణ మాసాంతమున వారుగూడ వందయేబది. రెండు వందల రూ॥లు దక్షిణగా నొసఁగుచుండిరి. శ్రావణమాసాంతము వారిట్లోనే నాభోజన సతులుండేవి, ఈడబ్బుగూడ నా అధ్యయన మునకు గొంత తోడ్పడినది.

## మాతండ్రిగారు అనారోగ్యమునకు లోనగుట

ప్రతియేట శ్రావణమాసములోవలె పురాణప్రవచనముకొరకు సదా శివపేటలోని శ్రీ శివుదానము బక్కయ్యగారు నన్నాహ్వానించియుండిరి.

వారి పిలుపు ననుసరించి సదాశివపేటకు విచ్చేసితిని. యథారీతి నా శివ పూజా భోజన వసతులు శ్రీ శిష్టదానము బక్కయ్యగారింట్లోనే జరుగు చుండెను. ఒకనాడు దేవగృహములో లింగార్చన ముగించుకొని జొన్న రొట్టెను తినుచుంటిని. మొదటి కబళము (బుక్క) చేదుగా దోచినది. వెంటనే దాన్ని మ్రింగకుండా క్రిందబడవైచితిని, నాకు ప్రతిదినము చనువుతో వడ్డించే శ్రీమతి చెన్న బసమ్మ (వీరు శ్రీ బక్కయ్యగారి మరదలు విధవరాలు)గారిని బిలిచి యేమమ్మ ఈరొట్టె ముక్క చేదుగా దోచినదని యామెతో చెప్పగా నామె ఆ రొట్టె ముక్క మాత్రమేనా? మిగతా రొట్టె అంతయు చేదుగానున్నదేమో చూడుమనెను. సరేయని మిగత ముక్కను కొరికి చూడగా చేదుగా లేకుండెను. అప్పుడే నాకు మా తలిదండ్రులలో ఒకరికి చెడు వాటిల్లియుండునని మనసులో ఒక విచిత్రమైన శంకా (అనుమానము) ఉదయించెను. తరువాత ఆ నెల శ్రావణములో పురాణమును సమాప్తిగావించి, యాదగిరి కాలేజికి వెళ్ళకుండ నేరుగా మా జన్మభూమియైన జోగిపేట పెద్ద మఠమునకు వచ్చితిని. ఇంతలో మా తండ్రిగారనారోగ్యముతో నేలబట్టి యుండిరి. వారిదీనస్థితిని జూచి ఈ సమయములో తండ్రిగారి పరిచర్యనుమానుకొని విద్యాధ్యయనమునకు వెళ్ళుట మంచిది గాదని యెంచి. అక్కడే ఉండి గ్రామములో మళ్ళీ యథారీతి పిండి భిక్షాటనముజేస్తు నాయనగారికి శుశ్రూషథోపచారములను జేయించుచుంటిని, నాతమ్ముడు వీరొంతయ్య ఇంటి విషయములసంతగా బట్టించుకొనకుండెను. మా తల్లిగారు చాలా అమాయకురాలు, వేరొండు ఆదాయ మార్గము లేనందులకు తండ్రిగారు నేలకొరగే పర్యంతంశక్తి చాలకున్నను తానే గ్రామములో భిక్షాటనకు వెళ్ళుచుండిరి. గాని సోదరుడు ఏమాత్రముబట్టించుకోకుండా ఉండి మా తల్లిదండ్రులను తిడుతు డబ్బులిమ్మని వేధిస్తు గ్రామములో వట్టిపోకిరి

వాడీలా దిరుగుతు సమయమునకు మఠమునకు వచ్చి దర్జాగా భుజించి వెళ్ళెవాడు. చదువు సంస్కారములు లేనివాడు. వాడి చేష్టలకు నాయన గారు చాలా నొచ్చుకొనుచుండిరి. తల్లిగారుమాత్రము నాయనగారెంతగా వాడికి తిండిబెట్టకుమనిరోధించినను దానిని బట్టించుకొనకుండ సమయ మునకు రావడముతోనే తండ్రిగారికి దెలియకుండగా, నేనువెళ్ళాకగూడ నాకును దెలియకుండగా, వాడికి చాటుమాటున భోజనముజేయించి బంపు చుండెను. నాయనగారిని వేధించడమువలన నేనక్కడికి వెళ్ళక మొదలె రెండు బఱ్ఱె(గెదె)లను సోదరుని ఉద్యోగ నిమిత్తము గొనియిచ్చి యుండిరి. వాటికి గూడ సమయానికి మేత నీళ్ళు అందించాలనే శ్రద్ధా గూడ వాడికి లేకుండెను. ఆ బాధ్యతను మా తల్లిగారే నేను వెళ్ళక పూర్వం భరించుచుండెను. ఇక నాయనగారు తాను మంచిగా నున్న సమయములోనే కొంతవ్యాపారముజేసి సంపాదించిన డబ్బును తాననుభ వించకుండ మాతల్లి మరియు, మాసోదరుని నిర్లక్ష్యపువైఖరిని గమనించి తనకు విశ్వాస పాత్రులైన వారికి చేబదులో, అప్పుగానో, ఇచ్చి మిగత డబ్బును తన ఆప్తమిత్రులవద్ద దాచుకొనియుండిరి. నేను మాత్రము ఇంతగా జదివి పెద్దవాడివైనందులకు మా తండ్రిగారిని కనీసము కూర గాయలకైనా డబ్బునిమ్మని యేనాడును అడుగలేదు. నేను ఇంటికి పెద్ద వాడిని గనుక సమస్త మఠము సంసారకుటుంబ పోషణాది బాధ్యత లను వహించవలసి వచ్చెను. ఈలోగా తండ్రిగారి వ్యాధి తగ్గుముఖం వట్టకుండ మరియెక్కువైనది. ఈ సమయములో జోగిపేటలోనుండుట కంటెను మా తండ్రిగారి జన్మభూమియైన చేవెళ్ళ గ్రామములోని మా మూలమఠమునకు మా నివాసమును మార్చితిని. కారణమేమనగా జోగిపేట పెద్దనగరము కావున ప్రతి వస్తువులు గొనుటకు డబ్బవస

రము. చేవెళ్ళ చిన్న గ్రామమైనందులకు మా తండ్రిగారి మీద నా మీద గూడ అక్కడి భక్తులకు ఎనలేని భక్తిగనుక కొంతవరకు అహారధాన్యము మిగతవస్తువులుకొన్ని ఉచితముగానె లభించు చుండెను, అప్పటికిని నాపిండిభిక్షాటనము అక్కడగూడ ఒకటి రెండు పల్లెలుదిరిగి రావడము జరుగుచుండెను, నాయనగారికి ఆయుర్వేదఔషధ చికిత్సను శ్రీమఠము సిద్దయ్యపెద్దా పురంగారుజేయు చుండిరి, మానాయనగారి పెద్దసోదరి శ్రీమతి సంగమ్మగారు మరియు వారిమనుమరాలు మా అమ్మగారికితోడుగానుండి నాయగారికి రెయింబవళ్ళు పరిచర్య జేయుచుండిరి. నాయనగారు నాకును మరియు వైద్యునకుగూడ చెప్ప కుండలోలోనతనకిష్టమొచ్చినరీతిగా అంబలిగుగ్గిళ్ళు మాతల్లిగారితో జేయించుకొని దినెవారు. వారట్లు అపథ్యముజేయుటచేత మరింత రోగము ప్రబలమగుటకు గారణమయ్యేను. అ పథ్యము చేత నంజురోగ గ్రస్తులైరి. వారు తమ మనస్సులో ఇక తమ జీవితము చాలా దినములుంద బోదని దలించి కాబోలు శ్రీ మఠము సిద్దయ్యగారి మొదటి కార్య కూతురిని నా సంబంధమునకు గుదిర్చిరి. అంతేగాదు కన్యా నిశ్చితార్థమునకై తనకు విశ్వాసపాత్రులైన శ్రీ ఆమని సంగప్ప. శ్రీ పట్లోళ్ళ (శెట్టి) వీలసంగప్ప. శ్రీ ఇందూరి సంగప్ప. శ్రీ పట్లోళ్ళరాచప్ప. మొదలగు గ్రామ ప్రముఖులను దనకడకు రప్పించుకొని,మంచి ముహూర్తము నిశ్చయించి ఆనాడు నిశ్చితార్థమునకై తప్పకుండ వెళ్ళిరండని ఆజ్ఞాపించిరి. నేను మరియు నాకును విశ్వాసపాత్రులైక శ్రీ ఆమని సంగప్ప శ్రీ పట్లోళ్ళ రాచప్ప మున్నగువారు ఇప్పుడేమి అంతగా తప్పిపోయినది. ఇంతతొందరపాటు వలదు. మీ యారోగ్యము కాస్త కుదుటబడిన తరువాత జూతమంటిమి. కాని వారెంతగా జెప్పినను వినకుండ నిశ్చితార్థమునకు వెళ్ళిరమ్మనిరి.సరె గ్రామప్రముఖభక్తులందరునా పైమాతండ్రి

గారిపై నున్న అభిమానము కొలది మిగుల సంతోషముతో అధిక జనులు బాజాబజంత్రీలతో తమ తమ వారుముల నధిరోహించి పెండ్లి సందడిలా గడీ పెద్దాపురము గ్రామమునకు వెళ్ళిరి. నేను చేవెళ్ళలో ఇంటివద్దనే ఉంటిని. ఉదయము నేను మంగలినిరప్పించి క్షౌరమును జేసికొనుచుండగా మాతండ్రిగారికలశము(తల)ఒకవైపు ప్రక్కకుదొరలి నట్లయ్యేను. అప్పుడే నాగుండెకు షాకుదగిలినట్లయ్యేను. ఇది యపశకున మని భావించితిని. నాలో అంతులేని దుఃఖము సముద్రముప్పొంగి మెర మీరి (కట్టలు త్రెంచుకొని) పైకెగిసినట్లయ్యేను. దుఃఖపు విచారములు తుఫానులో సాగరములోని కెరటాలు ఉవ్వెత్తుగా ఎగసినట్లయ్యేను. నేను కొంతసేపు తండ్రిగారి దాపుననె గూర్చుండి దుఃఖించితి, అక్కడే ఉన్న మంగలి సంగయ్య నివ్వెర బోయి మాట్లాడకుండెను. మళ్ళి తండ్రిగారె "నీకేమి కొరత ఉంది నాయనా? నీపై ఋణభారమునుమోప లేదు. బాగావిద్యభ్యసించావు. నీయంతట నీవు బ్రదుకనేర్చావు. దుఃఖిం చకుమని ఒదార్చిరి.

అక్కడ కన్య నిశ్చితార్థమునకై వారు గడీ పెద్దాపురము మఠ ములోకి ప్రవేశించడముతోనేమఠముమహాద్వారమునకుఎదుటనున్నఇంట ఒక స్త్రీ మరణించినది. ఇది యశుభముగా అక్కడికి వెళ్ళినవారు భావించి, ఆమె సమాధి అయ్యేవరకు అక్కడే ఉండి సాయంత్రము చేవెళ్ళకువారు దిరిగివచ్చేలోపుననే మా తండ్రిగారు లింగైక్యమైరి. ఇది యొక అశుభ చిహ్నముగా భావించి మరో సం॥ము వరకు వివాహము సంగతివి మానుకుంటిని.

దీనిముందు 2వ భాగమును "నేనెవరు?" అనే (గ్రంథము) స్వీయచరిత్రను జదువగలరు.

# సాయంత్రమున సూర్యోదయ భ్రాంతి

నా బాల్యమున నొక పర్యాయము సాయంత్రము సమయమున మా తండ్రిగారు ప్రతినిత్యము మాదిరి మధ్యాహ్నము స్నానముజేసే అప్పుడు తడిపిన మైలబట్టలను మిగతమైల బట్టలను ఉదికి శుభ్రపరచి తేవడానికై నన్ను వెంబండించుకొని అందోలు చెరువునకు దీసికెళ్ళెను. అక్కడికి వెళ్ళిన పిదప నాన్నగారు బట్టలనునీటిలోతడుపుతు నన్నుపండుకొనినిద్రనుండి లేచావు. కావున ముఖము గడుక్కొమ్మని యాదేశించిరి. అది విని నేను దంతధావనమునకు పండ్ల బూడిదితేదు గదా? అని ప్రశ్నించితిని. అందుకు వారు చిరునవ్వునవ్వుతు ఇప్పుడు ఉదయముగాదు. ఇది సాయం సమయమని చెప్పిరి. నేను సూర్యుడుదయించుచున్నాదుగదా? అంటిని, వారదివిని అది తూర్పుదిక్కు గాదు. పశ్చిమ దిక్కు అని సమాధాన మిచ్చిరి. ఇది నా భ్రాంతి మాత్రమే అందుకే పెద్దల సూక్తి "ఉదితెసవితారక్తా - రక్తాదాస్తమేపిచ"అనిగలదు. ఇది సార్థకమైనది. సూర్యుడుదయించునప్పుడు ఎఱ్ఱగానే ఉంటాడు, మరియును అస్తమిచె అప్పుడు ఎఱ్ఱగానే ఉంటాడు. అలాగే సత్పురుషుల స్వభావము అట్టిదే.

"ఇతి శివమ్ భూయాత్"

# అముద్రిత గ్రంథములు

1. శివానుభవవ్యాస సంపుటి. భా,1-2
2. వీరశైవగతవైభవము
3. విరాగినవల (అతిచిన్నది)
4. దారిద్ర్యపు పెనుభూతము (నాటకము)
5. ఆదర్శపు వివాహము, (నాటకము)
6. జగజ్జ్యోతి శ్రీబసవన్నగారు.
7. బసవగాంధి తత్త్వసామ్యము.
8. శాంత (నాటిక)
9. ఆదర్శపు విద్యార్థులు. (నాటిక)
10. పోలీసు దద్దమ్మ (నాటిక)
11. జగద్గురు శ్రీరేణుకాచార్యులు (నాటిక)
12. అద్భుతప్రేమ. అందనిబేమ (కథానిక)
13. వీరశైవధార్మిక వ్యాససంపుటి
14. శతకత్రయసారము (తెలుగుసేత)

**అతిముఖ్యగమనిక :-**

ఇంకను ననేకవ్యాసములను ధార్మిక-సాంఘిక-సాహిత్యక సాంస్కృతకములకు సంబంధించినవి, కన్నడ-తెలుగు-సంస్కృత భాషలలోననేకపత్రికలద్వారా- (త్రిలింగ-స్వధర్మ-శ్రీశైలజ్యోతి-శ్రీశైల

వభ-వీరశైవధర్మతత్త్వ ప్రకాశిక-వీరశైవదర్పణము-ఆరాధన) ప్రకటించ డమైనది. మరియు ఆలిండియా రెడియో (ఆకాశవాణి) హైదరాబాదు ద్వారా సిద్ధాంతశిఖామణి-శివశరణులు సంఘసంస్కర్త శ్రీబసవన్న, స్త్రీ స్వాతంత్ర్యము, అనుప్రసంగములను అమర వాణి, సంస్కృతములోను కన్నడ మరియు తెలుగులోను ప్రకటించనైనది. "వీరశైవధర్మ" మను పత్రికను అకుంఠితముగా వీరశైవధర్మ ప్రచారమునకై ఏకధాటిగాను నిర్వహించబడినది. ఇంతేగాకుండ హైదరాబాదు మరియు సికిందరబాదు జంటనగరాలలోను. మహబూబునగరము. వరంగల్లు. శ్రీశైలము కరీంనగరు-తాండూరు. మెదక్‌జిల్లా గ్రామ-పట్టణాల్లో ప్రతియేట వీరశైవప్రచారత నిర్వహింప బడుచున్న జగద్గురు శ్రీరేణుకాచార్యులవారి మరియు శ్రీబసవేశ్వర జయంత్యుత్సవాల్లోను, మహాసభసమాజంవారి ఆహ్వానంపైవెళ్ళి మహాసభవేదికలపై విజయవంతముగానుపన్యసించి వారిచేత సన్మానాలందు కొనిరావడమైనది.

అతిముఖ్యగమనిక :-

ఈ అముద్రిత గ్రంథములలోదేనినైన ఒకదానికి ధనవంతులు దగిన ఆర్థికసహాయము నొసగినయెడల, దానిని వారిపేరిట ృతిభర్తగా ముద్రించనగును. కీర్తికాంక్షులు ఇట్టి సువర్ణావకాశమును పగియోంచుకొందురుగాక.

ఇట్లు

కృతికర్త